# భావం

రచన :

అంతటి నరసింహం, ఎం. ఏ.

(ఆంధ్రోపన్యాసకులు-ప్రభుత్వకళాశాల, కడప.)

సమతా సాహితి

9/5 విప్పర్తివారి వీధి

విశాఖపట్నం

# భావం

రచన :

అంతటి నరసింహం, ఎం. ఏ.
(ఆంధ్రోపన్యాసకులు-ప్రభుత్వకళాశాల, కడప.)

సమతా సాహితి
19/5 విప్పర్తివారి వీధి
విశాఖపట్నం

# ఒక విషయం

ఈ రచన **1949** ఆదిలో ముగిసింది. వ్రాతప్రతిని పిల్లలకూ, పెద్దలకూ - స్త్రీలకూ, పురుషులకూ - అందరికీ యిచ్చి తమ అభిప్రాయాల చెప్పమన్నాను. 'మురళి' విషయాన్ని చదివిన అనుభవ శూన్యు లయిన పిల్లలూ, కొందరు స్త్రీలూ "అబ్బే! ఇట్లా ఎక్కడన్నా జరుగుతుందా?" అని పెదవి విరిచారు. అనుభవజ్ఞులు "ఇదంతా యథార్థం" అన్నారు. మీకుగూడా అనుమానం వస్తే మన స్తత్వవేత్తల నడగండి, లేదా పల్లె జీవితం, పట్నవాస జీవితం, ఇంకా యితర విధాలా అనుభవం గడించిన పెద్దల నడగండి. అప్పటికీ అనుమానంగా వుంటే మనస్తత్వ శాస్త్రం కాస్త అభ్యసించండి. అప్పటికి సందేహ నివారణ తప్పక జరుగుతుంది.

ఇందు, కథాగమనంతో సాంఘిక విషయాలెన్నో జోడింప బడినవి. దయచేసి, కథలోపడి కొట్టుకుపోకుండా సాంఘిక సమస్యా పరిష్కారంవైపు దృష్టి వహించితే సంఘానికి సేవచేసిన వా రౌతారు. పాత్రపోషణవైపూ, శైలివైపూ కాస్త దృష్టి వహిస్తే రచయితకు మేలు చేసిన వా రౌతారు.

లభించిన తొమ్మిదేండ్ల కయినా యీ పుస్తకమును ఒక రూపంలోకి తెచ్చిన రాయలసీమ కృష్ణరాయ పబ్లిషింగ్ వర్క్సు వారికిన్నీ, శ్రద్ధతో, అల్పకాలంలో ముద్రించిన శ్రీ కొండపల్లి ముద్రణాలయం వారికిన్నీ కృతజ్ఞతాభివందనము లర్పింపవలసి వున్నది.

ఆదినుండీ నన్నన్ని విధాలా ప్రోత్సహిస్తూ వచ్చిన ఏతత్ కృతిభర్త శ్రీ వంకిన వెంకటరాజేశ్వర ప్రసాదరావుగారికి ఎంతోకృతజ్ఞుడను.

"రచయిత"

## రెండవ ముద్రణకు సంబంధించి-

ద్వితీయ ముద్రణ సమయంలో ఈ పుస్తకాన్ని సంస్కరించడానికై ప్రయత్నం జరిగింది. అక్కడక్కడా తప్పులు సవరించడం తప్ప ఇంకేమీ చేయలేక పోయాము. ఎందుకంటే, ఏమీ తగ్గించడానికి వీలుకాదని చాలామంది పాఠకులు చెప్పారు కాబట్టి, పాఠకులనుండి అనేకమైన ప్రశంసల నందుకుని యీ నవల ఇంత త్వరలో ద్వితీయ ముద్రణకు రావడం చాలా ముదావహం. మా పాఠకులకు అభివందనము.

పబ్లిషర్స్.

# అంకితం

జన్మకు పూర్వం అన్నదమ్ములం
అంతకుముందద ద్వైతరూపులం
లోకయాత్రలో మా బాంధవ్యం
బావమఱదులం సుస్నేహితులం

పశ్చిమ గోదా వరి జిల్లాలో
కాగుపాడులో వంకిన వంశ
క్షీరాంబుధిలో చంద్రునివలె శ్రీ
వెంకటాచలం నారాయణమ్మ
గార్ల పుత్రుడై వెంకట రాజేశ్వర
ప్రసాదరా వు ద్భవించెను

అతి ధనాఢ్యుడ య్యును నిగర్వియై
అతి బలాఢ్యుడ య్యును నదంభియై
అతి వదాన్యుడై వినయశీలుడై
సుహృదుడైశో భిల్లుచుండగా

అతని సతి శ్రీ అంజనమ్మ, సా
విత్రీ, దమయం తీ, సుమతీ, గౌ
రీ, నారీసమ పతివ్రతామణి
సుపుత్రవతి, స చ్ఛీల, దానగుణ

అట్టి సతీమణి గల్గినట్టి మా
ప్రసాదరావే తగిన వరుండని
నా కృతికన్యను అంకితమను 'కుం
టెన'తో బంధమొ నర్చి కూర్చితిన్.

# 1

"తాగు బుజ్జీ, తాగు! ఇకపొయ్యేవే" అంటూ వుంది సరళ.

"గట్టిగా పట్టుకోవే! చూడూ-విడిచి పెట్టేశావ్!" అంది సరస్వతమ్మ.

"పోమ్మా! నే పట్టుకోలేను; నీ దెప్పుడూ యింతే; పట్టి అల్లరోడు!"

"అట్లాకాదే! ఆ రెండు కాళ్లూ ఒక చేత్తో పట్టుకో. రెండో చేత్తో ముక్కు మూసెయ్."

"చూదేమ్మా ఎంతగా తన్నేశాడో! గాజు పగిలిపోయింది!"

ఎట్లాగో ఉగ్గూ కారం పోయడం అయిపోయింది. గుక్కబట్టి యేడుస్తున్నాడు పిల్లవాడు. ఉయ్యాల్లో పండేసి, పాలు తీసుకరావడానికి వెళ్ళింది సరస్వతమ్మ.

ఉళ్ ళ్ ళ్ ళ్లో హాయీ

హాయమ్మా హాయీ,

యేడవకు యేడవకు య్రెరిపాపన్నా

యేడిస్తే నీ కండ్ల - నీలాలు కారూ"

అని పాడుతూ వుయ్యాల వూపుతున్నది సరళ. అమ్మ తెచ్చిన పాల బుడ్డి చూచి యేడుపు మానాడు పిల్లవాడు.

"అమ్మా! నేపడతానే పాలు!" అంటూ వుయ్యాల్లోకి యెక్కి వాడి ప్రక్కలో పడుకొంది సరళ. వాడు పాలు తాగుతూ ఒక మోస్తరుగా చూస్తున్నాడు. కండ్లల్లో నీళ్ళింకా మెదుల్తూనే వున్నాయి. కాస్త ముందుకూ వెనక్కీ - కిందికీ పైకీ - కదుల్తూవున్న చిన్ని గులాబిరంగు పెదవులపై లేత చిఋనవ్వు వొలికి పడుతున్నది. అంతవఱకూ ఉయ్యాల ప్రక్కన నిలబడి తృప్తిగా, మధురంగా చూస్తూ వున్న సరస్వతమ్మ, గొంతులో ఒకమోస్తరు ధ్వనిచేస్తూ, వంగి, వాడి గవదలు రెండు చేతుల్తోనూ నిమిరి, ఆ చేతులను

# 8

తన గవదలపై నొక్కుకుంటూ వెళ్ళిపోయింది లోపలికి. పాలబుడ్డి తీసినాక సరళ "కోపమా మురళీ" అంటూ దీనంగా, మురిపెంగా, చూస్తూ ఈచెంపనా ఆచెంపనా ముద్దుపెట్టి "నా బంగారు మురళీ," అంది వాడిపైకి వంగి. వాడు పెదవులు తెరచి నవ్వాడు. కాసేపట్లో యిద్దరూ నిద్రపోయారు.

పది గంట లయ్యే టప్పటికి బ్రహ్మారా వొచ్చాడు. కోటు విప్పుతూ ఉయ్యాల దగ్గరి కొచ్చాడు మురళిని చూడ్డానికి.

"ఏమే! ఇది బడికి పోవడం లేదేమిటి?" అన్నాడు భార్యతో.

"ఏమోబాబ్బా, నాకేమీ తెలీదు."

"దీన్ని బళ్ళో వదిలిగదా నే వెళ్ళింది!"

"అప్పుడే వచ్చేసింది."

సరళకు చదువంటే అయిష్ట తేమీ లేదు. కాని యింట్లో పిల్లవాడితో ఆడుకోడమంటే సరదా. వాణ్ణి విడిచి బడికి సరిగ్గా పోదు. అథవా బలవంతాన వెళ్ళినా, వెంటనే వచ్చి కూచుంటుం దింట్లో. "ఏమే వచ్చావ్?" అని వాళ్ళమ్మ అడిగితే "ఒంటికొచ్చానే" అంటుం దొకసారి. "మంచి నీళ్ళ కొచ్చానే" అంటుం దింకొకసారి. ఇట్లాగే ఏదో ఒకసాకు చెప్పి యింట్లో కూర్చుంటుంది. తర్వాత పోదు.

మురళి అంటే సరళకు ఎంత అప్యాయమో చెప్పలేము. సంవత్సరం కిందటే మురళిని వాళ్ళింటికి తెచ్చారు. అప్పటి కయిదేండ్లు తనకు సరిగ్గా. ఎవరిపిల్ల వా డయిందీ తనకు తెలీదు. అమ్మ నడిగితే "నీ తమ్ముడే నమ్మా" అంది. ఆ పైన అడ్డు ప్రశ్నలు వెయ్యటానికి తనలో సరుకులేదు. ఎవర్నే మనాలో పుడుతూనే ఎవరికి తెలుస్తుంది? ఎవరెవర్ని ఏ వరసలో పిలవాలో తర్వాత యితరులు నేర్పించాల్సిందే! 'ఫలానా' అనాలని ఆపిల్ల కెవరూ నేర్పించలేదు. అందరూ అంటూన్నట్టే 'మురళీ' అని సంబోధించేది. బొమ్మతో ఆడుకుంటున్నట్టుగా సరదాగా ఆడుకొనేది. సరళ చేష్టలకు మురళి ఒకసారి యేడ్చేవాడు, ఒకసారి నవ్వేవాడు, ఒకసారి తన్నేవాడు. ఒకసారి జుట్టు గట్టిగా పట్టుకొని లాగేవాడు కసితో. అయినా, వాళ్ళిద్దరి మధ్యా వున్నంత సామరస్యం ఆ యింట్లో యింకెవరి మధ్యా లేదు.

# 2

మిడ్ వైఫ్ రాజామణి మద్రాసునుంచి బదిలీ అయి బెజవాడ వచ్చింది. బ్రహ్మారావుగారింటికి రాగానే సరస్వతమ్మ ఆశ్చర్యంగాచూస్తూ "అదేమిటి? అంతగా చిక్కిపోయూరేం? గుర్తు పట్టలేనంతగా మారిపోయారు. బస ఎక్కడేమిటి?" అంది. "ఆసుపత్రి దగ్గరేనండీ! ఇక్కడికి కొంక ఫర్లాంగుంటుంది. అదో ఆ వీధి మలుపులోనే."

"భలే! భలే! పిల్లవాడదృష్టవంతుడే అయితే."

"వచ్చింది వాడి కోసమే. యేడీ, యేడీ!"

"పట్టుకొస్తానుండండి" అంటూ సరస్వతమ్మ పిల్లవాడి కోసం లేచి వెళ్ళింది. అటూ యిటూ చూచి తిరిగి వచ్చి "లేదు రాజామణిగారూ! సరళ వాణ్ణి బళ్ళోకి లాక్కెళ్ళి వుంటుంది వచ్చే టైం గూడా .... .... అరుగో!"

సరళ చెయ్యి వదిలించుకొని మురళి ముందుకోపున పరుగెత్తుకుంటూ వచ్చి తల్లి మీద వాలి "అమ్మా! అక్కసూడే, నన్ను...." అనబోతూంటే- వాణ్ణి వొళ్లో అదుముకుంటూ "బంగారునాన్నగదే, చిట్టినాన్నగదే" అంటూ ముద్దు పెట్టుకొని "అదో అత్తయ్య; దండంపెట్టు" అంది సరస్వతమ్మ. సిగ్గుపడుతూ, వాళ్ళమ్మపై ఒరిగి, రెండు చేతులూ జోడించి, చిఱునవ్వు నవ్వాడు. "ఏదీ, ఇట్రావోయ్" అంటూ ఆ చేతులు పట్టుకొని లాగి, తన వొళ్లో అదింపట్టుకొని "ఎంత మారిపోయాడమ్మా మూడేండ్లకు!" అంది రాజామణి. ఏమీ కొత్త లేనట్టుగా వున్నాడు మురళి. వాణ్ణి ఎత్తి తొడలపై కూర్చోబెట్టుకొని "బాగా బరువుగానే వున్నాడు. నాలుగోయేడే అయినా యేడెనిమిదేండ్ల పిల్లవాడంత బరు వున్నాడు. అసలేదో మంచి తెగగా వుంది. అయినా పుట్టినపుడే చూశాంగా. అప్పటికే బాగా బరువున్నాడు. అంతబరువు మన దేశపు పిల్లలు సామాన్యంగా వుండరు. యూరపు, అమెరికా దేశాల్లో వుంటారు."

"ఆ ఆవుపాలన్నీ వీడికే? ఇటీవల సరళ భాగంగూడా వీడే తాగేస్తు న్నాడు. ఇక వుండదా యేమిటి?"

"మీ యింట్లో లోటేమిటి సరస్వతమ్మగారూ! మొత్తానికి అదృష్ట వంతుడైనాడు నీ కొడుకై."

"తిండి బాగా తింటాడు. బాగా జీర్ణమవుతుంది. మీ కాశ్చర్యంగా వుంటుందేమో - మీరు వెళ్ళింది మొదలు ఒక చిన్న తలపోటన్నా రాలేదంటే నమ్మండి!"

"కొన్ని శరీరతత్వా లంతే నండీ! సరళ ఆరోగ్యంగానే వుంటూ వుందా?"

"ఆఁ ఆఁ వారానికి ఆర్రోజులయినా."

"ఎందుకూ?"

"ఏదో మందమంటారు డాక్టర్లు."

రాజామణి సరళను దగ్గిరికి లాక్కొని బాగా చూచి "సరేగాని సరళ కేం పెడుతున్నారు?" అంది.

"మామూలే."

"మీ యింట్లో కాఫీ తాగరుగా! దీనికిగూడా గేదె పాలే యిస్తున్నారా?"

"అవును. గేదె పాలే."

"ఆఁ అదే! అమ్మాయి శరీరం కాస్త పేశలం. గేదె పాలు మందం చేస్తాయి. ఆవు పాలివ్వండి."

"ఆఁ హాఁ ఆవుపాలన్నీ నాకే కావాల" అంటూ ఎగిరి సరస్వతమ్మ ఒళ్ళోకి దూకాడు మురళి.

"నా కొద్దమ్మా, మురళికి కావొద్దూ?" అంటూ దగ్గర చేరి మురళిని స్పృశించింది సరళ. సరస్వతమ్మ మురళి తలపైన చెయ్యేపి చూచి "ఇదే మిట్రా తలంతా యిసుక!" అంది కాస్త అధికార స్వరంతో. అంతలోనే కండ్లల్లో నీళ్ళు తెచ్చుకొని, "చూడే, అక్కా-మరే-బల్లో....యిసికపైన కూచో నుంటే తలమరా లని నా నెత్తిన పోసింది. నన్నుగూడా పొయ్యమంది. నేను

పోయిలా. మళ్లీ పోసింది....నాకు కోపమొచ్చి గట్టిగా యేడిశినా'' అంటూ యేడుపు మొగంతో సరళవైపు చూస్తూ తల్లి చీర కొంగుతో కన్నీళ్లు తుడుచుకుంటున్నాడు.

"ఏమేః నీ కప్పుడే తలంబ్రాలు కావాలాః'' అంటూ సుమారుగా వొక దెబ్బ వేయబోయింది. సరళ తటాలున కొంచెం జరిగింది. ఆ పిల్ల తల తగిలి, జారి, ఆమె మణికట్టు మురళి నొసటిపై పడింది. ఒక గాజు పగిలి నొసట బాగా గుచ్చుకుంది లోతుగా. చిల్లున రక్త మొచ్చింది. ఆతృతతో ముందుకు వంగిన సరళ కంట్లో గూడా పడింది. పక్కనున్న రాజామణి గాయాన్ని అదిమి పట్టుకొంది. పాత గుడ్డ కాల్చి గాయం నిండుకూ కూరింది సరస్వతమ్మ.

నెత్తురు మరకలు కడిగేందుకు తీసుకెళ్లింది సరళ మురళిని. కడిగి బాగా గుడ్డతో తుడిచి, గదిలో వేరే గుడ్డలు తొడిగి ఒక చోట కూర్చొని వాణ్ణి ప్రక్కలో కూర్చోబెట్టుకొని, "నొప్పాబుజ్జీ?'' అంది. అంటూ వాడి మొగం మీదికి వంగి ఆ దెబ్బ తగిలిన చోట తాకీతాకనట్టుగా ముద్దు పెట్టిందిః వాడామె వైపే చూస్తూన్నాడు చిఱునవ్వుతో.

"నొప్పిలేదు గదూః'' అంది తలాడిస్తూ.

"ఊఁ హూఁ''

"చూడూ-నన్నెపుడూ కొట్టించకేఁ. ఎపుడన్నా అట్లా చేస్తే సగం నీకు తగులుతుంది.''

"ఔను'' అంటూ తల ఊచాడు అర్థమైనట్టు.

ఇంతలోనే బ్రహ్మారా వొచ్చాడు కోర్టునుండి. అతన్ని చూడగానే పెద్ద ఉపద్రవం సంభవించినట్టుగా "చూశారాః అబ్బాయికి గాయంః'' అంది సరస్వతమ్మ.

"ఆఁ ఆఁః ఎక్కడే, ఏదీః" అంటూ తొందర తొందరగా ముందు కొచ్చాడు. ఇంతలో పరుగెత్తుకుంటూ వచ్చాడు మురళి. గట్టిగా కౌగలించు కొని "నాన్నాః బొమ్మలపుతకం యేదీ?'' అన్నాడు. వాడిమొగంలోకి బాగా

చూచి, తర్వాత భార్య మొగంలోకి చూచి "చంద్రుడికి మచ్చ వుంది తీరా ల్లేవే! లేకపోతే నిష్కళంక చంద్రుని చూచినవారు మరీ పిచ్చివాళ్ళైపోతారు" అన్నాడు.

ఉత్కంఠత ఉబికిరాగా నాలుక మడతపెట్టి కొరుక్కుంటూ సరస్వతమ్మ తమకంతో జవురుకొంది మురళిని అమాంతంగా. గట్టిగా అదిమి రెండు బుగ్గలపైనా ముద్దుపెట్టుకొంది. ప్రక్కనున్న సరళకు మురళి ముఖం దొరక్కపోగా దొరికిన రెండుకాళ్ళూ రెండు చేతుల్తో వట్టుకొని తన రెండు చెంపలకూ ఒత్తుకుంటూ నిల్చుంది.

"ఇటీవే అబ్బాయిని. అదో, ఆ కోటుజేబులో, బొమ్మల పుస్తక ముంది పట్టుకురా" అన్నాడు బ్రహ్మారావు. "ఆఁ తెచ్చావా!!" అంటూ, అక్కడక్కడా మాత్రం నెరిసిన పొట్టి మీసాలను లాగి కిందికి దుమికాడు.

మురళికి అక్షరాభ్యాస మయ్యేప్పటికి సరళ ఒకటో ఫారంలో చేరింది. మురళి కప్పటికే వ్రాయడానికి రాకున్నా చాలా పద్యాలూ, చిన్న చిన్న పాటలూ, కొన్నికొన్ని శ్లోకాలూ కంఠపాఠం వచ్చు. సరళా, మురళీ, ఎపుడూ ఒకేచోట వుండేవారు. ఇంట్లో ఎపుడూ ఒకేచోట వున్నా, బళ్లు వేరైనందువల్ల, కొన్ని దినాలు సరళకు బెంగగానే వుండేది. మురళికి ఒక మూడుగాళ్ళ సైకిల్ కొనిచ్చాడు బ్రహ్మారావు. దా న్నెక్కి చకాచకా కాళ్లాడిస్తూ, నీలుక్కొని కూర్చొనివుండే పెద్ద రబ్బరు బొమ్మలాగా వుండేవాడు. వాడి భుజంపై చెయ్యేసి, వాళ్ళ స్కూలువరకూ వెళ్ళి భారంగా వదలి తర్వాత ఒక ఫర్లాంగు దూరంలో వున్న తన స్కూలుకు వెళ్లేది సరళ. హైస్కూల్లో చేరినప్పటినుంచి మురళికి యింగ్లీషు మాటలు గూడా నేర్పించడం మొదలు పెట్టింది.

మొదటి నెలంతా మురళిని ముద్దుగా డనుకొనేవారు అయ్యవార్లు, ఓ, న, మః ॥ శి వా -యః । సీ ధం న మః । అనే అక్షరాలు ఒక నెల వరకుగూడా రాలేదు వీడికి. ఒకనాడయ్యవారు, "ఏరా! ఎపుడొస్తాయిరా ఓనమాలు?" అన్నాడు నవ్వుతూ.

"వచ్చినప్పటి కొస్తాయిలే సార్" అన్నాడు. వాళ్ళంతా నవ్వు కున్నారు. మరునాడు అట్లా కాదని గుంటక్షరాలు పెట్టించారు ఎండలో. అప్పటికిగాని వాటిభావం బోధపడలేదు మురళికి. అంతే, తర్వాత మూడు రోజుల్లో అక్షరాలన్నీ నేర్చుకున్నాడు. వాడి చురుకుదనానికి బాగా దోహదం యిచ్చారయ్యవార్లు. బాగా తర్ఫీ దిచ్చారు. ఇంట్లో సరళ తర్ఫీదు!

తొలి సంవత్సరంలోనే డబుల్ ప్రమోషన్ యిచ్చారు. రెండవ సంవ త్సరంలో మూడవ తరగతిలో వేశారు. మూడవ సంవత్సరంలో అయిదవ తరగతిలోకి వచ్చాడు, సంవత్సరానికి రెండు ప్రమోషన్లు యిచ్చినా తనివి తీరలే దయ్యవార్లకు.

ఒకనాడు బ్రహ్మారావు సుబ్బారాయు డనే అయ్యవారిని పిలిపించి, "ఏమండీ ఎట్లా వున్నాడు మా వాడు?" అని అడిగాడు.

"వాణ్ణి గురించి యేం చెప్పనండీ! చాలా సునిశితమైన మేధ."

"ఈ సంవత్సరం ప్రైవేటు మీరే చెబుతారా?"

"వద్దండీ. అసలు యీ సంవత్సరం బడి చాలించి బాగా యింగ్లీషు తెలిసిన మాష్టరు దగ్గిర ప్రైవేటు పెట్టించినట్లయితే వచ్చే సంవత్సరం రెండవ ఫారంలో సులభంగా చేర్చవచ్చు. పారేసేవాళ్ళకు ఇంకా వాటం కల్పిస్తే ఉర వడిగా పార్తాయిగా!"

"అయితే అది మీరే మాట్లాడి కుదర్చండి, ఏ మాత్రం యివ్వాల్సొ స్తుంది?"

"నెలకు పదిరూపాయ లివ్వాలి."

"పదిహేనిస్తా. తక్షణం చూడం డా పని."

మరు సంవత్సరమే రెండవ ఫారంలో చేరాడు మురళి. వాణ్ణి చూడ గానే పిల్లలంతా ఆశ్చర్యపడ్డారు. కొందరు ఉదాసీనంగా చూశారు. వీడేదో హెడ్మాష్టరుకు బాగా లంచం పోసిన ధనికుడులాగా వున్నాడని భావించారు, కొన్నాళ్ళకు వీని వునికి అందరికీ సర్దా అయిపోయింది. మురళి ఎరుపూ తెలుపూ కలిసిన రంగుతో మెరుస్తూ వుండేవాడు. పాల

పొంగుతో మిసమిసలాడుతూ వుండేవాడు. కాస్త లావుగా దాదాపు నాలుగు అడుగుల యెత్తు వుండేవాడు. ఆకర్షణీయమైన అందం! అందరూ వీణ్ణి చూచి "తమ్ముడూ!" అంటూ బుగ్గలు గిల్లేవారు. పోతూ పోతూ ఒక మొట్టికాయ వేసి నవ్వుకుంటూ పోతా డొకడు. చెవి అట్లా గిల్లేవాడు మరొకడు. ఒక మాష్టరు దవడలు లాగేవాడు. మరొక మాష్టరు ముక్కు లాగేవాడు. ఇట్లాగా అందరూ తమతమ సరదాకొద్దీ చేస్తూవుంటే వీడికి కష్టంగానే వుండేది.

ఒకనా డింట్లో పాఠాలు చదువుతూ "అక్కా! నన్ను చంపుక తినేస్తున్నారే అందరూనూ! ఆ బడికి పోకున్నా బాగుండు!" అన్నాడు మొగం చిట్లించి.

"అదేమిటి మురళీ! అందరూ తమ్ముడూ తమ్ముడూ అంటూ నీ వెంటపడి నీకోసం అట్లా అల్లాడిపోతూవుంటే నీ విట్లా అంటున్నావు! మరీ మా ఆడపిల్లలంతా నీ వైపే చూస్తూ వుంటారు. నీకు తెలీదూ?"

"అబ్బే! తెలీదే! రేపు నేనూ చూస్తా."

"అబ్బా! ఆ పిల్లలంతా నిన్ను చూస్తూ వుంటే నాకు కోపమొస్తుంది మురళీ."

"ఎందు కక్కా?"

"ఎందుకా? దిష్టి తగల్దూ?"

"ఎందుకూ?"

"ఎందు కంటే - అట్లా వింతగా చూచినందుకు! నీ వా స్కూల్లో అందరికంటే చిన్నవాడి వనీ - నీ వయసుకు మించిన తరగతి కొచ్చా వనీ-చదువు బాగా వచ్చనీ-అయ్యవార్లే అనుకుంటున్నారట! అందుచేత నీ వంటే-అయ్యవార్ల కాణ్ణుంచి - పిల్లవాళ్ళకాణ్ణుంచి - ప్యూన్ల వరకూ - ఒక వింత మనిషిగా - అందాన్నిచ్చే ఆటవస్తువుగా-చూడటం అలవా టయిపోయింది! అట్లా చూస్తే దిష్టి తప్పక తగుల్తుంది.

"నా కెప్పుడూ తగల్లేదే! అ దెట్లా వుంటుంది? తగిల్తే నొప్పి వుంటుందా?"

## 15

"నీకు జ్ఞాపకం లేదూ? అదో, ఆనాడు, నీకు గాజు గుచ్చుకొని రక్తం కారెనే, ఆ దినం - అమ్మ నీకు దిష్టి తీసింది తెలుసా?"

"ఆఁ! మిరపకాయలూ-చీపురు పుల్లలూ - పిచుగడ్డి - ఉప్పుగల్లులు- అన్నీ, 'ఛీ పో-ఛీ పో' అంటూ మూడుసార్లు కిందికీ పైకీ అని పొయ్యిలో వేసింది. ఎందుకూ?"

"అవి చిటపటా అంటాయి. మిరపకాయల కోరు గూడా వస్తుంది. అయితే బహుకొద్ది."

"అయితే?"

"అప్పటికి దిష్టి పోతుంది."

"నాకిపుడు దిష్టి వుందేమో చూద్దామా?"

"ఆఁ" అంటూ సరళ కావలసిన సామగ్రి తెచ్చింది. తెచ్చి-ఛీ,పో- ఛీ,పో-అంటూ దిగదీసి పొయ్యిలో వేసింది. చిటపట లాడాయి వస్తువులు. కోరు బాగా వచ్చింది.

"చూశావా మురళీ! ఎంత చిటపట లాడిందో పొయ్యి! ఘాటు రాలేదు చూడూ!" అంది.

గట్టిగా తుమ్మి, చీది, దగ్గుతూ, "వస్తూంటేనే?" అన్నాడు.

"ఎక్కడ్రా" అంటూ ఆమె గూడా తుమ్మింది. మురళి మళ్ళా తుమ్మాడు. కండ్లలో నీళ్లు తుడుచుకుంటూ వెళ్ళి నాలుగు ఉప్పురాళ్లుతెచ్చి పొయ్యిలో వేశాడు, పొయ్యి చిటపటలాడింది. మళ్ళా తల పూచి నాలుగు మిరపకాయలు వేశాడు. ఘాటైన కో రొచ్చింది.

"అక్కా చూడూ! దిష్టి లేకపోయినా ఉప్పు చిటపట లాడింది. మిరప కాయల కో రొచ్చింది!" అన్నాడు.

"అబ్బే, దిష్టి తగిలితే యింత కోరుండదు. అబ్బా ఎంత కోరో చూడూ" అని దగ్గింది. తర్వాత తుమ్మింది.

"అయితే, నీకు దిష్టి వుందేమో చూద్దాం" అంటూ అదే పనిచేశాడు. అంతా మామూలే.

## 16

"చూశావా మురళీ ఎంత కోరో! నాకు దిష్టిలేదు కాబట్టి అంత కోరు!"

"అప్పటిలాగే వుంది!"

"అబ్బా ఎంత యెక్కువ!" అంటూ మళ్ళీ తుమ్మి ఎఱ్ఱబడిన కండ్లతో చూస్తూ "ఎంత ఘాటు!" అంది.

"ఏమో నాకు ఆ నమ్మకం లేదు" అన్నాడు మురళీ విశ్వసించకుండా.

మురళీ కాస్త పెరిగాడు. కష్ట మంటే యెట్లాంటిదో, ఆకలంటే యెట్లాంటిదో - తెలియకుండా పెరిగాడు. చాలామంది యితర పిల్లలకూ - తనకూ - భోజన విషయాల్లోనూ వస్త్రధారణ విషయాల్లోనూ - యెంతో తేడా కనిపించేది. అది అతనికి కాస్త ఆధిక్యభావాన్ని పెంచింది. తమ యింట్లో నౌకర్లుగా వున్న బీద వాళ్ళను, పెద్ద వాళ్ళంటూ వుంటే విని - వయోభేదం లేకుండా ఒరే, గిరే అనేవాడు. అపుడపుడూ తన పాఠాల్లో చదివిన నీతులూ, ధర్మాలూ, జ్ఞాపకాని కొచ్చేవి. అయినా అవి ఆచరణలోకి రాలేకపోయేవి.

వేసవి సమీపిస్తూ వుంది. వాతావరణం కాస్త వేడిగానే వుంది. గాలి మాత్రం తోలుతూ వుంది. ఆ సాయం సంధ్యలో మురళీ వీధి అరుగుపై కూర్చొని అంతకు ముందు చదివిన శిబిచక్రవర్తి విషయమై ఆలోచిస్తూ న్నాడు.

"అమ్మా! సందాకవళం" అంటూ ఒక పిల్ల అరిచింది.

"ఇంతలోకీ యెక్కణ్ణుం చొచ్చింది? మళ్ళారా పో" అన్నాడు మురళీ కాళ్ళు వూచుకుంటూ ఠీవిగా.

పిల్లవాడి మాటలకేంలే అని, "మాధవకబళం తల్లీ" అని అరిచింది మళ్ళా.

"ఏయ్ నీకుగాదూ చెప్పేది?" అంటూ కిందికి దుమికాడు.

"అమ్మగారు పెడతారులే బాబూ. నీకెందుకు" అని మళ్ళా, "కొంచెం అన్నమెయ్యండమ్మా" అని అరిచింది.

"నీక్కాదంటే చెప్పేది? పోతావా లేదా? ఊఁ" అన్నాడు ముందుకు వూని.

''నీ కుక్కను కాస్త కట్టేసుకో వయ్యా! వూరికే యెందు కరుస్తావ్'' అంది.

"ఊం, అట్లాగా! ఘోరుగా మాట్లాడుతున్నావే'' అని జుట్టుపట్టుకొని కాలితో అట్లా తన్నాడు. అప్పటికే కాస్త చినిగివున్న పావడను ఆ పాదము బద్దలు చేసేసింది. తన శరీరాధోభాగాన్ని ఒక మోస్తరుగా కప్పుతూండిన ఆ కాస్త బట్ట గూడా చినిగి పోయేసరికి తన హృదయమే చీలి పోయినట్లుగా బిగ్గరగా యేడుస్తూ ''పాపిష్టివాడా!'' అంది.

"ముయ్ నోర్'' అంటూ చెంపపైన ఒక దెబ్బేశాడు. అట్లా తిరిగి పడింది "అమ్మా!'' అంటూ.

ఇదంతా విని, తడి సరిగాతుడుచుకొనీ తుడుచుకోకా, ఆదరా బదరా కోక చుట్టుకొని పరుగెత్తింది సరళ స్నానాల గదిలో నుంచి. దుర్మార్గుల శిక్షించిన చక్రవర్తిలాగా గంభీరవదనంతో మురళి నిలబడి వున్నాడు. వాడి కాళ్ళ దగ్గర బక్క చిక్కిన ప్రాణి పడిపోయివుంది. సరళ యింట్లోకి పరుగెత్తుకొనిపోయి, చన్నీళ్లు తెచ్చి, ఆ పిల్ల మొగాన చల్లి, తన గుడ్డతోనే ఆ మలిన ముఖం తుడిచింది. ఆ పిల్లకు స్పృహ వచ్చింది. కాని లేవలేక పోయింది. ఇంతలో ఆ పిల్ల అమ్మ వచ్చింది పరుగెత్తుకుంటూ. ''చంపారు గదుటే తల్లీ'' అంటూ దుఃఖించింది. ఆమెను చూచి, అట్లా, ఆ క్రింద పడివున్న పిల్ల మొగం చూచింది సరళ. మ్యామూలుగా అడుక్కు తినేవారి లాగా లేరు.

సరళ అంది: ''చూడమ్మా! ఏడవకు, పిల్లవాడు పొరపాటు చేశాడు. మీ పిల్లకేమీ ఫరవాలేదు. కాస్త అన్నం పెడతాను. తినిపించు. లేచి కూర్చుంటుంది.'' అని అంటూ అట్లా చూచేటప్పటికి, అప్పటికి చేరిన కొంత మంది ముందువైపు సత్యారావు నిలబడి తన వైపే చూస్తున్నాడు. వాడి దృష్టిని గమనించి తటాలున తనవైపు చూచుకొంది. పరుగెత్తుకుంటూ లోపలి కెళ్ళింది ఆ పిల్లను లోపలికి తెమ్మంటూ.

అన్నం తిన్న తర్వాత కాస్త ఊపిరి రాగా చిరునవ్వుతో ''బంగారు

తల్లీ!" అందా పిల్ల. సరళ మొగం గంపంత అయింది. దాని జీర్ణవస్త్రాలు చూచి, పరుగెత్తుకుంటూ లోపలికెళ్ళి ఒక పావడా, ఒక జాకెట్ తెచ్చి యిచ్చింది, అవి ధరించి ఆ పిల్ల మొగం ఆనందంతో విప్పారేటప్పటికి డ్రెస్సులో గూడా అందం వుందనిపించింది సరళకు. వాళ్లు వెళ్ళారు సరళను దీవిస్తూ. వాళ్లు కనిపించినంత వరకూ చూచి మురళిని లోపలికి లాక్కెళ్ళింది సరళ.

రూంలో కూర్చొని, "మురళీ! ఎంత తప్పు చేశావో తెలుసా?" అంది.

"ఏం తప్పు చేశాను? అది చెప్పిన మాట వినందే" అన్నాడు నిర్దయగా. తన అధికారాన్ని ఆ పిల్ల గుర్తించలేదని అతనిలో ఇంకా కోపంగానే వుంది.

"ఏం చెప్పావు వినడానికి?"

"ఇంకా కాలేదు వెళ్ళరమ్మన్నా."

"అది నీకెట్లా తెలుసు?"

"అందరూ అంతేగ దక్కా అనేది!"

"చూశావా మురళీ! నీకు తెలియని విషయంలో జోక్యం కల్గించుకొని ఎంత తప్పు చేశావో? నీ మాట వినలేదని దానిని తన్నావు. దానిపైన అధికారం చలాయించడానికి నీకు హక్కేమున్నది? అది తప్పు గాదూ? అందరూ నీ మాదిరే తయారయ్యారిటీవల. ప్రతి యింట్లో గూడా యిట్లాంటి తరిమివెయ్యడాలే వాళ్ళకు. వారికి అది తప్పు అనే జ్ఞానం లేకపోగా-మరొక వృత్తి తెలియక పోగా - తిట్టినా - కొట్టినా - మొండికిపడి అడుక్కు తింటారు. కొన్నిసార్లు వాళ్ళకు అన్నమే దొరకదు. చూశావా ఆ పిల్లను! ఎంత బక్కచిక్కి వుందో! దాని డొక్క చూశావా? బ్రెముకల్లో యిరుక్కుపోయివుంది! కండ్లెంత లోతులో వున్నాయో చూశావా? దాన్ని పట్టుకొని కొట్టావు. బీదదాని బట్టలు చించావు. తప్పు గాదూ? బీదలయితే మాత్రం ఆ మాదిరా చేసేది? మనకూ ఏమీ లేకపోతే ఆ మాదిరే అడుక్కొనేవారమే

గదూ? అపుడు నీ కీ విధంగా జరిగితే నీ వెట్లా భావిస్తావో చూడూ!'' అంటూ ఊర్ధ్వదృక్కులతో కన్నీళ్లు కార్చింది గంభీరంగా కూర్చొని.

''తప్పు చేశా నక్కా క్షమించు'' అంటూ ముందుకు వాలాడు మురళి కన్నీరు రాలుస్తూ. గట్టిగా హృదయానికి హత్తుకొని, ''మురళీ! నీవు బంగారు గదూ! మంచివాడవు గదూ! ఎపుడూ అట్లాటి పనులు చేయకు! అటువంటివా ళ్ళొస్తే యింట్లో చెప్పు ఏమన్నా వెయ్య మని. తెలిసిందా? అయితే-చూడూ యిటీవల నీవు సాయంకాలా లెక్కడి కెళ్తున్నావ్?''

''కృష్ణాతీరానికి పోతున్నా.''

'ఒంటరిగానా?'' అంది అదురుగా.

''లే దక్కా? సత్యారావు....''

''సత్యారావా?'' అంది వాడిమాట పూర్తికాకముందే.

''క్రిష్ణయ్య గూడా నక్కా.''

''క్రిష్ణయ్య ఫరవాలేదు. సత్యారావు సావాసం చెయ్యకు.''

''ఎందుకూ?''

''వాడు చెడ్డవాడు. పోకిరీ. అల్లరివాడు, చూశావా? మొన్న వాడు, ఆడపిల్లల వెనకపడి నానా అల్లరీచేస్తూవుంటే వాడివెనక నువ్వుగూడా నవ్వుతూ వస్తున్నావ్. అందరూ నిన్నుగురించి యే మనుకుంటారు! నీ వంటే అందరికీ యెంత గౌరవమూ, వాత్సల్యమూ అనుకున్నావ్? ఇపు డందరూ నిన్నల్లరివా డనరూ? మొన్ననే ఒకమ్మాయి అంది:- 'మీవాడు గూడా వాళ్ళల్లో చేరాడే' అని. నాకు చిన్నతనమేసింది.''

అక్కయ్య ఇక ఆ విషయం మాట్లాడకుంటే బాగుండు ననుకుంటూ వుండగా వా ళ్ళమ్మ అన్నానికి పిలిచింది. బయలుదేరారు. సత్యారావు స్నేహం విషయం ఆలోచించుకుంటూ వెళ్ళి, ఆలోచిస్తూనే భోంచేశాడు. చదువుకు కూర్చున్నపుడు గూడా ఏదో ధోరణిలో వుంటే—

''మురళీ! ఇంతకు ముందటి విషయాన్ని గురించే ఆలోచిస్తున్నావా?'' అంది సరళ ఆ సంఘటనను ఊహిస్తూ.

20

"అవును" అన్నాడు మురళి సత్యారావు స్నేహ విషయం గాబోలు ననుకొని.

"ఫరవాలేదులే, దాంట్లో అంతగా ఆలోచించాల్సిన దేమీలేదు."

కాసేపు చదివారు. అక్కడే పడుకున్నాడు మురళి. దీపం ఆరిపేసి వాణ్ణి కౌగిలించుకొని పడుకొంది సరళ. అపుడామె పెదవులు వాని నొసట వుండే గాయంపైన వున్నాయి.

మరునాడు సాయంకాలం సత్యారావు క్రిష్ణయ్యలతో కలిసి కృష్ణా తీరానికి బయలుదేరాడు మురళి. తాను నాలుగో ఫారానికి వచ్చినప్పటినుండీ వీళ్ళతో తిరగడం మొదలు పెట్టాడు. ఇదివరకంతా యింట్లో వాళ్ళక్కతో పాటు, పాఠాలు చదువుకోడమో, పేపరు చదువుకోడమో, మ రేదయినా చదువుకోడమో చేసేవాడు. సరళ S. S. L. C. అయినా మామూలు విషయాలు ఆమె కెంత తెలుసో వీడికీ అంత తెలుసు.

సత్యారావు యిల్లు వీళ్ళ వీధి కొసలో వుంది. క్రిష్ణయ్యది ప్రక్కవీధి. ప్రతిదినమూ వీళ్లు ముగ్గురూ కలిసి కృష్ణాతీరం వెళ్లేవారు. ఈ దినం గూడా అలాగే బయలు దేరారు.

కృష్ణ ఒడ్డున చేరిన తర్వాత వేడిగాలి కాస్త చల్లబడి నట్లయింది. మండు వేసవిలో బెజవాడ కాలిపోతూ వుంటుంది. ఉదయం తొమ్మిదిగంటల నుండి, సాయంకాలం నాలుగు వరకూ బయటికి తల పెట్టడానికే వుండదు. తననుతిట్టుకుంటున్న ప్రజలపై సూర్యుడికి కోపమొస్తుందేమోనని స్నేహితుడు వాయువును స్తంభింప జేస్తాడు. ఇక ఆవంలో ఉడికినట్లు ఉడికిపోతారు జనం. ఆ వేడిలో నుంచి వెళ్ళబారి బ్రతుకు జీవుడా అంటూ కృష్ణా తీరం పరుగెత్తి పోతా రున్నవాళ్లు సాయంకాలమౌతూనే.

గాలాలు వేసి చేపలు పడుతున్నా రొకచోట. క్రిష్ణయ్య చూస్తూ అక్కడే నిలుచుండి పోయాడు. తీరాన్నే నడుస్తూ ముందుకెళ్ళారు. మురళీ-సత్యారావూ. అట్లా కొంత దూరం వెళ్ళి గుడిసెల సమీపించారు.

"ఒరే, మురళీ! ఆ యిండ్లేరా మొన్న నీకు చెప్పింది!" అన్నాడు సత్యారావు.

## 21

"అక్కడేనా మంచిపిల్ల లున్నారని అన్నావు?"

"అవున్రా! మంచివా ళ్లున్నారు. నాకు తెలుసు గూడా."

"ఇకచాల్రా వెనక్కి వెళ్దాం పద, చీకటి పడుతుంది."

"ఈ కొంచెం దూరం వెళ్దొద్దాం."

"వద్దురా చీకటి పడింది గూడాను, మా అక్క తిడుతుంది."

"మీ అక్కకు పెండ్లి చెయ్యరట్రా" అన్నాడు సత్యారావు, కండ్లొక మోస్తరుగా బెట్టి, రెప్ప లెగరేస్తూ, పెదవులు బిగించి.

"ఏమోరా?"

"క్రిష్ణయ్య చేసుకోడూ?" అన్నాడు వేళాకోళ భంగిమలో.

మురళికి చిన్న తనమేసినట్లయింది. సత్యారావంతమిత్రుడు, క్రిష్ణయ్య లాంటి వాణ్ణి తన అక్కకు వరుడుగా సూచించే టప్పటికి అర్థమ్ కాదనో యేమో చిన్నతనం వేసింది. ఆ మాట సత్యారావు తనకే అన్వయించుకొని వుంటే అట్లా భావించి వుండదేమో! ఇంతలో పాత విషయాలు గూడా జ్ఞాపకం వచ్చాయి. అంతకు ముందు రెండు నెలలే అయి వుంటుందది జరిగి. క్రిష్ణయ్య సరళల పేర్లు బోర్డు లెక్కాయి. కిటికీల పైన, గోడలపైన గూడ. దీనికి కారణం క్రిష్ణయ్యకూ తెలీదు, సరళకూ తెలీదు. అంతా సత్యారావు చేసిన గోలే. అది చూచినప్పటినుండీ క్రిష్ణయ్యంటే మురళి కంతగా నచ్చదు.

ఆలోచిస్తూనే, "ఛా! వాడికంట్రా యిచ్చేది?" అన్నాడు.

"అయితే యింకెవరి కిస్తార్రా?"

మురళి సమాధానం చెప్పలేదు. అది అధికప్రసంగితనమని మురళికి తెలుసు. సత్యారావు కాబట్టి కోప్పడలేదు.

సరస్వతమ్మ సరళ రూంలో కొచ్చి "యేదే అబ్బాయి?" అంది.

"ఇంకారాలే దమ్మా ఎక్కడికెళ్ళాడో - వీడూ - ఆ సత్యారావుగా దొకడు చేరాడు వీడికి" అంటూండగానే మురళి వచ్చాడు.

"ఏరా! ఎక్కడెళ్ళావు?" అంది సరస్వతమ్మ మామూలుకాని గొంతుతో.

"పిల్లవాళ్ళంతా స్నానాలు చేస్తూవుంటే చూస్తూ కూర్చున్నానే" అన్నాడు తడబడుతూ, అక్కవైపు చూచి.

అది అబద్ధం అని అపుడే గ్రహించింది సరళ. అయినా యేమీ మాట్లాడలేదు. అదరాబదరా భోంచేసి ముందే రూంలో కెళ్ళింది సరళ. తప్పు చేసినవాడు లాగా తారాడుతూ వెళ్ళాడు మురళి. అట్లా, కనుబొమలెత్తి అక్కవైపు చూశాడు. ఆమె సూటిగా వీడి మొగం వైపు చూస్తూ వుందీ. మంత్రముగ్ధుడులాగా - ఆనుకొని కూర్చొని వున్న ఆమె కాళ్ళ దగ్గర కూర్చు న్నాడు.

దీనంగా చూస్తూ, "అక్కా! కోపమా!" అన్నాడు.

"చూడూ!" అంటూ గడ్డంపట్టి యెత్తాడు ముందుకు జరిగి. ఆమె ముందుకు వంగి వాడి నొసటి గాయంపై ముద్దు పెట్టి "కోపంలేదు గాని, అబద్ధా లెందుకు చెప్పావు?" అంది.

"చెప్పలేదే!"

"మళ్ళా ఒక అబద్ధం!"

"ఇది అబద్ధ మెట్లా అవుతుంది?"

"మళ్ళా ఒకటి!"

".... .... .... ...."

"చూడు! ఎవరో స్నానాలు చేస్తూవుంటే చూస్తూ వున్నానని అనటం కంటె, సత్యారావుగాడితో తిరుగుతూ వున్నానని చెప్పగూడదూ?" అని చూచినట్లు నిలవేసి అనేటప్పటికి తెలిసిందనుకొని "నిజమేక్కా!" అన్నాడు.

"అట్లా చెప్పు! అట్లా చెప్పడం పోనిచ్చి అబద్ధ మెందుకాడావు? చేసింది తప్పు! దాన్ని కప్పిపుచ్చడాని కొక అబద్ధం! దాన్ని మళ్ళా సమర్థించు కోడానికి మరొకబద్ధం! తప్పు గాదూ?"

"చూడు! ఇక మీదట సత్యారావుతో తిరగకు! పోవుగదూ?" నిర్బం ధించినట్లుగా అడిగేటప్పటికి "ఊఁ" అనవలసి వచ్చింది.

# 3

"అమ్మా నే నెందు కమ్మా? నీ వొక్కతెవే వెళ్ళవచ్చుగా!"

"ఎప్పుడూ గడపదాటని పిల్ల ఒంటరిగా యెట్లా వెళ్తుంది?" అన్నది సరస్వతమ్మ బ్రహ్మారావుతో.

"రావాలి నాన్నా."

"శీటు వచ్చింది. హాస్టల్లో గూడా శీటు వచ్చింది. ఇంకేం? నీవే వెళ్ళ వచ్చుగా! నీ క్లాసుమే టెవరో వస్తుందని అన్నావు."

"మురళి తప్పక రావాల నాన్నా! వాడు మద్రాసు చూడాలట!"

"వాడొ స్తే, వాడి కోసం తప్పక నేను రావాలని అర్థమేగా!"

"అందుకే! ఇద్దరూ వచ్చి రెన్నాళ్ళుండి వద్దురుగాని! నాకూ ఆ మద్రాసు కొత్తేగా! అది చాలా పెద్ద పట్నమని - ఎపుడూ - కార్లు - బస్సులూ- ట్రాములూ - ఎడతెగకుండా తిరుగుతూ వుంటాయనీ - మరీ సెంట్రల్ స్టేషను దిగగానే అవన్నీ తప్పించుకొని అవతలికి దాటుకోడమే కష్ట మనీ - ఇంకా ఏమేమో చెబుతారు నాన్నా! ఏమో నా కొక్కతెకే పోవాలంటే భయ మేస్తూ వుంది."

"ఇంతమాత్రం మగపిల్లవా డయితే ఇట్లా అనేవాడా సరళ? తన పాటికి ఒంటరిగా ప్రయాణం కట్టేవాడేగా."

సరళకు చిన్న తనమేసింది. నిజమే! మగపిల్లవా డయితే తన స్థితిలో తప్పక ఒంటరిగా వెళ్ళేవాడే. అసలు ప్రయాణాలు తనకు వలెనే కొత్తగా వుండవు. తాను పురుషులకంటే యే విషయంలో తక్కువ? అని చాలాసార్లు అనుకుంటూ వుందిటీవల! అన్ని విషయాల్లో గూడా యితరులపై ఆధారపడ కుండా వుండా లనుకుంటుంది. అయితే తానేం చెయ్యగలదు? తన కిచ్చే శిక్షణ వేరు! తనకు చెప్పే విషయాలు వేరు! తనను దండించే పద్ధతి వేరు! తనకు స్వేచ్ఛ యివ్వరు! మురళికీ, తనకూ భేదం వుంది. వాడు చిన్నపిల్లవా డయినా

బయటికి కెళ్ళి తిరుగుతున్నాడు స్వతంత్రంగా। వద్దన్నా వెళ్తున్నాడు। తనో। దీనికంతా కారకు లెవరు? తానా?

"నాన్నా, నేను ఆడపిల్ల కావటంవల్ల నంటావా యింత అసమర్థతతో కనబడటం? ఆడపిల్ల కిచ్చే శిక్షణ వల్లనే యిట్లా తయారైనా నని అనుకుంటున్నాను। దీనికి కారణం నేను గాదు।"

"నిజమే నమ్మా? అది నేనూ కా దనను."

ఇంతలో ఎవరో పార్టీదా రొచ్చి "అర్జెంటుగా రావాలండీ. చాలా అర్జెంటు కేసు" అన్నాడు.

బ్రహ్మారావు లేచి, "సరళా యీ వూళ్లోనే చదవగూడదూ?" అంటూ బయటి కెళ్ళిపోయాడు.

సరళ అట్లాగే కూర్చొంది. "ఈ వూళ్లో చేరగూడదా" అన్నవాక్యం పైనే ఆలోచిస్తూ కూర్చుంది. తక్షణం సత్యారావు జ్ఞాపకాని కొచ్చాడు. వాడి మిత్రబృందం, మిగిలిన రౌడీలు జ్ఞాపకాని కొచ్చారు. హైస్కూల్లో ఆడపిల్లల బ్రదుకెంత కష్టంగా వుంటుంది।

సరళ అప్పుడు ఒకటో ఫారంలో వుండగా, సత్యారావు గూడా చేరాడు అదే తరగతిలో. కాస్త ఉన్న యింటి పిల్లవాడే. బలే టెక్కు. ఎవర్నీ లెక్కించడు. అప్పట్లో కొంతమంది పెద్ద తరగతి పిల్లవాళ్ళ రౌడీజట్టుండేది. 'ఓగు నోగు మెచ్చు' అన్నట్టుగా వాళ్ళల్లో చేరాడు సత్యారావు. వాళ్ళకంతా ఎపుడూ ఆడపిల్లల గొడవే. ఆడపిల్లలు వాళ్ళ దెబ్బకు సరిగా నడవలేకనే పోయేవారు. బడి విడిచిందే తడవుగా ఆడపిల్ల లంతా జట్లు జట్లుగా చేరి బిక్కిరి బిక్కిరి చూస్తూ, గబ గబా అడుగులేస్తూ తడబడుతూ నడిచేవారు. ఆ ప్రక్కనో. లేకపోతే వెనకాల్నో రౌడీలు జట్లు జట్లుగా వచ్చేవారు. 'హంస నడకరా?' అని ఒక డనేవాడు। గొల్లున నవ్వేవారు మిగిలిన వారు। మళ్ళా ఒక డనేవాడు: 'కాదురా గుఱ్ఱం కదం తొక్కుతున్నదిరా' అని మరొక డనేవాడు 'నెమలి నాట్యం చేస్తున్నదిరా' అని మరొక డనేవాడు. 'అదేమిట్రా అడ్డకాలేసి నడుస్తుంది' అని. అబ్బా! ఇట్లాంటి వెన్ని!

గంట కొడుతూనే మాష్టరు క్లాసులోకి రాడు. కొంతమంది లోపల కూర్చుంటారు. రౌడీలు తలుపు దగ్గిర! ఆడపిల్లలూ, అక్కడే నిలబడాలి. మాష్టర్ను చూడగానే అందరూ దూర్తారు! ఏమికేక లేస్తారు! ఒకడు 'మాల కాకి!' అంటాడు. ఒకడు 'గరుత్మంతు' దంటాడు. మరొకడు 'పాము' అంటాడు, వరుసగా 'ఏనుగు, గేదె, పాంపడగ, ఇసుకతిన్నె, మేడపైన, సినిమా హాల్లో, మిడిగుడ్లు, కప్పనోరు!' ఇట్లాంటివెన్నో ఒక అరనిమిషంలో ప్రతిధ్వనిస్తాయి! ఒక పిల్లకూ పేరులేకుండా పోదుగదా!

పైగా ప్రేమ జాబులు! ప్రేమంటే ఏమిటో వాళ్ళ ముఖం! ప్రతిపిల్లకూ ప్రేమజాబు రావాల్సిందే! ప్రతి ఒకడూ ఏం పొగుడుతాడు! 'ఓ నా హృదయాధి దేవతా! నీ సుందరవదనారవిందమును జూచి పిచ్చివాడనై తిని. నీ నడకను చూచినపుడెల్ల నీ సుందర కోమలారుణ పాద ద్వయము నా హృదయమున కెంత చక్కిలిగింతలు ఆపాదించునో గదా! నీ కంత రూప మెక్కడనుండి వచ్చినది! ఎంతలావణ్యము! ఎంత మార్దవము! ఎంత సోయగము! నీ పాదములంటి పూజచేసినగాని నా యీ మోహమను పిచ్చి కుదరదు. నన్ను దయతో నేలుము'-ఇట్లాంటి జాబులే అందరూ అంద రమ్మాయిలకూ వ్రాస్తారు. కొంతమంది పిల్లవాళ్లు చిక్కేవారు. దేహపూజలు, జరిమానాలు పొందేవారు గూడ!

ఒక పిల్లపైన కోపం వస్తుం దొకడికి. మరొకడిపైన మత్సరం, అసూయా వుంటాయి. ఇక వీళ్లిద్దరి కతా దేవుడి కెరుక! వాడూ వాడి జట్టూ కలిసి వీళ్ళిద్దరిపేర్లూ బోర్డులపైనా, కిటికీలపైనా, లెట్రిన్‌లలోనూ ఎక్కడపడితే అక్కడ అసహ్య వర్ణనలతో ప్రత్యక్షం! రకరకాల చిత్రాలు చిత్రింపబడి వుంటాయి.

కొంద రమ్మాయిల అన్నదమ్ము లుంటారు. వాళ్ళకు కోపం వస్తుంది. పార్టీలు తయారౌతాయి. అపుడపుడూ దెబ్బలాటలు!

సరళ ఈ విధంగా ఆలోచిస్తూ కూర్చుంది. ఆడపిల్లల కెంత కష్టం హైస్కూల్లో. ఎన్ని సహించారు పాపం! ఎంత అవమానాన్ని పొందారు. ఛీ! ఛీ! ఆడుపిల్లగా పుట్టటమే తప్పు.

సత్యారావు చిన్నప్పటి నుండీ తనకు తెలుసు. తన వీథిలోని వాడే. ఆట పాటల్లో పాల్గొనేవాడు. తన నేదో విధంగా ఏడిపించాలని చూచేవాడు; ఒకనాడు వచ్చి అడిగాడు. తాను వద్దంది. తనను ప్రతి దినమూ ఎగతాళి చేసే వాడు; ఏమేమో అనేవాడు. ఒకనాడు బలవంతంగా, ఎవరూ లేంది చూచి పట్టుకొన్నాడు. దవడ పగిలేటట్టు కొట్టింది. కాలితో తన్ని పరుగెత్తబోయింది. వాడు పట్టుకొన్నాడు; వాడిముఖం అదేదో ఒక తీరుగా వుండింది. తన నేమీ అనలేదు. ఇంతలో ఎవరో ఆ దారిన వచ్చారు. ఎవరి పాటికి వాళ్లు పారి పోయారు. సత్యారావు గురించి సుముఖంగా ఆలోచించింది. అతనిపైకి కాస్త మనసు పొర్లింది. అప్పు డీమె మూడవఫారం. వాడిలో ప్రవర్తన మార లేదు. రౌడీలతో కలిసి తనకు మారుపేరు పెట్టి అరవసాగాడు. తర్వాత క్రిష్ణయ్యపేరూ తనపేరూ గోడల కెక్కించి, వ్యంగ్యంగా అసహ్య చిత్రాలు గీశాడు. తాను అయిదోఫారం చదివేటప్పు డొకనాడు ఒంటరిగా వస్తూవుండగా కాస్త చీకటి పడినాక, అడ్డగించాడు. పట్టుకున్నాడు గూడ. ఏదో విధంగా తప్పించుకొంది. సత్యారా వంటే అసహ్యం ప్రబలి పోయింది. తీక్షత వహిం చింది. అంతా ఒక్కసారి తిరిగింది మెదడులో. తన హైస్కూలు జీవిత మంతా సింహావలోకనం చేసుకొనే టప్పటికి ఏదో వ్యధ హృదయంలో చొర బడింది. కండ్లలో నీరు తిరిగింది. చక్కాలేచి తన గదిలో కెళ్ళిపోయింది.

సాయంత్రం వాళ్ళ నాన్న కాలేజీ మాట యెత్తగానే "ఈ పూళ్ళో నేను చదవను నాన్నా! అంతగా అయితే చాలించేస్తాను" అంది దృఢంగా.

"సరేలేమ్మా? అట్లాగే వస్తాను. అయితే ఒకరోజు కంటే యెక్కువ వుండటానికి వీలులేదు."

"చాలు" అంటూండగా రాజామణి వచ్చింది. ఆమెను చూడగానే "నమస్తే అత్తయ్యా!" అంది సరళ.

"దయ చేయండ త్తగారూ!" అన్నాడు మురళి చేతులు చాపి, దింపిం కుర్చీ చూపిస్తూ.

"ఏరా అత్తయ్యతో సరసాలు మొదలుపెట్టా వప్పుడే" అంది సర స్వతమ్మ.

''అవును మరి! గోపాలకృష్ణ దెవరితో ఆడాడు?'' అంటూ రాజామణి వైపు కొంటెగా చూశాడు.

"నా బంగారూ'' అంటూ రాజామణి వాణ్ణి దగ్గిరికి లాక్కొని గట్టిగా రెండు చేతుల్తో అదిమి పట్టుకొని, కూర్చుంది. కూర్చొని అట్లా చూస్తూ ''ఏమిటే చా లంటున్నావు సరళా'' అంది.

''కాలేజీకి వెళ్తున్నా నత్తయ్యా.''

''ఈ వూళ్లోనేనా?''

"మద్రాసులో.''

''మంచిపని చేశావు.''

''ఏమిటో పిల్ల నొంటరిగా వదలటం నా కంత యిష్టం లేదు. రాజా మణిగారూ, ఈ వూళ్ళోనే చదివితే పోతుం దనుకుంటున్నా'' అంది అపుడే వంటింట్లోంచి వచ్చిన సరస్వతమ్మ.

''అబ్బే! ఈ వూళ్ళో చదివింది చాలమ్మా! ఇక చదవలేను. ఈ హైస్కూళ్ళల్లో రకాలే ఈ కాలేజీలో చేర్తారు. ఇటువంటి మఫిసిల్ కాలేజీ లన్నీ హైస్కూళ్ళ వాతావరణాన్నే కలిగి వుంటాయి. ఇటువంటి కాలేజీల్లో చదివితే విశాల దృక్పథం బాలికల్లో గానీ బాలురలో గానీ రాదు. అంతా సంకుచిత వాతావరణం! మాస్టర్లు ప్రిన్సిపాళ్లు గూడా సంకుచిత స్వభావులు'' అంది సరళ.

''అది నిజం. సిటీ కాలేజీలు చాలా మేలు. అక్కడంతా స్వతంత్ర వాతావరణం! ఆడపిల్లలు నిజంగా అక్కడే చదవాలి. వాళ్ళ స్థితేమిటో కాస్త తెలుసుకుంటారు. వాళ్ళలో వుండే అసమర్థత పోతుంది. సంకుచిత స్వభావమూ పోతుంది. బాధ్యతంటే యేమిటో తెలుస్తుంది. ఈ కాలేజీల్లో వుండే కోతి స్వభావం గల పిల్ల వాళ్ళుండ రక్కడ,'' అంది రాజామణి.

''సరళ విషయంలో నా కేమీ భయం లేదమ్మా'' అన్నాడు బ్రహ్మ రావు.

''అవు నన్నయ్యా! సరళ అంత మాత్రం తెలివైందే! నేను మామూలు పిల్లల విషయం చెప్పానంతే.''

"మరి మద్రాసుకు నన్నుగూడా రమ్మని కూర్చుంది!"

"నన్నుగూడా రమ్మంటూం దత్తయ్యా" అన్నాడు మురళి కుర్చీలో కూర్చున్న ఆమె పైన కూర్చొని, ముందుకు చూస్తూ చేతులు మాత్రం పైకెత్తి ఆమె నున్నని గవదలు నిమురుస్తూ.

"అట్లాగా" అంటూ వాణ్ణి గట్టిగా ముద్దాడింది మమతతో.

"ఎక్కడుంటారు మరి మీరు మద్రాసులో" అంది రాజామణి.

"అంతమంది తెలిసిన వాళ్లుండగా యెక్కడుండగూడదు?"

"మా చెల్లివుంది అక్కడ డాక్టరుగా. ఒక సంవత్సరమైంది ప్రాక్టీసు పెట్టి. అక్కడికి కెళ్ళాలి ఈ దఫా! అట్లా అయితే నేనుగూడా వస్తా రేపు" అని "ఏమోయ్ అల్లుడూ వెద్దామా" అంది వెనకగుండా హస్తాలు రానిచ్చి వాడి గవదలు నిమురుతూ.

"ఊఁ" అన్నాడు మురళీధర్ లేచి, గట్టిగా తనను ఆమె రెండు తొడల మధ్యా అదుంకుంటూ.

"ఇక మరి నేనెందుకమ్మా. అత్తయ్య వస్తుందిగా! తర్వాత ఆమె, మురళి కలిసి వస్తారు" అన్నాడు బ్రహ్మారావు.

"ఓహో? బాగా వుందే! మీరుగూడా వస్తారనుకొని అట్లా అన్నాను" అంది మిడ్‌వైఫ్ రాజామణి.

"ఫరవాలేదమ్మా! నాకు చాలా పనుంది. నన్ను బ్రతికించిన దాని వొతావు....మరి, అంతమాత్రం బాధ్యత లేదా యేమిటి అల్లుడి విషయంలో కోడలి విషయంలో."

"సరే భోజనాలకు లేవొచ్చు" అంది సరస్వతమ్మ.

"సరే వస్తా మరి!" అంటూ లేచింది రాజామణి.

"భోంచేసి తర్వాత వెళ్ళండి" అంది సరస్వతమ్మ చిరునవ్వుతో.

"నువ్వెక్కడికి కెళ్ళేదీ" అంటూ లోపలి కీడ్చాడు మురళీధరుడు రాజామణిని.

"ఏమోయ్! యిప్పుడే యిట్లా యాడుస్తున్నావ్? పెండ్లయితే యింకా

యీాద్చేటట్లున్నావ్'' అంటూ పక్కకు అదుంకొంది. అందరూ నవ్వుకుంటూ లోపలి కెళ్ళారు.

మరునాదే కలకత్తా మెయిల్‌లో బయలుదేరారు. మరునా డుదయం తొమ్మిదికంతా మద్రాసు చేరారు. ప్లాట్‌ఫారంపై దిగగానే చంద్రమణి కలుసుకొంది.

''ఇదుగోనే నీ కొక మంచి అల్లుణ్ణి తీసికొచ్చాను'' అంది. వాణ్ణి చూడగానే ఆమె మనసంతా ఆహ్లాదపూరితమై పోయింది. ఒక విధంగా లోపల పండ్లు బిగించి, గొంతులో శబ్దంచేసి దవడలు నలిపింది. వెంటనే పరిచయం చేసిన సరళను ఒక చేత్తో దగ్గిరికి తీసుకుంది. అందరూ కారెక్కి వెళ్ళా రింటికి. భోజనాల తర్వాత,

''ఈ పిల్ల లెవరో తెలుసా?'' అంది రాజామణి.

'ఎవరు? బ్రహ్మారావుగారి.

''ఆఁ ఆఁ, అన్నీ ఆనాడు చెప్పాను చూడూ! జ్ఞాపకం లేదూ?''

''ఓహో! తెలిసింది! చూచావా! అందుకే యీ యబ్బాయి అంత దృఢంగా, అంత చురుగ్గా కనిపిస్తున్నాడు! ఏదీ! రా అల్లుడూ యిట్లా.''

దగ్గిరి కెళ్ళాడు మురళి ఒక మోస్తరుగా సిగ్గనభినయిస్తూ.

''నీ పేరేమిటి?''

''మురళీధర్.''

''ఓహో! చక్కగా వుంది! అంటే అర్థం?''

''కృష్ణుడు.''

''అదీ! కృష్ణుడు రాధ దగ్గర కొచ్చాడుగదూ!'' అంటూ ప్రక్కకు అదుంకొంది. వాడూ సిగ్గుపడుతూ ఒక మోస్తరుగా లొంగాడు. ఈ సరసం గూడ వాళ్ళత్తయ్య సరసంలాగానే వుందిగాని అంత చనువుగా లేదు. అంతే తేడా.

''చూచిన వాళ్ళంతా వాడిపైన పడటం సరళ సహించదు. కాని, దాన్ని గురించి అంత వెగటుగా భావించదు. వీళ్ళేగాదు, తమ యింటి కెవరొచ్చినా-

స్త్రీగాదు - పురుషుడు గాదు - వీణ్ణి దగ్గిరికి లాక్కొని ముద్దుపెట్టుకోవాల్సిందే! నిజంగా వీడు గోపాలకృష్ణుడే అవుతాడేమో అన్న సందేహం అపుడపుడూ సరళకు కలుగక పోలేదు. 'చిన్న తనంలో అందర్నీ అలాగే ముద్దుగా చూస్తార్లే' అని సమాధానించు కొనేది. అయితే కారణ మింతగా తెలియ కుండానే, కొద్దిపాటి అసూయా భావం ఆమె హృదయంలో పొడసూపేది.

"మార్కు లెట్లా వచ్చాయి సరళా" అంది చంద్రమణి.

"మూడువందలా యాభై మాత్రం!"

"గ్రూపేమిటి తీసుకుంటావ్?"

"ఫస్టు గ్రూపు."

ఆ మధ్యాహ్నమే కాలేజీకి బయలుదేరారు కారులో. కాలేజీకీ, హాస్ట లుకూ, డబ్బుకట్టినాక తిరిగి వచ్చేశారు. రేపో యెల్లుండో హాస్టలు కెళ్ళాలి. తలిదండ్రులను వదలి, యిల్లు వదలి ఎక్కడో ఒంటరిగా జీవించాలి. ఇంటి దగ్గర ధైర్యంగానే వుండిందిగాని, మద్రాసొచ్చినాక కాస్త బెంగ కలిగింది! మురళిని వదిలి వుండా లన్నది పెద్ద బెంగయి కూర్చుంది! ఆ రాత్రి ఆలోచన ఎక్కువైంది సరళకు. అప్పటికి రాత్రి 10-30 అయి వుంటుంది. అంత వరకూ ఆలోచిస్తూనే ప్రక్కపైన కూర్చొనుంది సరళ. మురళి నిద్రపోతు న్నాడు. అతని కాళ్ళ దగ్గరగా కూర్చుంది. కన్నీరు కార్చింది!వాడి ప్రక్కలో పడుకొని, నొసలి కనుమపై పెదవులు వుంచి, కౌగిలించుకొని నిద్ర పోయింది. నిద్రపోగానే చంద్రమణి వచ్చిచూచి లైటు ఆర్పి, అక్కతో అంది:

"అక్కా! మురళి తన తల్లికొడుకు కాదని సరళకు తెలుసా?"

"తెలుసు? ఎందుకు?"

"ఎందుకూ లేదులే! ఊరికేనే!" అంటూ తలపంకించి, వెళ్ళి పోయింది తన గదికి.

మూడోనాడు ఢిల్లీ ఎక్స్ప్రెస్‌కు బయలుదేరారు మురళి రాజామణి., చంద్రమణి, సరళలు స్టేషను కొచ్చారు.

"అత్తయ్యను చూడ్డానికి మళ్ళా యెపు డొస్తావోయ్" అంది చంద్ర మణి మురళి చంపగిల్లి.

"అత్తగారి మనసెపుడు కోరితే అపుడే" అన్నాడు చనువుగా. బండి కదిలింది. గుడ్ బై అన్నాడు మురళి. చంద్రమణి చిరునవ్వుతో - సరళ కన్నీటి ధారలతో నిండిన దిగులు ముఖంతో బయలుదేరారు. సరళ అంతకు ముందు రాత్రి చెప్పిన విషయాలన్నీ నెమరు వేసుకుంటూ అత్త తొడపై చెయ్యేసి కూర్చున్నాడు, మురళి పోతూన్న బండ్లో.

## 4

క్రిష్ణయ్య, మురళీధర్ - ఇద్దరే కలిసి యిపుడు కృష్ణాతీరం వెళ్ళేవారు. క్రిష్ణయ సహవాసం మంచిదని అక్కయ్య అపు డపుడూ చెప్పడమే కాకుండా మొన్న మద్రాసులో కూడా చెప్పింది. క్రిష్ణయ్యంటే గొప్ప అభి ప్రాయం లేకపోయినా కాస్త గౌరవం మాత్రం వుంది. క్రిష్ణయ్య తనను గూడా మర్యాదగానే చూస్తాడు. తా నిపుడు కాలేజీలో చేరినప్పటికీ మామూలు వాత్సల్యం చూపిస్తూనే వున్నాడు. క్రిష్ణయ్య స్నేహం దినాలు గడిచేకొద్దీ, మంచిగానే తోస్తూ వుంది.

అట్లా పది దినాలు గడిచాయి! సత్యారావు మాత్రం కనబడలే దింత వరకూ! అతని విషయం క్రిష్ణయ్యగానీ మురళిగానీ యెత్తలేదు. ఆనాడు కొద్ది కొద్దిగా చీకటి పడుతూంది. మురళి భుజంపైన చెయ్యి పడేటప్పటికి ఉలిక్కిపడి తిరిగి చూచాడు! ప్రత్యక్షంగా సత్యారావు నిలబడ్డాడు చిఱునవ్వుతో, చూడగానే ఆలోచనలు బయలుదేరాయ్. పాత నిర్ధారణలన్నీ పటాపంచలయి పోయాయ్! క్రిష్ణయ్యను వదలి వాడితో బయలుదేరాడు!

"ఏంట్రా ఆలోచిస్తున్నావ్?" అన్నాడు సత్యారావు భుజాన చెయ్యేసి

"ఏమీ లేదురా! ఇన్నాళ్లు కనబల్లే దెందుకా అని!"

"ఊళ్లో లేను. అంతే? లేకపోతే నీ బంగారు స్నేహాన్ని వదిలా ననుకున్నావా?" అంటూ తృప్తిగా పరీక్షించాడు ఆపాదమస్తకం.

అది పన్నెనో యేడు మురళికి. పిల్లవాడు చీకూ చింతా లేకుండా పెర గటంవల్ల బాగా వున్నాడు. ఇద్దరికీ ఆరేండ్ల వ్యత్యాసం వున్నా అంత తేడా వున్నట్లు కనుపించదు. సత్యారావు మళ్ళా వాడి భుజంపైన కొట్టి—

"ఏరా? ఇంకా ఆలోచిస్తున్నావ్! రా! పోదాంరా!....చూశావా, సాయంకాలమే దిగాను రైలు. అదరాబదరా స్నానంచేసి మీ యింటి కెళ్లాను. ఇప్పుడే వెళ్ళా రన్నారు. అంతే, చక్కా వచ్చేశాను. ఏరా మురళీ మీ యక్క లేదేం యింట్లో?"

ఈ మా రెండుకో, సత్యారావు వాళ్ళక్క విషయం యెత్తడం అంత రుచికరంగా కనిపించలేదు మురళికి. అయినా ఆ ప్రశ్న వెగటు కలిగించ లేదు. "మద్రాసులో చేరింది" అన్నాడు ముక్తసరిగా! "ఓహో!" అన్నాడు సత్యారావు తప్పించుకుంది అనుకుంటూ.

చెయ్యిపట్టుకొని, దూరంగా నడిపించాడు మురళిని సత్యారావు. ఏమేమో చెప్పాడు. తానెక్కడికో తన బంధువుల వూరికి వెళ్ళాడట. అక్కడ తన మాదిరే చదువుకొనే వాళ్లు గూడా వున్నారట! వాళ్ళంతా కలిసి బాగా షికారు వెళ్ళేవారట! ఆ వూళ్ళో మంచిపిల్లలే వున్నారట! వీళ్లు వాళ్ళకు కాస్త డబ్బులిచ్చి బాగా వ్యభిచరించేవారట. చాలా కులాసాగా కాలం గడిపేవారట! ఈ కాలేజీ చదువుకోసం వాళ్ళ తలిదండ్రులు త్వరగా రమ్మని వ్రాయకపోతే ఇపుడే వచ్చేవాడు కాదట! ఎన్నేండ్లయినా అక్కడే వుండిపోవాలనే ఊహ గూడా కలిగిందట!....ఇంకా ఎన్నెన్నో ఇట్లాంటివి మురళికి చవులు పుట్టించేటట్లు చెప్పాడు. బాగా .వుందని మెచ్చుకున్నాడు. తర్వాత తను మద్రాసు ప్రయాణాన్ని గురించి చెప్పాడు.

అప్పటికి ఆరు నెలలు ముందునుండీ కసరత్ నేరుస్తున్నాడు మురళి. ప్రతి దినం చీకటితో లేవటం-బాగా దండీలు బస్కీలూ యింకా యేమోమో అయినాక, బారుచెయ్యటం - ఇట్లాంటివన్నీ ఒక గంటసేపు చేసేవాడు. నులి

వెచ్చని వేన్నీళ్ళతో స్నానంచేసి, కాసేపయ్యేటప్పటికి - బాదంపప్పూ, గస గసాలూ, బాగా నూరి, పాలుతీసి, దాంట్లో ఆవుపాలూ చక్కెరా కలిపిన ద్రవాన్ని వాళ్ళ నౌకరు అందివ్వగా తాగేవాడు. పుష్టినిచ్చే ఆహారాన్ని బాగా సేవించేవాడు. రాత్రి పూటా, పడుకొనేప్పుడు మళ్ళా ఆవుపాలు!

మార్చినెల మొదట్లో ఒక ఆదివారంనాడు కాస్తముందే బయలు దేరారు మురళీ, సత్యారావూ. అట్లా ఊరుదాటి వెళ్ళారు, సుమారు మూడు మైళ్ళయినా వెళ్ళివుంటారు. అక్కడ పరిమళ్ళు చెఱకుతోటలు ఎక్కువ. ఒక చెఱకుతోటలో కూర్చున్నా రిద్దరూ, చెఱకు కొట్టుకొని తింటూ.

"అబ్బా! ఎంత హాయిగా వుందిరా" అన్నాడు సత్యారావు రసం పీలుస్తూ.

"అవున్రా! ఇక్కడే ఆ మరణాంతం వుంటే బాగుంటుం దనిపిస్తు న్నది" అన్నాడు మురళి.

"చూడూ! బయట వేరే ప్రపంచం వున్నట్టు కనిపిస్తుందేమో!"

"అవున్రా ఏమిటో చాలా తమాషాగా వుంది."

"ఇపు డిద్దరు పిల్లలుగూడా వుంటే బాగుండురా."

"నిజమేరా!"

"అయితే నీ కిష్టమేనా?"

ఆలోచిస్తూ కూర్చున్నాడు మురళి. కాస్త భయపడ్డట్లు కనిపించాడు.

"ఏమిట్రా భయమా?" అన్నాడు సత్యారావు పరిహాస ధోరణిలో.

"అబ్బే! భయ మేమిట్రా?" అన్నాడు మేకపోతు గాంభీర్యంతో మురళి. తన క్రసత్ శరీరాన్ని ఒకసారి భౌతికనేత్రాలతోనూ ఏమీ కనిపించని అయోమయాన్ని మనోనేత్రంతోనూ తిలకిస్తున్నాడు. ఆవిధంగా ఆచరిస్తే తన శరీరం పాడయిపోతుందని తనకు తెలుసు. శ్రద్ధగా పెంచుకుంటూ అభివృద్ధి దశలో వున్న శరీరాన్ని నాశం చేసుకోడం అతనికి యిష్టంలేదు. ఇంకా బాగా పెంచాలనుకున్నాడు.

"ఏరా! నీ కండలు కరిగిపోతా యనుకుంటున్నావా?" అన్నాడు సత్యా రావు నవ్వుతూ.

"కాదురా! ఎట్లయినా మంచిదికాదేమో! బలం తగ్గిపోదూ?"

"ఎవడ్రా చెప్పింది నీకు? పెండ్లయిన వాళ్ళంతా బలుస్తున్నారా తగ్గిపోతున్నారా?"

కాబోలుననుకున్నాడు మురళి. సత్యారావు భావాన్ని త్రోసిపుచ్చడానికి తన దగ్గర ప్రత్యుక్తులు లేవు. అవసరంగూడా కనిపించలేదు.

"రేపెవరన్నా యిద్దరు పిల్లల్ను పట్టుకొద్దామా?" అన్నాడు సత్యారావు, ఉత్సాహంతో మురళి భుజంపై చెయ్యేసి.

అప్పటికి బాగా తిన్నారు. అయిదారు గడలు నమిలి వుంటారు. పిప్పంతా అక్కడే వుమ్మేశారు. అంతా మరిచి దర్జాగా బయటికి నడుస్తున్నారు. తాము దొంగతనానికి వచ్చామన్న విషయం మరిచిపోయారు. బయట పడగానే తోటవాళ్లు పట్టుకున్నారు. వీళ్లేమీ చలించలేదు. అట్లా పట్టుబడటం మొదటిసారి గాదు. కాస్త గర్వంగానే తామెవరో చెప్పారు. "పోనీ వదలండి" అన్నారు తెలిసిన పెద్దవాళ్లు. కుర్రవాళ్ళిద్దరున్నారక్కడే. వాళ్ళన్నారు: "మీరు వాళ్ళ పిల్లవాళ్ళయితే మాకేమోయ్! ఇక యిట్లా వస్తే పక్కలిరగదంతాం." అని

ఇంటికొచ్చేటప్పటికి రాత్రి యెనిమిది గంటలయింది. బ్రహ్మారావింట్లో లేడు. "ఏరా! మళ్ళా ఎక్కడికన్నా దొంగతనం కెళ్ళావా?" అంది సరస్వతమ్మ. అంటూనే పని చూచుకుంటూ వుంది. "లేదమ్మా" అంటూ మురళి తన గదిలో కెళ్ళాడు ఆలోచిస్తూ.

పరీక్ష లయినంత వరకూ ఎక్కడా పోలేదు. సత్యారావుకు మాత్రం పరీక్షలు ముందే అయిపోయాయి. మురళి పరీక్షలు అయిపోగానే సత్యారావు లక్ష్మిని పరిచయం చేస్తానన్న ప్రదేశానికి బయలుదేరడానికి ముస్తాబౌతున్నాడు. అప్పటికి సరిగ్గా నాలుగు. బయట ఎండతీవ్రత ఇంకా తగ్గలేదు. అప్పటికే తయారై వచ్చాడు సత్యారావు. మురళిని చూడగానే సంతోషంతో,

"ఓహో! అట్లా వుండాలి. ఏదయినా అనుకుంటే, దాని సాఫల్యానికి

సరిగ్గా ప్రయత్నించాలి. నేను వచ్చి నిన్ను ప్రయాణం చెయ్యాల్సి వస్తుం దేమో అనుకున్నా."

"పొరపాటు జరిగిందిరా!"

"జరుగుతాయిలే, వాటికేం? కానీ! వెళ్దాం మరి!"

"అదిగాదురా, నే స్టేషను కెళ్ళాలి. మా అక్క వస్తుంది."

"వస్తుంది లేవోయ్! ఇదేం ఆమెకు కొత్తా?"

"అమ్మా నాన్నా చెప్పార్రా!"

"అరె! మా అమ్మా నాన్నా యెన్ని చెప్పరు నాకు!"

"అంతే నంటావా?"

"ఇక చాలు బయలుదేర్రా!"

బయలుదేరారు. బతికాంరా దేవుడా అనుకుంటూ సత్యారావు తనకు తానే అభివందనాలు, అభినందనాలూ చెప్పుకుంటున్నాడు. ఒక్కక్షణంలో రాజామణి యింటి కొచ్చారు. రాజామణి అపుడే స్నానం చేసి తలుపు తీసికొని బయటికొస్తూ వుంది. "అత్తయ్యా" అంటూ వచ్చి చెయ్యి పట్టుకొన్నాడు. చటుక్కున నిలబడింది. మొగం యెందుకో కలకలలాడింది. ఏదో లౌల్యం ప్రవేశించింది హృదయంలో. వివశత్వం చెందినట్లుగా "నా బంగారూ" అంటూ కౌగిలించుకొంది. వాడి శరీరానికి శీతోష్ణాలు రెండూ ఒకేసారి తగిలాయి. ఏదో చిన్న సంచలనం గలిగింది తనలో. ఇంతలో రెండు ముద్దులు పెట్టి,

"ఎక్కడి కొచ్చావ్ అల్లుడూ" అంది రాజామణి మైకంతో చూస్తూ. తాను బయలుదేరబోతున్న పనికి యిది నాంది అనుకుంది మధురంగా ఆలోచిస్తూ.

"అక్కను పిలుచుకురావడానికి పోతూ ఇట్లా వచ్చాను."

"అయితే కూర్చో వస్తున్నా డ్రెస్ వేసుకొని."

"వెళ్ళాలి."

"అయితే పనేమిటి?"

కాన్త నపిగాడు మురళి.
మళ్ళా వాని బుగ్గగిల్లి "చెప్పవోయి మగడా" అంది మందహాసంతో.
"కొంచెం డబ్బుకావాలి" అన్నాడు సంకోచిస్తూ.
"అంతేనా; ఎంతకావాలి? జట్కాకేనా?"
"అవును. రెండురూపాయ లుంటే యివ్వు."

"అంతేనా?" అని తక్షణం యిచ్చింది లంచ మిచ్చే దృష్టితో. గంతులేసుకుంటూ బయటికి పరుగెత్తాడు మురళి.

మిత్రులు ఇద్దరూ కలుసుకొని బయలుదేరారు. గుడిసెలు సమీపించారు క్షణంలో. మురళిని అక్కడుండమని సత్యారావు వెళ్ళి ఒక నిమిషంలో తిరిగి వచ్చి "పదరా" అన్నాడు.

"ఎక్కడికి?"
"తోటలోకి! వాళ్లు ముందే వెళ్ళినట్టుంది."
"ఏ తోట?"
"ఆ దినం మనం దొంగతనంగా జామకాయలు కోశామే, ఆ తోట."
"ఎన్ని జామతోట్లలో కొయ్యలేదురా మనం?"
"వాళ్లెవరో వస్తే తరమడానికి - రాళ్లు వేశాం చూశావా! అది!"
"ఎందరి పైనో వేశాం!"
"అదిరా! నదిగట్టున........"
"ఓహో! అదా! సరే?"

గబగబా నడిచారు. తోటలోకి వెళ్ళారు. ఆ తోటలో చిన్న గుడిసె గూడా వుంది. అది సంసారానికి గాదు. కావలి మనిషిని, ఎండ వానలనుండి రక్షించేందుకు! ఆ గుడిసెలోకి దూరారు ముందూ వెనకా. లక్ష్మి సీత లున్నారు. వీళ్ళను చూడగానే పెద్దపిల్ల చిఱునవ్వుతో ఆహ్వానించి మన స్తృప్తిని ప్రకటించిరది. ఏదో బాధ్యత నిర్వహించిన తృప్తి ఆమె మొగంలో కనిపించిం దా క్షణం. పరిచయం అయిపోయింది. చిన్నపిల్ల జామపండ్లు తెచ్చిపెట్టింది. జామపండ్లు తింటున్నా రందరూ ఒకర్నొకరు చూచుకుంటూ.

ఒక పందు మాత్రమే కొరుక్కుంటూ కూర్చున్న వాళ్లు మురళీ, ఆ చిన్న పిల్లా. వీళ్ళిద్దరి హృదయాల్లో ఏదో నూతన సంచలనం ప్రవేశించింది. అంచేత తినలేకున్నారు. సత్యారావు బాగాతింటూ, సగర్వంగా అటూ యిటూ చూస్తూ ఏదో కోతలు కోశేస్తున్నాడు. పెద్దమ్మాయి మాత్రం "ఆతిధ్యం చాలా అల్ప మైంది" అంది చిఱునవ్వుతో మురళివైపు చూచి. "ఇంతకంటేనా?" అన్నాడు మురళి తడబడుతున్న బొంగురు గొంతుకతో. అదురుపాటుతో అతిగా స్పంది స్తున్న గుండె, తన మాటల్లోగూడ స్పందనం కలుగజేసింది. చిరుచెమటలు తుడుచుకుంటూ చేతిగుడ్డతో విసురుకుంటున్నాడు.

ఒక క్షణం అట్లా మురళివైపు చూచి బయటి కెళ్ళిపోయింది లక్ష్మి. వెంటనే వెళ్ళాడు సత్యారావు. అప్పటికి ప్రొద్దు కుంకుతూవుంది. దట్టమైన వనం గాబట్టి, అప్పటికే కాస్త చీకటి వ్యాపించినట్లుంది తోటలో. గుడిసెలో మరి కాస్త ఎక్కువగా వున్నట్లుంది చీకటి. చాలసేపటినుండీ అక్కడే కూర్చొని వున్నారు గాబట్టి, ఆ మసక చీకట్లోనే ఒకర్నొకరు బాగా చూచుకో గలుగుతున్నారు వీళ్లిద్దరూ. ఆలోచిస్తూ, వాళ్లు లేచిపోవడం లీలగా చూస్తున్న మురళి తటాలున, కలగని మేలుకొన్నవాడి మాదిరి, లేవబోయాడు. రెండు భుజాలూ భారంగా వున్నాయి. వాటిపైన రెండుచేతులూ వేసి, ముందువైపున మోకాటి తుండేసి కూర్చుని అదొక మోస్తరుగా వీడి మొగంలోకి చూస్తూ కూర్చున్నది ఆ చిన్నమ్మాయి. మళ్ళా ప్రయత్నించకుండా చల్లగా కూర్చు న్నాడు. భావశూన్యమైన చూపుల్తో ఆమె మొగం అంతా పరికిస్తున్నాడు.

"అట్లా చూస్తా రెందుకూ?" అంది కాస్త కంపిస్తున్న స్వరంతో.

"ఏమీ లేదు" అన్నాడు. ఆ మాట గొంతు పెకలించుకొని ప్రయత్నం మీద వచ్చింది. గొంతులో దడకనిపిస్తూనేవుంది.

"ఎందు కొచ్చా రిక్కడికి?"

"సత్యారావు రమ్మంటే."

"అంతే నన్నమాట!"

".... .... .... ...."

"సత్యారా విఁకేమీ చెప్పలేదా?"

"ఏదో చెప్పాడు."

"ఏం చెప్పాడు?"

"…. …. …. …."

మురళి శరీరమంతా చెమటతో తడిసి పోయింది. మొగమంతా చిన్న ముత్యాలు తాపినట్లు తయారైంది. శరీరమంతా తేలి కయిపోయింది. నిర్వీర్యుడుగా కూర్చొని శూన్యంగా చూస్తున్నాడు.

"భయంగా వుందా?" అంటూ ఆప్యాయతతో తన పైట గుడ్డతో వాని ముఖమంతా తుడిచింది ఆ అమ్మాయి.

ఎడతెగని స్పర్శవల్ల మురళి గుండెదడ కాస్త తగ్గింది. ఏదో భావంతో ఆమె మొగంలోకి చూస్తున్నాడు. ఆమె తమకంతో అతని కండ్లల్లోకి చూస్తున్నది. ఇపుడామె హస్తాలు అతని రెండు నున్నటి గవదలపైనా నాట్యమాడుతున్నాయి. ఆమె యెడ తనకు అసహ్యం యీషణ్మాత్రం గూడాలేదు. సదభిప్రాయమే వుంది. అది ఆకర్షణకు దారి తీసింది. ఆకర్షింపబడి ఆలోచిస్తున్నాడు, లోపలేమిటో? ఒక విధమైన లౌల్యం ప్రవేశించింది. దానిపైన కేంద్రీకరించాడు మనసును. భయం ఆవేశించింది. 'నిస్సారవంతుణ్ణై పోతానేమో,' అన్న దిగులు ఉత్పన్నమైనది. అంత కంతకూ భయం పెద్దదయింది. మనసు భయంపై కేంద్రీకరింప బడేటప్పటికి, అంతకుముందు ఉత్పన్నమయిన లౌల్యభావం పటాపంచ లయిపోయింది. తటాలున ఆమె రెండు చేతులూ లాగివేసి లేచాడు. చకితయైనట్టుగా లేచింది ఆమె గూడా!

"చూడండీ!…." అంటూ దీనంగా అట్లా చూచింది.

"ఏమిటి?"

"చూడండీ" అంటూ ఇటు తిరిగిందామె చేతులు చాచి అర్థించే దృక్కులతో. అప్పటికే కొన్ని గజాలు పరుగెత్తాడు. పరిగెత్తుతూ ఆలోచిస్తున్నాడు. తన శరీరాన్ని మాటిమాటికీ చూచుకుంటూ పరుగెత్తుతున్నాడు. తప్పించుకొని వచ్చినందుకు తనకు తానే ధన్యవాదా లర్పించుకుంటూ పరు

గెత్తుతున్నాడు. ఒకసారట్లా ఆ యమ్మాయి పైకి పారించాడు మనసు. ఆ యమ్మాయి బాగానే వుంది. అందంగానే వుంది. అప్పటిలాగా కృశించి లేదు.

ఆనాడు - తాను అరుగు మీద కూర్చుని వున్నాడు. ఆ పిల్ల 'అమ్మా' 'సందాకవళం' అంటూ వచ్చింది. ఆ పిల్లను కసిరాడు. పోలేదు. తిట్టాడు! జమపెట్ట లేదు. తన్నాడు. కింద పడిపోయింది. తన కాలు దాని పావడ చించింది! పిల్ల ఎంత చక్కగా వుంది! . ఈ దృశ్యాన్నే పదేపదే మనసు లోకి తెచ్చుకుంటూ పరుగెత్తుతున్నాడు. సరిగ్గా 7-30 కు ఇంట్లో పడ్డాడు. అపుడే సరళ వచ్చి రూంలో సామాన్లు పెట్టించి నిలబడి వుంది.

"వెళ్తానని చెప్పి యెందుకు రాలేదు వెధవ! రానీ యింట్లోకి!" అంటూ వుంది సరస్వతమ్మ కాస్త కోపంగా.

"ఇదుగో వచ్చాడు!" అంది సరళ వింతగా వాడి మొగం వైపు చూస్తూ.

"ఎక్కడికి కెళ్ళావురా?"

"స్టేషనుకే, కాస్త ఆలస్యంగా వెళ్ళాను. అక్క కనిపించలేదు."

ఆ మాటలేమో అన్నాడు గాని, అవి యెట్లా వెలువడుతున్నాయో తాను మాత్రం గ్రహించలేక పోయాడు. అయితే సరళ గ్రహిస్తున్నదని బాగా తెలుసు! సరళ 'మురళీ' అంటూ సూటిగా చూచింది వాడి కండ్లల్లోకి. కట్టుకట్టేసిన పాము, మంత్రగాడు హస్తం చూపగానే పడగనూ, పొడవునూ ఉపసంహరించుకొని బుట్టలోకి యిమిడి పోయినట్టుగా కుంచించుకొనిపోయి గది లోకి వెళ్ళిపోయాడు. సరళ చూపులపై మనసు కేంద్రీకరించి కూర్చున్నాడు. ఏమిటా చూపులు! ఆ చూపులకు తన గుండె లెందుకు కంపించాలి? నా గుండెల్లో దాగివుండే భావాన్ని పైకి లాగడానికి ఆ చూపుల కెట్లా వచ్చిందో ఆ శక్తి! అక్క యేమంటుందో అనే భయం ఆవేశించింది హృదయంలో, గుండెలు గట్టిగా శబ్దం చేస్తూ కొట్టుకుంటున్నాయి!

"మురళీ!" అంది సరళ. తలెత్తి చూచాడు ఆందోళిత దృక్కుల్తో.

"ఇక్కడే వుందు" అంటూ స్నానాల గదికి వెళ్లిపోయింది. ఒక పావుగంటలో తిరిగి వచ్చింది సేదదీరినట్లుగా! ఆమె వాలకం చూడగానే వీడి భావాలు తీవ్రమై గుండె వేగం హెచ్చింది. ఆ వేగానికి వేడి రక్తం మొగం లోకి చిమ్మించి కొట్టింది. అందులోని వేడి, ద్రవాన్ని చెమట రూపంగా వెలికి గ్రక్కించింది. వీడి ఆందోళన చూచి వీడేదో మంచి తప్పే చేశాడు మళ్ళా అని బాగా తెలుసుకొంది సరళ. దగ్గరికి వచ్చి ప్రక్కలో కూర్చుంది! ఎంత బాగా వున్నాడు పిల్లవాడు! ఎంత నిగనిగలాడుతూ వుందా నుదురు! చిన్న చిన్న ముత్తెపు బిందువులతో ఎంత థళథళమంటూ వుంది! ముఖ చంద్రుణ్ణి భావ మేఘా లావరించి ఆలోకనానికి ఎంత కుతూహలాన్ని కలుగజేస్తున్నాయ్!

"నా మురళీ" అంది ఆప్యాయంగా ముందుకు జరిగి. లేచి నిల బడ్డాడు మురళి. అమాంతంగా కౌగలించుకొంది. అదే చోట ముద్దాడింది. ఎపుడూ రాని పారవశ్యం ఈ నా డామెలో చొరబడింది! తన చేతుల నిండుగా వున్నా డిపుడు. తన యెత్తున్నాడు దాదాపు.

"అక్కా" అన్నాడు రుద్ధ కంఠంతో. చకిత యైనట్లుగా కౌగలి వదిలింది. "ఏం చేశావు మురళీ? నాకు చెప్పవూ? నా బంగారు గాదూ" అంది ప్రసన్నంగా. ఇద్దరూ కూర్చున్నారు మంచంపైన. వాడి చెంపను తన చెంపకు తాకించి ఇటూ ఆటూ రాస్తూ తటాలున అభిముఖమై.

"చెప్పు! అబద్ధ మెందుకు చెప్పావో చెప్పు" అంది అంతా తెలిసి నట్లు. మురళిలో ఒక భయం వుంది. తానేమి చేసినా సరళ తప్పక కను క్కుంటుందని! అందుకే 'ఆమె కనిపెట్టేసిందే' అని అదొక మోస్తరు గాభరాగా చూస్తాడు? ఆమెకు వాని మనస్తత్వం అలవాటు కాబట్టి కనిపెట్టి నిలదీసి అడుగుతుంది! సత్యాన్ని బయటపెట్టేస్తాడు.

"స్టేషను కొచ్చావా? నిజం చెప్పు?" అంది వాని రెండు గవదలూ పట్టుకొని అటూ యిటూ తిప్పి తలను.

"రాలేదు."

"అమ్మతో అబద్ధ మెందుకు చెప్పావ్?"

"ఇక చెప్పను."

"నిజం!"

"ఒట్టు."

"అయితే స్టేషనుకు రాకుండా సత్యారావుగాడితో యెందు కెళ్ళావో - ఎక్కడి కెళ్ళావో చెప్పు."

సత్యారావు పేరుగూడా చెబుతూ వుంది. కొంపదీసి ముందే యెవ రన్నా చూచిన వాళ్ళు చెప్పారేమో అనుకొని,

"జామతోట కెళ్ళాను" అన్నాడు మొగం వంచి.

"దొంగతనానికేనా?"

"కాదు."

"కాదేమిటి యిటీవల నీవు వాడితో కలిసి అల్లరిగా తిరుగుతూ, తోటల్లో దొంగతనాలు చేస్తూ, వాళ్ళపైన రాళ్ళు వేస్తూ నానా అల్లరీ చేస్తున్నావట! ఒకటి రెండుసార్లెవరో కట్టేసి, తర్వాత ఎవరయిందీ తెలిసినాక వదిలారట! రాత్రి పూటా యెనిమిది గంటల వరకూ యింటికే రావట! ఇవన్నీ అమ్మ వ్రాసింది నాకు. అమ్మ మనసెంత నొచ్చుకుంటూ వ్రాసిందో తెలుసా మురళీ! అమ్మా నాన్నల మనసట్లా నొప్పించవచ్చా?"

ముందే గుండెల్లో అలజడి! సరళ ధోరణి దుఃఖాన్ని తెప్పించింది. బొటబొట కారాయ్రశ్రువులు. "అక్కా!" అంటూ ఆమె వొళ్ళో ముఖం పెట్టి కౌగిలించుకొన్నాడు. సరళ వాని వీపుపైన మృదువుగా నిమురుతూ,

"ఏడవకు మురళీ? బంగారు మురళివి గదూ! చెప్పు! ఏం చేశావో చెప్పు? ఏదైనా తప్పుచేస్తే చెప్పి పశ్చాత్తాప పడితే పాపం పరిహారమౌతుంది. మనసు శాంతిస్తుంది" అంది.

"మేం వేరే పని కెళ్ళాం" అన్నాడు పడుకొనే.

"ఏమిటి?" అంది వాణ్ణి తటాలున లేపి కండ్లు పెద్దవి చేసి చూస్తూ.

"నేను స్టేషనుకు ప్రయాణమౌతూ వుంటే సత్యారావు వచ్చాడు. బయలుదేరాం. జామతోటలో పిల్ల లున్నారు పరిచయం చేస్తా రమ్మన్నాడు. వెళ్ళాం."

'పిల్ల లున్నారా?''

''ఆఁ.''

''మురళీ'' అంటూ పరుపుపైన బోరగిల పడింది ఏడుస్తూ తన వస్తు వేదో చెడిపోయినట్లుగా దుఃఖిస్తూ వుంది. కాసేపుండి మొగం ఇటు త్రిప్పి దృష్టి వానిపై పఱపింది. మురళీ అచేతనంగా కూర్చొని దీనంగా చూస్తూ ఆమె గడ్డం పట్టుకొని,

''నేనేమీ చేయ లే దక్కా'' అన్నాడు.

''ఆఁ'' అంది ప్రశ్నార్థకంగా చూస్తూ. పద్మపత్రంపై తుషారబిందువులు కదుల్తున్నట్లుగా వున్నా యామె నేత్రాల్లో అశ్రువులు.

''నేను ఆలోచించాను. బలం చెడిపోతుందని తప్పించుకొని పరుగెత్తుకొని వచ్చాను.''

ప్రోత్సహితానందం తరుంకొని వచ్చిందామె హృదయంలో నుంచి. రెప్పలల్లార్చి కండ్లల్లో నీటిని బయటికి తరుముతూ,

''నిజమా'' అంది రెప్పలు పైకెత్తి,

''ఇంకా అబద్ధమాడతానా?''

''అబ్బా!'' అంటూ నిబ్బరంగా వాణ్ణి కౌగలించుకొని కాసేపట్లా అర్ధ నిమీలిత నేత్రాలతో వుండి, కౌగిలి వదిలి, వాడి నునుచెంపలు నిమర్తూ నొసలిపై ముద్దు పెట్టింది కండ్లు మూసికుంటూ. కాసేపటికి మళ్లా ఇద్దరూ ఒకరి మొగా లొకరు చూచుకున్నారు చల్లగా.

''చూడు మురళీ! అటువంటి పనులు చెయ్యగూడదమ్మా! చాలా తప్పు? నీవు చూడూ ఎంత బాగున్నావో! అట్లాంటి పనులకు పోతే నీ ఆరోగ్యం చెడుతుంది. లేత రక్తం చెడిపోతుంది. `కండలు పెరగవు. ఎముకలు బలం కావు. తర్వాత పెరగవు. అందం చెడిపోతుంది! తెలుసా?'' అంది దీక్షగా చూస్తూ. నిబ్బరంగా అంతా విన్నాడు.

వాళ్ళ నాన్న యింటి కొచ్చేటప్పటికి మురళీగూడా స్నానం ముగించుకొని గుడ్డలు వేసుకుంటున్నాడు. సరళ ఆ ప్రక్కనే నిలబడి వుంది చూస్తూ.

"ఎంత సేపయిందమ్మా వచ్చి" అన్నా డదరాబదరా లోపలికొచ్చి.

"యెక్స్‌ప్రెస్ ఒక గంట లేటు నాన్నా."

"ఏరా నాన్నా! భద్రంగా వచ్చిందా అక్క?" అని నవ్వాడు నోటారా? ఏమీ పలక్కుండా వున్నాడు మురళి వినీ విన్నట్టుగా అక్కవైపు చూస్తూ.

"సుఖంగానే వచ్చా నాన్నా" అంది ఆమే జవాబిస్తూ.

కాసేపటికి రాజామణి వచ్చింది, పరుగెత్తుకుంటూ వీళ్ళ రూంలో కొచ్చి.

"ఏం సరళా! ప్రయాణం బాగా సాగిందా? చంద్ర యేమంది?"

"నిన్ను తప్పక రమ్మం దత్తా."

"అవును! నాకే పని లేదు గాబోలు! ఏమోయ్ అల్లుడూ అత్తయ్యొస్తే పలకరించనన్నా పలకరించలేదే?"

దొంగలా ప్రక్కన వచ్చి కూర్చున్నాడు. అపుడే పనులన్నీ ముగించుకున్నట్టుగా వచ్చి "మీరు స్నానానికి లేవండి" అని బ్రహ్మారావుతో అని, "రాజామణిగారుగూడ ఈ పూట అల్లుడూ, కోడలితో పాటు భోం చెయ్యాలి" అంది సరస్వతమ్మ.

"ఎందుకండీ, అక్కడ అన్నం వృధా అయిపోతుంది."

"వృధా యేమీ కాదులే ఆ అన్నం మిగలకుండా సద్వినియోగం పొందించుకో కూడదా యీ కరువు కాలంలో," అంటూ వెళ్ళింది వంటిం ట్లోకి. గదిలో వీళ్ళు ముగ్గురే మిగిలారు.

"చూశావటే. ఇంతలోకే నీవు మాకు అతిధిగా తయారయ్యావ్! నిన్ను సాగనంపడానికీ పిలుచుకురావడానికి మా డబ్బులు పెట్టుకుంటున్నాం. ఏమంటా వల్లుడూ?"

మురళీధర్ గుడ్లు మిణకరిస్తూ అటువైపు చూశాడు.

"మరేమనుకున్నా వత్తయ్యా! ఆడపిల్ల పుట్టింటి కెప్పుడూ అతిథే అనుకో! గృహయజమాని కాబట్టి తనచేత డబ్బులేకున్నా నీచేత యిప్పించు కొని కార్యాన్ని నిర్వహించాడు. ఎన్నయినా మగపిల్లలు స్వతంత్రులే గదా!" అంటూ మురళివైపు చూచింది. అక్కడ వుండడానికి సహించక పిల్లిలాగా

లేచి వెళ్ళిపోయా డమ్మ దగ్గరికి. కోపాన్ని మరిచి పోయిన తల్లి ఆప్యాయ నంగా వాణ్ణి ఒకచేత్తో తన ప్రక్కకు అదుంకొని "ఆకలవుతుందా నాన్నా" అంటూ తెస్తూన్న పీట అక్కడ వేసింది. "ఊఁ" అంటూ మూతి బుద్ధ గించాడు మురిపెంగా.

మరునాడు బ్రహ్మారావు తప్ప తక్కిన ముగ్గురూ రాజామణితో కలిసి సినిమాకు వెళ్ళారు. వచ్చేటప్పుడు రాజామణి తన బస దగ్గర దిగుతూ "అల్లుడు ఈపూట కిక్కడే భోంచేసి పడుకుంటాళ్లే" అని అంటూ వాణ్ణి లాగింది. మురళీ ఆమె భుజాలపై చేతులు ఊని కిందికి గెంతాడు. జట్కా వెళ్ళిపోయింది. మురళీని ప్రక్కగా నడిపిస్తూ, వాణ్ణి లాగి ప్రక్కకు అదుం కుంటూ, అప్పుడు తెలుసుకుంది వాడు తన యెత్తున్నాడని. ఆమెలో ఒక విధమైన తృప్తి, ఆనందమూ, చొరబడగా, సన్నగొంతుపెట్టి, అస్పష్టో చ్చారణతో, సినిమా పాటలు పాడుకుంటూ తానే వడ్డించడం మొదలు పెట్టింది.

"అల్లుడూ నీకు వేరే వడ్డించాలా?" అంది చిరునవ్వుతో.

"నా యెంగిలి నీకు కొత్తా అత్తయ్యా? అయినా చాలా దినాలైంది మనం కలిసి తిని," అన్నాడు నవ్వుతూ కొంటెగా. ఆమె ప్రక్కన కూర్చుని గట్టిగా వాణ్ణి చుంబిస్తూ "నా యెంగిలి నీకు క్రొత్తగాదుగా" అంది. యెడమ చెయ్యివాడి మెడచుట్టూ వేసి, కుడిచేత్తో అన్నం కలిపి వాడి నోటికి అందిస్తూ వుంది. వా డిది వణకులాగా మింగలేక పోతున్నాడు. ఏదో వెగటుగా వుంది. అన్నం అంతగా మ్రింగుడు బారటంలేదు. అప్పటి ఆమె ఆ చేష్ట అతనిలో ఏదో సంచలనం లేపింది. అది వాడికి అవ్యక్తంగా వుంది. అంతకు ముందటి సంఘటనలు జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాడు.

"చూడు మురళీ! మన మిద్దరం ఒకచోట కూర్చుని తిని ఒక సంవ త్సరం పైగా అయ్యింది గదూ! అప్పటికీ యిప్పటికీ నీలో యెంత మార్పు! కస్రత్ చేసి బాగా తయారవుతున్నా వెవరి కోసం?" అంది రాజామణి.

"ఎవరి కవసరమైతే వారి కోసమే అనుకో."

"ఆఁహాఁ అట్లాగా!" అంది వాడి బుగ్గగిల్లి. కాసేపుండి,

"మురళీ, నా యింట్లోనే వుండిపోరాదూ" అంది ఆదొక మాదిరిగా చూస్తూ.

"ఇపు డున్నానుగా!"

"అట్లా కాదోయ్, ఎప్పుడుగూడా!"

"నువ్వెప్పుడూ, యింట్లోనే వుంటావా యేంటి?"

"అవులేరా చమత్కారీ" అంటూ వ్రేళ్లు ముడిచిన పిడికిటితో మెత్తగా చెంపను నెట్టింది. కాసేపుండి, మురళి ముఖాన్ని తనవైపు తిప్పుకొని,

"అల్లుడూ! ఆ రెండు రూపాయలూ యేం చేశావో నిజం చెప్పు!" అంది తాను డబ్బుగూడా యిస్తున్నట్లు తనకు జ్ఞాపకం చెయ్యడానికి. మురళి సమస్యలో పడ్డాడు. నిన్న తాను బయటి కొచ్చిన తర్వాత అక్కయ్య రాజామణితో యేమో చెబుతూ వుండింది. 'మురళికి' అని గూడా ఒకసారి అంది. ఆ విషయం గూడా చెప్పిందేమో - డబ్బిచ్చిన మనిషి గదా అని. ఆలోచనలో పడ్డాడు. ఇపుడేం చెప్పాల్నా అన్న సమస్య ఎదుర్కొంది!

"ఏమిటోయ్ ఆలోచిస్తున్నావ్!" అంది రాజామణి జిజ్ఞాసతో. ఒక మోస్తరుగా గ్రుడ్లాడించాడు.

"ఏం చేశావో నిజం చెప్పాలి" అంది తెలిసినట్లు చూపులు కనబరుస్తూ.

అప్పటికి భోజనా లయ్యాయి. చేతులు కడుక్కొని తన పడకటింటి మంచంపై కూర్చున్నాడు. వాడి భుజాలు రెండూ పట్టుకొని కండ్లల్లోకి చూస్తూ,

"నిజం చెప్పాలి. తెలుసా?" అంది మళ్ళా.

"సత్యారావు చేతి కిచ్చాను" అని ఎందుకో గూడా చెప్పాడు.

తన వస్తువు చెడకుండా మళ్ళా స్వస్థితిలో లభిస్తే, వ్యక్తి ఎంత సంతోషపడునో - ఆ విధంగా సంతోషపడి గట్టిగా వాణ్ణి కౌగిలించుకొని,

"మంచిపని చేశావ్! అంతే! అట్లాంటి పను లిప్పట్నుండే చెయ్యగూడదమ్మా" అంది. వాడు ఆమె వొళ్ళోకి వాలాడు. ఆమె ఆలోచిస్తూ వాడి వీపు నిమురుతూ వుంది. వా డట్లాగే నిద్రపోయాడు.

యస్. యస్. యల్. పి. క్లాసులో మురళీ అందరికంటే వయసులో చిన్నవాడు. సైజులో అందరి కంటేనూ పెద్దవాడుగా కనబడతాడు. చాలా మంది ఫైల్‌మాన్ అనేవా రతన్ని. ఇతనంటే అందరికీ గౌరవం బాగా వుంది! మొదట డబుల్ ప్రమోషన్లతోవచ్చి హైస్కూల్లో చేరాడనీ - చాలా చిన్న వయసులో పెద్ద క్లాసులో చేరి బాగా చదివి ఫస్టు మార్కులు తెచ్చే వాడనీ - ఇపుడు గూడా క్లాసులో అందరికంటే ముందువాడేననీ - మంచి గౌరవభావం. చాలా అందంగా, దృఢంగా, వుంటాడు గాబట్టి ఆకర్షణ! ఎపుడూ లేదుగాని ఆ సంవత్సరం మాత్రమే ఆడపిల్లలవైపు కాస్తచూడడం మొదలుపెట్టాడు. ప్రతి పక్షంనుండి ప్రోత్సాహం రావటంవల్ల ఎక్కువగా చూస్తూ వుండేవాడు! తర్వాత భావలౌల్యం వల్ల బాధపడేవాడు.

మామూలుగా అపుడపుడూ చెప్పడమే కాకుండా ఆనాడు సత్యారావు గోలపెట్టి చెప్పాడు. ఎట్లైనా మురళిని ఒక్కసారి తనతో రమ్మని కోరాడు! చాలా దినాలైం దిప్పటి కా సంఘటన జరిగి! తర్వాత ఆ దిక్కైనా చూడలేదు మురళి. సత్యారావు చెప్పుకొని పోతున్నాడు:-

"ఆనాడు నీవు పరుగెత్తి వచ్చావు మురళీ! కాసేపటికి మేమొచ్చాం. ఆ పిల్ల యేడుస్తూ వుంది. వాళ్ళక్క పరుగెత్తుకొనిపోయి దగ్గర కూర్చొని ఎంతో ఓదార్చింది. దుఃఖం ఇంకా యెక్కువై యెక్కిళ్ళుపెట్టి యేడ్చింది. నీవు నా చేతి కిచ్చిన డబ్బు వాళ్లెవరూ తీసుకోలేదు. వాళ్లు నా కదివరకే బాగా తెలుసని చెప్పానుగా! వాళ్ళ బీదరికానికి నీ పరిచయమూ, నా ఉనికీ, తోడు పడతాయనే అభిప్రాయంతోనే నిన్ను తీసుకెళ్ళాను. ఇంకొక ముఖ్యమైన కారణ మేమిటంటే సీత నిన్ను ఎంతగానో వలచింది. అదొక పెద్ద సమస్య కాగా లక్ష్మికి నా సాయం కావలసి వచ్చింది. ఎట్లాగో నిన్ను ఆనాడు తీసుకెళ్ళాను. నీ వా విధంగా పాఱివచ్చావు. ఆ పిల్ల దుఃఖం వర్ణనాతీతం. ఆ పిల్ల యెంతకూ మురళి కావాలనే అంటుందిగాని యింకొక మాటనదు! పెద్ద పిల్ల నన్ను చాలా బ్రతిమాలింది నిన్ను ఎట్లయినా పిలుచుకురమ్మని. అట్లాగే నని నే నొచ్చాను. నీవు ఏమీ చలించలేదు! ఇదేమిట్రా! ఇంతమాత్రం ఒక

పిల్ల ఒకరి కోసం దుఃఖిస్తూ వుందంటే వాడెంత అదృష్టవంతుడను కున్నావ్?''

అంతా బాగా విన్నాడు మురళి. నిజమే! ఆ అమ్మాయి చాలా మంచి దిగా కనబడుతుంది! సౌమ్యురాలు! దుడుకు మనిషిగాదు. బలవంతం జేసేది కాదు. నెమ్మదిగా మాట్లాడుతుంది. ఎంత బాగా మాట్లాడ్తుంది! ఎంత శ్రావ్యంగా వుంటుందామె పలుకుతూవుంటే - ఎంతో అందవతి! అంత బీద వాళ్ళల్లో, అట్లాంటి అడుక్కొనే వాళ్ళలోగూడా అంత అందం వుంటుందా!- ఆ దినం గూడా యేడ్చింది! పాపం-జాలి ప్రక్కన్నే భయం ఉద్భవించింది. అంతరాత్మ దేహం చెడిపోతుంది అని ఘోషిస్తూ వుంది. తక్షణమే అక్కా, అత్తయ్యా 'ఇంతలోకే యిట్లాంటి పనులు చేస్తే దేహం నాశనమైపోతుంది' అన్న ఏకాభిప్రాయం చెవుల్లో గింగురుమంది. బాగా ఆలోచించాడు. అంత రాత్మ గెలిచింది. ఆ విషయం మరిచిపోవాల్సిందే అని నిర్ధారించుకొని వెళ్ళి పోయాడు.

సత్యారావు నుండి తప్పించుక తిరుగసాగాడు. మళ్ళా క్రిష్ణయ్య సహ వాసం పట్టాడు. క్రిష్ణయ్యకు వీళ్ళ కతంతా తెలుసు. అయితే యేమీ అనడు! అట్లాంటి విషయాలే యెత్తడు. సత్యారావును గానీ, మరెవర్ని గూడా విమ ర్శించడు. ఇంకా సత్యారావే ఎవరెవర్నో విమర్శించేవాడు. క్రిష్ణయ్యనింకా నీచంగా విమర్శించేవాడు. కొద్ది దినాలు జరిగినాక, వీళ్ళిద్దర్లోకీ సత్యారావే రాసాగాడు. సంవత్సరం అయిపోవస్తున్నది గూడా. పరీక్షలు సమీపిస్తు న్నాయ్. ఒకనాడు క్రిష్ణయ్య ఊళ్ళోలేడని తెలిసి మురళి ఒక్కడే బయలు దేరాడు కృష్ణాతీరం. ఇంతల్లో సత్యారావు వచ్చాడు. సత్యారావు ఏదో యింపుగా చెప్పుతూవుంటే వింటూ ముందుకు నడుస్తున్నాడు. అట్లా మరిచి చాలా దూరం వచ్చారు. గుడిసెలు దాటారు గూడ. కొద్దిగా చీకటిపడుతూ వుంది. వెనుక యెవరో చెయ్యిపట్టు కొన్నట్టయింది మురళికి. తటాలున తిరి గాడు, ఆనాటి పిల్ల! ''ఇదేంటి!'' అంటూ అటూఇటూ బెదుర్తూ చూశాడు. సత్యారా వప్పుడే తప్పుకున్నాడు. తన కాళ్ళకు చుట్టుకొని కన్నీరు కారుస్తున్న ఆ అమ్మాయిని లేవనెత్తి జాలిగా చూస్తూ,

''చూడూ! నీపేరు సీతన్నావుగదూ!'' అన్నాడు శాంతంగా. అవు నన్నట్లు తల వూచింది, మొగంలోకి చూచి.

''ఇట్లాంటి పని కెందుకు దిగావు?''

''ఎట్లాంటి పని?''

''ఇదే.''

''కావాలని?''

''తప్పుగాదూ?''

''మీ విషయంలో కాదు.''

''అంటే?''

''మీరే నాకు కావాలని నా మనసులో వుంది గనుక!''

''నీకుంటే నాకూ వుండొద్దూ?''

''?అందుకే యిన్నాళ్ళు తపస్సు, ఈనాడు ప్రార్థన!''

ఏమీ మాట్లాళ్లేక పోయాడు మురళి. సానుభూతి పొర్లుకొస్తూ వుంది. ఆమె వైపు చూచేకొద్దీ అదిమిపట్టి వుంచిన ఆ జితభావం ద్రవీభూతమై వెలికి ప్రవహించింది. తమకంతో వంగి, ఆమె గడ్డం క్రింద చెయ్యిపెట్టి ముఖాన్ని పైకెత్తి ''చూడూ'' అంటూ చూశా డామె చంచల నేత్రాల్లోకి. ఒక కంట్లో దేహాభీతి - మరొక కంట్లో పరీక్షలూ కనిపించా యతనికి. తెర చిన కండ్లు తెరిచినట్లుగానే చూస్తున్నాడు.

''ఏమి టట్లా చూస్తారు?'' అంది సీత.

''ఏమీలేదు సీతా, ఏమీలేదు. అయితే - పసివాళ్ళట్లాంటి పనులు చెయ్య గూడదు.''

''ఎట్లాంటి పని? అది నాకు తెలుసు! అది మీకంటే నేనే యెక్కువ ఆలోచించాను. మిమ్ముల ప్రేమించాను కాబట్టి మీ దేహారోగ్యం విషయంలో గూడా నాకు బాధ్యత వుంది. నాకు కావలసింది మీ ప్రేమ.''

''మళ్ళా ప్రేమంటున్నావేంటి! ఆ పనికి ప్రేమ భిన్న మెట్లా అవు తుంది!''

"అవుతుంది! అంతవరకూ నాకు రూఢిగా తెలుసు? అయితే విమర్శించి చెప్పలేను. హేతువులు చూపించలేను."

"నీవు చదువుకున్నావా సీతా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఏదో కొద్దిగా చదువుకున్నాను. మీ యంత చదువుకోలేదు."

తన పరీక్షలు మళ్ళా కండ్లల్లో మెరిశాయి మురళికి. భయంగా,

"నాకు పరీక్షలువున్నాయి సీతా!" అన్నాడు.

"ఎపుడు?"

"త్వరలోనే."

"అయితే మళ్ళా తపస్సు చేసుకుంటూ కూర్చోవాల్సిందేనా?"

"నేను పరీక్ష లయిపోతూనే తప్పక వస్తా."

"తప్పించుకొని పోవడానికి చూస్తున్నావా?"

"ఛ! తప్పక వస్తాను."

"చేతిలో చెయ్యి వెయ్యి."

చేతిలో చెయ్యి వేశాడు. దాని ఫలితంగా సీత మొగంలో ఎన్నో మార్పులు కలిగాయి. అవి చూడకుండానే తొందర తొందరగా నడువ సాగాడు మురళి.

పరీక్షలకు బాగా వ్రాశాడు మురళి. చాలా చక్కగా వ్రాశాడు. కనీసం స్కూలు కన్నా ఫస్టు వస్తా డనుకున్నా రందరూ. తన కెంత లేదన్నా అయిదు వందల మార్కు లొస్తాయని భావించాడు. ఇట్లా ఆనందంలో వుండగా, మద్రాసు నుండి సరళ నుండీ, చంద్రం నుండీ మురళిని పంపవలసిందిగా జాబు లొచ్చాయి. ఆనాటి సీత కిచ్చిన వాగ్దానం గూడ ఆ ఆనందంలో మెరిపింది.

త్వరత్వరగా సత్యారావు దగ్గిరికి వెళ్ళి చెప్పాడు సీతను చూడాలని. సత్యారావు సంతోషంతో బయలుదేరాడు. వీళ్ళ రాక ముందుగా తెలియదు కాబట్టి తమ ఆగమనాన్ని అందజెయ్యడానికి సత్యారావు వెళ్ళాడు మురళి నొక చోట నిల్చోమని. కృష్ణ ఒడ్డున ఒక చెట్టు మొదట్లో కూర్చున్నాడు మురళి,

చల్లగా వస్తున్నది గాలి. సాఫీగా పార్తూ వుంది నది ఏ అలజడి లేకుండా. కాసేపటికి తన వెనుక మెడ మీద చల్లటి హస్తస్పర్శ తగిలింది.

"సీతా!" అంటూ తిరిగి చూశాడు.

"కాదు, లక్ష్మిని."

"నీవెందు కొచ్చావ్?"

"నీ కోసమే"—ఆ మాట వినగానే సీత సత్యారావుగాడితో వెళ్ళిం దేమో అన్న అనుమానం ఆవేశించింది తన్ను. తొందరగా,

"సీతేదీ?" అన్నాడు.

"జ్వరంగా వుంది."

"ఆఁ" అన్నాడు ఆశ్చర్యంగా ఏదో దెబ్బతోపాటు విన్నట్లుగా.

"నే నెందు కొచ్చానో తెలుసా?"

"ఎందుకమ్మా సీతకు జ్వరమని చెప్పడానికేనా?"

ఇంతలోకే తూలిపోతూ అక్కడికి వచ్చిన సీత ఆ మాట విని ఆనం దంతో అమాంతం కదలిపోయి "మురళీ" అంటూ అతనిపై పడింది. లక్ష్మి లేచి వెళ్ళింది. సీతకు వళ్ళంతా వుడికిపోతూ వుంది. అతని వొళ్ళో పడుకొని నీరసంగా, "వచ్చావా?" అంది.

"అవును సీతా నీకు మాట యిచ్చానుగా!"

"పరీక్ష లయిపోయాయా?"

"అయిపోయాయి సీతా."

"బాగా వ్రాశావా?"

"చాలా తృప్తిగా" అన్నాడు ఆమె ముంగురుల సవరిస్తూ.

"మీరు పరీక్షల్లో చాలా బాగా వ్రాసే వుండాలి. పరీక్షల్లో ప్రథములుగా రావాలని ప్రతి దినమూ దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను. ఒకనాడు కలలో, అంటే యిటీవలనే, తెల్లవారుఝామున - మీరు ఫస్టు వచ్చినట్లూ అందరూ మీకు విందు చేసినట్లూ వచ్చింది. నా కలలపై నాకు నమ్మకముంది!"

"సీతా!" అంటూ గట్టిగా కౌగిలించుకొని గాఢంగా హృదయానికి

హత్తుకున్నాడు. ఆ వేడికి తన శరీరం గూడ వేడెక్కి నట్లయింది! క్షణం సేపయాక,

"అబ్బా! ఇక చాలు మురళీ! నీకొఱకు అహోరాత్రాలు ధ్యానించి నిన్ను ఈ నాటికి లభింపజేసికున్నాను. ఇక్కడే, ఈ క్షణమే నీ చేతుల్లోనే చస్తే యెంత బాగుంటుంది! ఈ జ్వరం...." నోరు మూశాడు మురళి. "అట్లా అనకు సీతా, నాకు దుఃఖం వస్తుంది. నీ వానందంగా వుంటే నేనూ ఆనందంగా వుంటాను" అన్నాడు తొందర పడుతూ తమకంతో.

"నేను నీ కిష్టమేనా?" అంది రెప్పలు కాస్త యెత్తి.

"చాలా యిష్టం! నీవు నన్ను గెల్చావు. ఇక నేను నీ వాణ్ణే."

"నిజంగానా!"

"ప్రమాణపూర్వకంగా."

"మురళీ" అంటూ గట్టిగా నడుమును కౌగిలించుకొంది, అతని పొత్తి కడుపుపై ముఖం అదిమి. కాసేపటికి ఇటు తిరిగి అంది:

"చదువు కొన్నావు. ఇంకా పెద్ద చదువులు చదువుతావు. ధనవంతుడివి. నీ అంత నాకు లేదు. బీదదాన్ని. కూలి చేసికొనే దాన్ని. నన్ను నీవెట్లా స్వీకరిస్తావు?"

"ప్రేమ స్వీకరణాని కివన్నీ అడ్డు కావు సీతా! అసలు, ప్రేమకూ, ధనానికీ, విద్యకూ సంబంధం లేదు. ఇంకా చదువుకోవచ్చు కావాలంటే నీవు!"

"అదెట్లా అవుతుంది?"

"ఇపుడు నీ వయసెంత?"

"పధ్నాలుగు."

"అంతేగా!"

"మరి నీ విప్పటికే యెంతో చదివావుగా."

"నీవు త్వరలో చదవగలవు!"

"నన్నెవరు చదివిస్తారు? తండ్రి లేదు. తల్లి లేదు. ఏ దిక్కూ లేక

రెక్కల కష్టంతో బ్రతుకుతున్న వాళ్ళం."

"మీ వాళ్ళెవరు? నీ వెవరో చెబుతావా?"

"ఇపు డొద్దులే. అది పెద్ద గొడవ! ఇంకొకసారి చెబుతాను. చాలా నీరసంగా వుంది" అంటూ "అబ్బా!" అంది అట్లా కదిలి.

"అయితే నీకు జ్వర మెపు డొచ్చింది సీతా? ఎందుకొచ్చింది?"

"అలవాటు పడనిదాన్ని ఎండకూ గాలికీ కష్టం చెయ్యటం - కడుపు నిండుకూ తిండి లేక పోవటం- ఆ పైగా నిన్ను గురించి ఎపుడూ ఆలోచిస్తూ కూర్చోడం! ఆ నీరసానికి ఈ వ్యధ తోడై జ్వరం వచ్చింది."

"నా కోసం జ్వరం గూడ తెచ్చుకుంటున్నావా?"

"నీ కోసం యేం తెచ్చుకుంటే యేం? మృత్యువును గూడా తెచ్చుకో వచ్చు" అంటూ వాడి చంపలు నిమిరింది చేతులెత్తి నీరసంగా,

"చూడు సీతా ఒక ఉపాయం చెబుతాగాని, ఆ విధంగా చెయ్యి. కొన్నాళ్లు పోయిన తర్వాత మా యింటికి రా. అప్పటికి మా అక్కయ్య వస్తుంది. ఆమె కోసమే నేను మద్రాసు పోతున్నా. వచ్చి దిక్కు లేదని చెప్పు. చదువుకోవాలని వుందని చెప్పు. నీ దీన చరిత్ర చెప్పు. ఆమెకు బీదలంటే బలేదయ. అందులో ఆడపిల్లలంటే బాగా సాయం చేస్తుంది. నేను మద్రాసు నుండి తిరిగి రాగానే వచ్చి చెబుతా. గట్టిగా పట్టుపట్టేశావా, గెలుస్తావు తప్పక!'

"నీ కోసం యేమయినా చేస్తా" అంది సీత కృతజ్ఞతతో. అప్పటికి సత్యారావు లక్ష్మి వచ్చారు.

"ఏరా వెళ్దామా?" అన్నాడు సత్యారావు.

"ఒరే! యెట్లాగూ ఆలస్య మయిందిరా. సినిమాకు వెళ్ళాం అని చెబుదాం 9 గంటలకెళ్ళి."

"బ్రతికించావురా" అంటూ అట్లా వెళ్ళాడు సత్యారావు.

"సీతా!" అన్నాడు మురళి. పలకలేదు. సీత నీళ్ళలో స్నానం చేసి నట్టుగా వుంది. "అబ్బా" అంటూ అట్లా పొర్లింది, గాఢంగా ఊపిరి పీలుస్తూ

క్రాసేపటికి బాధగా "ఊ" అంటూ మూలిగింది. ముందుకు లాగుతూ "సీతా! సీతా!" అంటూ ఆదుర్దాగా పట్టుకొని కుదిపాడు.

"అబ్బా!" అంటూ కదిలింది కండ్లు తెరిచి.

"ఏమిటి సీతా పిలిస్తే పలకలేదు!"

"చచ్చేంత పనయింది మురళీ. ఒళ్ళంతా దహించి వేస్తున్నట్టు ఉష్ణం బయలుదేరింది. భరింపరాని బాధ పడ్డాను. గోలచేస్తే నీవు బెదిరిపోతావని బిగబట్టుకున్నాను. నిజంగా కృష్ణాజలశైత్యము నన్నాకర్షించింది. నీళ్ళలో పడదామని అనుకున్నాను. నీవు పడనీ లేదు. ఇంతలో గుబగుబ చెమట పోసింది. శరీరం చల్లబడింది. ఇపుడు తేలిగ్గావుంది. అపుడేదన్నా శబ్దం చేశానా?"

"అవును. మూలిగావు బాధగా."

"అబ్బా! ఎంత చల్లగా, హాయిగా వుంది, చల్లనిగాలి తగిలేతలికి!"

"జ్వరం పోయిందా?"

"వైద్యుడొస్తే పోకుండా వుంటుందా?"

మురళి ముద్దుగా నవ్వుకున్నాడు. త్రికోణాకారంగా వేసిన వాని మోకాళ్ళపై తలబెట్టి వానికి అభిముఖంగా కూర్చున్న దామె. మురళి భావాలు ప్రశాంతంగా వున్నాయి.

"సీతా! ఒక విషయం చెబుతాను. ఏమీ అనుకోవద్దు. నీకు మందుకు కావాల్సొస్తుంది. ఏదన్నా డబ్బు కాస్త తీసుకొవూ" అన్నాడు అర్థిస్తూ.

"నాకు మందక్కర్లేదుగా! జ్వరం పోయింది. ఇక రాదు."

"పోనీ! ఇంకా కొన్నాళ్లు నీవేమీ పనిచెయ్య లేవుగా; అందుకైనా ఉంచుకో."

"ఆ విధంగా వుండటం మాకు కొత్తగాదు మురళీ. ఈ విధంగా యేదో వొక జబ్బు వస్తూనే ఉండేది. అట్లాగే పనులు చేసుకొనే వారం. లేక పోతే తిండి? జరిగేవాళ్ళట్లాంటి ప్రశ్నలు వేసుకో గలరు."

మురళి యెక్కడో ఆలోచిస్తున్నాడు. జీవితం కోసం ప్రపంచంలో

ప్రాణికోటి యెట్లా కష్టిస్తుందో తనకేం తెలుసు? అనుభవం లేశం గూడ లేదు. కేవలం వూహిస్తున్నాడు. ఊహలకు కష్ట సుఖాల పరిమితులు, అవధులు యెట్లా తెలుస్తాయి?

"ఏమిటి ఊహిస్తున్నావ్ మురళీ? నేను కూలి చెయ్యడ మిష్టం లేదు గదూ?"

"కావచ్చు" అన్నాడు మురళి.

"ఇంతలోకే అంత తొందర పడకు! ఈనాడు ప్రేమించావు గాబట్టి అట్లా అనుకుంటున్నావు. ఇన్నాళ్లూనో! ఇంకా కొన్నాళ్లు నా విషయమై కండ్లు మూసుకో."

కాసేపు విడిపోయి ప్రక్కన ప్రక్కన కూర్చున్నారు. చల్లబడిన గాలి మెల్లగా వీస్తూ హాయినిగొల్పుతూ వుంది. ఏదో మధురమధురంగా ఊహించు కొంటూ కూర్చున్నారు. ఆ చీకట్లో కృష్ణ ప్రవాహం నిశ్శబ్దంగా సాగిపోతూ వుంది. తన నిశ్శబ్ద వాతావరణంలో ఎంతమంది ప్రేమికా ప్రేమికులు, ఎంతెంత ప్రీతి వచనాలు చెప్పుకుంటూ మురిసిపోతూ వుంటారో!!

రెండవనాడే మద్రాసు పయనమయ్యాడు మురళి. చంద్రమణితో కలిసి సరళ స్టేషను కొచ్చింది. కార్లో కూర్చున్నాక మురళిని బాగా దగ్గిరికి యీడ్చు కొని కూర్చుంది సరళ.

"ముందుకొచ్చి పక్కలో కూర్చుందూ. రావోయ్ అల్లుడూ" అంది చంద్ర.

"ప్రస్తుతం కూర్చున్నాలే అత్తయ్యా" అన్నాడు ఏదో చెప్పడానికి ఉపక్రమించి ఆపేస్తూ.

"ముందు రావోయ్" అంది కారు నిలిపి.

"ఆడవాళ్లు పట్టుపడితే విడవరు" అంటూ దిగకుండానే, లోపల్నుండే దాటుకొనిపోయి, ప్రక్క సీటులో కూర్చున్నాడు. సరళ పోగొట్టుకొన్నట్లుగా కాస్త అసూయపడుతూ కూర్చుంది. ఒక చేత్తో స్టీరింగ్ వీల్ తిప్పుతూ రెండవ చెయ్యి వీడి మెడపై వేసి నవ్వుకుంటూ ప్రశ్నలు వేస్తూ తీసుకెళ్ళిం దింటికి చంద్రమణి.

# 55

చంద్రమణి గూడా అందమైన వ్యక్తి. దేహ సౌష్ఠవం గలది. చాలా చురుకైన మనిషి. ఆకర్షణీయంగా, చలాకీగా మాట్లాడ గలదు, ఆమె అందం వల్లనే ఇంత త్వరలో పైకి రాగలిగిందని వాళ్ళూ వీళ్ళూ అనుకుంటూ వుంటారు. ఎవరేమనుకుంటే యేం ఆమె దైహికంగా, మానసికంగా కూడ ఆరోగ్యంగా వుంటూనే వుంది. మంచి భోగాల అనుభవిస్తూనే వుంది. అటువంటామెకు మద్రాసులో పలుకుబడికి లోటేమిటి?

మురళిని ఎంతమందికో పరిచయం చేసింది, తన అల్లుడంటూ, మురళి వున్నన్నాళ్ళూ, చాలా హుషారుగా వుండేదామె. ప్రతి దినమూ ఆసుపత్రినుండి రాగానే స్నానం చేసి డ్రెస్సు మార్చి, మురళిని హెచ్చరిస్తుంది, వాడూ సిద్ధమౌతాడు. కార్లో కూర్చొని షికారు! లేకపోతే సినిమా! మురళి దగ్గర వుంటే ఆమె ఎన్ని విధాలుగానో మానసిక వికారాలు పొందేది! తనకు తానే సిగ్గుపడే దొకసారి!

ఇక రేపు మురళి వూరికి పోతా డనగా యీ దినం సాయంకాలం బీచికి వెళ్ళారు. ఆ దినం రాత్రికే సరళ సిద్ధమై హాస్టలు నుండి తన యింటికొస్తుంది. తర్వాత అల్లుడితో మాట్లాడ్డానికే వీలుండదు. బాగా ముస్తాబై బయలుదేరింది బీచికి. బీచిలో దిగేటప్పటికి పొద్దు కుంకింది. నీటి ఒడ్డున దాదా పొక మైలు నడిచి వుంటారు. ఏదేదో మాట్లాడుతూ పోతూ వుంది చంద్రమణి. అయితే ప్రతి దినమూ వస్తున్నంత ధారాళంగా సులభంగా రావడంలేదు మాటలు. ఏదో తన్ను కుంటున్నట్టుగా, కృతకంగా వస్తున్నాయ్. మురళి వూరికే వూకొడుతూ సీతను గూర్చి ఆలోచించుకుంటూ పోతున్నాడు. అప్పటికి సుమారుగా చీకటి పడింది. జనసమ్మర్దంలేదు. ఇంతలో చెయ్యి వదిలి ఆమె కుడిచేతి చూపుడు వ్రేలును యెడమచేత్తో పట్టుకున్నాడు మురళి నడుస్తూ.

"ఏమోయ్ నీవే ప్రక్కనొస్తున్నావో తెలుసా?" అంది నవ్వుతూ.

"నీకు కుడివైపు."

"నా కుడిచేతి వ్రేలు నీ యెడమచేత్తో పట్టుకొన్నావా?"

"అవును, సరిపోయిందిగా."

"నేను నీ పెండ్లికూతుర్ననుకున్నావా?"

"అయితే యేం అత్తయ్యా?"

"ఆఁహాఁ! పెద్ద పెండ్లాం కావాల్నా నీకు?" అంటూ గట్టిగా లాగి కూర్చుంది. ఆమె యెట్లా కూర్చుందంటే, పాదాలు క్రింద పెట్టి కూర్చుంది మోకాళ్లు పైకి ఎత్తి త్రికోణాకారంగా. మురళి విసిరిగొట్ట బడినట్లుగా ఆమె పైన బడ్డాడు. ఆమె ఎత్తిన మోకాళ్ళకూ వక్ష స్థలానికి మధ్య అతని వక్షం వుంది. తల ఆమె యెడమ మోకాటిపై వుంది. ఆమె తమకంతో వాడి ముఖంలోకి చూస్తూంది. వాని దేహాన్నంతా చూస్తూ వుంది ఆశతో ఆకలిగా. ఏదో సంకోచం మళ్లా. వాడు మాత్రం ఏమీ ఎరగనట్లుగా పడుకొన్నా డామె భుజాలపై చేతులువేసి. అయితే ఆ బంధంలో ఆనాడు తనపైన ఒరిగి కూర్చున్న సీతను గురించి ఆలోచిస్తున్నాడు. ఆ జలనిధి ఒడ్డున, చంద్ర మణి భావాన్ని కనిపెట్టాడు. ఆమె ఆలోచనకు భంగం కలిగించాలని,

"నీవు పెండ్లెందుకు చేసుకోలే దత్తయ్యా యింకా?" అన్నాడు.

"నీ వింకా పెద్దయితే నిన్నే చేసుకుంటా" అంటూ వాణ్ణి గట్టిగా కౌగలించబోయి మళ్ళా వెనక్కి తగ్గింది. రబ్బరు బొమ్మలాగా వున్నాడు. అపు డపుడే ఉద్భవిస్తున్న యౌవనంతో మిసమిస లాడుతున్నాడు. చల్లటి గాలి తనలో విజృంభించిన కామాగ్ని నింకా ప్రజ్వరిల్ల జేస్తూ వుంది. అలల నుండి చిందివస్తున్న తుంపరలు పైనబడి ఎంతో ఆహ్లాదాన్ని కల్గిస్తున్నవి. ఒక్కసారిగా ప్రకోపించిన కామ విజృంభణ, మురళి యెముకలు గూడ నలి గేంత గాఢంగా పరిష్వంగం చేయడాని కామె హృదయాన్ని పురికొల్పగా ముందుకు వంగినాయి చేతులు. తక్షణమే మురళి హృదయాన్ని స్పర్శించి వున్న తన హృదయం మురళి హృదయంలోని భయాందోళనలను గ్రహిం చింది. ఇపుడేమి జరిగినా తన దేహ మెక్కడ చెడిపోతుందో అనీ - ఎవరో యెంగిలి చేసిన నైవేద్యాన్ని తన ప్రణయ దేవత సీత కెట్లా యివ్వటమనీ - ఆందోళన పడుతున్నాడు మురళి. ఎఱ్ఱబడిన కనుకొలుకులతో చూస్తూ,

గాఢంగా ఉఛ్వాస నిశ్వాసలను సలుపుతూ తన్ను తానే సమాళించుకుంటున్న చంద్రమణి.

"నీవేమనుకుంటున్నా విపుడు మురళీ" అంది వాడి నొసట వున్న చెమట పైటతో తుడుస్తూ.

"ఏమీ అనుకోడం లే దత్తయ్యా" అంటూ ఆమె పైపెదవిపైన చెమటను వేలితో తుడుస్తున్నాడు. ఆ జవాబు విని కాస్త కుదుట పడినట్లుగా భావించి 'కసిగాయను కొరికినా అనుకున్నంత రుచివుండదు ఏదో తృప్తి తప్ప' అనుకొని "మురళీ, వెళ్దాం పద" అంటూ బయలుదేరింది వాడి చెయ్యి పట్టుకుని.

"మురళీ! నా యెత్తున్నావోయ్!" అంది పక్కన నిలబడి తన కుడి చేతి అరచెయ్యి యిద్దరి తలల ఉపరిభాగాన తాకిస్తూ.

"మరేమనుకున్నావ్. వచ్చే సంవత్సరం చూడు నీకంటే ఎంతెత్తుంటానో! అయితే నీ యెత్తెంత అత్తయ్యా?"

"నే నిపుడు సరిగ్గా అయిదడుగులా మూడించలు."

"నేను అయిదూ అయిదు. నాన్నెల్ల క్రితమే నేను అయిదునాలుగు." అన్నాడు మురళి అపుడే చాలా పెరిగినట్లుగా.

## 5

మరునాడు సాయంకాలానికి బెజవాడ చేరారు. కాస్త టైము వుంటే సీత కోసం పరుగెత్తేవాడే మురళి. సత్యారావు దగ్గిరి కెళ్ళాడు. అతనివల్ల తెలుసుకున్నాడు సీత ఆనాటి నుండీ జ్వరం లేకుండా వున్నదని - తర్వాత వాళ్ళని చూడటం వీలుపడలేదనీ-మురళి వున్నపుడే వాళ్లు బాగా కనిపిస్తారనీ - అదేదో యెత్తుగా వున్నదనీ - అన్నీ చెప్పాడు సత్యారావు. సీతను చూడ లేకపోతినే అనే అసంతృప్తితో ఇంటికి తిరిగి వచ్చాడు మురళి. రాత్రి ఆలోచిస్తూనే పడుకున్నాడు. త్వరగా నిద్రపోయాడా దినం. సరళ గదిలో కొచ్చి

లైటు వేసేటప్పటికి చిరునవ్వు తాండవిస్తూ వుంది మురళి పెదవులపైన. ఏదో మాట్లాడుతున్నట్టుగా పెదవులు కదులుతున్నాయిగూడ. తలుపుమూసి బిరబిరా వచ్చి పక్కలో కూర్చుంది వాని కిరువైపులా చేతులుపెట్టి మొగం లోకి చూస్తూ.

'సీతా! ఆరోగ్యంగా వున్నావా?' అన్న అస్పష్టపు పలుకులు వింది'

ఆలోచన పట్టుకొంది సరళకు. ఆ పేరు ముందెప్పుడో విన్నట్టుంది. బళ్ళో తనకు తెలిసినంత వరకూ ఎవరికీ లేదది. ఈ రెండు సంవత్సరాల్లో ఎవరైనా కొత్తపిల్లలు చేరారేమో! ఎవరా అని ఆలోచిస్తూ వుంది. ఎంతకూ గుర్తుకు రాలేదు. ఆలోచన తీవ్రం చేసింది. ఆనాటి పిల్లేమో! ఈ రెండేం డ్లలో యెన్నెన్ని పనులు చేశాడో! ఇట్లా ఆలోచించేకొద్దీ మనసంతా పరిభ్ర మించింది. ఇట్లా అయిపోతున్నాడే అని దుఃఖించింది. వాని ముఖం పై ముఖం పెట్టి యేడ్చింది. కన్నీళ్లు వాని చెంపలపై పడ్డాయి. కొద్దిగా మెలుకువ వస్తూ వుంది. పూర్తిగా మెలుకువగూడా రాలేదు. సంధ్యావస్థలో వున్నాడు. "ఏడవకు సీతా నిన్ను పెండ్లిచేసుకొని తీరుతాను" అంటూ కౌగలించు కున్నాడు. కాదన బోయింది, సరళ, ఏమీ పలుకలేదు. ఆ దుఃఖంలోనే ఒక సుఖం, ఆ అసంతృప్తిలోనే ఒక సంతృప్తి - అనుభవిస్తూ వుంది. కాసే పట్లా పడుకొని కండ్లు తెరిచాడు. సరళ! అమాంతంగా లేచి కూర్చున్నాడు ఎగిరిపడి "అక్కా! క్షమించు!" అంటూ కాళ్లు పట్టుకున్నాడు గాభరాతో, వాడి చేతులు బలవంతంగా పైకిలాగి తన చెంపలకేసి వొత్తుకుంటూ "ఫరవా లేదు; నాకు కోపంలేదు" అంది. అంతే! తక్షణం స్థలం మార్చాడు! ఆమె ప్రక్కలో పడుకోడాని కానాటితోనే స్వస్తి చెప్పాడు.

మరునాడు సరళ రాత్రి విషయాన్ని గురించి యేమన్నా అంటుందేమో అనుకున్నాడుగాని, ఆ విషయమే మాట్లాడలేదామె. అంత కులాసాగా లేనట్టు మాత్రం కనిపించింది. సాయంకాలమైనాక "అత్తయ్య యింటి కొస్తావా?" అంది.

"నీవు వెళ్ళిరా అక్కయ్యా నేను కృష్ణాతీరం వెళ్ళొస్తాను" అన్నాడు.

మద్రాసులో వద్దంటున్నా చంద్రమణి బలవంతాన పది - రూపాయల నోటు మురళీ జేబులో పెట్టింది. దానికి మరి అయిదు రూపాయలు కలపి మంచి చీరా మరికొన్ని గుడ్డలూ కొన్నారు ఉదయం మురళీ సత్యారావులు. అవన్నీ సత్యారావు అపుడే గుడిసెల్లో వారికి పంపించి తమ ఆగమన వార్త అందజేశాడు. సాయంకాలం మురళీ వచ్చేటప్పటికల్లా సత్యారావు హుషారుగా తయారౌతున్నాడు. త్వర త్వరగా బయలుదేరి జామతోట కెళ్ళారు కాస్త పొద్దుండగానే. గుడసె వాకిట్లో నిలబడి వున్న లక్ష్మి తృప్తికరమైన మంద హాసంతో వాళ్ళ నాహ్వానించి తాను తప్పుకుం దక్కడ్నుంచి. మురళీ మాత్రం లోపలికి దూరాడు. మురళీ ఆ వేగంతో లోపలికి దూరగానే ఆత్రంతో వడిగా వచ్చింది సీత అభిముఖంగా. తమకంతో వాని చేతులు పట్టుకొని సోలిపోతూ వాని మొగంలోకి చూచింది అర్ధనిమీలిత నేత్రాలతో. దీర్ఘకాల నిరీక్షణ వల్ల కలిగిన బాధాతమస్సునంతా తరిమేస్తున్నదా అన్నట్లున్న దామె మొగంపై ప్రకాశం, చూస్తూ, వివశుడై ఆమె భుజములు రెండూ పట్టుకొని వూపుతూ "యేం సీతా, ఇట్లా చిక్కి శల్యమైపోయావ్?" అన్నాడు.

"ప్రాణధారణ కింత మాత్రం శరీరం చాలదా?"

"కాదు సీతా! శరీరం సౌష్ఠవంగా వుండాలి."

"నీ సౌష్ఠవాన్ని కాస్త భాగం పట్టి యిస్తావుగా?"

"తప్పక సీతా" అంటూ ఆమె చెయినొక్కి కిందికిలాగి కూర్చున్నాడు. ఇద్దరూ సీతారాములవలె ప్రక్క ప్రక్కన కూర్చున్నారు. ఆమె కుడి చెయ్యి వీని యెడమ తొడపై వేసి ఎడమచేతి మడత శిరసుకాధారంగా పడుకొంది. ఆమె మొగంలో తృప్తి, ఆనందం, ప్రకాశిస్తున్నాయి. ఆమె తమకంతో చూస్తూ,

"చాలా మారావు మురళీ!" అంది.

"ఎట్లా?"

"బాగా బలిసినట్లున్నావు. చాలా కళగా వున్నావు!"

"నీ చిక్కిపోయిన కండ్ల కట్టా కనిపిస్తున్నానేమో!"

"కాదు పద్దెనిమి దేండ్ల యౌవన పురుషుడు లాగా వున్నావు."

"అమ్మో! ఒక దెబ్బలో నాలుగున్నర సంవత్సరం?"

"అవును మురళీ. అంతా తిండిపైన ఆధారపడి వుంటుంది. తల్లి దండ్రులపైన అంతకంటే యెక్కువ ఆధారపడి వుంటుంది. నేను గూడా బాగా ఆరోగ్యంగా వుండేదాన్ని."

"అవును! మనం మొదట కలుసుకున్నపుడు నా కన్ని విధాలా సరి పోయేటట్లుండే దానివి!"

"ఇపుడు పనికిరానా యిక?"

"అదిగాదు సీతా! ఇపుడు చాలా చిక్కిపోయావని."

"అంతేగదా!" అంటూ మందహాసం చేసింది.

"అవును. అంతే!" అంటూ నవ్వుతూ, చెయ్యినొక్కి-

"యెందు కట్లా అయ్యావు? జ్వరం వస్తూనే వుందా?" అన్నాడు.

"లేదు. జ్వరం ఆనాటి నీ శరీర స్పర్శతోనే మాయమైంది. తర్వాత........"

"తర్వాతేం జరిగిం దేమిటి?"

"ఏమీ జరగలేదు."

"ఏమీ జరగకపోతే?"

"ఏమీ జరగలేదు మురళీ."

"ఏమీలేందే అట్లా యెందు కయిపోయావ్?"

"నేనేం చెప్పేది మురళీ! నిజం చెబితే నమ్ముతుందా లోకం!"

"చెప్పు సీతా! నిజాన్ని నేనెప్పటికీ నమ్ముతాను. నిజమో అబద్ధమో నిర్ణయించగల శక్తి ప్రతి శరీరంలోని ఆత్మకూ వుంటుంది."

"నీవు వెళ్ళినప్పటి నుండీ నాకు అన్నం సహించడమే లేదు." బాగా తిని తిరుగుతూ వుండిన మురళి కా వాక్యం ఆశ్చర్యాన్ని కొల్పింది.

"అయితే అన్నమెందుకు సహించలేదు సీతా?"

"యేమో మురళీ. నేనేం చెప్పగలము?"

"ప్రేమించుకొన్న వా రన్నం తినరా?"

"తింటారు; గాని........"

"అసంతృప్తి యెందు కుండాలి?"

"అది వ్యక్తినిబట్టి వుంటుంది;."

"నేను బాగా తింటున్నాను గదా - నాలో అంత ప్రేమ లేదనా?"

"వుంది మురళీ, ఇంకా యెక్కువే వుంది; నీ కత వేరు; నీవు పురుషుడివి."

"అయితే నిర్మల ప్రేమ స్త్రీలలో ఒక విధమూ, పురుషుల్లో మరొక విధముగానూ వుంటుందా?"

"కాదు-కాని-సంఘ పరిస్థితులవల్ల కాస్త వ్యత్యాస ముంది."

"ప్రేమలోనా?"

"కాదు దాన్ని గురించి, చింతించడంలో........"

"ఎట్లా?"

"పురుషుడు సంఘంలో బాగా తిరగగలడు. ఎన్నెన్నో చూస్తూ, ఎన్నెన్నో చేస్తూ తిరుగుతూ వుంటాడు. మనసును వాటివాటిపై కొద్దో గొప్పో కేంద్రీకరించుతూ వుంటాడు. అందువలన కాస్త మరిచి పోగలుగుతాడు. అట్టి పరిస్థితులులేని అస్వతంత్రయైన ప్రస్తుత యువతి, ఇంట్లోనే కూర్చొని ఎపుడూ ఆలోచిస్తుంది. ఆలోచించేకొద్దీ బాధ యెక్కువవుతుంది; మనసులోని మార్పు శరీరంలో ప్రతిఫలించక మానదు."

"నేనిచ్చిన పుస్తకాల్లోని విషయాన్ని వల్లించేశావే;"

"అ చదవటమే గాదు మురళీ; ప్రత్యక్షంగా అనుభవిస్తుందే చెబుతున్నా. అనుభవ జ్ఞానం ముందు పుస్తక జ్ఞాన మెంత?"

"నిజమే; ఇవన్నీ సరేగాని. అసలు విషయం చెప్పనేలేదు. అంత తీవ్రబాధ కలిగించి, నిన్ను సరిగ్గా అన్నంకూడా తిననీకుండా ఎందుకు చేసిందీ ప్రేమ; స్వానుభవంతో చెబుతున్నా పీతా; నా కిది అనుమానమే;"

"స్వానుభవం అంటే బాగానే వుందిగాని, స్త్రీగా నీ వనుభవించ

లేదుగా! పురుషుడుగానే అనుభవించావు! స్త్రీ దృష్ట్యా నీ వెట్లా చూడ గలవు?''

''ఏమో నాకు నమ్మకం కలగడం లేదు.''

''నీకు నమ్మకం కలగనంత మాత్రాన అది నిజం గాకుండా పోతుందా మురళీ? అందరి హృదయస్థ ఆందోళనావేశాదికాలు ఒక వ్యక్తికే ఎట్లా తెలుస్తాయి?''

''అయితే అంత తీవ్రభావాలు నన్నుగురించి యెందుకు కలిగాయి నీకు?''

సీత ఆలోచిస్తూ కూర్చుంది తలవంచుకొని. ముఖంలో కొన్ని మార్పులు కనిపిస్తున్నాయ్. యేమి చెబుతుందో చూద్దామని ఆతృతతో వున్నాడు మురళి. సీత అంది:

''అనుమానాల వల్లనే మురళీ.''

''అనుమాన మెందుకు?''

''ఏ సమయానికి వ్యక్తులు యే విధంగా హృదయం మార్చుకుంటారో అని.''

''అట్లాంటి అనుమానా లెందుకు కలిగాయి?''

''నే నిప్పుడు చెప్పను. నీవు నమ్మే ధోరణిలో లేవు.''

''లేదు సీతా! నే నెందుకు నమ్మను? నీ వబద్ధాలు చెప్పవని తలుస్తాను.''

''అబద్ధాలు చెప్పాల్సిన అగత్యం నాకు లేదు.''

''అయితే అదేమిటో చెప్పు.''

''అదొక కల విషయం.''

''ఓహో! అదా యింతకూ కలలు చూచి భ్రమపడే దానివన్న మాట!''

''అది భ్రమపడే విషయం గాదు! భయపెట్టే విషయం.''

''చెప్పు మరి.''

తన చేతిని మురళి చేతిలోనుండి ఉపసంహరించుకొని, ఎదుటివైపు దృష్టి నిలిపి అదొక మోస్తరు ధోరణిలో చెప్పుకుపోసాగింది.

"ఆనాడు నీవు వెళ్ళిపోతున్నావు మురళీ. అప్పటి నా మనఃపరిస్థితి వర్ణించలేను. నీవే నా భర్తవై వుంటే నిన్ను విడిచిపెట్టే వుండను. నీ వెనకాలపడి బ్రతిమాలి, యింకా కాసేపు కూర్చోబెట్టుకుందామనుకున్నా. నీవు వెళ్ళిపోతున్నావు. ఆ నీరసపు వెన్నెల్లో నా కండ్ల నిండా నీవే వున్నావు. నా హృదయం నీ వెంటపడి పరుగెత్తుతూనే వుంది. వెనుక చూపులేని నీ హృదయం దాన్ని గమనించలేదు. మా అక్కయ్య నన్ను చేయి పట్టుకొని తిన్నగా నడిపించుకొని యింట్లోకి తీసుకెళ్ళింది. మంచం మీద పడుకున్నాను. అంతే. మరునాడుదయం వరకూ నాకు స్మారకమే లేదు. బాగా తెలివి వచ్చి లేవబోతే లేవలేను. అతి నీరసంగా వుంది శరీరమంతా. నా శక్తినంతా యెవరో అపహరించినట్లయింది, లోపల తేలిగ్గానే వుంది. అయితే లేవలేక పోయాను. మా అక్క ఏదో గంజి కాచి యిచ్చింది. ఎంత ఆకలి! బాగా తాగేశాను. కాస్త శక్తి వచ్చింది. అది నిన్ను గురించి ఆలోచించడానికే గాని, పని చేసుకోడానికి పనికి రాకపోయేది. నాకై నాకే ఒక్కొక్క సారి విచిత్రం వేసేది ఇంత తెలివి తక్కువగా ఎవరన్నా వుంటారా అని? ప్రపంచంలో ఎందరెందరో ప్రేమించుకుంటూ వుంటారు. వాళ్ళంతా నా అంత విరహ వ్యథతో కూర్చుంటే ప్రపంచమే వేరే దారి పట్టేదేమో! చాలాసార్లు అధైర్య పడుతూ వుండేదాన్ని. మా అక్క చాలాసార్లు ఓదార్చేది. నా యీ వేషం చూచి అది చాలా దుఃఖించేది. తన మాదిరే వుంటే తంట లేకుండా వుంటుందని చాలాసార్లు చెప్పేది. నాకేమో వివాహంపైన యిష్టముంది. అది గూడా ఒక్క మురళితోనే. నేను నీతోడి వివాహ విషయమై నొక్కి చెప్పేదాన్ని. మా అక్క అన్నది:—

'వాళ్లు మహారాజులు! అందులో పసివాడు. ఏదన్నా వుంటే కాస్త పుస్తక జ్ఞానం తప్ప అనుభవ జ్ఞానం లేనివాడు. చాలా విషయాలు తెలీవు. ఏదో ఉద్రేక పడడం తప్ప వితరణ తెలియదు. తర్వాత మనసు మారవచ్చు.

మనసు మార్చుకొనే వారిని పట్టుకొని మనం మరువలేని స్థితిలో కూర్చుంటే జీవితమే దెబ్బ తింటుంది. అసలది నిష్ప్రయోజనం. అడుసు త్రొక్కనేల కాలు కడగనేల?'

'అయితే అంతేనాక్కా' అన్నాను కన్నీళ్లు రాలుస్తూ. నా కెందుకో ఆ మాటలు వింటూంటేనే కన్నీళ్లు రాలాయి. ఆమెకు చాలా విషయాల్లో బాగా జ్ఞానం వుంది. మా నాన్న దగ్గర బాగా చదువుకొంది. ఎన్నెన్నో విషయాలు బాగా తెలుసుకుంది. ప్రేమతో నాకు సలహా చెబుతూ వుంది. నే నెట్లా కాదనేది? నా ఆలోచనలు విహాయసంలో విహరింపసాగాయ్. మనో నేత్రంతో నిన్ను చూస్తూ కూర్చున్నా. చిన్నప్పుడు మన మెట్లా కలుసుకుందీ తర్వాత పెరిగినాక మొదటిసారిగా యెట్లా కలుసుకుందీ - నీవెట్లా ప్రవర్తిం చిందీ - తర్వాత యే విధంగా ప్రవర్తిస్తూ వచ్చిందీ - అంతా ఒక్కసారి ఊహించాను. నిన్ను అనుమానించ వలసిన చర్య నాకేమీ స్ఫురించలేదు. ఏమో నీవంటే చెప్పరానంత సానుభూతి ప్రవేశించింది నా హృదయంలో. ప్రేమ పొంగి పారింది. వివశనై, సోలి, 'ఇక చాలు' అంటూ మంచంపై పడిపోయాను'' అంటూ మురళిపై వాలింది సీత. పట్టుకొని, కృతజ్ఞతతో చూస్తూ,

''అలసటగా వుందా సీతా! ఇట్లా పడుకో'' అని తన యెడమతొడపై పడుకోబెట్టుకొని, చేతిగుడ్డతో కాస్త విసిరాడు మురళి.

''అబ్బా! ఇదే నా స్థానం మురళీ! ఎంత హాయిగా వుంది! ఇది చాలు మురళీ నాకు! ఇదే తృప్తి. ఈ తృప్తే ఆనందాన్ని ప్రసాదిస్తుంది. ఆ ఆనం దంతో ప్రాణం వదిలితే జన్మరాహిత్య మొస్తుందేమో!'' అంది అర్ధనిమీలిత నేత్రాలతో చూస్తూ.

''అట్లా అనకు సీతా. ఇదివర కొకసారి అని నా మనసును కష్ట పెట్టావు. ఇంకెప్పుడూ అనకు'' అన్నాడు మురళి బాధగా.

''అననులే, ఇంకెప్పుడూ అనను. నీ మనసు బాధ పడేటట్టయితే అనను'' అంటూ తృప్తిగా చూచింది వాడి కండ్లలోకి.

"చెప్పు సీతా, తర్వా తేమయింది?"

"మా అక్క నా ప్రక్కన కూర్చుంది విసనకర్రతో విసుర్తూ. నా తల తన తొడపైకి తీసికొని కార్తున్న నా కన్నీటిని తుడిచి, వంగి ముద్దు పెట్టి "పిచ్చిదానా! నీ కివన్నీ యేం తెలుసు? చిన్నప్పటినుండీ ఆ పిల్లవాణ్ణే కలవరిస్తున్నావ్! మనం గర్భదరిద్రులం. ఫలానా కులం అంటూ లేనివాళ్ళం. ఆ కారణంచేత సంఘంలో అంత మర్యాద లేనివాళ్ళం. మనలో యేముందని ఆ శ్రీమంతు డొచ్చి కౌగలించుకుంటాడే' అంది.

'అసలు, ప్రేమ వుంటే చాలదా అక్కా' అన్నాను అనుమానిస్తూనే.

'అదెవరికి తెలుస్తుంది సీతా? అదే విధంగా ప్రేమించిన వాళ్ళే దాని పరిమాణం తెలుసుకోగలరు? ఎదుటి మనిషిలో ఎంత ప్రేమ వుందో అని పరీక్షించే వాళ్ళెవరు సరిగ్గా! వీలుపడితే శరీరాన్ని మాత్రమే అనుభవించి పోతారుగాని' అంది. నాకామె మాటలు అబద్ధాలుగా తోచలేదు. అయితే అనుమానం మాత్రం కలిగింది. నా మానసిక బాధ మాత్రం తగ్గలేదు. అట్లాగే కన్నీరు కారుస్తూ పడుకున్నా. నా కన్నీటితో దాని తొడంతా తడిసింది. నేనంటే దానికి బలే ప్రేమ, నా తలిదండ్రులు పోయిన తర్వాత అదే నాకన్నీ. ప్రపంచంలో తలిదండ్రులూ - ఇంకా యెవరన్నా ప్రేమించేవారూ వుంటే అందరూ కలిసి యెంత ప్రేమ చూపుతారో - అంతకంటే అధికమైన ప్రేమతో చూచి పెంచింది నన్ను. నేను ఒక సమస్య అయి కూర్చున్నా దానికి. నా నుదుటి కురులు సవరిస్తూ, చెమ్మకండ్లతో అంది: 'సీతా! నువ్విట్లా బాధ పడకే. నాకిది హృదయ విదారకంగా వుంది! ఆ ప్రేమపిచ్చి చెదపురుగుల్లాగా నీ శరీరాన్నే క్రమక్రమంగా తినేస్తూ వుంది!' అంటూ, నా దేహాన్ని నిమురుతూ 'నీవేమో నిర్మల ప్రేమతో వున్నావు. అతనూ ఇట్లాగే వుంటే నీకింతకంటే స్వర్గం లేదు. అట్లా కావాలనే నా అభిలాష. నీ ప్రేమ లోతులు తెలిసికోడం యెదుటి వ్యక్తికి సంబంధించిన విషయం. కాబట్టి ఒక వ్యక్తే నిర్ధారణకు రాలేని విషయం అది. అది యెదుటి మార్గాన రావాల్నే గాని, యీ మార్గాన తేలదు. అతడు మాత్రం యిక యిరవై రోజుల్లోనే వస్తాడుగా ఫరవాలేదులే' అంది కాస్త ధైర్యాన్నిస్తూ.

అంతే! ఆనాటినుండి యీనాటి వరకూ తానే విధీ విరామం లేకుండా కూలిచేస్తూ వుంది. ఇద్దరం కలిసి చేసేటప్పుడు అపుడపుడూ విశ్రాంతి తీసికొనే వారం. నేనిట్లా కూర్చున్నాక తానొకతే చేసేది పాపం. దాని కష్టం చూచి సహించలేక ఒకనాడు నేనుగూడా వస్తా నన్నాను. వద్దంది. కాదు, వస్తా నన్నాను. ససేమిరా అంది. 'కాదక్కా నేనూ కాస్త సాయంగా వుంటాను' అన్నాను అర్థిస్తూ. బలవంతంగా మంచంపై కూర్చోబెట్టి పడుకోబెట్టి అదిమి, "వద్దు తల్లీ! నీ వొంట్లో బలం లేదు. నే చేస్తాగా! అంతమాత్రం నా బంగారు చెల్లికి చేసుకోలేనా? అయినా నీవేమీ తినటం లేదుగా యిపుడు! నా కడుపుకు నేనే సంపాదించు కున్నట్లుంది' ఆ దినం ఆ మంచంపై అట్లా ఆలోచిస్తూ పడుకున్నా—

'అబ్బా! ప్రేమజీవు లెంత ఉదారులు! ఎంత త్యాగాలు చేస్తారు' అని అట్లా ఊహించాను. నీవు నా మనోనేత్రాల ముందు నిలబడ్డావు. అట్లా నిన్ను గురించి ఊహించాను. తర్వాత నా తలిదండ్రులు - మా అక్క - ఇట్లా ఊహిస్తున్నా, గత విషయాలన్నీ ఒక్కొక్కటే తరుంకొని వచ్చినట్లు వచ్చి వాలుతున్నాయి, నా మనఃఫలకంపైన. ఆనాడు - అప్పటికే మా తండ్రి గతించి పోయాడు. ఆయనుండగా మమ్ముల్ను చదివించాడు. ఆయనకు మేమంటే యెంతో ప్రేమ. చాలా అభిమానంతో పెంచాడు. మా అమ్మపైన అతనికి చెప్పలేనంత ప్రేమ. మమ్ముల తన ప్రేయసివల్ల, దీక్షతో పుట్టించుకున్నాడు కాబట్టే అంత మమత అని మా అమ్మ చెప్పేది. ఏమిటేమిటో ప్రతి దినమూ పాఠాల్లాగా చెబుతూ వుండేవాడు. నాకంత బాగా అర్థమయ్యేవి కాదు. మా అక్క చాలా శ్రద్ధగా వింటూ వుండేది. ఆయన ప్రేమ. మోసం, సంఘం, కపటం! ఇట్లాంటివన్నీ ప్రతి దినమూ అంటూ వుండేవాడు తన ఉపన్యాసంలో, చాలా పుస్తకా లుండేవి మా యింటి నిండా, నేనపుడు నాలుగో తరగతి, మా అక్క మూడో ఫారం. మా నాన్న చనిపోయాడు. ఇక మా అమ్మ దుఃఖం వర్ణనాతీతం! నేను మాత్రం ఆమెను చూచి యేడ్చే దాన్ని. 'అమ్మా నిన్ను చూచి చిన్నది యేడుస్తున్నదే కాస్త ఆపుకోకపోతే యెట్లా?'

అనేది మా అక్క. అది అట్లాంటి సమయాల్లోనే గుండె నిబ్బరం చూప గలిగింది. అది ఎటువంటిదో నీవికమీదట తెలుసుకోగలవు. ఎంత సునిశిత జ్ఞానం గలదో - ఎంత సమయస్ఫూర్తి గలదో - నీవే యిక తెలుసుకుంటావు. ఇపుడు నీవామె నెట్లా భావిస్తున్నదీ నాకు తెలుసు. మా నాన్న పోగానే దీనా వస్థలో వున్న మా యమ్మే మాకు దిక్కయింది. తానొకతే కూలిచేసి మాకు పెట్టాలి. మా అక్క కప్పటికి పదమూడో సంవత్సరం పడింది. మా అక్క తన కొచ్చిన విషయాలన్నీ నాకు చెప్పేది. మనకంటె పెద్దవాళ్లు పెద్దతరగతిలో వుంటే నిజంగా ఎంత లాభమనుకున్నావు! ఎన్నంటే యేం! చదువు చాలిస్తా నని కూర్చుంది. మా అమ్మ బలవంత పెట్టింది. ఆ సంవత్సరం యిద్దరమూ ప్యాసయ్యాం. అప్పటికి మా బ్రతుకు చాలా హీనమయి పోయింది. తిండికి జరగడమే కష్టమయింది. బట్టమాట దేవుడెరుగు, ఏనాడుగూడా ఆకలంటూ యెరగని మేము, బాగా, లక్షణంగానే తింటూ వుండిన మేము, చాలా తగ్గు రకపు ఆహారానికిగూడా నోచుకోలేక పోయాం. ఆక లెట్లాంటిదో దాని బాధ యెటువంటిదో గూడా చవిచూచాం. బట్టలన్నీ చినిగిపోయాయి. చినిగినవి కుట్టీ, అచ్చర్లు వేసి కుట్టీ వాడుకొనే వారం. దుర్భర దారిద్ర్యం ఆ నాళ్ళల్లో బాగా అనుభవించాం. మా అక్క చాలించింది. కూలికి పోవడం మొదలు పెట్టింది. నన్ను మాత్రం చదువుకు పంపడం మానలేదు. నేనింకా చిన్న పిల్లను. అంతా యెనిమిదేండ్లు దాటి వుంటాయి.

కష్టాల్లో వున్నపుడే కొత్త కష్టాలు వచ్చిపడుతూ వుంటాయి. అట్లా రావటం వాటికి సహజం అయినా మనం మనకే వస్తున్నా యని భావిస్తూ వుంటాం. మా అమ్మకు జబ్బుచేసింది .... .... తిండికే లేనపుడు మందు కెక్కడొస్తుంది! మందు గూడా యిప్పించలేక పోయాం, అసలు మా కంద రికీ తిండికి మరీ కటకట పడవలసి వచ్చింది. నేను చిన్న దాన్ని కాబట్టి భిక్ష మెత్తడం నాకు తప్పదు. భిక్ష యితర్లకు పెట్టనేర్చినామే గాని ఒకరి దగ్గర చెయ్యిపట్టి యెరగం మేము. మాత్రాత ఆ విధంగా వ్రాసివుంటే తప్పించుకో డానికి మావల్ల అవుతుందా? నా అభిమానాన్ని చంపుకొని బయలుదేరాను.

ఎంతో సిగ్గుపడేదాన్ని అరవడానికి, ఏదో గొంతు పట్టుకున్నట్టుగా వుండేది. కన్నీళ్లుగూడా వచ్చేవి. ఒక్కొక్క యింటి దగ్గర వూరికే నిలబడే దాన్ని. ఎంతెంతో దీనంగా కేకలు వేస్తేగాని పలకనివారు, నేనూరకే విలబడితే గమ విస్తారా? చాలా యిండ్ల ముందు ఎవరూ చూచేవారే గాదు. మరి కాస్తదూరం వెళ్ళేదాన్ని. ఎవరైనా ఒకవేళ చూచినా, చూచీ చూడనట్టు వెళ్ళేవారు. మరి కొన్నిండ్ల కెళ్లే దాన్ని. చూచి కసరుకొనేవారు! అబ్బా! ఎంతకష్టం మురళీ! అభిమానం తలచూపేది! దానికి చెల్లింపు వుంటేగా! పోను పోనూ అభి మానం చచ్చింగి. అవకాశంలేని అభిమానం చావకేం చేస్తుంది? అవసరం లేనిది యెన్నాళ్లుంటుంది? ఇంటిముందు నిలబడి నా ఉనికిని తెలియచెయ్యా డానికి అరవడం నేర్చుకున్నా.

'ఏం! దూడవలె వున్నావే. ఏదైనా పనిచేసుకోరాదూ' అనేవా డొకాయన! 'మీకోసమే సంపాదిస్తున్నాం కష్టపడి' అనే వా డింకొకాయన! ఈ 'న్యూసెన్సు ఎపుడు పోతుందో! వెధవ ప్రభుత్వం' అనే వాడింకొ కాయన! "ఒకమ్మ పెట్టేది పాపం! మరొకతల్లి కసిరేది! ఇంకొకమ్మ తిట్టేది! కడపటికి నీవు కొట్టావు" అని చిరునవ్వు నవ్వింది వాని కండ్లలోకి చూచి.

"క్షమించవూ సీతా!" అంటూ ఆమె గవదలు పట్టుకున్నాడు కన్నీరు రాలుస్తూ.

"దాంట్లో యేముంది మురళీ! అందర్లాగానే నువ్వూ అన్నావు. వాళ్లే విధంగా అయితే ప్రేమ, జాలి, దయలేకుండా అన్నారో నీవూ అంతే అప్పుడు, భిక్షగాళ్ళ చూస్తే పెద్ద వాళ్ళకూ, చిన్న వాళ్ళకూ, ధనవంతుడికీ, బీదకూ - అందరికీ యెట్లాంటి భావా లుంటాయో అట్లాంటి భావమే నీలో వుండింది. జాలి, దయ, వుండి వుంటే నీవట్లా చేసే వుండవు. ఆ గుణాలే వుండి వుంటే, మనం యింత మాత్రం దగ్గరికి వచ్చి వుండమేమో! నీ ఆ కాఠిన్యమే మన పరస్పర హృదయ సంచలనానికి దారి తీసింది. చూడు మురళీ! మా అమ్మ అప్పట్నుండీ కోలుకోనే లేదు. ఆ జ్వరం ఆమె ఆరోగ్యాన్ని పూజ్యం

చేసేసింది. తర్వాత ఆమె ఏ పనీ చేయలేక పోయింది! ఆమెగూడా భిక్షానికే బయలు దేరింది. మా యిరుగు పొరుగువారు మొదట చాలా చింతించారు. మా నాన్న ఉండగా చాలా మర్యాదగా చూచే వారు. మా గతి యిట్లా అయి పోగా మాపైన గౌరవం గూడా క్రమంగా నశించింది. సానుభూతిగూడా నశిం చింది. మా అమ్మ జ్వరంతోనే ఆనాడు నా వెంట వచ్చింది. ఆనాడంతా మా కన్నం లేదు. ఎందుకంటే కాస్త కూలిచేసి సంపాదించే మా అక్కగూడా ఒంట్లో బాగాలేక కూలికి పోలేదు రెన్నాళ్లు. ఆనా డంతా నిరుపవాసం అని చెప్పానుగా! ఆకలి మంటలు ప్రజ్వలిస్తున్నాయి గర్భకుహరంలో. గుండెలు గూడా మండిపోతున్నాయి. కండ్లు కనబడకుండా పోతున్నా యొక్కొక్క సారి. చెవులు దిమెక్కిపోయాయి. ఆ స్థితిలో మీ యింటి ముందుకొచ్చా నా నాడు. ఏదో అరిచాను. అంతే నాకు తెలుసు! తర్వాత నీ యీ కాలితన్నే" అంటూ కన్నీరు రాల్చింది వాడి కుడిపాదం పట్టుకొని. "సీతా" అంటూ ఆమెపైన వాలాడు మురళి.

"అవన్నీ చెప్పకు సీత! నాకు హృదయ విదారకంగా వుంది" అన్నాడు అర్థించే ధోరణిలో.

సీత మరలా అంది ఉత్సాహంతో:

"అవును మురళి! మనల్నిద్దర్నీ ఒకటి చేసిన ఆ ఘట్టాన్ని తలుచు కొని, ఆ మహాభాగ్యానికి నేనెపుడూ ఆనందపడుతూ వుంటాను. అట్టి పరి స్థితిలో వున్నాగూడా నా పావడ చినిగి నపుడు నాకు బాగా జ్ఞాపకం వుంది. నిజంగా అది మానభంగం! అభిమానం ఎంతగా పొల్లుకొచ్చిందో చెప్పలేను. అది ఆధిక్య భావాన్ని తృణీకరిస్తూ కలిగే అభిమానం! దౌష్ట్యాన్ని ధిఃకరిస్తూ కలిగే అభిమానం! అపుదేమన్నానో జ్ఞాపకం లేదు. నీవు కొట్టావు - నాకు స్ఫురణ వచ్చేటప్పటికి ఆ అన్నపూర్ణాదేవి సాక్షాత్కరించింది. ఆమేగా మీ అక్కయ్య? సరే! అక్కడేం జరిగిందో నీకూ తెలుసు! భిక్షాటనలో మా అభి మానం చచ్చిందని చెప్పానుగా! మరు దినమే మీ యింటి ముందుకొచ్చాను. నీ వదేచోట కూర్చొని వున్నావు. నిన్ను చూడగానే నాకు భయం వేసింది.

అంతకు ముందు రాత్రంతా నీవే నా మనసులో. ఎంత అందం! ఎంత చక్కదనం! ఎంత ఆకర్షణ! అవే నా మనోనేత్రాల ముందు ఎడతెగకుండా తాండవిస్తూ వున్నాయి. నిన్ను అదే చోట చూచి నా కెంతో ఆనందం వేసింది. కొడతావేమో నన్న భయంగూడా వేసింది! అయినా నిన్ను బాగా కండ్లారా చూడాలని దగ్గిరికి వచ్చాను. నీవూ యెదురుగా అట్లాగే చూస్తూ లేచివచ్చావు. 'నిన్న రాత్రి మీ అక్క తిట్టిందేమో - ఆ కసి యిపుడు నాపైన తీర్చుకుంటావు కాబోలు' అని ఊహించాను. నీవు సమీపించేకొద్దీ భయం ఎక్కడపోయిందోగాని నీ అందంలో లీనమై పోయాను. ఆడవాళ్లు అందానికి యెక్కువ విలువ యివ్వరంటారు మగవాళ్ళ మాదిరిగా. చాలావరకూ నిజమే. అయితే ఆ ధోరణిలో వుండే స్త్రీ జాతికి వాళ్ళు మెచ్చుకొనేటటువంటి, ఆకర్షించేటటువంటి - అందం పురుషుల్లో కనిపిస్తే, తమ పంచ ప్రాణాలనూ వాళ్ళ శరీరంలోకి చొనిపి ఆనందిస్తారు! ఆ వయసులో నాకు అందం విలువ యెంత తెలుసో యిప్పుడు చెప్పలేను. అయితే చాలా ఆకర్షింపబడ్డాను. 'మా అక్కయ్యతో చెబుతానుండు' అంటూ నీవు చిరునవ్వుతో లోపలి కెళ్ళావు. అప్పట్నుండీ అనుదినమూ వచ్చేదాన్ని. నీవు అపుడపుడూ బాగా మాట్లాడించే వాడివిగదూ? ఎందుకో మీ యింటికి రాగానే నా బుట్టా నిండేది, నా హృదయమూ నిండేది. అట్లా పది దినాలు గడిచాయి మురళీ! కష్టాలు రాసాగినా యంతే వాటికి అంత ముండదు. మానవుళ్ళో వుండే సహనాన్ని అంతు చూచినంత వరకూ ఆగవవి. గోటిచుట్టుపై రోకటి పోటన్నట్టుగా ఆ జ్వరంతో మా అమ్మ చనిపోయింది. ఇక మా దుఃఖం ఫలానా అని చెప్పలేను. ఏమిటో అయోమయంగా వుండేది. ఏమీ తోచేది గాదు. ఏమీ అర్థమయ్యేదిగాదు. అయితే విరక్తి మాత్రం మా హృదయాల్లో నిండి నిబిడీకృతమైంది. మా కాకలి దప్పులు కలిగాయో లేదో ఇపుడు చెప్పలేను. మా నాయన చనిపోయినందుకు ఈ విధంగా తయారయ్యాం. మమ్మల ఈ వయసులో, ఈ పరిస్థితిలో వదిలిపెట్టి మా తల్లికూడా చనిపోతే మా గతేం కాను? ఎంతో ఏడ్చాం! దానివల్ల కాస్త మనశ్శాంతి దొరికిందనే అనాలి. అసలు కష్టాలు మరిచిపోవడానికి దుఃఖం ఒక సాధన. దుఃఖానంతరం ప్రాణా

వికి కా_స్త శాంతి లభిస్తుంది! అప్పట్లో మాకు భోజన మెట్లా వచ్చేదో నాకేమీ జ్ఞాపకం లేదు. అపుడపుడూ యిరుగు పొరుగువారు బలవంతంగా పెట్టేవారు. ఆ సమయంలో చాలామంది యువకులు సాయం చేసేవారు. ఏ అభి ప్రాయంతో చేసేవారో పాపం! దుఃఖం అంత కంతకూ వెనుక ముఖం పట్టింది. అది తగ్గేకొద్దీ విర_క్తి నశిస్తుంది. తర్వాత స్వార్థాన్ని గురించి ఆలోచన బయలుదేరుతుంది.

మా అక్క బలే గుండె నిబ్బరం గల మనిషి. అసలు మా నాన్న ప్రతి దినమూ మాకు బోధించిన విషయాల్లోని సారాంశము అదే.

మా తల్లి కర్మ యేదో విధంగా చేసిన తర్వాత, నన్ను ఒడిలోకి తీసుకొని. 'సీతా! భయం వేస్తున్నదటే' అంది మా అక్క.

'అవు నక్కయ్యా! ఆడ పిల్లలం! మన బ్రతు కేమిటి ' అన్నాను.

'ఆ భయమెందుకమ్మా! మనబోటివారు ప్రపంచంలో వేలకువేలు! మనం చాలా మేలు! పుట్టుకతోనే తలిదండ్రులు కోల్పోయిన వా రుంటారు, మరి వారి గతో?'

'వారు చిన్నప్పటినుండీ ఒకే తీరులో జీవితాన్ని గడుపుకుంటూ వస్తారు. మన మాదిరి మధ్యలో అనాథలు కాలేదు. మధ్య కలిగితేనేగా యీ బాధలు!'

'మొదట కలిగినా, మధ్య కలిగినా అట్లాంటి జీవిత తత్వం ఒకటే సీతా! మనం తారతమ్యాలు ఊహించుకుంటూ కూర్చుంటాం అంతే.''

'అనాథ లయినా మగపిల్లల మయితే పరవాలే దక్కా! ఆడపిల్లలం; ఎవరూ ఒక బంధువన్నా లేనివాళ్ళం! ఈ సంఘంలో మన మెట్లా జీవించడం?'

"ఆడా మగా అని ఏదో లీల కొఱకు భగవంతుడు సృష్టించాడే గాని లింగభేదం వల్ల యింతింత వ్యత్యాసా లుండాలని భగవత్సంకల్పం కాదు. అవన్నీ మనం కల్పించుకున్న భావాలు, ఆ న్యూనత్వ ఆధిక్యభావాలు, ఆడ, మగజాతుల్లో స్థిరంగా స్థాపితమైపోయాయి. ఆ భావాల కనుగుణంగానే యిరు తెగలూ సంచరిస్తున్నాయి. మన మా భావాన్ని లాగేసి, ఆ న్యూనతాభావాన్ని

మనసులోకే రాకుండా చేసుకుంటే - నీవన్నట్లు - మగపిల్ల లెంత స్వతంత్రంతో బ్రతుకుతారో మనమూ అట్లాగే జీవించవచ్చు. అంత దైన్యంతో, అంత న్యూనతాభావంతో ఎపుడూ ఊహించక సీతా.''

కావచ్చునని సంతృప్తిపడ్డాను. తర్వాత నాకు అడుక్కు తినాలంటే బుద్ధిపుట్టలేదు. అభిమానం మళ్ళా రేకెత్తింది. అందులో నాకప్పటికి దాదాపు పన్నెండేం డ్లుంటాయి. మా అక్క నా కంటే నాలుగేండ్లు పెద్ద, నాకు దాని వల్ల ఎంతో ఓదార్పుండేది. అయినా ఓదార్పు లోపం నా హృదయంలో ఎక్కడో కదుల్తూ వుండేది! అది నిన్ను చూస్తే పూర్తవుతుందని నా హృదయం చెప్పింది. ఒక నా డట్లా వచ్చాను. నీవు కనిపించలేదు. మరు నాడు వచ్చాను. కనిపించలేదు. మీ అక్క గూడా కనిపించలేదు. మీ రా యిల్లు మార్చారేమో అనుకున్నా. ఎవర్నడగడం? ఎట్లా తెలుసుకోడం? మొదట అభిమానంవల్ల ఎవర్నీ అడగలేదు. తర్వాత, పాతబడిం తర్వాత ఆ విషయాన్ని ఎవర్నన్నా అడిగితే బాగుండదనిపించింది. అయితే నన్నుచూడా లని మనసు చాలా తహతహ పడేది. నీవు కనపడకపోగా, నిన్ను చూడాలన్నకోరిక ఎక్కువ కాగా, నా హృదయంలో తహతహ హెచ్చి పోయింది.

మా అక్క ఒకతే కూలికి వెళ్ళేది. నేను వెళ్ళేదాన్నిగాను. నన్నామె రానిచ్చేది గాదు. నేనింట్లో నే కూర్చునే దాన్ని. ఉన్న పుస్తకాలు చదువు కుంటూ, చాలాసార్లు నిన్ను గురించే భావించేదాన్ని. నిర్వ్యాపారత్వం నిఖిల భావనలకు మూలకందం, ఆ స్థితిలో వున్న నేను, నిన్ను గురించే యోచించ డానికి మొదలుపెట్టాను. ఆ వయసులో అటువంటి భావాలకు తావుందా అంటావేమో! అందులో తప్పేమీలేదు. అవి కామ సంబంధిక భావాలంటే నే నంగీకరించ ననుకుంటా. కేవలం అవి అస్పష్ట లౌల్యసంబంధిక భావాలే అనాలి. అటువంటి భావాలు ఆ సమయంలో ప్రతి బాలికలోనూ చాలావరకూ వుంటా యనాలి. ఎందుకంటే మన దేశంలో అది దాదాపు పెండ్లి యీడు గాబట్టి. ఒక్కొక్క నాడు నిన్ను గురించి ఎంత తీవ్రంగా ఆలోచించేదాన్నో

ఏమాలోచించేదాన్నో! అన్నీ మా అక్కకు చెప్పేశాను. ఆమె అంతా అర్థం చేసుకుంది. నవ్వి ఊరుకుంది.

ఒకనాడు నన్ను అట్లా ఆప్యాయనంగా దగ్గిరికి తీసి అంది:

'ఆ పిల్లవాడు నాకూ తెలుసు తల్లీ! నేను ఒకటో ఫారం చదివే టప్పుడు వాళ్ళక్క రెండో ఫారం. ఆమె చాలా మంచిది! అంచేత మాకు స్నేహం. అది తర్వాత బాగా వృద్ధి అయింది. సత్యారావు నొకప్పు డామె తిట్టింది. అప్పట్నుండీ ఆ దుర్మార్గుడు పగబట్టి బాగా యేడిపించేవాడు. మేమందరం సత్యారావు గ్రూపును తిట్టిపోస్తూ వుండేవాళ్ళం! నీకు అనుభవం లేదు సీతా హైస్కూల్లో మగపిల్ల వాళ్ళెట్లా సంచరించేదీ! వట్టికోతిమూ కనుకో! ఆడపిల్లను చూస్తే కోతికి సారాయి త్రాగించినంత పనవుతుంది! ఆ పిల్ల పొరపాటున మాట్లాడితే ఇక చెప్ప శక్యంగాదు. నేను చదువు చాలించిన తర్వాత ఆ పిల్లవాడు చేరాడు రెండో ఫారంలో. వాళ్ళక్కతో పాటు బడికి వచ్చేవాడు. ఎంత ముద్దుగా వుండేవాడనుకున్నావ్? ఎంత అందంగా వుండేవాడు! చక్కెరబొమ్మ అనాలి. ఆడపిల్లలంతా తనను చూచి ఆనందించేవారు. ఆడుకోవాలని కుతూహల పడేవారు. నేను ఎపుడన్నా అందర్నీ చూచివద్దామని వెళ్ళేదాన్ని. అపుడీ అబ్బాయిని గూడా పిలిపించి ముద్దుగా రెండు మాటలు మాట్లాడించుకొని వచ్చేదాన్ని. వాళ్ళక్కతో కలిసి పోతూవుంటే, ఆడపిల్లలంతా బుగ్గలు గిల్లేవారు. కాస్త చిన్నపిల్లలు ఏమి టేమిటో పప్పరమెంట్లు ఇట్లాంటివి యిచ్చేవారు.' ఇట్లాంటి వన్నీ చెప్పేది మాయక్క. అవన్నీ వింటూంటే అది నన్ను పొగిడినట్లే. అందరూ నన్ను ప్రేమించి బహూకరించినట్టే వుండేది. ఆనందం హృదయాన్ని ఆవరించి నన్నెక్కడికో తీసుక పోయినట్లుండేది. మరుక్షణంలోనే ఏదో నిరాశా మారుతం వల్ల అది తరుమబడినట్లుండేది, ఇట్లా బాధపడుతూ వుండగా ఒక నాడు సత్యారావు మా యింటికొచ్చాడు. మా అక్కే అతన్ని పిలిపించి నట్లుంది. వాళ్ళిద్దరూ బాగానే మాట్లాడుకొనేవారు. చాలా చనువుగా కాస్త వ్యంగ్యంగా మాట్లాడుకొనేవారు. అతను మాట్లాడుతూ వుంటే అహం

కారమూ ఆధిక్య భావము తృణీకార భావమూ, కనిపించేవి. అసలు సంఘంలో అంతస్థానం లేని, అందులో బీదపిల్లలనూ చూస్తే, పై భావాలు చాలామంది పురుషులకు కలిగి తీరతాయి. సత్యారావు నాతోగూడా అదే పనిగా మాట్లాడుతూ కాస్త హేళన పూర్వకంగా ప్రవర్తించే వాడు మాటల్లో. నాకు కోపంవచ్చి ఒకనాడు ఛీ కొట్టాను. మా అక్కగూడా మందలించింది. అతడు రెండు మూడుసార్లు వచ్చినాక 'ఏమక్కా అత నట్లా మాట్లాడ్తాడు? అటువంటి వాడితో నీకు పరిచయ మేమిటి - పనేమిటి?' అన్నాను.

'అవసరంకొద్దీ మాట్లాడుతున్నా సీతా! కొన్ని కొన్ని పనులు కొందరి వల్లనే అవుతాయి. అటువంటప్పుడు ఏదో విధంగా వాళ్ళ నాశ్రయించాలి దుర్మార్గులైనా.'

'ఏమిటక్కా అంత అవసరం! మనకేమన్నా కూడూ గుడ్డా యిచ్చి పోషిస్తాడా?' అన్నాను.

ఆమె నవ్వి, "నా కేమీ లాభంలేదు గాని అది నీకే లాభం' అంది.

నా కనుమానం వేసింది. ఏమిటేమిటో భావా లుత్పన్నమైనాయి! ఆమెలోని భావ మేమిటో నా కర్థం కాలేదు. నా ముఖంలోని మార్పులు గమనించి,

'నేను మురళీధర్ విషయంలో ప్రయత్నాలు సాగిస్తున్నా' అంది నవ్వుతూ.

'ఎవరు మురళీధర్?' అన్నాను.

'నీ మనోనాథుడే' అంది చిఱునవ్వుతో కొంటెగా చూచి.

నేనెక్కడున్నానో తెలియ దా క్షణం! ఎంతో ఆనందించాను. 'ఏదక్కా' అన్నాను తమకంతో. 'ఎక్కడున్నాడే! అనుకున్నపాళాన మనకు దర్శన మివ్వడానికి మనం విష్ణుభక్తులమూ శివభక్తులమూ కాదుగా? కాస్త ఓపిక పట్టు' అంది. 'అంతేనా' అన్నాను నిరుత్సాహపడుతూ.

"దేనికైనా సమయం రావాలి, మన ప్రయత్నాలకు దైవ సహాయం గూడా కావాలి. అన్నీ కలిస్తేనే నెరవేర్తాయి. ఒక్కొక్కసారి యిక యీ

జీవితంలో లభ్యంకాదు అన్న వస్తువుకూడ అతిసులభంగా లభ్యమవుతుంది. ఆ మరునా డెంతో సంతోషంతో జామతోటలో కొచ్చాను. ఎంతో ఉబలాటతో కూర్చున్నా. హృదయారాటం నిరీక్షణ వల్ల ఎక్కువయిందేగాని మీ రింకా రాలేదు. అట్టి నిరీక్షణ ఒక వింతానుభవము. అది అనుభవించిన వారికే అర్థమవుతుంది. అది బాధానంద మిళితము! ఉత్సాహ నిరుత్సాహముల కలయిక! మీరు వచ్చారు. ఏమి చెప్పను మురళీ, అప్పటి నా హృదయావస్థ! హృదయంలోని బాధా నిరుత్సాహా లంతరించి తత్స్థానే ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి! ఉవ్వొంగి గట్లు తెగి ప్రవహించాయి. గుండెలు వెఱ్ఱిగా నాట్యంచేయ మొదలుపెట్టాయి. ఏమి చెయ్యాలో తెలీలేదు. మా అక్క కను సైగ ననుసరించి జామకాయల బుట్ట నీముందు పెట్టాను. ఆ పరిస్థితిలో నీపైన పడేదాన్నే, జంకాను మళ్ళా. నీవు గాభరాపడుతున్నట్లూ భయపడుతున్నట్లూ గమనించాను.నన్ను నేను సమాళించుకుంటూ వుండగానే పారిపోయావ్. బయటికి గబగబా పరుగెత్తాను. నిరాశతో, నిర్భిన్న హృదయంతో గుడిసెలోకి వెళ్లాను. ఎంతగానో దుఃఖించాను. తర్వాత మా అక్క, సత్యారావూ వచ్చారు. మేము యిల్లు చేరింది మొదలు నాకొకే వ్యధ. నోటిదాకా వచ్చిన పండు జారిపోయేగదా అని దుఃఖం, మళ్ళా ఒక సంవత్సరం ఒకే వ్యసనం. అదొక వింతైన బాధ. అదివరకంతా దొరకవేమో అని బాధ. ఇపుడు దొరికి పోయేనే అని బాధ. నాకు మా అక్క సత్యారావూ అభయమిచ్చారు'' సీత కాస్త ఆగింది వాడి మొగంలోకి చూస్తూ.

ఎంతో ఉత్సాహంతో ఉబ్బిపోతూ ''ఊఁ, చెప్పు సీతా!'' అన్నాడు మురళి ప్రోత్సాహనీయంగా.

''ఏమిటి చెబుతున్నాను నీకు? అంతా అనవసరపు సోదె చెప్పుకు పోతున్నా. నీ వడిగిం దొకటి - నే చెప్పే దొకటి! ఈ జబ్బు ఇంతే! ఒకే విషయం శాఖోపశాఖలుగా చీలి, అల్లుకుంటూ పోవడమే!''

''నేనడిగిందిదే! కానీ.''

''పరీక్షలకు ముందుగానే వచ్చావుగాదూ? నీతో ఎట్లా మాట్లాడాలో

నాకు తెలీలేదు. ఏమంటే ఏమవుతుందో అని భయపడ్డాను. ఆనాడు నువ్వెంతో ఆదరంగా, ఉత్సాహంగా మాట్లాడావు. నేనేదైతే కోరానో ఆ గుణాన్ని ప్రదర్శించావు. చాలా సంతోషించాను. ధన్యనయ్యా ననుకున్నాను. ఒక గడువు పెట్టి వెళ్ళిపోయావ్, అబ్బా! పరీక్షలో నీవు ఫస్టు రావాలని ఎంతగా ప్రార్థించాను దేవుణ్ణి! నీ వారోగ్యంగా వుండాలనీ-బాగా చదవాలనీ - బాగా పరీక్షల్లో వ్రాయాలనీ-పరీక్షలవుతూనే నీవు నా దగ్గరికి రావాలనీ-దేవుణ్ణి ప్రార్థించేదాన్ని- నా ప్రార్థనలు సఫలమయ్యాయి, అయితే నాకెందుకో జ్వరం పట్టుకొంది. చాలాబలహీనమయ్యాను, నీ వొచ్చిన నా డెంత జ్వరంగా వుందో తెలుసా? అగ్గిగా వుంది తాకితే. నీవు వచ్చావని చెప్పారు. ఆనందం ఉప్పొంగగా, అమాంతంగా ఎగిరిలేచాను. లేచిం దాన్ని లేచినట్టే పడ్డాను. 'ఎట్లక్కా?' అని దుఃఖించాను. 'నేవెళ్ళి పిల్చుకొస్తా నుండమ్మా' అని బయలుదేరింది. నే నక్కడ వుండలేకపోయాను. క్షణం ఆలస్యానికిగూడ ఓర్చుకో లేకపోయింది హృదయం. బయలుదేరాను. శక్తి ఎట్లా వచ్చిందో నాకే తెలీదు. నీ వాడిలో వాలాను. ఎంతగా ఆదరించావు మురళీ! ఆజన్మాంతం నీకు కృతజ్ఞురాల్ని. చూడూ! ఆ దినం వెళ్లావుగా!....మన ప్రేమను గురించి ఆలోచించేకొద్దీ నాకే సందేహాలు రామొదలిడినయ్. ఒకనాడు తీవ్రంగా ఆలోచిస్తూ పడుకున్నా. ఎన్నెన్నో సందేహ లొచ్చాయి. చాలాచాలా విషయాలు పురస్కరించుకొని సందేహిస్తూ ఆలోచిస్తున్నా. ఆ ఆలోచనలతోనే నిద్రపోయాను ఒక పెద్ద కల వచ్చింది. నేను గూడా చదువుతున్నానట! మన యిద్దరీ ఒకే కళాశాలట. ఆడపిల్ల లందరూ నీపైన కన్నేశారట చాలా మంది! ముఖ్య స్నేహితులతో కలిసి ముచ్చటించు కొనేవారట నిన్ను గురించి. వీళ్ళకే గాకుండా పెద్దపెద్ద ఆడవాళ్ళకు నీపైన మోహం కలిగిందట! అందులో నలుగురు ముఖ్యులట! వాళ్ళు చిన్నప్పటినుండి ఒక ప్రత్యేక దృష్టితో నిన్ను చూస్తూ వచ్చారట! వాళ్ళ దృష్టిలో ఇక ఫర్వాలేదు అన్న వయసు వచ్చినాక ప్రయత్నించినారట! కొందరి వలల్లోపడ్డావట! ఎవర్నీ పెండ్లాడలేదట! ఆఖరికి నన్ను గూడా చేసుకోలేదట! ఎంతో బాధపడ్డానట! కడపటికి నేను విషం మింగానట .... ....

మా అక్క నన్ను గట్టిగా తట్టిలేపింది. ఆమె వాళ్లోకి నన్ను తీసుకొని, 'ఏమిటి సీతా యిది? ఇట్లా యెవరన్నా చేస్తారా? ఎందుకా విధంగా కలవరిస్తూ - కేకలువేస్తూ యేడుస్తున్నావ్ నిద్రలో?' అని అంటూ కార్తున్న నా కన్నీటిని తుడిచింది. నేను పసిబిడ్డలాగ దాన్ని హత్తుకొని కలంతా చెప్పాను. ఆమె నవ్వలేదు. ఎందుకంటే నా కలలు చాలా చాలా నిజమైనవి.

అంచేత ఆలోచిస్తూ కూర్చొని, 'ఎట్లయినా ఇట్లాంటి వారి ప్రేమలు అంత విశ్వసించదగినవి కావు' అని ఇంకా ఏమేమో ఉదాహరణ పూర్వకంగా చెప్పింది. నాకు అనుమానం బాగా పట్టుకొంది .... అయితే నిన్ను బాగా నమ్మవచ్చా మురళీ'' అంది సీత.

''ఇంకా అనుమానిస్తావా సీతా! నేను నీవాణ్ణే యెప్పటికీ! నిన్ను తప్పక పెండ్లాడతాను. ఇందులో అసత్యం అవంతైనా లేదు. ఇంతగా ప్రేమించి నా కోసం యింతగా బాధపడే స్త్రీ నాకు భార్య కావటం కంటే వేరే భాగ్యమేముంది సీతా!'' అన్నాడు కృతజ్ఞతను దృక్కుల్లో కనబరుస్తూ.

సీత ఆనంద బాష్పాలు రాలుస్తూ ''ఇదే నన్నిన్నాళ్ళూ బాధ పెట్టింది. ఏమి టేమిటో చెప్పాను గదూ'' అంది.

''అన్నీ మంచి విషయాలే చెప్పావు సీతా! చక్కగా వున్నాయి. ఇంత జ్ఞానం నీకుందని నే నిపుడే గహించాను. ఇన్ని విషయాలు నీవే యిట్లా మాట్లాడుతూ వుంటే, మీ అక్కయ్య ఇంకా ఎంత బాగా మాట్లాడగలదో! అయినా ఎంత బాగా వర్ణించి చెబుతావు సీతా చక్కని ఆ వ్యాఖ్యాన పద్ధతి.''

''అవును. ఇదంతా మా అక్కయ్య నుండి నేర్చుకొన్నదే.''

మురళి కాసేపు ఊరికే కూర్చున్నాడు. తృప్తిగా సీత దేహాన్నంతా తమకంతో చూస్తున్నాడు. ఏదో జ్ఞాపకాని కొచ్చినట్టుగా. ''సీతా నేను పంపిన బట్టలు కట్టుకోలే దెందుకూ?''

''పాపం ఎంతో ప్రేమతో పంపించావు గదూ?''

''అవును, నీ వాడ్రస్సులో వుంటావేమో, చూచి ఆనందిద్దామను కున్నాను. ఎందుకు .... ....''

"ఆనందించే కాలం వెనకుంది మురళీ! మన పెండ్లినాడు కట్టుకుంటాను. నీవు నా వాడి వయిన తర్వాతనే నీవు తెచ్చివ్వడానికి హక్కున్నది. నేను నీ దాన్నయి నపుడే నీవు తెచ్చినవి ధరించవలసిన బాధ్యత నాపైన వున్నది."

"అయితే మనం పరస్పరం చెందమా?"

"చెందకేం? అయినా ఇపు డవసరం లేదుగా! ఒకనాడు ఇవే కట్టుకొని నిన్ను తృప్తి పెడతాగా!"

ఇంతలో సత్యారావు వచ్చాడు. అప్పటికి చీకటి పడింది గూడా. వాళ్ల ముందూ సీతా వాళ్ళక్కా వెనకా నడుస్తున్నారు.

"అరెరే! అసలు విషయం చెప్పడానికి మరిచాను" అంటూ నాలుక కొరుక్కొని "ఉండ్రా సత్యారావ్! ఒక మాట మాట్లాడాలి" అన్నాడు. సీతను ప్రక్కకు పిలిచాడు. పిలిచి "అసలు విషయం మరిచాం గదూ!" అన్నాడు.

"నా చదువు విషయమా?"

"అవును."

"నేను మరవలేదు. ప్రొద్దు పోయిందని ఊరుకున్నాను."

"బలే దానివి! చూడూ! రేపు సాయంకాలంగా రా. మా అక్కయింట్లో వుంటుంది. ఆమె రూంలోకి పిల్చుకపోతుంది. నన్ను గూడ సమక్షంలో వుండమన వచ్చు. నా యెదురుగా జాగ్రత్త! తెలిసినట్టుండ గూడదు! నీ పేరు సీత అని చెప్పక, చెప్పావో అంతా చెడిపోయినట్టే - జాగ్రత్త" అంటూ ఆ చీకట్లోపడి వెళ్ళిపోయాడు.

మరునాడు సాయంకాలం సీత సుమారుగా తాహతుకు తగినట్టుగా ముస్తాబై బయలుదేరి వచ్చింది. అప్పటికి నాలుగున్నర అయివుంటుంది. సరళ మురళికి బీదరికంలోని బాధల గురించి చెబుతున్నది. ఇంతలో ఎవరో వచ్చారని చెప్పగానే సరళ బయటికి వెళ్ళి క్షణంలో సీతను వెంటబెట్టుకొని రూంలో కొచ్చింది. ఆమెను చూడగానే సంతోషంతో ప్రోత్సహితమైన

చిరునవ్వు పెదవులపై తాండవించక తప్పలేదు మురళికి. బయటకి వెళ్ళాడు.

"కూర్చోమ్మా" అంది సరళ తాను కూర్చుంటూ. సీత నిలబడే వుంది సందేహిస్తూ. "సందేహిస్తా వెందుకూ? కూర్చో" అంది మళ్ళా ప్రసన్నవదనంతో, కూర్చుంది సీత. మురళిని పిలిచింది సరళ. చాలా భద్రంతో వచ్చి అక్కకు వెనుక భాగంలో మంచం పైన కూర్చున్నాడు వంచిన సీత మొగంలోకి చూస్తూ.

"ఈ యమ్మా యెవరో బీదమ్మాయట పాపం!" అంది సరళ మురళితో.

"ఇంతకు ముందా విషయం పైన్నే గదా మాట్లాడుతున్నాం! ఎందరో?"

"ఎవరమ్మా నువ్వు? ఏమిటి విషయం?" అంది సరళ.

"మీ సాయం కావాలి. అంచేత వచ్చాను."

"చేతనయిం దెంతైనా చేస్తా, విషయమంతా చెప్పు."

"నా కిపుడు చదువుకోవాలని మనసు కలిగింది."

"ఇపుడు చదవటం లేదన్న మాట!"

"లేదు. చాలించి నాలుగేండ్లయింది."

"ఏం చదివావు?"

"అయిదో తరగతి ప్యాసయ్యాను."

"ఎందుకు చాలించ వలసి వచ్చింది?"

"చాలా కారణాలున్నాయి. వెనుక పెద్ద కథ వుంది."

"అంతా చెప్పమ్మా ఫరవాలేదు."

"మీ కాలాన్ని వ్యర్థపుచ్చడం నాకు సమ్మతం కాదు."

"ఏమీ ఫర్వాలేదు. నాకు తీరిగ్గానే వుంది."

"మేం సమీపంలోనే వుంటున్నాం. మా నాన్నా అమ్మలు చని పోయారు. తర్వాత బలవంతంగా చదువును చాలించెయ్యాల్సి వచ్చింది."

"అయ్యో పాపం! నీ వాక్కతివే నేంటి? ఎవరూ దగ్గిర బంధువులు లేరూ?"

"నాకొక అక్క వుంది. అంతే. బంధువులు ఎక్కడో వున్నారుగాని, మా గాలే వాళ్ళకు కిట్టదు. వాళ్ళ నుండి సాయం లభించదు."

"ఏం విరోధమా?"

"అవును."

"ఎందుకూ?"

"మా నాన్నపై వారికి కోపం."

"ఏం?"

"మాది విశాఖపట్నం జిల్లా కవతల ఒక పల్లెట. మానాన్న చిన్నప్పుడు సుమారుగా చదువుకున్నాడు. తెలుగు చాలా చక్కగా వచ్చేదట? కవిత్వంగూడా అల్లేవాడు........"

"తర్వాత."

"అంతా స్వవిషయం. ఇతర్ల కంతా చెప్పగూడనిది? చెప్పిందానివల్ల అంత ప్రయోజనం వుండదు" అంది సీత.

"పరవిషయాన్ని వినడానికి కుతూహలం చూపించేవాళ్ళమని అనుకోకమ్మా. ఏదో విచిత్ర విషాదగాధలా గుందని కుతూహలం కలుగుతూ వుంది. చెప్పు." అంది సరళ, మురళిగూడా నోరుతెరుచుకుని చూస్తున్నా డాశ్చర్యంగా.

"ఆయన చదువుకొనే స్కూల్లోనే ఒక అమ్మాయి చదువుతూ వుండేది. చాలా అందగత్తె, గుణవతి, నెమ్మది మనిషి. మా నాయనకు ఆమె బాగా నచ్చింది. ఆమె మా నాన్నను ఆకర్షించింది. పరస్పరాకర్షణ పెరిగింది. ఇద్దరూ పెద్దయాక పెండ్లి చేసుకోవాలని నిర్ధారించుకున్నారు. మానాన్న పట్టుదల మనిషి. ఏదన్నా చెయ్యాలనుకుంటే బాగా ఆలోచించేవాడు. అది సరి అయిందని తోస్తే దాన్ని నిలపడు. ఇంట్లో చెప్పాడు ఆమెను చేసుకోబోతున్నానని. ఆ వూళ్లో బంధువులే గాక, ఇతర్లుగూడా పట్టుపట్టారు. నువ్వు రాజువేనా?" అని అందరూ దూషించారు. మొగాన ఉమ్మేశారు తలితండ్రులు. తానెంతగానో వాళ్ళకు నచ్చచెప్పాలని చూచాడు. అందరి లాగానే ఆమె గూడా

ఒక స్త్రీ అని చెప్పాడు. ఏ వర్ణంలోవి స్త్రీకంటేగూడా గుణరూపజ్ఞానాల్లో తగ్గదని చెప్పాడు. వాళ్ళ కా సమత్వం అంటే ఏం తెలుసు? అర్థంకాలేదు. తాము పట్టిన కుందేటికి మూడేకాళ్ళన్నారు. మానాన్న అంతే అని కూర్చున్నాడు. ఈ వూరికి వచ్చేశాడు. ఏదో చిన్న ఉద్యోగం చేస్తూ వచ్చాడు. నెలకు ముప్పయికంటే యెక్కువ ఆదాయం లేదు. కొన్నాళ్ళకు, అతని అన్నదమ్ములూ మేనమామా అంతా వచ్చి మా అమ్మను వదలిపెట్టి వచ్చినట్టయితే ఆస్తిలో భాగమిచ్చి తమ కులంలోనే ఇంకోపిల్ల నిచ్చి పెండ్లిచేస్తాం రమ్మన్నారు. మన హిందూజాతి నానాకులాలతో, కులగర్వ కులవ్యత్యాసాలతో తగలబడి పోతూవుంది. సమత్వ విషయం కొందరి నోళ్ళలోని ఆదర్శ వాక్యమేకాని ఎవరూ ఆచరించరు! పోనీ వాళ్ళ అభిప్రాయ ప్రకారమైనా అతను కులం చెడిన వాడేగదా? స్వార్థంకోసం మళ్ళా స్వీకరిస్తామంటూ వచ్చారు. తనను నమ్మిన ఒక స్త్రీని అన్యాయం చేసి రమ్మనే కంటే రాక్షసత్వం వేరే వుంటుందా? ఆ రాక్షసత్వం మన నీచపు హిందూజాతిలో వుంది! కులమత విషయాల్లో ఎంత నీచమైనా చేస్తారు, ఆ విధంగా మన ధర్మ శాస్త్రాల్లో వ్రాసి వుందని వాటిపైనుండే గౌరవాన్నిగూడా సామాన్య మానవ హృదయంలో నుంచి పెకలించి పారేస్తున్నారు. అట్లాంటి బూటకంతో నిండి పోయింది మన సంఘం. ఈ స్త్రీతో కలిసి భోంచేసి ఈ స్త్రీ రక్తాన్ని భాగం పంచుకుంటున్న మా తండ్రి వాళ్ళకు పనికి వస్తాడటగాని, ఈమె పనికిరాదట. అసలు సత్యం అక్కర్లేదు. స్వార్థం ముందూ, అన్యాయం ముందూ, సత్యం కనిపిస్తుందా? వాళ్లు ఏమేమో వాదిస్తే మానాన్న మా అమ్మతో కలిసిపోడానికి మాత్రం యిష్టపడ్డాడు. వాళ్లు ఒప్పుకోలేదు. అన్నివిధాలా తిట్టారు మళ్ళా. జాతీ నీతి పోగొట్టుకున్న వాడా అని దుర్భాషలాడారు. జంధ్యాన్నిగూడా లాగి పారేసి, క్షత్రియత్వాన్నిగూడా మంటగలిపిన దౌర్భాగ్యుడా అని నిందించారు. జవాబు చెప్పాడు మానాన్న: "మీరనవసరంగా నోరు పారేసుకోవద్దు. నేను అసలైన జాతివాణ్ణి. నీతి నాలో తప్పలేదు. నమ్మిన ఒక స్త్రీని అన్యాయం చేసి రమ్మనే మీ నీతికంటే నా నీతి తీసిపోలేదు. సమత్వం ఉండగూడదు. అని వాగే మీ నీతికంటే నా నీతి మెరుగే అని నా అభిప్రాయం. జందెం

విషయం అంటావా? అది కేవలం ఇపుడు వంచకులు (Hypocrites) ధరించేదని నాకు బాగా తెలుసు! అది చమటకు మాగి మట్టినంతా గుడ్డకు తీసుకొని,నల్లగా, అసహ్యంగా కంపుకొడుతూ వుండడం చూస్తే నా కసహ్యం. అదెందుకు దేహానికి దిగవేసి పెద్దబిరుదులాగా? ఇంకా కొంతమంది వేసు కుంటున్నా రెందుకు అంటే మేం ఫలానా అని చెప్పుకొని కాస్త మర్యాదను స్వీకరించడానికి. ఇటీవల ద్వేషింప బడడానికిగూడా ఉపకరణంగావుంది! అస లివన్నీ యెందుకు? మీరు వెళ్ళవచ్చు,' అని సాగనంపాడట! అప్పటికి మా అక్క చిన్నపిల్ల, నేను పుట్టలేదు,'' అని కాస్త ఆగింది సీత ఆవేశాన్ని ఆపుకుంటూన్న దాని మాదిరి.

సరళ ఆశ్చర్యపడుతూ వుంది. అయిదవ తరగతి చదివిన పిల్ల ఇంతంత విషయాలు ఇంత బాగా మాట్లాడుతూ వుందే అని! మురళిగూడా ఈ క్రొత్త కథను ఆవేశంతో చెబుతూవుంటే నూత్నోత్సాహంతో వింటున్నాడు. సరళ తన సందేహాన్ని బయటికి అన్నదిగూడా.

''నిజమే! ఈ కాలం ఇంగ్లీషు పరీక్షలు ప్యాసయిన వారికే ఏ దోజ్ఞానం వుంటుందనీ మాట్లాడేశక్తి వుంటుందనీ - అపోహ వుందిలెండి. మా నాన్నకు యింగ్లీషు విద్య అంత తెలియకపోయినా. తెలుగు పుస్తకాల్లో వుండే జ్ఞానానంతా జీర్ణించుకున్నాడు. మాకు అవన్నీ చెప్పేవాడు. ఆయనే బ్రదికి వుంటే మా కీ గతి పట్టేది గాదు" అంటూ కాస్త గంభీరంగా కూర్చుంది సీత.

''నిజమేనమ్మా! ఇట్లా జరుగుతూ వుంటాయి. తర్వాత చెప్పు.''

''మా అక్క మీ బడిలోనే చదివింది గూడా. మీకు ఒక సంవత్సరం జ్యూనియర్, మీరు బాగా తెలుసామెకు.''

''ఆమె పేరు?''

''లక్ష్మి.''

''ఓహో! అమ్మా! ఇంతసేపు లక్ష్మి చెల్లెలి వన్నమాట! ముఖం పోలికలు చూచి అనుమానించానుగాని, లోకంలో మనుషులను పోలిన మనుషు

లెంతో మంది లెమ్మని విన్నదగలేదు. చూచావా మురళీ! లక్ష్మి ఎంత అంద కత్తెనుకున్నావ్! ఆమె రూపంలో దర్పం కవిపించేది. నడవడికలో గాంభీర్యం గోచరించేది. ఎంత బాగా మాట్లాడేదనుకున్నావ్? ఆమె ఏమేమో విషయాలు చెప్పేది! సాంఘిక విషయాలే చెప్పేది! మాకు అప్పట్లో చాలా చాలా అర్థమయ్యేవి కావు దాని మాటలు! నా కిప్పటికీ జ్ఞాపకం కొన్ని. 'సరళా! స్త్రీలు గూడా స్వతంత్రులు అని అనిపించుకోవాలంటే ఈ కాలంలోని మూఢ యువకుణ్ణి చేసుకోగూడదు. సరైన వాణ్ణి చేసికొని ఏ కులమైనా కానీ కావలసింది గుణమే - మంచి బిడ్డలకని, వాళ్ళను మనం పెరిగినట్లుగాకుండా, సమత్వభావాలతో - సంఘసేవా తత్పరతతో - పురుషాధిక్య రాహిత్యంతో - పెంచినట్లయితే - అందరు తల్లులూ దేశమంతటా యీ విధంగా ఆచరించి నట్లయితే - సంఘం సత్వరం బాగుపడుతుంది. ఎందుకంటే, కని ఉగ్గూ పాలూ పోసి పెంచుతూ, మాటలూ నడతా అంతా నేర్పేది స్త్రీ గాబట్టి. మనం మాతృజాతిలోని వారం. మనం పెంచగా పెరిగే వాళ్ళే గదా యీ పురుషులు! మనపైన తిరగబడేటట్టూ, మనల నీచంగా చేతగాని వాళ్ళనుగా చూచేటట్టూ మనమే పెంచుతున్నాం. అది చాలామంది గ్రహించరు. ఈ నిర్మాణ కార్య క్రమాన్ని ప్రతి స్త్రీగూడా, ఈ బాధ్యత నా ఒక్కతిపైన్నే వుంది అని భావించి, అనుసరించి ఆచరించి నట్లయితే, మానవసంఘం త్వరలో బాగుపడి ప్రపంచంలోని ద్వేషమూ, అర్థంలేని స్వార్థమూ, అనవసరమైన ఆధిక్య భావమూ, అన్యాయమూ, అక్రమమూ, అవివేకమూ, అన్నీ నశించి, ప్రేమ, నిస్వార్థం, సమత్వం, సత్యం, ధర్మం, జ్ఞానం, అన్నీ ప్రబలగలవు' అని ఇట్లాంటి వెన్నో చెప్పేది. మా నాన్న ఇవన్నీ చెబుతూవుంటా' రని చెప్పి 'నేను తప్పక ఇట్లాగే ఆచరిస్తాను చూడు' అనేది. నేను దాని సాంగత్యం వల్లనే ఇట్లాంటివి చాలా నేర్చుకున్నాను. మీ అక్కను తర్వాత చూడలే దమ్మాయ్ నేను. చూచి రెండేండ్లయి వుంటుంది, అది వర కపుడపుడూ స్కూలు కయినా వస్తూ వచ్చింది. తర్వాత కనిపించ లే దెందుకు?'' అంది.

'సంసారమంతా దాని నెత్తిన పడింది కాబట్టి.''

''ఏం, అదేమిటి?''

"నేను నాలుగో క్లాసులో వుండగా మా నాన్న చనిపోయాడు" అని కతంతా చెప్పేసింది. కడపట తమ యింటి ముందు జరిగిన సంఘటన చెప్పే టప్పటికి,

"ఆఁ ఆఁ ఆ పిల్లవా నీవు! నీ పేరు!" అని ఆత్రంగా అడిగింది సరళ.

"సీత."

"ఔనౌను. అదే అనుకుంటాను" అంటూ ఆలోచనలో పడింది, ముఖంలో మార్పు కనిపింప జొచ్చింది. మురళి వేలు కొరుక్కుంటూ సీత వైపు చూచాడు. సీత గ్రహించింది.

"నీ పేరు సీతా?" అంది సరళ మళ్ళా ముఖంలోకి సూటిగా చూస్తూ. సీత జాగ్రత్త మనిషి, తన మనసులో మార్పు బయటికి కనిపించనీకుండా,

"అవును. అది మా నాన్న పెట్టిన పేరు. మా అమ్మ పార్వతిఅనేది. రెండవపేరే చలామణిలో వుంది!"

అబద్ధం అబద్ధంగానే సరళకు తోచింది. మళ్ళా ఆ అమ్మాయిని నమ్మకుండా వుండలేకపోతున్నది. అసూయ ఒక వైపున పుట్టుకొస్తున్నది. జాలిగూడా మరొక వైపు కలుగుతున్నది. ఒకవైపు ఈర్ష్య కలుగుతున్నది. మరొకవైపు ఔదార్యం గోచరిస్తున్నది.

ఇట్లా భావద్వంద్వాల్లో పడి, ఆలోచించి, కాసేపట్లో నిర్ధారణకు వచ్చిందాని మాదిరిగా, "రేపు మళ్ళా ఒక మాటొస్తా వామ్మాయ్. మా నాన్నతో మాట్లాడాలి" అంది.

"సరే" అంటూ నమస్కారం చేసి బయలుదేరింది సీత.

సరళ ఆలోచిస్తూ వుంది. మురళికి కాస్త భయం వేస్తూవుంది. దొంగలాగా లేచిపోబోయాడు. "మురళీ! కూర్చో" అంది సరళ. కూర్చున్నా డయిష్టంగా.

"నీ కా అమ్మాయి తెలుసా?" అంది సూటిగా చూస్తూ, వెల వెల పోతున్న మొగంతో.

"అబ్బే నా కెట్లా తెలుసు?" అన్నాడు. సరళ కది పచ్చి అబద్ధం అని తెలుసు. అయినా ప్రశ్న మాత్రం వెయ్యలేదు.

మరునాడు సీత వచ్చింది. ఆమె రాగానే సరళ వేసిన మొదటి ప్రశ్న "మా మురళి నీకు తెలుసా?" అని.

"తెలుసు" అంది సీత.

"ఆఁ. నిజమా?" అంది సరళ ఆశ్చర్యంగా.

"అవును. ఆ నాడు తన్నాడు. తర్వాత పది దినాల వరకూ ప్రతి దినం కనబడేవాడు. అందుచేత ముఖ పరిచయం బాగుంది." సీత చక్కగా చెప్పింది జవాబు. అంతకుముందూ తనకు తెలియనట్లూ - అంతకంటే యేమీ తెలియనట్లూ చెప్పింది. బొంకులోగూడా బాగా బొంకింది, బాగా నమ్మేటట్లు బొంకింది. సరళ కాక మరెవరన్నా వినివుంటే 'ఎంత బాగా చెప్పింది ఉన్నదున్నట్టు!' అనుకొనేవారు. సరళకు మొదట్నుండీ హృదయస్థ భావాలను లాగే నేర్పుంది.

ఒక్క నిట్టూర్పు విడిచి, "క్షమించు సీతా! నీకేమీ సాయం చెయ్యలేను" అంది లేచి.

"అదృష్టముండ వద్దమ్మా" అంటూ సీత గూడ లేచింది.

మరునాడు మురళి వెళ్ళాడు. అతన్ని చూడగానే బోరున యేడ్చింది సీత. అతని మొగమే చూళ్ళేకపోయింది.

"పోనీలే సీతా! పొరపాట్లు జరక్కుండా వుంటాయా? ఆమె వేసే ప్రశ్నలకు తప్పించుకోవడం కష్టం" అన్నాడు మురళి ఓదారుస్తూ.

"ఏం పొరపాటు మురళీ! చాలా మందమతిగా ప్రవర్తించాను. జీవితాన్ని నాశనం చేసుకున్నాను. అవక తవకలుగా బొంకి నందుకు అపరాధమిది."

"ఇంతలోకే జీవితం నాశనమయి నట్టేనా!" అంటూ ఆలోచిస్తూ

కూర్చున్నాడు. కొన్ని నిమిషాలు గడిచాయి. దిగ్గునలేచి "వస్తా మళ్ళీ" అంటూ బయలుదేరాడు.

"ఎక్కడికి మురళీ" అంటూ వెఱ్ఱిగా ఆ నిర్గమిస్తున్న మూర్తిని చూస్తూ నిర్విణ్ణయై కూర్చుంది.

కాసేపటికి క్రిష్ణయ్యను వెంటబెట్టుకొని సీత యిల్లు చేరాడు మురళి. క్రొత్త వ్యక్తిని చూచి సీత లోపలికి వెళ్ళింది. లక్ష్మి బయటికొచ్చి "ఓహో కృష్ణయ్యా!" అంది, సాశ్చర్యంగా.

"ఇది నీ యిల్లా లక్ష్మీ?" అన్నాడు క్రిష్ణయ్య సాశ్చర్యంగా.

"అవును" అంటూ "సీతా!! కాస్త కాఫీ తయారు చెయ్యవే" అంది.

మరలా "చాలా నాళ్ళకు కనబడ్డావు క్రిష్ణయ్యా" అంది లక్ష్మి గ్రుడ్లు పెద్దవిచేసి.

"అవును లక్ష్మీ! నీవు చాలా కష్టాలవల్ల చదువు చాలించావు. తర్వాత నిన్ను చూడటమే లభించింది కాదు. ఎపుడో ఒకటి రెండు సార్లు చూచాను. ఇంతకు ముందే మీ కతంతా చెప్పుకొచ్చాడు మురళి. నిజంగా చాలా విషాద విషయం" అని ఇంకా ఇట్లా మాట్లాడుకుంటున్నారు. ఈ లోపల మురళి వంటింట్లో కెళ్ళి కూర్చొని అక్కడ సీతకు సాయం చేస్తున్నాడు. కాసేపటికి పొగలుగక్కే కాఫీని రెండు గ్లాసుల్లో పట్టుకొని బయటికొచ్చా రిద్దరూ. లక్ష్మికి క్రిష్ణయ్యకూ అందిచ్చారు గృహస్థుడూ, గృహిణీ అతిథులకు మర్యాద చేస్తున్నట్లు.

"మురళీ యెనిమి దయిందిరా" అని క్రిష్ణయ్య అనేటప్పటికి త్రుళ్ళి పడ్డాడు మురళి. ఇంతవరకూ క్రిష్ణయ్యా లక్ష్మి యేం మాట్లాడుకున్నారో ఒక ముక్కగూడా వినలేదు మురళి. వాళ్ళమాటలు వాళ్ళవే. "మరి యేంజేశావురా" అన్నాడు మురళి క్రిష్ణయ్య వంక చూచి. క్రిష్ణయ్య లక్ష్మి వంక చూచాడు.

"ఏమవుతుందీ? నీకు స్నేహితుడైతే నాకు స్కూలుమేటుగా" అంది లక్ష్మి నవ్వుతూ.

ఎంత సంతోషం వచ్చిందో మురళికి చెప్పశక్యం కాదు. క్రిష్ణయ్య చెయ్యినొక్కి పారేశాడు. ఆనందంగా యింటికి బయలుదేరారు.

# 6

సరస్వతమ్మకు అది పదవరోజు జ్వరం వచ్చి. బాగా నీరసించింది మనిషి.

బ్రహ్మారావును దగ్గిరికి రమ్మని సంజ్ఞ చేసింది. కుర్చీ దగ్గిరికి లాక్కొని కూర్చున్నాడు. రాజామణినిగూడా పిలిచింది. ఆమె వచ్చి ఆమె మంచం పైనే కూర్చుంది.

"చూడండి! ఈడు వచ్చిన పిల్లకింకా పెండ్లి చెయ్యకపోతే బాగుండదు. పెండ్లి త్వరగా చేసేస్తే మంచిది" అంది సరస్వతమ్మ.

"ఇపుడే యెందుకే? ఏమంత వయసు మించిపోయిందని!"

"ఆ వయసుకంటే వయసు కావాలా?"

"అయినా తొందరేమొచ్చింది? చదువుకోనీ."

"పెండ్లయిం తర్వాత చదువుకుంటుందిలే కావాలంటే."

"అది నీ యిష్టంపై ఆధారపడి వుండదుగా?"

"వచ్చేవాడంత తెలివితక్కువ వాడుగా వుండదులే."

"ఈకాలం ఎంతమంది తెలివిగల పెండ్లికొడుకుల చూచావో చెప్పు!"

సరస్వతమ్మ ఏమీ మాట్లాడలేదు. లోపల అసంతృప్తి పడుతూ వుంది.

రాజామణి అంది: "అదికాదండీ! పెండ్లయిం తర్వాత చదువుకుంటుం దన్నారుగదా. అంతమాత్రాని కిపుడే పెండ్లెందుకు? పెండ్లి చేసెయ్యాలని పట్టుదలా?"

"నాకు బ్రతుకుతానని లేదు. ఉన్నదంతా ఒక బిడ్డ. దాని పెండ్లి కండ్లారా చూచి చస్తాను."

ప్రక్కన వున్న మురళి ఆ మాట విన్నాడు. ఎందుకిట్లా అన్నదా అని ఆలోచించాడు. కడపటికి 'బిడ్డ' అంటే ఆడుపిల్ల అనే అర్థంలో అందేమో అని సమాధానపడ్డాడు.

"ఏమిటా కోరిక వదినెగారూ? అట్లా యెందు కంటారు?" అంది రాజామణి.

"ఏమోనమ్మా నాకు సందేహంగా వుంది."

"చూడూ! నీవే అట్లా అంటే పిల్లవాళ్ళ కెట్లా వుంటుంది చెప్పు" అన్నాడు బ్రహ్మారావు.

"నా కది నిజమనే తో స్తున్నది. దాని పెండ్లి చూచిపోవాలి. తప్పదు."

"అయితే ఆ పిల్ల నే పిలిచి అడుగు" అంటూ బయటికి లేచివెళ్ళాడు.

వచ్చింది సరళ. ఆమెను దగ్గిరికి లాక్కొని, "సరళా! చిన్నప్పటి నుండీ చాలా మంచి పిల్లవు. తల్లికోర్కె ఒకటి తీరుస్తావా?" అంది ఆశావహంగా.

"అది అడగాల్నామ్మా?"

"నీవు వివాహం చేసుకోవాలి తక్షణం. అది నా తుది కోర్కె."

గుండెల్లో బండ పడింది సరళకు. ఏమీ పలక్కుండా రాతిబొమ్మలాగా కూర్చుంది నిశ్చేష్టయై.

మళ్ళా సరస్వతమ్మ అంది: "నేను బ్రతకను సరళా. నీ పెళ్ళి చూచి పోవాలని వుంది."

"అమ్మా" అంటూ ఆమె పైనబడి యేడ్చింది సరళ.

ఏడుస్తూ, "అమ్మా' అదే కోరిక కోరావా కడపటికి!" అంది గాద్గదికంగా.

"అందులో తప్పేమిటమ్మా; అంతకంటే తల్లి కోరదగిన కోరికేమిటో చెప్పు."

"నీకు యీాడొచ్చింది."

"వస్తేమాత్రం, ఇంతలోనే చేసుకోవాలని లేదమ్మా."

"కాదు తల్లీ? ఆడపిల్లల్ని కనిపెంచినందుకు, వాళ్ళ ముద్దుముచ్చట్లు వాళ్ళ పెండ్లి ద్వారానే చూచి సంతోషిస్తారు తలిదండ్రులు."

"అది యే వెట్టికాలంలోనో! ఒకవేళ వెట్టి తల్లులుంటే యిపుడు గూడా అనుభవిస్తారేమో కాని, తండ్రు లనుభవించలేరమ్మా."

"యెందుకమ్మా? అందులోగూడా తేడా యేమిటి?"

ప్రపంచ జ్ఞానహీనతే లేదా!''

''వరకట్నాలు చెల్లించలేని తండ్రు లుంటారుగా!''

సరస్వతమ్మకు అంత పూర్తిగా కాకపోయినా కొంతవరకూ తెలుసు తన కుటుంబ పరిస్థితి. ఇల్లుదౌలా, పేరు దౌలేగాని, డబ్బు లేదని బాగా తెలుసు! బ్రహ్మారావు అంత బాగా సంపాదించే లాయరుగాదు. అబద్ధాలను సుబద్ధాలుగా చేసి, క్రిందుమీదులు చేసే అందరు లాయర్ల పంథాలో అతను నడవక పోబట్టే అతని కా దురవస్థ. పైగా మొగమాటమి! ఆదాయం తక్కువ. హోదా నిలుపుకొనేందుకు అప్పులు గూడా చేస్తున్నాడు. అందరూ అనుకుంటారు అతనికేం పెద్ద లాయరు అని. అటువంటి వాళ్ళ పైతళుకు చూచి ఎంత కట్నమైనా అడగవచ్చు ననుకుంటారు నవకాలపు ప్రబుద్ధులు.

మరునాడే భర్తను తొందరపెట్ట సాగింది సరస్వతమ్మ. త్వరగా యెవ ర్నన్నా తీసుకొచ్చి పెండ్లి చేస్తారా చెయ్యరా అని కూర్చుంది. 'సరే వెళ్తాను' అని మాట యివ్వందే మందు గూడా తాగలేదామె.

కాసేపు ఆలోచించి, ''చూడూ! పిల్ల కిష్టం లేదేమో!'' అన్నాడు.

''దాని కిష్టం లేదని మీ కెట్లా తెలుసు?''

''తెలుసు! దాని కిష్టం లేదు. దాన్నెందు కేడ్పించడం!''

''ఏడ్పించడమా! శుభం అంటూ పెండ్లి చేస్తూ వుంటే యేడ్పించడ మేమిటి? నాందిలోనే అశుభం పలుకుతా రెందుకు? చూస్తే మీకే యిష్టం లేనట్టుంది మధ్య! తక్షణం వెళ్ళి పిల్లవాణ్ణి చూచొస్తారా లేదా?'' అంది.

బయలుదేరాడు బ్రహ్మారావు. ఎక్కడికి? గమ్యం లేదు. ఇదివర కెపుడు గూడా సరళ వివాహ విషయం తలపెట్ట లేదతను. అందుచేత యెక్క డెక్కడ వరులు దొరుకుతారో తెలియదు. అయితే యెక్కడికి పోవడం? యెవర్తో మాట్లాడ్డం? కొంతమంది స్నేహితుల యిండ్లకు వెళ్ళాడు. వారు ప్రయత్నించగా తమకు అందని కొన్ని పోవిళ్లు చెప్పారు. బయలుదేరాడు సామర్లకోట. ఒక సుమారైన సంసారం! పిల్లవాడు కాస్త వయస్సులోనే

వున్నాడు. బాగానే వున్నాడు అయితే యితనో యస్. యస్. యల్. సి. చదువుతున్నాడు దండయాత్రలపైన. కనీసం అయిదు వేలిచ్చి కాలేజీ చదువు చెప్పించా లన్నాడు. సరే అని కాకినాడ కెళ్ళాడు. ఒకబ్బాయి బి. ఎ. చదువుతున్నాడు. వయసు చెల్లిన మనిషిలాగా కనిపిస్తాడు బక్క బక్కగా. నోటినిండా పండ్లు. ఉబ్బు కణతలు. చంపలపైన మాంసమే లేదు. వా డొక కారు, అయిదువేల రూపాయల రొఖ్ఖం అడిగాడు. బయలుదేరి, ఎవరో ఆచోకి యివ్వగా తిరిగి రాజమండ్రి కొచ్చాడు. ఒకబ్బాయి ఇంటర్‌మిడియట్‌తో పోట్లాడి పోట్లాడి, దాదాపు డజన్ యం. యస్. యం లు చూచిన తర్వాత కొత్తగా బి. ఎ. లో చేరాడు. మొగం చూస్తేనే మంచి రౌడీ అనుకోవచ్చు. అక్కడ చదివే ఆడపిల్లల కంతా నామకరణ కర్త వీడే. వీడి లఘువ్యాఖ్యానానికి గురికాని ఆడుపిల్ల ఆ కాలేజీలో ఆరేండ్ల నుండీ లేదు. మనిషిని చూస్తే లెక్చరరేమో అని భ్రమపడాల్సిందే. వాడు పదిహేనువేలు అక్కడ పెడితే చేసుకుంటా నన్నాడు పిల్ల యెట్లావున్నా. సరే! వీరేశలింగం హైస్కూల్లో ఒకాయన టీచరు. ఆయన యెనిమిది వేలు రొఖ్ఖమిచ్చి పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సు చదివించా లన్నాడు. తర్వాత విశాఖపట్నంలో యెవరో వున్నారంటే బయలుదేరాడు బ్రహ్మారావు. ఒక కొత్త లాయర్, ఒక కాలు చచ్చు, ఒరగబడి నడుస్తాడు. అతన్ని ఫారిన్ పంపితే చేసుకుంటాడట! తర్వాత గుంటూరిలోనే యెవరో ఒక ఆఫీసరున్నాడని ఎవరో పోవిడీ యివ్వగా బయలుదేరాడు. ఆయన ఒక తహసిల్‌దారు. రిటైరు అయ్యేస్థితిలో వున్నాడు. పండ్లు అన్నం నమలడానికి మాత్రం గట్టిగా వుంటాయి, దవడల క్రింద మాత్రం. మళ్ళీ పెండ్లి చేసుకోవాలనే అభిప్రాయంతో పండ్లు కట్టించుకున్నాడు. ఆయనకు రెండవ వివాహం కింద కావాలట. వంటచేసే దిక్కులేకనే వివాహమాడ దలచుకొన్నాడట! ఇంకా ఇట్లాంటివి చాలా చూచాడు. తల వాచిపోయింది బ్రహ్మారావుకు. ఆడపిల్లల తండ్రులు గోలపెడుతూ వుంటే ఆపు డపుడూ విన్నాడుగాని, వారెంత అనుభవంతో, ఆవేదనతో ఆ మాట అన్నారో ఇపుడు స్వానుభవంతో గ్రహించగలిగాడు. ప్రస్తుత యువకులపైన ఎంతో అసహ్యమేసింది బ్రహ్మారావుకు. ఆలోచిస్తూ యింటిముఖం పట్టాడు - దేశం ఎంతో

దౌర్భాగ్య స్థితిలోనికి దారితీస్తూవుంది? దేశాన్ని అభ్యుదయ ముఖమై నడిపించ వలసిన బాధ్యతగల నేటి విద్యార్థు లెంత పతనమయ్యారు! నైతికంగా వారెంత చ్యుతులయ్యారు! అభ్యుదయకర ఆదర్శాల నెంతగా విస్మరించారు! విద్య యొక్క పరమావధి యెడ యెంత విస్మృతులయ్యారు! ప్రతివాడికి యెంత ధనాశ! ఎంత గర్వం! ఎంత దర్పం! ఎందుకూ పనికిమాలిన వాడుగూడా తానొక గొప్ప ప్రయోజకుడ ననుకుంటున్నాడు! తనలో యెంత అధికృత లేందే యీ విధంగా పిల్లనిస్తామంటూ తిరుగుతారు అనుకుంటున్నాడు! ఏమిటి దీనికి కారణం? ఏమిటి దీనికి విరుగుడు? ఇంతకూ యింటికి వెళ్ళి భార్య కేమని చెప్పడం?-ఇట్లాంటి ఊహలతో ఇల్లుచేరాడు. సరస్వతమ్మ వేసిన ప్రశ్నకు జవాబు చెప్పలేకపోయాడు. ఆమె గోల యెక్కువ కాగా మళ్ళా బయలుదేరాడు. విజయనగరం, బొబ్బిలి, శ్రీకాకుళం, అన్నీ తిరిగి విశాఖ పట్టణం వచ్చాడు. అక్కణ్ణుంచి పెద్దాపురం వచ్చి యువకులా - వాళ్ళ తలి దండ్రులా - అంతులేని కోర్కెలు వినివిని విసిగి ఛీ! అనుకొని ఇంటిముఖం పట్టాడు.

రైలుబండి ఒక ప్రత్యేక ప్రపంచం అనాలి. ఒక క్షణంలో క్రొత్త! మరుక్షణంలో పాత! ఒక క్షణంలో విరోధం! మరుక్షణంలో స్నేహం! ఒక క్షణంలో మోహం, మరుక్షణంలో విరహం! ఇట్లాంటి చిత్రమంతా ఆ ప్రపంచంలో కనిపిస్తుంది. అంతా క్షణికమే. అందులో మూడవ తరగతి పెట్టెలకే ప్రత్యేకించి యీ ఉపమానం చెందుతుంది. మూడవతరగతి పెట్టె అంటే ప్రస్తుతం మన స్వరాజ్య మన్నమాట. ఇక ప్రత్యేకించి వర్ణించడం అనవసరం! క్రిక్కిరిసి వున్న పెట్టెలోకి ఒకడు ఎక్కబోతే, లోపలున్నవాడు వాణ్ణి తావులేదంటూ బయటికి తోస్తాడు. వాడు లోపలికి రావాలంటాడు! తన హక్కును గురించి కేకలు వేస్తాడు. ఎట్లాగో ఎక్కుతాడు. ఎక్కిన క్షణంలోనే వాడితో స్నేహం! తర్వాతి స్టేషనులో వీళ్ళిద్దరూ కలిసి అక్కడ యెక్కబోయే వాణ్ణి అడ్డుతారు. వాడూ దేవుడి దయవల్ల లోపలి కొస్తే మిత్రుడే అయిపోతాడు బ్రహ్మారావు ఎక్కబోతూ

వుంటే ఒక యువకుడు అట్లాగే తోసేశాడు. బ్రహ్మారావు వెట్లాగో ఎక్కి, వాడు నిలబడి వుండగానే వాడి శీట్లో కూర్చున్నాడు. కూర్చొని, తనవైపు 'నా శీటులో కూర్చున్నావే' అనే అర్థమిచ్చే చూపులు చూస్తున్న వాణ్ణి చూచి "ఈ శీటు తమ దనుకుంటాను. కూర్చోండి" అన్నాడు లేవబోయినట్లు నటిస్తూ. "అబ్బెబ్బే! అక్కర్లేదులెండి. నేను దిగుతాను దగ్గరలో. కూర్చోండి లేవకండి పెద్దవాళ్లు" అన్నాడు.

"ఎక్కడ దిగా లేమిటి?" అన్నాడు బ్రహ్మారావు.

"ఏలూరు."

"చదువుకుంటున్నారా?"

"అవునండీ, ఇంటరు అయిపోయింది. పైన చదవాలని వుంది గాని...."

"వివాహం చేసుకుంటే కట్నం దొరుకుతుందిగా;"

"అవును. అదే ఆలోచిస్తున్నాను. అస లందుకే! యింతవరకూ నెట్టుకొచ్చాను. కొన్ని సంబంధా లొచ్చా యిప్పటికే! అయితే యెగరగొట్టే శాను" అన్నాడు తేలిగ్గా.

"ఏమాత్రం అడిగా రేమిటి?" అన్నాడు బ్రహ్మారావు అక్కరలేని వాడులాగా.

"అయిదువేలు మొదలు యిరవై వేల వరకూ సాగింది, అప్పటికీ నే నొప్పుకోలేదు. యింకా యిస్తామంటూ వస్తారు. ఇంకా కొన్నాళ్ళుపోతే, రాకేం జేస్తారు? పిల్లల్ని చదివించారు. అంతకంటే యెక్కువ చదివిన వాళ్ళ కివ్వాలి. లేకపోతే మొగుడినెత్తి కెక్కి నాట్యం చెయ్యరూ యీ కాలప్పిల్లలు! అయినా ఈ కాలం చదువుకుంటున్న పిల్లల పెండ్లాడడమంటే భయంగా వుంటుందండీ" అన్నాడు ఆ చదవరి.

"అయితే గతశతాబ్దంలో పిల్లను చేసుకుంటావా నాయనా?"

"అదిగాదు సార్! ఈ కాలప్పిల్లల సరిగా చూళ్ళేదేమో మీరు! ఒక్కొక్క పిల్ల నలుగురు బిడ్డల తల్లిలాగా వుంటుంది. మరొక పిల్ల నలు

గుర్ని చాటుగా కన్నేసి వుంటుంది: ఇంకొక పిల్ల ఎందరెందరకో ప్రేమజాబులు వ్రాసుకుంటూ, కొందరితో మంతానాలు జరుపుతూ, కొందరిని వివాహ మాడాలనుకుంటూ, కొందరితో ప్రేమ వ్యాపారాలు సాగిస్తూ వుంటుంది: ఒకామె చీరకింద చాటుగా, గుట్టుగా బోదకాలు పెట్టుకొని వుంటుంది. ఒక పిల్ల ఒరగబడి నడుస్తూ వుంటుంది: మరొక పిల్ల ఎవడినో చేసుకొని వాడి జీవితం హతమార్చి వుంటుంది: ఏ పిల్లకు చూచినా, కాలు సరిగ్గావుంటే కండ్లు సరిగ్గా ఉండవు. అవి బాగా వుంటే నోరు బాగా ఉండదు. ఎన్నిరకాలు: ఇట్లాంటి వాళ్ళకు "పదివేలిస్తాం, ఇరవై వేలిస్తాం, యాభై వేలిస్తాం" అంటూ వస్తారు. అసలు ఈ కాలం పిల్లల్ను నమ్మలేం?"

"ఎందులో నమ్మకం:"

"వాళ్ళకు క్యారక్టర్ (Character) ఉండ దన్నానుగా:"

"అంటే యేమిటి నాయనా?

"వాళ్ళు చెడిపోయి ఉంటారని అర్థం."

"అంటే కుళ్ళిపోయి ఉంటారా?"

"కాదండీ మహాశయా, వ్యభిచార్లన్నమాట" అని గట్టిగా నవ్వాడు.

ఈ సంభాషణను జాగ్రత్తగా వింటూన్న మామూలు జనం "ఆ పిల్ల వాడు మాట్లాడింది నిజం" అంటూ బాగా నవ్వారు.

"అమ్మో, యీ కాలప్పిల్లలా?" అని దవడలు నొక్కుకుంటూ, తలలు వూచివూచీ నవ్వుకున్నారు భర్త మొగం చూడని ప్రతివ్రతలుగూడ.

బ్రహ్మారావు వాడి తెలివితక్కువతనానికి నవ్వుకున్నాడు. చదువు కుంటున్న ఆడపిల్లలంటే ఆ అవిద్యాపరులైన పల్లెటూరి జనంకంటే వీడికేమి మంచిభావాలు లేవనుకున్నాడు.

"అయితే అందరూ వ్యభిచారులే నన్నమాట?" అన్నాడు చిరునవ్వుతో.

"చాలా మటుకు."

"అయితే వాళ్ళను చెరిచినవారు కొంద రుండాలా?"

"అవునూ:"

"అయితే ఆ చెడ్డతనం, ఆ క్యారక్టరు, చెర్చిన వాళ్ళ కక్కర్లేదా?"
"ఎన్నన్నా ఆడపిల్లలకూ, మగపిల్లలకూ భేదం భేదా యేమిటి?"

"చెడడమూ, చెడకపోవటంలో - భేదాలేమిటి?"

ఈ వాక్యం సరిగ్గా అర్థంకా లేదతనికి. అర్థంచేసు కోవాలని తీవ్రంగా ఆలోచించి, బుర్ర పాడుచేసుకోవాలని గూడా అతనికి లేదు. ఊరికే వున్నాడు.

"నీ పేరేమి నాయనా?"

"పిచ్చయ్య."

అతన్ని గురించి ఇంకా కొన్ని విషయాలు తెలుసుకున్నాక నిశ్శబ్దంగా కూర్చున్నాడు బ్రహ్మారావు. తానేదో గొప్పగా ఉపన్యసిస్తూ గొప్పగొప్ప ఆశయాలను వెదజల్లినట్లుగా నీలుక్కొని నిలబడి, ఆడవాళ్లు కూర్చున్నవైపు చూస్తూన్నాడు పిచ్చయ్య. ప్రస్తుత సంఘంలో, బాలబాలికలను గురించి తనవలె క్షుణ్ణంగా అర్థం చేసుకున్నవాడు లేడనే తృప్తి అతనిలో జొర బడింది. బ్రహ్మారావు ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఎపుడూ తర్కంతో, హేతువులతో యోజించే బుర్ర, ఈ వివాహ విషయాల్లో ఏమీ పనిచెయ్య లేకపోతున్నది. తన మనసంతా విసుగనే వస్తు వొక్కటే నిండి నిబిడీ కృతమై ఉన్నది. ఏలూరులో బండి ఆగగానే, దిగి, పిచ్చయ్య యింటికే వెళ్లాడు. అదొక చిన్న పెంకుటిల్లు, పైనంతా బూజుపట్టి ఉంది. ఇంట్లో కుర్చీలుగానీ, బెంచీలుగాని, ఏమీలేవు. ఒక విధవ తల్లి మాత్రం ఉంది. ముఖ్యమైన పనిమీద వచ్చానని బ్రహ్మారావు చెప్పినందువల్ల కాస్త మర్యాద చేసింది, పెండ్లి సంబంధమేమోనని.

"ఏమండీ అబ్బాయి కిపుడే పెండ్లిచెయ్యరూ?" అన్నాడు బ్రహ్మా రావు. సంతోషంతో నోరంతా తెరిచి నవ్వింది పిచ్చయ్యతల్లి.

నవ్వుతూ, "నే ననుకుంటూనే వున్నాను ఇక పెళ్ళివాళ్లు వస్తారు అని. మీరు మొదటి వారయ్యారు" అంది. అది విన్న పిచ్చయ్య 'అరరె' అనుకుంటూ గ్రుడ్లు తేలావేశాడు.

"మరి చేస్తారా!" అన్నాడు బ్రహ్మారావు తల ఊపుతూనే.

"చేస్తామండీ."

"మరి, కట్నం పుచ్చుకొనే అలవాటుందా?"

"అబ్బే! మాకు లేదండీ! అయితే కాలంతోపాటు...."

"సరే, యేమాత్రం అడుగుతారు?"

"పిల్లెవరండీ, అంతా చెప్పండి."

బ్రహ్మారావు అంతా చెప్పాడు. ఆమె సంతోషించింది.

"కానీండి, ఇపుడే కానీండి. తొలిగా వచ్చిన సంబంధాన్ని తోసెయ్యగూడదంటారు. అయితే యెంతిస్తా మన్నారూ?"

"ఎంతో చెప్పండి."

"పదివేలిస్తారా?" అంటూ ఆయనవైపు చూచి- 'అరరె. ఇతను పెద్ద వకీలు గదా! బాగా సంపాదించి వుంటాడు. ఇంకా ఎక్కువ అడిగివుంటే బాగుండేది-' అనుకొంది.

"అంత యివ్వడానికి లేదండీ! ఒక రెండు వేలిస్తాను."

"ఏమండీ పిల్లవాళ్ళంత చౌకగా దొరుకుతారటండీ యీ కాలంలో! ఏమంటే నేనూ పూర్వకాలపు మనిషిని గనుక సంబంధం మంచిదని ఒప్పుకున్నాను. అందుకోసం చాలా తక్కువ అడిగాను. ఇదివరకే యెందరెందరో వచ్చారు. వీలుకాదని చెప్పాను. మొన్ననే పదివేలిస్తామంటూ ఒకాయనొచ్చాడు. మావాడు కానే కాదన్నాడు. అంతకంటే తక్కువ ఒప్పుకోడానికి మాకేం గ్రహచారమండీ? మా వాడు రత్నం లాంటి పిల్లవాడు. కాలు కుంటా? కన్ను గుడ్డా?"

"ఇపుడు మాత్రం నాకు తొందరేంటే అమ్మా" అన్నాడు పిచ్చయ్య.

"సరే కాస్త చూడాలిమరి! నేను గూడా మీ సంబంధం మంచిదనేగా?"

"పోనీ యెనిమిదివే లివ్వండి."

"కష్టకాలమండీ! పోనీ యింకొక వెయ్యి వేపిస్తాను."

"కానేకాదండీ, నిర్మొగమాటంగా మాట్లాడుతున్నానని ఏమీ అనుకోకండి. ఏదో చదువుకున్న పిల్ల గదా అని ముల్లాజాపడి అంత మాత్రమన్నా తగ్గించాను. యేమోలా ఇచ్చుకొన్నా ఏమంటావు?"

"అవునేమ్మా! బాగా చదివిన పిల్లనే నేనుగూడా ఒప్పుకున్నాను అయితే యిదేమిటి? నా కొచ్చిన తొందరేంటి? చూడండి మాష్టరుగారూ - నే నింకా రెండేండ్లు పెండ్లాడ దలచుకోలేదు," అంటూ లోపలికెళ్ళాడు.

"పోనీ ఇంకొక వెయ్యికి తగ్గుతాను; యేడువే లివ్వండి. ఆ పైన యింకేమీ మాట్లాడవద్దు. అలా అయితేనే చూడండి" అంది పిచ్చయ్య తల్లి.

"అంత నే నెట్లాగూ యిచ్చుకోలేనని చెప్పానుగా; ఏదో కాస్త చూడాలి" అన్నాడు బ్రహ్మారావు.

"చూడండీ వియ్యంకుడుగారూ. చదువుకొన్న పిల్లలు అత్తలు చెప్పి నట్లు వినరని నాకు తెలుసు; నేనూ చాలామంది చదువుకొన్న పిల్లలు టిప్ టాప్‌గా తిరుగుతూ, స్వతంత్రం స్వతంత్రం అంటూ అత్తల యేడ్పించడం చూశాను. ఏదో మీ వంశం మంచిదనీ. మీ పిల్లగుణాలు మంచివనీ తెగించి ఒప్పుకుంటున్నా."

ఇట్లా వాదప్రతివాదనలతో, ఒకరికొకరు తగ్గి మాట్లాడుతున్నట్లు నటించడంతో - బేరం జరిగి జరిగి, కడపటికి ఆరువేలకు తీర్మానమైంది. బయలు దేరబోతున్న బ్రహ్మారావును నిలిపి "ఏవండీ ఒక పిసరాగండి; మీరు సహం మొత్తం వివాహానికి ముందే యివ్వాలి. ఆ మిగిలిన సహం పెళ్ళిపీటలపైన్నే యిచ్చేసియ్యాలి. తప్పకండి సుమండీ; అంత్య నిష్ఠూరం కంటె ఆది నిష్ఠూరం మేలన్నారు పెద్దలు;" అని బాగా దీర్ఘాలుతీసి చెప్పింది.

అసంతృప్తితో; కాస్త వెగటుతో, బయట పడ్డాడు బ్రహ్మారావు. తిరిగి తిరిగి విసిగి వేసారి యిక ఏదో ఒకటి కుదుర్చాలనే ఉద్దేశ్యంతో యీ సంబంధాన్ని కుదిర్చాడు. ఏదో ఒకటి కుదుర్చుకోనిదే యింటికి పోవడానికి వీలులేకనే యీ పని చేశాడు. ప్రస్తుతం ఆడపిల్లల తండ్రులంతా ఒక పూర్వా చారాన్ని అనుసరిస్తూ. పాతనమ్మకాలకు దాసులైన యంత్రాలని స్వాను భవంతో గుర్తించాడు. ఇంటికి రాగానే రాజామణి ముందు సరస్వమ్మతో అంతా ఏకరువు పెట్టాడు. నెమ్మదిగా అంతా విని "కానీండి త్వరగా; దాని

రాత యెట్లావుంటే అట్లా అవుతుంది'' అందామె మెల్లగా. మళ్ళా యేదో తర్కించబోయాడు గాని బ్రహ్మారావు. ''తప్పదు'' అంటూ నోరు మూసేసింది.

కన్నీరు కారుస్తూ అంతా విన్నది సరళ. తండ్రి చెప్పే ధోరణి అతను పడ్డవెతలు అన్నీ అవగాహనం చేసుకుంది। బిగబట్టుకున్నా ఆగక దుఃఖం శబ్దం చేసుకుంటూ వచ్చింది బయటికి.

''ఎందు కేడుస్తావ్ సరళా?'' అంది సరస్వతమ్మ నెమ్మదిగా.

''నేను నీ కేం ద్రోహం చేశానమ్మా। పోతూపోతూ నన్నిట్లా చేసి పోతావెందుకు?'' అని యింకా గట్టిగా యేడుస్తూ అమ్మపై పడింది.

''నిన్ను అన్యాయం చెయ్యాలనా సరళా?''

''భావ మది కాకపోవచ్చు. అయితే జరుగుతున్నది అన్యాయమే.''

''అట్లాగే వుంటుంది. ఏదో కొత్త జీవితాన్ని స్వీకరించేటప్పుడిట్లాగే వుంటుంది. ఇట్లాంటి మాటలు చాలామంది పిల్లలు అనడం అనాదిగా వస్తున్న ఆచారమే. ఏ సంబంధంతోనూ తృప్తి వుండదు. అసంతృప్తి భావంతో ఇంకొకణ్ణి చేసుకున్నా, వారనుకున్న విధంగా జీవితం జరగకపోగా అపుడు అనుకుంటారు, ఆ ముందువాణ్ణే చేసుకోనుంటే బాగుండేదేమోనని। ఆ భావానికి అవధిలేదు. ఏదో ఒక మోస్తరుగా ఎగదోసుకపోవాల్సిందే.

''కొంత వరకన్నా యిష్టముంటే గదమ్మా దిద్దుకుపోవడానికి।''

''దాందే ముందమ్మా? యిష్టం తర్వాత మాత్రం కలుగగూడదూ?

''ఒక సారన్నా చూడందే యెట్లామ్మా।''

''చూడడం. పరీక్షించడం వీటిల్లో నాకేమీ నమ్మకం లేదు సరళా। ఏమని చూస్తావు? ఎంతని చూస్తావు। పరీక్షకు కూర్చుంటే బలవంతంగానైనా నటిస్తారు. వారి హృదయంలోది బయటికి పడనీరు, వాళ్ళల్లో లోపాలుంటే ఇతర్లుగూడా చెప్పరు. వివాహ విషయాల్లో నూలు అబద్ధాలయినా చెప్పవచ్చు ననే నమ్మకాన్ని ఏ ధూర్తుడు కల్పించాడోగాని. తప్పుడు వాళ్ళనుగూడా మంచి వాళ్ళకింద కట్టేసి చెప్పుతారు। ఇక నీవు పరీక్షించేదేమిటి చెప్పు.

అట్లా పరీక్షకు కూర్చుంటే పెండ్లే కాదు. ఏదో విధికి వదిలి వెయ్యాల్సిందే'' అంటూ ఆయాసంగా కన్నుమూసింది. ఆమె మాటలు నెవరూ కాదని మాట్లాడలేదు. సరళ నిశ్చేష్టయై కూర్చుంది లోలోపల దుఃఖిస్తూ. తన పరిస్థితి అడక త్తెరలోకి వక్కయి కూర్చుంది! తన మనసులో వున్న వ్యక్తిని బయట పెట్టలేదు. అది బయట పడితే వినే వాళ్ళకు ఎంతో అన్యాయంగా కనిపిస్తుంది! ఒక్కమాటుగా తన మొగాన ఉమ్మేస్తారు. అసహ్యాన్ని మించిన కోపంతో తన్న వచ్చుగూడా!

ఏలూరికి తంతివార్త వెళ్ళింది. తర్వాత మురళిని వెళ్ళి చూచి రమ్మన్నారు. రాజామణి క్రిష్ణయ్య మరొకరితో మురళి బయలుదేరాడు. వీళ్ళ అట్టహాసం చూచి పిచ్చయ్య కాస్త గాభరాపడ్డాడు. పరిస్థితులు చూచి పెదవి విరిచి, రహస్యంగా ఒక కన్నీటి బొట్టుగూడా రాల్చాడు మురళి. అందరూ భోం చేసినాక. "మీ పేరేమిటి?'' అన్నాడు క్రిష్ణయ్య.

"పిచ్చయ్య.''

మురళికి నవ్వు వచ్చింది కాని ఆపుకున్నాడు.

"ఆమెవరు?'' అన్నాడు పిచ్చయ్య.

"మా అత్తయ్య.''

"ఇతను?''

"పేరు క్రిష్ణయ్య, మా అక్కకు క్లాసుమేటు.''

ఆ మాట వినగానే కొద్దిగా చకితుడయ్యాడు పిచ్చయ్య. ఆడపిల్లల క్లాసుమేటు అంటే అతనికి చెడ్డ అనుమానం. అందులో యితను గొప్ప ఆస్తిపరుడులాగా పెండ్లి విషయాల్లో గూడ జోక్యం కలుగజేసుకుంటున్నాడు! యేమిటీ సంబంధం? - ఇట్లా లోలోపల యిజాగులాడుతూ "అయితే మీకు బంధువవుతాడా?'' అన్నాడు.

"కాదు. అయితే మంచి స్నేహం! కుటుంబ స్నేహం లెండి! అన్నదమ్ముల మాదిరిగా మెలుగుతూ వుంటాం'' అన్నాడు మురళి వాడి అనుమానాన్ని కాస్త పసికట్టి.

బతికాన్రా దేవుడా అనుకున్నాడు పిచ్చయ్య.

పెండ్లిప్రయత్నాలు యేలూరులోనూ, బెజవాడలోనూ, చురుగ్గా జరుగుతున్నాయి. సరళ యిదివర కున్నంత సంతోషాన్ని ప్రకటించడం లేదిపుడు. మొగం దిగేసుకొని ఏ మూలో కూర్చొని ఆలోచనా సముద్రంలో మునిగి వుంటుంది. ఒక్కొక్కసారి కన్నీరుకారుతూ వుందన్న ధ్యాసగూడా వుండదు, అన్నం సరిగ్గా తినదు. ఎవర్తోనూ మాట్లాడదు. ఎవరైనా ఓదార్చడానికి మాత్రం వస్తే దుఃఖం ఇంకా ఎక్కువయ్యేది.

మురళి తిరిగివచ్చి అక్కడి విషయాలను అసహ్య భావంతో వివరించిన నాటిరాత్రి నిద్ర పట్టలేదు సరళకు, జవాబు దొరకని సమస్యలు తీవ్రంగా ఉప్పతిల్లుతున్నాయి మెదడులో. ఈ జీవితాన్ని ఇంతటితో అంతమొందించుకుంటే యెంత బాగుంటుంది! ఛీ! ప్రియుడికోసమన్నా బ్రదకాలి! అయితే ప్రయోజనం? ఎవడికో భార్యగావుండి ఎవడిపైనో మమత కలిగి వున్నందువల్ల ఫలితం? వ్యభిచారమా? ఛీ! ఛీ!—బయలుదేరింది సరళ. అప్పటికి తెల్లవారురూము నాలుగయి వుంటుంది! నేరుగా మురళి గదిలోకి వెళ్ళింది, లైటు వేసింది! వాడి ప్రక్కలో కూర్చుంది. ఆమె హృదయంలో ప్రళయం ప్రజ్వరిల్లుతూ వుంటే — ఎంత ప్రశాంతంగా నిద్రపోతున్నాడు! తన రాగ ద్వేషాదుల కతను భాగస్వామి అయితే గదా ఏదైనా పంచుకుంటాడు!-తిన్నగా వంగింది ఆ నుదుటిపైన అదే స్థలంలో ముద్దు పెట్టింది భారాన్ని తొలగించి వేసుకుంటున్నట్టుగా, పెదవు లట్లాగే వుంచి స్మారకం లేనట్లు పడిపోయింది వాడిపైన. చెంపలపై పడిన కన్నీటి స్పర్శకు మేలుకున్నాడు మురళి. అక్క వాడిపైన పడివుంది 'అక్కా'అంటూ లేపాడు. నీరసంగా, దీనంగా చూచింది వానివైపు. ఎంత బలహీనంగా వుంది! ఎంత నిస్పృహచెంది వుంది! ఎంత నిరాశను వెదజల్లుతున్నా యా దృక్కులు! ఎఱ్ఱగా చింతనిప్పుల్లాగా మెరుస్తున్న ఆమె కండ్లను చూచి దుఃఖం వచ్చింది మురళికి.

కన్నీరు కారుస్తూ "అక్కా! ఎందు కిట్లా తయారవుతున్నావ్?" అన్నాడు సానుభూతితో.

హృదయంలో కతుక్కు మనగా ఏమీ పలక్కుండా చల్లగా లేచి పోయింది సరళ.

వివాహం అయిపోయింది. కారణకర్త సరస్వతమ్మ చెల్లిపోయింది. సరళ యేలూరు వెళ్ళిపోయింది. యిల్లుచేరగానే అత్త యెదురుగా వచ్చి "నా యింటికి అందాలరాణి వచ్చిందమ్మా! భాగ్యలక్ష్మి వచ్చింది!" అని రెండు హస్తాలూ రెండు కణతలపైనా పెట్టి మెటికలు విరుచుకొంది. రెన్నాళ్ళు గడిచాయి. పిచ్చయ్య యేమి టేమిటో మాట్లాడుక పోసాగాడు. తన హైస్కూలు విద్యను గురించీ - తన చురుకుదనాన్ని గురించీ - దాన్ని విస్మరించి అయ్యవార్లు తనకు మంచి మార్కులు యివ్వకపోవడం గురించీ - కాలేజీ జీవితాన్ని గురించీ - తన నెంతమంది ప్రేమించిందీ - ఎంతమంది చేసికొమ్మని బాధపెట్టిందీ - ఎంతమంది యెన్నెన్ని వేలు యిస్తామని చెప్పిందీ - అంతా చెప్పి, కడకు, "కడపటికి నీ అదృష్టంలో యిరుక్కున్నా సరళా!" అన్నాడు.

"నా అదృష్టం కాకపోతే మరేమిటి?" అంది సరళ హేళనగా హసించి. అది గ్రహించలేదు పిచ్చయ్య. నిజమే కాబోలనుకొని, తంద నాలు పలికి తైతక్కలాడాడు.

"ఇక యేం చదవమంటావు సరళా! అర్ధాంగి అంగీకారంతోనే ఏద యినా చేయాలంటారు పెద్దలు. నీ యిష్ట ప్రకారం పోవాలి. ఇంజనీరింగు చదవమంటావా? డాక్టరు కోర్సు చదవమంటావా? లేకపోతే అమాంతంగా ఉత్తరహిందూస్థానమెళ్ళి నాలుగేండ్లలో M. A. L. L. B. చదివి వచ్చి ప్రాక్టీసు పెట్టమంటావా? చూడు సరళా! ఒక పెద్ద లాయరై ఒక పెద్దకారు కొని, నీవూ నేనూ కార్లో కూర్చొని తమాషాగా పోతూంటే........"

"ఓ? దానికేం? దివ్యంగా వుంటుంది!" అంది సరళ.

కోతికి సారాయి పోసినట్టయింది ఆ ప్రోత్సహిత పదం వినేటప్పటికి! మళ్ళా యెత్తుకున్నాడు:

"తర్వాత బాగా డబ్బుగడించి యం. యల్. ఎ. అయిపోతే, మిని

ష్టరుగూడా కావచ్చు సరళా! కొంచెం, కాస్త పనిచేస్తే సరి! అజ్ఞానపు జనం! ఓట్లిస్తారుగా! ఎన్నిక గ్యారంటీ. అల్లాకాదులే. మొదట మ్యునిసిపల్ కౌన్సిలర్ అయితే సరి! చిన్నగా చైర్‌మన్ అయిన తర్వాత కాస్త పలుకుబడి హెచ్చుతుంది. మనకంటే మించి చదువుకున్నవా డెవడుంటాడు! మన తెలివిని బాగా ప్రదర్శిస్తే సరి! ఆ పలుకుబడితో జిల్లాబోర్డు ప్రెసిడెంటు కావచ్చు. ఇక పలుకుబడి చెప్పాలా? నీకూ యెంత పలుకుబడి వుంటుందనుకున్నావ్? ప్రెసిడెంటుగారి భార్య అని అన్ని మీటింగులకూ పిలుస్తారు! ప్రతి స్కూలు వార్షికోత్సవాలకు నిన్ను పిలిచి బహుమాన ప్రదానం గావించమంటారు! అపుడు నీ ప్రక్కలో కూర్చున్న నన్ను చూస్తూ సగర్వంగా బహుమతు లిస్తావు! అబ్బా! అవన్నీ అనుకుంటూ వుంటే యెంత బాగుంటుందే! చూశావూ? ఆ పలుకుబడితో - అంటే కాస్త బీదవాళ్ళకు మేలుచేసినట్లు నటించాలి, అంటే అది చేస్తాం, ఇది చేస్తాం, అని పథకాలు వేస్తేచాలు! ఏదో చేస్తార్రాబ్బా అని తృప్తిపడుతూ మూఢప్రజ బ్రహ్మరథం పడుతుంది, మనకు యం. యల్. ఎ. కావడానికి క్షణం [illegible] చిన్నగా ఒక గ్రూపు తయారు చేసుకుంటే సరి! [illegible] యం. యల్. ఏలు ఎంతోమంది వుంటారుగా [illegible]వాళ్ళందర్నీ కాస్త వల[illegible]కొని ఒక గ్రూపు తయారు చేసుకుంటే వి[illegible] పదవి గ్యారంటీ! ఇక [illegible]న్నీ మనచేతిలోనే! ఊరికేనే పర్య[illegible] వేసుకొని, వేలకువేలు దారి [illegible] కింద లాగవచ్చు, మన మెప్పుడు[illegible]స్టుక్లాసులో తిరగవచ్చు. అప్పు[illegible]పుడూ విమానంలో గూడా.........[illegible]టే సరళా కన్నీళ్ళు!''

''అబ్బే! ఆనంద[illegible]ష్పాలు!''

''అబ్బా! సరళా! అం[illegible] ఊహా[illegible]ందుక వె[illegible]తున్నావటే! నాకంటే వేగంగా ఊహించే దానివిలా వున్నావే! చూడు సరళా! అపుడు మనం మూడంతస్తుల అద్దాలమేడలో మెత్తని కుషన్ పరుపులపైన హాయిగా పడుకొనివుంటే, క్షణ క్షణం యెవడో ఒకడొచ్చి మినిష్టర్‌గా రున్నారా అంటే, లేరని ఒకసారి - నిద్రపోతున్నారని ఒకసారి - స్నానం చేస్తున్నారని ఒక

సారీ - ఇపుడే భోజనానికి కూర్చున్నారని ఒకసారీ - చెప్పుతూ 'ఒక క్షణం గూడా విశ్రాంతి తీసుకోనివ్వ రాయన్ని - ఎపుడూ ఏదో మిన్నువిరిగి పడిం దంటూ దండొచ్చిన ట్లొస్తూ వుంటారు' అని అంటావు గదూ! పెద్దపనిమీద యెవరన్నా వస్తే, నావల్ల కానేకాదబ్బా అని నేనంటే - మీవల్ల కాకపోతే మరెవరివల్ల అవుతుందండీ అని నా దగ్గర అని - నీ దగ్గరికొచ్చి వాళ్ళు సద్దు గాకుండా, రూపాయల నోట్ల కట్టలు నీచేతిలో పెడితే-"ఇదేంటండీ మీబోటి వారే యిట్లా చేస్తే యెట్లా, ఆయనకు నే చెప్పలేను. నాపైన కోప్పడతారు. తన విషయాల్లో జోక్యం కలిగించుకోవద్దన్నారు" అని అంటూ వాళ్ళు ప్రతిమ లాడగా 'సరే చూస్తాను' అంటూ నాదగ్గిరికి ఏకాంతంగా వచ్చి నా గడ్డం పట్టు కొని,—'చూడండీ! పోనీండి పాపం, ఈపని కాస్త చేసిపెట్టండి' అని అంటావు గదూ! అబ్బా! అపుడు నీకెంత గౌరవం అనుకున్నావ్? మంత్రి గారి భార్య! మంత్రిగారి భార్య! దేనికి గూడా మంత్రిగారి భార్యే! ఏ మీటిం గొచ్చినా నీవూ నేనే! కాలేజీ ఆడపిల్లల సభలో మాట్లాడ్డానికి నీవే, సాంస్కృ తిక సభల్లో నీవే! నవ్యసాహిత్య పరిషత్తువారి సభల్లో నీవే! ఆంధ్రమహిళా సభల్లో నీవే....అయితే ఒక విషయం సరళా! లంచం అంత ఇదిగా తీగూడ దని అంటావేమో! లేకపోతే వీలులేదు! మళ్ళావచ్చే యెన్నికలలో మనం వస్తామన్న గ్యారంటీ యేమిటి? అంచేత గాలి తోలేటప్పుడే తూర్పెత్తాలి, ప్రజాసేవ, సత్యం, అహింస, అనికూర్చుంటే మనకు మిగిలేది గుండుసున్నే... అయితే...." అంటూ యిటుతిరిగిచూచి, "ఓసి మొద్దుదానా! నిద్రబోతు న్నావా!" అని ప్రక్కలో ఒరిగి కాసేపట్లో తానూ నిద్రపోయాడు పిచ్చయ్య.

మరునాడు:

"చేతులు మంటలని కూర్చుంటే యెలా అవుతుందే? యెవరు చేస్తా రనుకున్నావ్? ఇంకా నేనే చెయ్యాలా? నా కెందుకు! నా కొడుకును పెద్ద వాణ్ణి చేశాను. ఒక యింటివాణ్ణి చేశాను. రాణిలాగా కూర్చుంటాను. చేసి పెట్టాల్సిందే నీవు. అయినా! అంత తక్కువ తీసుకొన్నాంగదా, అంత మాత్రమన్నా నీకు తెలివిలేకపోతే యెల్లా? బంగారం వంటి నా కొడుక్కు మాణిక్యంలాంటి పిల్లల్నిస్తామని ఎందరెందరో. ఎంతెంతో-యిస్తామని వస్తే

అన్నీ పోగొట్టుకొని, కడపటికి యీ పనికిమాలిన దాన్ని చేసుకున్నాం....మరీ యీ చదువుకున్న పిల్లలెందుకూ పనికిరారు. కబుర్లు చెబుతూ మగళ్ళ పక్కల్లో పడుకోమంటే రెడీ అంటారు. థూ! థూ! పనికిమాలిన బేరం...." అని పిచ్చయ్య తల్లి సాధిస్తూ వుండగా పిచ్చయ్య యెక్కణ్ణించో వూడిపడి,

"యేంటే అమ్మా అప్పుడే రొదరొద!" అన్నాడు.

"యేముందిరా పిచ్చీ! నీలాంటి కొడుకును కన్నందుకు నే నింకన్నా సుఖపడొద్దుట్రా!"

"అవునేమ్మా! నీకేంటే లోటు? రాణిలాగా పడుకో!'"

"పడుకొన్నట్లే ఉంది నీ పెళ్ళాం కత సూస్తే."

పిచ్చయ్యకు మాతృభక్త్యావేశం ప్రజ్వలించి, కర్తవ్యం మెదళ్లో దూరగా, "ఏయ్ సరళా! ముసలామె నాకు దైవము! నీకు భర్త దైవము! దైవము తల్లి ఏం కావాలి?" అన్నా డామె నుద్దేశించి.

"దేవమాత!" అంది సరళ.

"ఆ! అలా అను. చూదేమ్మా! తెలివైన పిల్లేనే యిది! నీవంటే యెంత భక్తో చూడే పాపం! సరేగాని సరళా! పనెందుకు చెయ్యలేదే?"

"చేతులు మంటలుగా ఉన్నాయి!"

"అవ్వన్నీ చాలించు! మనదగ్గ రాపప్పుడకదు! అదిమాత్రం బాగా తెలుసుకో! ఎంత షావుకారి కూతురి వైతేమాత్రం యింట్లోపని చేసుకో లేవూ? అయితే పగలల్లా పనిచేసే బీదవాళ్లు నీమాదిరి పుట్టలేదు గాబోలు! మనకు డెమోక్రసీ కావాలి. అంతా ఒకటే మాలా మాదిగా బీదా బిక్కా, చిన్నా పెద్దా - అంతా ఒకటే. ఏమీ భేదం లేదు. అందరూ పనిచెయ్యాల్సిందే."

"తప్పక చెయ్యాల్సిందే! ధనవంతులకేం కొమ్ము లొచ్చాయా?" అంది సరళ.

"చూదే అమ్మా! నే చెప్పలేదటే - చాలా తెలివైందే పాపం! తెలివిలో నాకేమీ తీసిపోదే!....చేస్తుందిలే. నీవు వెళ్లి ఆ మంచంపైన పడుకో పో!....ఏమే! ఆ మంచంపైన పరిచావా? పరుపేసిరా పో!" అని ఆదేశించాడు సరళకు.

వెళ్లి పరుపువేసింది సరళ, పిచ్చయ్యతల్లి పడుకుంది దర్జాగా.

"ఆఁ, అదీ! నీకు తీరికవుంటే ఆమెకాళ్లు గూడా పట్టాలి!....మరి, ఆ పనేదో చూడు."

సరళ పెరట్లో కొచ్చింది. పిచ్చయ్య వెంట వచ్చాడు. ఎట్టిగా కమిలి పోయిన తన చేతులను సరళ చూపించింది.

కండ్లు పెద్దవిచేసి చూచి, "అయ్యో! అలా అయ్యా యెందుకే పాపం!" అంటూ ఆమె చేతులు తన చెంపలకేసి వొత్తి గిన్నెలూ, చెంబులూ తోముతూ కూర్చున్నాడు. తోముతూ "సరళా! చదువుకున్న కుటుంబం యింతే! భార్యకు భర్త భర్తకు భార్యా, అన్నిట్లోనూ సాయపడుతూవుంటారు." అని అంటూాండగా తల్లి లేచివచ్చింది.

దూరాన్నుంచే చేతులు పైకెత్తి, "అయ్యో, అయ్యో! ఇదేమిట్రా అంట్లవెధవా? దాన్ని గుడ్లగూబలా అక్కడ నుంచోబెట్టి, నువ్వు తోము తున్నావేమిట్రా! నీకేం శనికాలంరా? నీకేం పాడుకాలంరా; లేరా దరిద్ర పీనుగా" అంది.

"ఉండే అమ్మా! అదంతా మీ కాలంలో!మా కాలం వేరు!మీ కాలంలో మాదిరి భార్యంటే బానిసనుకున్నావా? కాదు. అన్నిట్లోనో సహం పంచుకో దగిందన్నమాట! అందుకే నేను సహం పంచుకుంటున్నా."

"ఇదేవిట్రా నీ మొహం మాడా! ఇలా చేస్తే అది నీనెత్తి కెక్కదుట్రా?"

"నెత్తేంటే నీ మొహం! అది నీలాంటి దనుకున్నావా?"

"నేనేనంట్రా అల్లాంటిదాన్ని! నన్నంటావట్రా! నీ జిమ్మడా! నీశ్రార్థం పెట్టా!" తోముతూ వున్న చెంబు లాక్కొని వీపుమీద కొట్టింది.

"ఓయ్, ఓయ్!" అంటూ పెరడంతా చిందులు తొక్కుతున్నాడు పిచ్చయ్య. తిడుతూ వెంటపడింది వాళ్లమ్మ. కేకలేస్తూ, ఎగుర్తూ, పరుగెత్తు తున్నాడు పిచ్చయ్య అటూ ఇటూ. సరళకు నవ్వు వచ్చింది. లోపలికొచ్చి యేడుస్తూ కూర్చొంది.

పిచ్చయ్యను ఆడించడం సరళకు కాస్త సరదాగానే వుండేది. గాని, అసహ్యం, దుఃఖం, నానాటికీ పెరగడం మొదలుపెట్టాయి. ఆ అత్తతో ఒకటే పోరు! ఆమె యెపుడూ రుసరుసలాడుతూ ఉంటుంది. అధికారాన్ని ప్రదర్శిస్తూ పోట్లాడుతూ వుంటుంది. ఆమె ముందు కూర్చుంటే ఒక తప్పు: లేస్తే ఒక తప్పు! మాట్లాడితే ఒక తప్పు! ఇలాజరుగుతూ వుంది.

సరళ ప్రతిరోజూ పిచ్చయ్య గదిలోకి పడుకోడానికి వచ్చినపుడు వాణ్ణి కాస్త రెచ్చగొట్టి, ఏదేదో వాగుతూవుంటే నిద్రపోయేది. తర్వాత వాడూ నిద్రపోయేవాడు. ఒక్కొక్కసారి లేపేవాడు. ఏదో సాకు చెప్పి పడుకో మనేది. ఒకనాడు వాడు బలవంతం చేశాడు. ఆమె కానాడు తప్పించుకోడానికి మార్గం దొరకలేదు. ఏదో వద్దని బ్రతిమాలింది. ఎందుకు? అని ప్రశ్న వేశాడు. వొంట్లో అంత బాగాలేదు'' అంది. ''ఎందుకు బాగులేదు'' అని ఎదురు ప్రశ్న వేశాడు. ''నీ మొగంచూచి'' అంది వెగటుగా, ఆమె కింకేమీ తోచక విసుగేసి దానికి వాడు పెద్ద గోలచేశాడు. అమ్మగూడా కలుసుకుంది. రాసా తాగిన కోతికి తేలుకుట్టినట్లు కాగా, బాగా చిందులు తొక్కాడు.

ఇంతలో వాళ్లమ్మ అంది! ''మొన్న రాత్రి యెవర్నో కలవరించిందిరా యిది'' అని!

''ఆఁ ఆఁ ఎవర్ని అదే! అదే! ఇపుడు తెలిసిం దిదెందుకు ఇట్టా ఆడుతున్నదో'' అన్నాడు ఎగిరిపడి గుడ్లు పెద్దవిచేస్తూ. సరళ ఊరికే కూర్చుంది తలవంచుకొని.

ఆమె జడపట్టి తల పైకెత్తి, ''చెప్పు! ఆ గాడ్దికొడు కెవడో చెప్పు. నిన్నూ వాణ్ణీ నరికి అంటగట్టి కాల్చేస్తా! బూడిదచేసి నీళ్లల్లో కలిపి తాగుతా!'' అన్నాడు.

''కలవరించింది జ్ఞాపకముంటుందా?'' అంది సరళ చల్లగా.

పిచ్చయ్య యింకా మండిపడి, ''ఎందుకుండదూ! అసలు పురుషుడేగా కలలో కొచ్చేది'' అన్నాడు.

''ఏమిటా పిచ్చికూతలు,'' అంది సరళ కాస్త కోపం నటించి.

"పిచ్చా! నీవూ అంటావా? వూళ్లో వెధవాయిలంతా అంటే నీవూ అంటావా? చూడు నా తడకా!"

"ఏంటా పిచ్చివాగుడూ, నువ్వూ" అంది సరళ కను బొమలెత్తి. శివం హెచ్చింది పిచ్చయ్యకు; అగ్గి దొక్కినట్టయింది. వళ్ళుతెలీకుండా అయి పోయింది.

"మర్యాద యిచ్చేకొద్దీ నెత్తికెక్కుతావా లంజా! మీ స్త్రీ జాతంతా యింతే! యెవరే కట్టుకున్న మొగుడికి సరిగ్గా సంసారం చేసింది?" అన్నాడు.

"ఎవరూ లేదూ! పోనీ మీ అమ్మయినా లేదూ?"

పిచ్చయ్య తెల్లబోయి అట్లా చూస్తూండగా, "చూశావా వొరే, రంకు మొగళ్ళ కలవరించే లంజ యేమంటుందో! ఇటువంటి సమయాల్లో అంతా మీ నాయన జ్ఞాపకంవచ్చి నేను యేడుస్తూ వుంటే నన్ను రంగంలోకి యీడుస్తూ వుంది! మనమంటే దీనికెంత చులకనరా!" అంటూ వలవల యేడ్చింది పిచ్చయ్య తల్లి, పిచ్చయ్యను పట్టడానికి వీలులేకుండాపోయింది. అక్కడున్న పీటకోడు తీసుకొని సరళ వీపుపైన బాది "చెప్పు వాడి పేరు! నామరూపాలు లేకుండా చేస్తా" అన్నాడు పండ్లుకొరికి.

"ఎవడో ...ధర్‌గాడట్రా" అంది పిచ్చయ్య తల్లి.

"మా మురళీధర్‌ను కలవరించినా తప్పే" అంది సరళ మూలుగుతూ.

"ఆఁ మురళీధరా?" అంటూ అటు తిరిగి, ఆ పీటకోడుతో వాళ్ళమ్మను రెండు చటచి "ఊరికే పసిపిల్లను కొట్టిస్తివిగదే గయ్యాళిగంపా!" అంటూ యేడుపు మొగంతో మంచంపై కూర్చొని "సరళా క్షమించవూ?" అంటూ గడ్డం పట్టుకున్నాడు పిచ్చయ్య.

సరళ తీవ్రంగా ఆలోచిస్తూ కూర్చుంది. తన జీవితం ఎటువంటి నాటకంగా పరిణమించింది! ఈ విధంగా అవుతుందని ఎవరన్నా ఏనాడన్నా కలగన్నారా? బాగుపడుతుందన్న ఆశగూడా లేనిస్థితిలో వుంది తన స్థితి. పోతూపోతూ తల్లి చేసిన చలువ యిది! ఎన్నిసార్లో తల్లిమీద కోప్పడింది మనసులో! మళ్ళా తానే సమాధానం చెప్పుకుంది. 'తల్లిమాత్రం యిటు

వంటివాడు దొరికి యిట్లా కష్టాలు పడతానని ఊహించిందా?' తాను మాత్రం తెలిసి కావాలని చేసిందా! అంతా విధి' ఇట్లా ఆలోచిస్తూ కూర్చుంది. తప్పించు కోడానికి ఉపాయం యెట్లాగా, అని తీవ్రంగా ఆలోచిస్తూ, వుంది. ప్రక్కన కూర్చున్న పిచ్చయ్య కన్నీరు కారుస్తూ "సరళా!" అన్నాడు ఆమె కాళ్లు తాకి మొగంలోకి చూస్తూ. వానివైపు తిరిగింది సజల నేత్రాలతో.

"చూడూ! క్షమించవూ" అన్నాడు దీనంగా.

"సరేగాని కొన్నాళ్లు నా జోలికి రాకుంటే క్షమిస్తాను."

"కొన్నాళ్లు గాదు. కొన్ని నెలలైనా వుంటాను" అన్నాడావేశంతో. పరవాలేదనుకుంది కాని నమ్మకం యేమిటి ఆ కోతి మాటలపైన!

"చూడూ! మా వూరికి వెళ్ళొద్దామా ఒకసారి!" అంది.

"మరి కాలేజో!"

"నా నాళ్ళకేం?"

"ఒక నెల వుండు! దసరా సెలవుల్లో వెళ్దాం" అన్నాడు.

# 7

ప్రతి దినమూ కాలేజీ అయిపోగానే క్రిష్ణయ్య, మురళి, కలిసి గుడిసెలకు వెళ్ళేవారు, లక్ష్మి సీతలకు చదువు చెప్పేవారు. లక్ష్మిగూడా సరిగ్గా 5 గంటల కింటికొచ్చేది. ఏడు గంటలవరకూ చదువు. తర్వాత వంటచేసుకోడం కొన్ని దినాలు గడిచాక, లక్ష్మికూడా కూలిపనులు చాలించి చాపలల్లుతూ కూర్చుంది; ఇద్దరూ కాసేపు అల్లుకొనేవారు. కాసేపు చదువుకొనేవారు. అన్ని చింతలు పెట్టుకోగూడదని ఒకరికొకరు ప్రమాణాలు చేసుకున్నారు.

వీళ్ళ వ్యవహారం గుడిసెల్లో వాళ్ళకు వెగటుగా వుండేది చాలా దినాలనుండి. అక్కా చెల్లెళ్ళు కలిసి బయట తిరగడం, మురళీ సత్యారావులతో కలుసుకోడం, వాళ్ళు ఇక్కడికి రావడం, ఇటీవల క్రిష్ణయ్యగూడా రావటం, ఇదంతా చూచి వీళ్లు వ్యభిచరిస్తున్నారని వాళ్ళంతా అనుమానపడ్డారు. వీళ్ళ

పైన ఒక విధమగు ఈర్ష్య, ఉదాసీనభావం కలిగాయి. ఏదో ఒక చోట కూడినపుడు ఊళ్ళోని నలుగు రాడవాళ్ళ విషయమూ విమర్శించి వెళ్ళి పోతారు యువకబృందం. మరి ఆడవా ళ్ళంత మాత్రాన తృప్తి పడరు నీళ్ళబావుల దగ్గరా, కొళాయీల దగ్గరా, తమ తమ విషయాలు విస్మరించి, ఇతరుల విమర్శించడమే కాకుండా. కనబడినపుడు, చాటుగానో, సూటిగానో అనేస్తూ వుంటారు. ఒకనాడొకామె అంది:-"ఏమమ్మా! ఒకవేళ అడిగే దిక్కులేరని, మీ యిష్టం వచ్చినట్లు అంత విచ్చలవిడిగా తిరగాల్నా" అని. ఇంకా కొందరమ్మలు అదే అన్నారు. సరైన జవాబు వీళ్ళు చెప్పారుగాని, వాళ్ళ కది అర్థం కాలేదు. పైగా అబద్ధమని తోచింది. ఇట్లా వుండగా సత్యా రావుకు కన్ను కుట్టిం దీ విషయంలో. తాను వుండగా, క్రిష్ణయ్య నెందుకు పిలిపించిందీ అన్న ఈర్ష్య కలిగింది సత్యారావుకు. తిన్నగా ఆ ప్రాంతంవెళ్ళి యువకులను రెచ్చగొట్టాడు - "మీ వూళ్లో మగవారు లేరట్రా? ఎవరో పరాయివాళ్లు ఊళ్ళకొచ్చి పోతూవుంటే చూస్తూ కూర్చున్నారేం?"

ఒకనాడు దాదాపు పదిమంది కుఱ్ఱవాళ్లు కఱ్ఱలు తీసికొని వచ్చారు వీళ్ళ యింటి దగ్గిరకి వీళ్ళంతా వున్నప్పుడు.

"రాండి బయటికి" అని కేకలేశారు. అందరూ కనిపిస్తూనే వున్నారు. చూస్తున్న సీతా, లక్ష్మి, వెలవెల బోయారు. లక్ష్మి వాళ్ల సమీపించింది.

"మీకంత కావాల్సొస్తే యీ పల్లె గొడ్డుపోయిందా?" అన్నారు కొందరు.

"వాళ్ళమాదిరి నాజూగ్గా లేమని కాబోలు" అన్నాడొకడు.

"సిగ్గున్న ముండలయితే గదట్రా" అన్నాడింకొకడు.

పాపం, లక్ష్మికి తల నరికేసినట్టుగా వుంది. సీత ఊరికే యేడుస్తూ వుంది. ఇంతలో గబగబా బయటి కొచ్చాడు మురళి. అతన్ని చూడగానే కాస్త తగ్గారు. ఇతనికి తెలిసిన యిద్దరు ముగ్గురు కుఱ్ఱవాళ్లు వెనక్కి వెళ్లి నక్కారు.

"తెలివి వూరికే వస్తుందట్రా" అన్నాడు మురళి రొప్పుతూ,

''తెలివి మా కే వొ స్తది'' అంది ఒక గొంతుక.

''చాలు పోండి యీనాటికి'' అంది మరొక గొంతుక.

''యిక వచ్చారో - చూచుకోండి'' అంది మరొక దాగిన గొంతుక.

కాసేపయ్యాక వాళ్ళంతా వెళ్ళిపోయారు. వీళ్ళు లోపలి కెళ్ళారు. లక్ష్మి యేమీ మాట్లాడకుండా ఆలోచిస్తూ వుంది. యేడుస్తున్న సీతను ఓదార్చ డానికి మురళి వంటింట్లోకి వెళ్ళాడు. తమకు జరిగిన అవమానం విషయమే గాకుండా, వీరికి సాయం చెయ్యడానికి వచ్చిన వారికి జరిగిన అవమాన విష యమై యెక్కువగా దుఃఖిస్తూ వుంది సీత. మురళిని చూడగానే ''మాకు చదివే ప్రాప్తం లేదు. ఆ నా డట్లా, యీ దినమిట్లా'' అని భోరున యేడ్చింది.

మరునాడు కాలేజీలో అంతా క్రిష్ణయ్య పేరు మోగిపోతూ వుంది. క్రిష్ణయ్య తలెత్తుకొని తిరగలేక పోతున్నాడు. ఒకప్పుడు అమాయిక సరళ పేరుతో తన పే రెక్కింది. ఈనాడు తన సాయాన్ని అర్థించిన బీద బాలి కతో తన పేరు బయటి కొచ్చింది, రెన్నాళ్లు కాలేజీకి రాలేక పోయాడు. అంతా చేసింది సత్యారావని తెలుసు.

సత్యారావు ప్రమేయంతోనే యివన్నీ జరుగుతున్నాయని లక్ష్మికి చక్కగా తెలుసు! సత్యారావులో యీర్ష్యాగుణం యెక్కువ మొదట్నుండీ. కామగుణం ఎక్కువ. అంచేతే లక్ష్మికి తొట్టతొలుత వివాహం చేసుకోవచ్చని అనుకున్నా, రానురానూ వాణ్ణి దగ్గరకు వచ్చి మాట్లాడనుగూడా అనుమతించ లేదు. లక్ష్మిని ఊరికే అనుభవిస్తాడటగాని, పెండ్లాడలేడట! అందుకు లక్ష్మి కులంలేనితనం, సంఘంలోని తన స్థానం, విద్యలేమి, బీదతనం, యివన్నీ కారణాలట! అసలు లక్ష్మి భావాలను ఉపేక్షతో చూచి హేళన చేసేవాడు లక్ష్మి యెపుడైతే అతన్ని ఛీ కొట్టి, ఇకమీదట నాకు కనిపించకు అని అన్నదో, అప్పట్నుండీ వాడికి రోషం పట్టుకుంది. క్రిష్ణయ్య యిటీవల రాసాగినాక, ఈర్ష్య ప్రబలిపోయింది. అందుకే తన చేతనయింది చెయ్యిస్తు న్నాడు. సత్యారావుకు ఆ గుడెసెల్లో చాలామంది తెలుసు. అందులో హను మంతరావు, ఆంజనేయులు అనేవాళ్లు అతనికి ముఖ్యులు.

ఆ యిద్దరూ మరునాడు ఒకామెను పంపించారు లక్ష్మి సీతల దగ్గిరికి అడగమని. ఆమె వచ్చి అడిగింది. లక్ష్మి ఎంత వ్యధ పడిందో మనసులో! సీత కన్నీరు కారుస్తూ కూర్చుంది. ఆ వచ్చిన మనిషితో లక్ష్మి ఒక్క మాట మాత్రం అంది.

"మమ్మల ఆ విధంగా భావించవద్దని వాళ్ళకు చెప్పు. తర్వాత, నీ విట్లాంటి రాయబారాలు ఎపుడూ చేయకు, నీవు స్త్రీగావుండి స్త్రీలనే వ్యభిచారానికి పురికొల్పడం తప్పు."

ఈ జవాబు విని వారికి కోపం వచ్చింది. ఆంజనేయులన్నాడు: "చూశావా హనుమంతా! వాళ్లు మన కండ్ల యెదుటనే వ్యభిచారం చేస్తూ పైగా పతీతల్లాగా యేం చెబుతున్నారో? చిన్నగా వీళ్ళ పట్టుకోవాల్రా."

"ఔను వాటి పతివ్రతతనం యేంటో కాస్త చూద్దాం" అన్నాడు రెండవవాడు.

# 8

సరళ పిచ్చయ్యతో కలిసి బెజవాడ వచ్చిన దినం ఒక ప్రత్యేక దినం. బిగబట్టుకుని వచ్చిన యేడుపు చేత ఆ యిల్లంతా నింపింది సరళ. ఎంతగానో యేడ్చింది. ఆమె బాధలు చెబుతూంటే అందరికీ దుఃఖం వచ్చింది. ఆ పిచ్చయ్య పిచ్చిచేష్టలు, ప్రగల్భాలు పగటి కలలు, అమాయకత్వం, వీటిని గురించి చెబుతూవుంటే జాలివేసింది. ఆ అత్త పెంకితనం, గయ్యాళితనం, మందబుద్ధి - వీటిని గురించి చెబుతూవుంటే కోపంగూడా వచ్చింది. 'అయితే యిక మన చేతుల్లో యేముంది' అని అనుకోసాగారు.

తానున్నదిగూడా లెక్కించకుండా అంతా చెప్పినందుకు బలే కోపం వచ్చింది పిచ్చయ్యకు. ఎవరుగూడా తా ననుకున్నంత గొప్పగా మర్యాద చేయనందు కింకా కోపం వచ్చింది. తన తల్లిని అట్లా అన్నందుకు మంట యెత్తింది. ఎగిరెగిరీ పడ్డాడు. బొత్తిగా మర్యాద తెలియని వాళ్ళన్నాడు,

యెవరెవరియెడ యెట్లా ప్రవర్తించాలో తెలియని మూఢు లన్నాడు. ఒకవేళ ధనం వుంటే మాత్రం బీద లనబడే వారిని తాహతు గమనించకుండా తూలనాడడం అధర్మం అన్నాడు. తన పెండ్లాన్ని తానేమయినా చేసుకోడానికి సర్వహక్కులూ వున్నాయని తన అధికారాన్ని బయటపెట్టాడు. ఇంకా యేమేమో కొన్ని కాంగ్రెసు మాటలూ, కొన్ని సోషలిష్టుల మాటలూ, కొన్ని కమ్యూనిష్టుల మాటలూ, కొన్ని రాష్ట్రీయస్వయంసేవక సంఘం వారి మాటలూ, అన్నీ అనేస్తూన్నాడు. వాని పైత్యంచూచి "మియ్‌నోర్" అని గర్జించాడు మురళి. ఆ రోషావేశుణ్ణి చూచి. క్రిష్ణయ్యను కరుచుకొని, "క్రిష్ణయ్యా నన్ను స్టేషనుదగ్గిరికి వొదిత్తే మా అమ్మ కాళ్ళ దగ్గర పోయి పడతా" అన్నాడు భయపడుతూ.

"షటప్" అని హూంకరించాడు మురళి. క్రిష్ణయ్యను ఇంకా గట్టిగా కరుచుకున్నాడు పిచ్చయ్య కన్నీళ్ళు కారుస్తూ. అందరూ గోలగా నవ్వారు. మళ్ళా కోపం వచ్చింది వాడికి.

"న న్నవమాన పరుస్తున్నారు. నా కివ్వాల్సిన డబ్బును నా కివ్వండి. మీ పిల్ల నా కక్కర్లేదు."

"ఏంటోయ్ యిచ్చేది?" అన్నాడు మురళి నవ్వాపుకుంటూ.

"నా కింకా సహం డబ్బివ్వలేదు. యిస్తే పెండ్లి రద్దుచేసుకొని పోతాను."

"రాస్కెల్ నీకేమిట్రా యిచ్చేది" అన్నాడు రొప్పుతూ మురళి. మురళిని చూచేకొద్దీ బెదురెక్కువయింది.

భయపడుతూ, "యిచ్చింది చాలు. నాకొద్దు పెళ్ళాం. వెళ్తా" అన్నాడు గాభరాగా.

"నీ భార్యను నీవే తీసుకుపోవోయ్! తీసుకుపోయి ఏమన్నాచేసుకో! లేకపోతే భరణం రాబడ్తాం" అన్నాడు తెలీకుండా నవ్వుతూ.

"అమ్మా, ఇక గతేమిట్రా దేవుడా" అంటూ అసహాయత్వం ప్రకటించి కూలబడ్డాడు యేడుస్తూ.

బ్రహ్మారావు మురళిని ఆపి, "చూడు పిచ్చయ్యా! నీ కిష్టంలేకపోతే పోనీలే. మా పిల్ల అటువంటిదే. వట్టిపెంకి. నీబోటి పెద్దమనిషికి తరహా కాని పిల్ల. చూడూ! ఈ అగ్రిమెంటుపై సంతకం చెయ్యి." అని చూపించాడు బ్రహ్మారావు. అది వివాహపు రద్దుపత్రం. వణుకుతున్న చేతులతో సంతోషంగా చేవ్రాలు చేసి, "వెళ్తా మామా!" అన్నాడు.

"వెళ్లు నాయనా."

"మరి వెళ్ళనా" అంటూ అటువైపు చూచాడు.

"వెళ్ళిరా నాయనా" అన్నాడు బ్రదికాననుకుంటూ బ్రహ్మారావు.

"ఫో!" అని నాలుక కొరికాడు మురళి భయపెడుతూ. భయంతో యిటూ అటూ చూచి, "చార్జీకేమన్నా......" అనబోతుండగా, "వూరికే పంపిస్తానా పిచ్చయ్యా? అడుగో అబ్బాయి స్టేషనుకు వస్తాడు టిక్కెటు తీసి పంపుతాడు" అన్నాడు, మురళిని చూస్తూ.

"వద్దండీ! నేనే వెళ్తాను." "అన్నాడు, మనసులో టిక్కెటు లేకుండాపోతే డబ్బు మిగుల్తుందనుకొంటూ. మురళీ క్రిష్ణయ్యలు పట్టుపట్టారు స్టేషనుకు వస్తామని. రైలు కదిలినంతవరకూ కోతిని యేడిపించినట్టు యేడిపించారు పాపం!

సరళ బయటపడింది. అందుకు ఆనందంతో వాళ్ళ నాన్న ఎదపై తలపెట్టి ఎన్నో ఆనందబాష్పాలు రాల్చింది కృతజ్ఞతతో. మురళిని గాఢంగా కౌగిలించుకొని పునరుద్ధరించుకొన్న తన స్వాతంత్ర్యాన్ని ఎంతగానో ప్రకటించింది. క్రిష్ణయ్యతో ఎన్నెన్నో విషయాలు చెప్పి ఆ కోతికి దక్కకుండా తానెట్లా మానాన్ని కాపాడుకొని వచ్చిందీ చెప్పింది. క్రిష్ణయ్య ఇటీవల చాలా ఆప్తుదయ్యాడు ఆమెకు.

అప్పటికి కాలేజీ తెరిచి కొన్ని నెలలయింది. అంచేత ప్రైవేటుగా చదవాలని బి. ఎ. పుస్తకాలు తెప్పించుకొంది.

మరునాడు లక్ష్మి హఠాదాగమనాన్ని చూచి ఉలిక్కిపడ్డట్టుగా లేచి, ఉత్సాహంతో, "అరె! నువ్వా లక్ష్మీ! రా!" అంటూ దగ్గిరికి లాక్కొని "చాలా మారిపోయావ్‌గదూ!" అంది సరళ.

"నీవూ అంతే సరళా! రెండేడ్లకు పూర్వం నీవు కాలేజీకి పోయే ముందు చూచినప్పటికీ ఇప్పటికి నీలో యెంతో మార్పు కన్పిస్తున్నది." అంది లక్ష్మి.

"ఏమిటే లక్ష్మి! ఎంత నాటక మయిందమకున్నావ్?" అని అంతా చెప్పి, "ఛా! స్త్రీ బ్రతుకు చాలా అధ్వాన్నంగా వుంది మన ప్రస్తుత సమాజంలో. చదివినా ఒకటే, చదవకున్నా ఒకటే. ఒకే మర్యాద! ఏమీ బాగుపడలేదు లక్ష్మి."

"బాగుపడదు సరళా. ఇపుడల్లా బాగుపడదు. స్త్రీపురుష ఆధిక్య అనాధిక్య భావాలు, ఉభయులకూ మారాలి. ఈనాడు చదువుకుంటున్నా కూడా, స్వేచ్ఛ అంటే యేమిటో తెలిసికొంటున్నాగూడా ప్రస్తుత యువకుడు బ్రూటుగానే సంచరిస్తున్నాడు. పూర్వకాలంలో వలెనే స్త్రీని పడకటింటి వస్తువులాగా చూచే ధోరణి పోలేదు. వివాహాదర్శం అంత మాత్రమే అయినపుడు, నేటి కాలపు యువకులకు చదువుకున్న పిల్లలే కావాలని లేదు."

"అదేగాదు. చదువురాని పిల్లలే వారికి నచ్చుతారు. బానిస మాదిరి పగలంతా పనిచేసి, అధికారంతో యిచ్చే వీడి అర్ధరుకంతా అడకువతో భయపడుతూ సంచరిస్తూ, రాత్రికాగానే పడకటిల్లుచేరి, తెల్లవారకముందే కంటికి కనబడకుండా లేచిపోయి పనులు చూచుకొనే పెండ్లాం అయితే వీడికీ సులువేగా! వాడి అధికారాన్ని గురించి చదువుకున్న పిల్లలు ప్రశ్నవెయ్యరూ? వేస్తే వస్తుంది చిక్కు! ఆధిక్య భావాలతో, అజ్ఞాన భావాలతో నిండిన మేధస్సుగల తలిదండ్రులూ, భర్తలూ, స్వతంత్ర భావంతో స్త్రీ ప్రశ్నవేస్తే సంచలించిపోతారు. స్త్రీ విద్యనూ, స్త్రీ స్వాతంత్ర్యాన్నీ అపార్థం చేసికొని ద్వేషించడం యిపుడు బాగా కనిపిస్తున్నది."

"అవును. చదువున్నా, లేకున్నా, ఒకటిగానే కనిపిస్తూవుంది, స్త్రీ బ్రతుకు."

"అదెట్లా అవుతుందిలే? చదువు మాత్రం ముఖ్యం. మానవతిగా స్వతంత్రంగా బ్రతకాలంటే స్త్రీకి చదువు అవసరం. అదివుంటే తప్పనిసరిగా బానిసయ్యే బ్రతుకునుండి తప్పుకోడానికి ఆస్కారముంది.

"నేనుగూడా స్వతంత్ర జీవనాన్ని, కాస్త ఉదాత్తజీవనాన్ని,కాంక్షించే మెట్రిక్ చదవాలని అభిప్రాయపడ్డాను. ఇక్కడికి రావట మందుకే."

"బాగానే ఆలోచించావు. మంచిదే" అని వూరుకుంది సరళ తనేమీ సాయంచేసే స్థితిలో లేనట్టు.

"మాకేమీ అక్కర్లేదు. కాస్త........"

"అదే లక్ష్మీ! ఆలోచిస్తున్నా.......పరిస్థితులు అంత...."

"అదిగాదు సరళా! మాకు ధనసాయం అక్కర్లేదు."

"ఆఁ. అయితే...." అంది తటాలున లక్ష్మి మొహంలోకి చూచి.

"నీవు కాస్తా పాఠాలు...."

"ఓ! తప్పక లక్ష్మీ. అందులో సందేహం యెందుకు? రేపట్నుండే రా".

"చాలా కృతజ్ఞురాల్ని సరళా. పాత స్నేహాన్ని పాటించి...."

"అదెక్కడ పోతుంది లక్ష్మీ! ధనం, విద్యా, కాలం, దానికి అడ్డం రావుకాస్త బుద్ధివుంటే."

"అయితే మెట్రిక్ సులభంగానే వుంటుందా?"

"నీకా! అదెంత లక్ష్మీ!"

"సరే వెళ్ళనా" అంటూ లేచింది లక్ష్మి.

"లక్ష్మీ" అంది సరళ కంటితో కూర్చోమన్నట్టు సంజ్ఞ చేస్తూ.

"మీ సీత బాగుందా?"

"బాగానే వుంది.'.

"దాన్ని గూడా పిల్చుకరా! చదువుతుందటగదూ!"

"అవును. అసలీ విషయం మొదలుపెట్టడం అదే. నాకు గూడా బుద్ధి పుట్టింది."

"అసలు సీత విషయమే యెత్తలే దెందుకు?"

"నీ దగ్గిరి కిది వరకదీ వచ్చింది, నీవు సాయం చేయనన్నావు."

"అవును. ఆ పరిస్థితుల్లో అట్లాగే భావించాను" అంది సిగ్గుపడుతూ.

''రేపు పిల్చుకొస్తావుగా'' అంది చిరునవ్వుతో.

''అట్లాగే.''

''మంచిపిల్ల! చాలా ముద్దుగా మాట్లాడుతుంది!''

''నీ వాత్సల్యం అట్లా అనిపిస్తూ ఉంది.''

''అదిగాదు లక్ష్మి. ఆ పిల్లలో ఆకర్షణ వుంది.''

''నీవంటే ఆ పిల్లకు మంచి గౌరవం. నిన్ను గురించి కొన్ని దినాలు బాగా మాట్లాడేది!''

"అవును. ఆ పాటి బాంధవ్యం లేకపోలేదు'' అంది సరళ శ్లేషగా. మళ్ళా అంది: కొన్ని మాసాల క్రితం వచ్చినపుడు, మీ విషాద గాథంతా చెప్పింది. ఎంతబాగా చెబుతుంది లక్ష్మి! ఎదుటివారి హృదయా లెంత కాఠిన్యపూరితా లయినా, కరిగి సానుభూతిని ప్రవహింప జేసేటట్లు ఘట్టాన్ని వర్ణించగలదు, అపుడు చెప్పింది నీవు తన అక్కవని. అప్పట్నుండీ నిన్ను చూడాలని వుండేదిగాని.... తెలుసుగా!''

''మరి యిక వస్తాను'' అని లేవబోయింది లక్ష్మి.

''కాఫీ త్రాగి పోదూ వుండు'' అని లేచింది సరళ.

ఇంతలో మురళీ వచ్చాడు గదిలోకి.

ఒకరొకరు చూచుకున్నారు లక్ష్మి మురళులు. మురళి పెదవులపై చిరునవ్వు తప్పలేదు. లక్ష్మి సీరియస్‌గా వుంది.

''మురళిని చూశావా?'' అంది సరళ.

''నీవు హైస్కూల్లో వున్నపుడు చాలాసార్లు చూచేదాన్నిగా! ఎంత పెద్దవా డయ్యా డిపుడు! నీకంటే పొడుగ్గా వున్నాడు!''

"మా మురళిని చూచి పిల్లలంతా యేమేమో అనుకొనేవారు గదూ!''

''వీలుపడితే అందరమూ పెండ్లిచేసికొని బొమ్మతో మాదిరిగా ఆడుకోవా లనుకొనే వాళ్ళంగా!''

''అసలు ప్రేమ యేమూల వుందో తెలుసుకోలేక పోతున్నాడింకా - తెలుసుకుంటే గదా పెండ్లి'' అంటూ మురళి వైపు అట్లా చూచి వంటగదిలో

వెళ్ళిపోయింది సరళ....ఆమె లోపలికి పోగానే చేతిగుడ్డలు మూతికడ్డంపెట్టు కొని హృదయాల్లో గట్టిగా నవ్వుకున్నారు లక్ష్మి మురళులు. కాసేపటికి మూడు గ్లాసుల్లో ఓవల్‌టిన్ పట్టుకొచ్చింది సరళ. తాగినాక "వస్తా సరళా" అని లేచింది మళ్ళా లక్ష్మి.

"రేపే రండి లక్ష్మీ! ఇద్దరూ రావాలి. చూడు! ఏ వేళ మీకు సౌకర్యం?"

"నీ సౌకర్యం చెప్పు సరళా! తిరిపానికి వచ్చేవారం నీ యిష్టంపై ఆధారపడి ఉండాలిగాని...."

"ఛీ! ఛీ! అదిగాదు మీకెపుడు వీలో చెప్పు చాలు."

"ఉదయం బాగుంటుందా?"

"మీరు పనికిపోరూ?"

"ఊఁ హూఁ! ఇటీవల కూలికిపోవడం చాలించేశాం. చాపలల్లు కుంటున్నాం. రాట్నంగూడా వుంది. అది యింట్లోపని కాబట్టి ఎప్పుడైనా చేసుకోవచ్చు."

"దాంతో కూడు, గుడ్డా గడుస్తాయా?"

"గడవక!"

"సరే, ఉదయం పదికి వస్తూ వుండాలి అయితే?"

చాలా సంతోషంతో వస్తున్న అక్కను బిగ్గరగా కౌగలించుకొని "పందేనాక్కా" అంది సీత రెప్పలల్లారుస్తూ.

"అవును!" అంటూ ఒక ముద్దు పెట్టింది చెల్లికి.

"నేను వచ్చివుంటే ఒప్పుకొనేది కాదేమో!" అంది సీత.

"అది చాలా మంచిదే పాపం! చాలా సరళ హృదయం! అందుకే ఆ పేరు పెట్టారేమో! మలిన హృదయకు నిర్మల అనే పేరువలె, దుశ్శీలకు సుశీల అనే పేరువలె, కళాజ్ఞానంలేని దానికి కళావతివలె, నాపేరు లక్ష్మివలె, లేదు దాని పేరు. పేరుకూ గుణానికీ బాగా సరిపోతుంది. అసలు పేరంటే అట్లాగే ఉండాలి. ఆనా దట్లా అందంటే కారణముందిగా! ఎంత మంచివారికైనా ఆ మాత్రం వుంటుందిలేవే! వాళ్ళ పిల్లవాడు నీ వల్ల చెడిపోతున్నాడని అట్లా అంది."

"పోనీలే, నీవన్నా మేలుపడు. తర్వాత నా కత చూచుకోవచ్చు."

"నిన్నుగూడా అక్కడికి తీసుకెళితే."

"వద్దక్కా, నిన్నుగూడా తరిమేస్తుంది!" అంది కాస్త భయంతో సీత.

"పోవే పిచ్చిదానా!"

"పిచ్చేమిటే, అంతపనీ అవుతుంది!"

గట్టిగా గవదలుపట్టి, ఆడించి, ముద్దుపెట్టి, "లేదు చెల్లీ! ఆమే నిన్ను పిల్చుక రమ్మన్నది" అంది లక్ష్మి.

"ఆఁ!" అంటూ గట్టిగా కౌగిలించుకుని, "తానే అందాక్కా" అంది ఆనందంతో.

"అవును. తానే నిన్ను పిల్చుక రమ్మంది. నే నడగలేదు. నీ మాటే ఎత్తలేదు. తానే నీ విషయం అడిగింది. నిన్ను బాగా ప్రేమిస్తున్నది!"

అదే సాయంకాలం, సత్యారావొచ్చాడు. సీత వంటదగ్గర వుండగా ఏదో పోయిన చీరకట్టుకుంటూ ఉంది లక్ష్మి. సత్యారావుకు మామూలుగానే మర్యాద చేసింది.

కాస్త వెటకారంగా నవ్వి, "ఎట్లా సాగుతూవుంది చదువు లక్ష్మి" అన్నాడు.

"నీ ధర్మమా అంటూ నిలిచిపోయింది సత్యా" అంది లక్ష్మి తలెత్తకుండా.

"సత్యారావంటే యేమనుకున్నావ్? వాడికి విరుద్ధంగా యేపనీ సాగదు," అన్నాడు చిన్నమీసాలపైన చెయ్యేసి.

"నాకు గూడా అంతే తోచింది సత్యా" అంది లక్ష్మి వాడి తృప్తి కోసం.

"అట్లా తగ్గు. ఇకమీదనైనా జాగ్రత్తగా వుండండి."

"ఇంతకు ముందుమాత్రం జాగ్రత్తగా లేమా యేమిటి?"

"జాగ్రత్తగా ఉంటే యిన్ని చిక్కు లొచ్చేవి కావుగా?"

"నీవేమో వచ్చి చెప్పవు; ఇతర్ల చేత చెప్పించుకోడం గూడా తప్పా?"

"చెప్పడాని కింకెవరూ దొరక్కపోయాడా? ఆ కిట్టిగాడేనా?"

"అదే భేదం నీకూ అతనికీ! నీ వెంతసేపూ నీ విషయమే చూడా లంటావు. నా భవిష్యత్తును గురించి ఆలోచించవు. పోనీ నీవే చదువు చెప్తా నంటే నే నతన్ని ఆశ్రయించేదాన్ని గాదుగా!"

"అది నన్నడిగావా?"

"అడగాలా?"

"అడగందే అమ్మయినా పెట్టదని తెలీదా?"

"బాధ్యత తెలిసిన వారిని అడగ పనిలేదు. నీవు మొదట చెప్పిం దేమిటి? నన్ను వివాహమాడతా నన్నావు. నీవు పెద్ద డిగ్రీలు పొందుతావు; నీ భార్య చదువురాని దయితే బాగుంటుందా? నిజంగా నేను భార్య కావాలని నీ హృదయంలో ఉంటే, నా కిష్టం లేకున్నా నన్ను పీడించి చదువు చెప్పే వాడవు. దానికి బదులు లభిస్తున్నదాన్ని గూడా చెడగొట్టావు."

"అవును, నిన్నే చేసుకోవాలి చేసుకుంటే! ఇంత పవిత్ర స్త్రీనీ, ప్రతివ్రతనూ, చేసుకుంటేగాని నేను పునీతుణ్ణికాను. మా వంశం అపుడుగాని తరించదు! మొన్న నేనూ, ఈనాడు క్రిష్ణయ్యా - రేపింకొకడు ... ...."

లక్ష్మికి ఎంతో వెగటేసింది ఆ సంభాషణ. ఏం చేస్తుంది? ఒకానొక ముఖ్యకారణం కోసం, తానపార్థం చేసికోబడతానని తెలిసి గూడా. అపాయ కరమైనదని తెలిసిగూడా, ఆ సత్యారావు నాశ్రయించ వలసి వచ్చింది. అతనితో కేవలం మాట్లాడుతున్న దానికే యింత నీచంగా మాట్లాడుతున్నాడు. వాని ఆ ప్రవర్తన చూచి చాలా కోప మొచ్చింది లక్ష్మికి. పేదవారి కోపం పెదవికి చేటు అని లక్ష్మికి తెలుసు. అయినా వస్తూవుంది కోపం. దాన్నికాస్త అణచుకొని-

"నిజమే సత్యా, నీవన్నది నిజం! మాబోటి వాళ్ళ జూస్తే ఎంతపనికి మాలిన వాడుగూడా ఏదో ఒకటంటాడు. మీ దానంత స్వచ్ఛమైన కులం కాదు మాది, మీ యిండ్లలో వున్నంత స్వచ్ఛమైన నీతి మాలో

వుండదు. అతి ముఖ్యమైన పనిమీద మా బోటివాళ్లు పరపురుషుడితో ఒక నిమిషం మాట్లాడినా, వేయిమందితో తిరిగినట్లుగా చూస్తుంది లోకం! కలిగిన వారిండ్లలో అట్లా యెందు కవుతుంది? మీ స్త్రీలు ప్రపంచం అంతా గాలించినా పతివ్రతలే అవుతారు! నీతిపరులే అవుతారు! ఎన్ని చేసినా చెల్లిపోతాయి! నిన్నేమీ అనబల్లేదు సత్యారావ్. అది మీ సంఘదోషం! మీ వాతావరణ మంతా అట్లాంటి భావాల్తో నిండివుంది. చిన్నప్పటి నుండీ మీ బోటివాళ్ళకు ఉగ్గుపాలతో ఇట్లాంటి భావాలనే నూరిపోశారు. సంఘ దృష్టి అంతా పతనమైపోయింది. ఐతే నీబోటివారి హృదయాలు సంస్కరింపబడితే సంఘం సంస్కరించ బడిన ట్లవుతుంది. నీతో నేను మాట్లాడాను. అయితే నీతో వ్యభిచరిద్దామనిగాదు. నీవేమో ప్రేమ వచనాలు పలికి, నే నన్నదాని కంతా తందానా కొడుతూవుంటే. నీ హృదయం మారుతున్నదేమో, వివాహ మాడతా వనుకున్నా, అంతమాత్రానికే నీవెంతెంతో అనేస్తున్నావు. నిజంగా నీకు వివాహమాడాలనే వుంటే - నిజంగా నీది నీతిగల హృదయమే అయితే నన్నంతగా వేధిస్తావా! ఎంతకూ వ్యభిచారానికి ప్రోత్సాహమేనా సత్యారావ్? నీబోటివారే - బాగా అభివృద్ధి కాబోయే విద్యార్థులే-సమయానుకూలంగా కార్య సిద్ధికోసం ముఖస్తుతి చేస్తూ ఇంత అవినీతి భావాలు గలిగి, దురాచరణకు పాల్గొంటే, సంఘం బాగుపడుతుందా? సంఘాన్ని ఎంత తిడితే మాత్రం ప్రయోజన మేమిటి? వ్యక్తి సంస్కరణ జరిగితే సంఘం దానంతటదే సంస్కరించుకుంటుంది, క్రిష్ణయ్య మాటెత్తావు! నీకంటే అతనెంత నయమో చూడు! నీవు నా శరీరాన్ని కాంక్షించి నన్నేదో ప్రత్యేక దశలోకి ప్రోత్సహిస్తూ, నా భావిని గురించి లేశమైనా ఆలోచించకుండా వున్నావు గదా! అతను నాకు నీవలె తెలీదు-అయితే పరిచయం బాగావుంది. పాపం మురళి అడగగానే, తనకు జరగబోయే సన్మానం, రాబోయే అపనిందలూ, తెలిసి గూడా లెక్కించకుండా చదువు చెబుతానన్నాడు. నీవలె అత నింత వరకూ ఏమీ ప్రసంగించలేదు. నీవలె యేదో మమ్ముల తృప్తిపరచి అక్కర తీర్చుకుపోడానికి సంఘాన్ని దూషించలేదు. నీవలె మమ్ముల్ని ఏనాడూ నీచంగా సంభావించలేదు. తనకు తగిన సాయం త్యాగబుద్ధితో చేస్తున్నాడు.

నీవంత మాత్రం యేమీ చెయ్యలేదు సరిగదా నా శరీరాన్ని కాంక్షిస్తున్నావు. ఏం సత్యారావ్, ఈ శరీరాన్ని తింటావా? ఒకవేళ వుంటే మాత్రం యెన్నా ళ్లుంటుందీ శరీరంపై మమత! నాన్నాళ్లు అనుభవించినాక తప్పకపోతుంది! శాశ్వతాకర్షణ కోసం, ప్రేమకోసం, నా హృదయంకోసం, ప్రయత్నిం చావా? నిన్నుబాగా కొన్ని సంవత్సరాలు పరిశీలించి చూశాను. బాగా అర్థం చేసుకున్నాను. నీవు మాత్రం నన్ను అన్యధా అర్థం చేసుకున్నావు. ఒకవేళ మాజన్మ మీకంత నీచంగాతోస్తే మా హృదయాలుగూడా అంతనీచంగా వుంటాయని యెందుకనుకుంటావు? ఏనాడన్నా నీవు సమదృష్టితో చూశావా? మేము తిండికిలేక చస్తే మాత్రం వ్యభిచరిస్తామని ఎట్లా ఊహిస్తావు?''

''ఆగు! ఆ విధంగా తిరగడం వ్యభిచారం కాదా? నీ చెల్లి చేసేదికాదా?''

''నీ ఉపేక్షాభావంతో కూడిన ఆ ముఖధోరణి చూస్తే ఇంతకు ముందు నే మాట్లాడిందంతా నీకు లేశమైనా అర్థం కానట్లున్నది. అయినా అర్థం చేసుకోవలసిన అగత్యం నీకు లేదేమో! మాట్లాడే ప్రతిమాటకు కాస్త అర్థం మేమిటో సరిగ్గా తెలుసుకొని మాట్లాడు. వ్యభిచారానికి అర్థం పెద్దది. అది అందరికీ ఒకటే. నేను నీతో తిరిగింది వ్యభిచారమేమో నీవే చెప్పు! స్నేహంతో తిరిగా, వివాహమాడతానని నీవు అంటూ వుంటే, నీ హృదయ పరిశీలనకోసం తిరిగాను. తిరగ వలసిన అవసరం ఉండబట్టి తిరిగాను. నీవు వ్యభిచార దృష్టితో తిరిగావు. నీభావం అది గాబట్టి, అందరూ అంతేలే అవి భావించడం నీకు సహజమేమో! అది ఒకవేళ వ్యభిచారమే అయితే నీది గూడా అవుతుందిగా! అపుడు నీవు ఏ మాత్రమూ అధికుడవు కాదుగా! ఒక వేళ పురుషుడికి సంఘం ఎంత మద్దత్తు ఇచ్చినా, మంచి మంచే! చెడ్డ చెడ్డే! మన పాక్షిక ధర్మశాస్త్రాల కంటే భిన్నమైన సత్యం ఒకటుందని తెలుసుకో, ఆ సత్యందృష్ట్యా చూడు. అంతేగాని సంఘంలో మీ ఆధిక్యభావదృష్ట్యా చూడకు. నీ హృదయంలోకి నీవు చూచుకో! సత్యం బోధపడుతుంది. ఎంతసేపూ ఒకరి లోపాలు చూపడానికే ముందుకొస్తావుగాని, నీ లోపాలు నీవు చూచుకోడానికి ప్రయత్నిస్తే మంచిది. నా చెల్లి మాటెత్తావు. దానిది నిర్మల

ప్రేమ! దానికి తెలుసు ఎట్లా ప్రవర్తించుకోవాలో! నాకంటే అది తీసిపోదు. వాళ్లు పెండ్లాడాలని ప్రతిజ్ఞలుకూడా తీసుకున్నారు.'' - అని, పొరపాటు చేశా ననుకొని. మళ్ళా అంది: ''వాళ్ళ విషయం మన కెందుకు? ప్రతివ్యక్తి వాళ్ళవాళ్ళ విషయాల్లో భద్రంగా వుండి. వాళ్ళవాళ్ళ హృదయాల కట్టేసుకొని వాళ్ళవాళ్ళ చిత్తాలను సంస్కరించుకొంటే చాలు! మరొకరి విషయం అన వసరం," అంది.

''మొత్తానికి చాలా నీతులే మాట్లాడుతున్నావే ఇటీవల!'' అన్నాడు సత్యారావు అవహేళనగా నవ్వుతూ.

''నిజమే సత్యారావ్! ఇట్లాంటివి మహానీతులని మీబోటివారు అవ హేళన చేస్తారు. మా స్థితిలో ఉన్నవారు ఇట్లాంటివి మాట్లాడ్డానికి అర్హత లేనివారిని మీబోటివారి భావన. మీ దృష్టి అంతే. ఎవరు ఏ స్థితిలో మాట్లా డినా సత్యం సత్యంకాక మరేమవుతుంది? ఈ ధోరణి వదిలిపెట్టమని నీకు చాలాసార్లు చెప్పాను. నీవు మార్చుకోవు. మార్చుకోవలసిన అవసరం నీకు పట్టలేదు.''

''నిజం చెప్పు లక్ష్మీ! నీకు మాత్రం న్యాయమా నన్ను వివాహమాడ మనడానికి?''

ఆమెకు ఇక మాట్లాడ్డం యిష్టంలేకపోయింది. ఎంత ఉదికినా యెలుక తోలు యెలుకతోలుగానే ఉంటే యేం చేస్తుంది?ఏదో వాదించి తనను ఒప్పించా లనే ధోరణిలోగూడా లేదామె. అవసరంకూడా లేదు. ఇంతవరకూ అవలం బించిన హృదయ వ్యతిరేక పద్ధతిగూడా అవలంబించాల్సిన అవసరంగూడా యిపుడు లేదు. అయితే సత్యారావు పగను పెంచడం ఆమె కిష్టం లేదు. దుర్మార్గులతోడి పగ ఎప్పటికీ అపమార్గమే.

ఒకమాటంది, మళ్ళా: ''ఆలోచించు సత్యారావ్! చదువుకుంటున్న వాడివి, కాలేజీ విద్యార్థివి. పైగా మంచి కుటుంబంలో పుట్టినవాడి వంటు న్నావు. చదువునూ సంస్కారాన్నీ - జన్మనూ - అన్నిటినీ ఉపయోగించి ఆలోచించు-ఏది న్యాయమో ఏది అన్యాయమో తెలుస్తుంది!''

"బాగానే తెలుస్తూ వుంది. మురళిని ఆకర్షించడానికి నా సాయం కావాల్సొచ్చింది. అది కాస్త అవుతూనే నేను పనికి రాకుండా అయ్యాను. అక్కర గడిస్తే తక్కెడ పొయ్యిలో పెట్టమన్న సామెతలాగా వుంది."

"పొరపడకు సత్యారావ్! అసూయతో మాట్లాడకు! నీవు గూడా ఆకర్షింపబడే గుణా లలవర్చుకో! కాని వూరికే యెందు కట్లాంటి మాటలు!"

"ఇక నీ లంజ టక్కులు కట్టిపెట్టు" అంటూ లేచి కోపంతో, "ఇపుడు నీవు వస్తానంటావా రానంటావా?" అన్నా డధికారంగా.

లక్ష్మి ఊరికే కూర్చుంది. మనసంతా అసహ్య భావంతో నిండి పోయింది. ఇదంతా వంటగదిలో వుండి వింటున్న సీతకు అసహ్యమూ, కోపమూ ఉద్భవించగా, తటాలున బయటికొచ్చి, "అక్కా, సత్యారావుకు ఆడు తోబుట్టువు లున్నారా?" అంది.

"ఉండకేమమ్మా, వున్నారు. అయితే వాళ్ళకున్నంత మానాభిమానాలు మన కుండవని ఇట్లాంటివారి భావన" అంది కన్నీరుకారుస్తూ లక్ష్మి. సీత కోపంతో అంది: "సత్యారావ్! కాలేజీలో చదివేవాడివిగదా! గుడిసెల్లో వుండే వారితో అంత అసహ్యంగా ఎందుకు మాట్లాడ్తావ్? నీ నోటికొచ్చినట్లు వదరడమేనా? చాలాసార్లు విన్నా నిట్లాంటి దౌర్జన్యపు పలుకులూ, అన్యాయపు పలుకులూ! నేనున్నానని గూడా గమనించలేదు నీ వెపుడుగూడా. నేను వింటున్నాననిగూడా నీవు లెక్కించలేదు. నీ అక్కలకు, చెల్లెండ్లకు వుండే మానాభిమానాలు ఇతరులకు గూడా వుంటాయనుకో. ఈమాత్రం మాట నీ యింటికొచ్చి యే వ్యక్తయినా, నీ ఆడుతోబుట్టువుల నంటూవుంటే వింటూవున్న ఇంకొక చెల్లి ఎంత తీవ్రంగా బాధపడుతుందో ఆలోచించు. ఎంత కోప మొస్తుందో ఊహించు. నీవే యెట్లా భావిస్తావో ఆలోచించు. నీ కులాధిక్యత, విద్య, ధనం, రూపం - ఇవన్నీ యెందుకూ పనికిరా విట్లాంటి విషయాల్లో, కేవలం సరియైన హృదయం కావాలి' నోరు జారకు. నీవెంత భేదదృష్ట్యా ఆలోచించినా ...."

"నీవాపని చూడు సీతా: నే మాట్లాడుతున్నాను," అంది లక్ష్మి

సీతను ఆపేస్తూ. కన్నీరు తుడుచుకొని సత్యారావు వైపు చూచింది. లక్ష్మి తలవంచుకొని వెళ్ళి పోయా డతడులేచి.

అతడు పోగానే లక్ష్మి, "అందరూ యిట్లాంటి భావాలతోనే నాశన మౌతున్నారు. పైనుండేవారు వారి విధానాన్ని మార్చుకోడానికి ప్రయత్నించరు. అది వారి కక్కర వుంటేగా!" అంది,

ఇంటరు పరీక్షా ఫలితాలు వచ్చేముందే బి. ఎ., మెట్రిక్ ఫలితాలొచ్చాయి, సత్యారావు ఒకదాంట్లో పెయిలయ్యాడు. లక్ష్మి మెట్రిక్యులేషన్ ఫస్టు క్లాసులో ప్యాసయింది, చిన్నదయినా, సీత గూడా ఫస్టు క్లాసులోనే ప్యాసయింది. సరళ బి. ఎ. మామూలుగా ప్యాసయింది. క్రిష్ణయ్య రెండవ క్లాసులో ప్యాసయ్యాడు. అందరికి ఆనంద సమయం కాబట్టి సరళ వీళ్ళందరికీ డిన్నరిచ్చింది సత్యారావుకు తప్ప. విందు చాలా బాగా జరిగింది. రాజామణి సల్లాపోక్తులకు అందరూ నవ్వుకుంటూ, ఆనందిస్తూ కూర్చున్నారు. క్రిష్ణయ్యతో ఎక్కువగా, ఆనాడు మాట్లాడింది సరళ: సీత మాటి మాటికీ, కృతజ్ఞతానందపూర్ణ దృక్కులతో జంకుతూ మురళివైపు చూచి తక్షణమే సరళ వైపు చూస్తూ దృక్కులు ఉపసంహరించు కుంటూ వచ్చింది. మొత్తానికి చాలా సంతోషకరంగా ముగిసింది విందు, అందరూ వెళ్ళారు.

ఇంటికొచ్చిం తర్వాత సీత ఆనందోద్రేకాన్ని పట్టడం కష్టమయి పోయింది. లక్ష్మి భుజం పట్టుకొని వ్రేలాడుతూ ఉత్కంఠతతో అంది:

"అక్కా! ఈ సమయంలో ఎంతో కవిత్వాన్ని ఆశువుగా దొర్లించాలని వుందిగాని, గొంతులో ఏదో తన్నుకొని వున్నట్లుగా వుంది! మన యీ స్థితికి యెవరికి కృతజ్ఞత చెప్పుకోవాలో తెలియకుండా వుంది."

"మొదట యీ విషయాన్ని ఎత్తి, దారి చూపి, తుదముట్టా నెరవేర్చిన మురళికి చెప్పుకోవాలి. తర్వాత మిగిలిన వారికి. కడకు సత్యారావు కూడా!"

"ఛీ! ఆ నీచుడికా?"

"ఏదో నా నాటకంలో ముఖ్య పాత్రధారిగా నన్నా వుంటూ వచ్చాడు. గాబట్టి. చూశావా! సత్యారావుకూ మురళికీ బలే స్నేహం అప్పుడు. అంచేత సత్యారావునే పట్టవలసి వచ్చింది. సత్యారావు లేకపోతే మురళి రాడు, మురళి లేకపోతే మన కీ చదువే వచ్చి వుండదు."

"సరళ హృదయం చాలా మంచి దక్కా! ఊరికే చదువు చెప్పేవా రెవరైనా వున్నారా యీ కాలంలో. పైగా మనకు మధ్యాహ్నం అన్నం గూడా!"

"విద్య విలువ తెలిసినవారంతే నమ్మా: విద్య పరమావధి నెరిగినవా రెల్లప్పుడూ ధార్మికులే: సరళ చిన్నప్పటి నుండీ మంచి ఆశయాలు గల వ్యక్తి!"

ఇంతలో క్రిష్ణయ్య. మురళి వచ్చారు. ఆ సమయంలో మురళిని చూచి యేమి చెయ్యాలో తోచలేదు సీతకు. అమాంతంగా ఎగిరి మురళిని జవురుకొని వంటగదిలోకి ఎత్తుకు పోదామా అన్నంత ఉద్రేకం హృదయంలో నుండి ఉబికి వచ్చిందిగాని క్రిష్ణయ్య సమక్షం కాస్త ఉద్రేకాన్ని వెనుకకు నెట్టింది. అర్జెంటుగా లోపలికిరా అన్నట్లుగా మురళి వైపు చూచి సీత లోపలికి కెళ్ళి తడిక చాటున నిలబడింది నిరీక్షిస్తూ. మురళి లోపలికి దూరగానే చిన్న చప్పట్లు చరిచి, చేతులు నలుపుకుంటూ ఉత్కంఠత గొంతును తన్నుకొని రాగా, అదొక విధంగా నవ్వుతూ, చలించిపోతూ, వివశ్వతం పొందుతూ "మురళీ! నీ ఋణం జన్మజన్మాలకూ తీర్చుకోలేను. నన్నొక స్వతంత్ర వ్యక్తినిగా చేసి నిలబెట్టావు." అంది. మురళి చిరునవ్వు నవ్వుకుంటూ నిల బడ్డాడు, ఆమె ఆనందాన్ని పరిశీలిస్తూ. అక్కడున్న పీటపై కూర్చున్నాడు మురళి. తన ప్రక్కనే తనపై వాలి సీత కూర్చుంది.

"తర్వాత యేం చేస్తావు సీతా?" అన్నాడు చెంపలు నిమురుతూ.

"ఏం చెయ్యమంటావు?"

"ఫస్టు క్లాసులో వచ్చావుగా! కాలేజీలో చేర్తే."

"అదెట్లా వీలవుతుంది?"

"సాధ్యాసాధ్యాల కేముంది సీతా! ఈ మెట్రిక్ ప్యాసు కావడం కూడా ఒకప్పుడు సాధ్యం కాదని వదలుకొన్న దినాలు లేవా?"

"అవును మురళీ, అదివేరు. ఇంతవరకూ గడచిన విధానం వేరు. మేం కడుపుకు సంపాదించుకుంటూ చదివే వారం. కాలేజీలో చదవాలంటే తిండీ, బట్టా, పైకర్చులూ. ఎవరిస్తారు?"

ఇంతలో సత్యారావు అనే మాట వినబడగా ఇద్దరూ ఆగారు.

"అయితే సత్యారావు విషయం మొదట్నుండీ, అంతే నంటావా?" అంటున్నాడు క్రిష్ణయ్య లక్ష్మితో.

"చాలా చెప్పాల్సివుందా విషయంలో. చెప్పాలనుకుంటున్నా."

"చెప్పు."

"ఇన్ని అవకతవకలూ మాపిల్ల వల్ల వచ్చాయి. చిన్నప్పుడు అది బిచ్చానికి పోతే మురళి తన్నాడట. అది అతన్ని గురించి ఆలోచించడానికి తావిచ్చింది. అతనిపై దానికి ఒక విధమైన భావం పడింది ఆ వయసులోనే. అది పెరిగేకొద్దీ ఆ భావం పెరిగింది. ఆ పెరుగుదలతో అది వికారాన్ని పొందుతూ వచ్చింది. అది ప్రేమ కిందికి దిగింది. నన్ను పేధింపసాగింది, మురళి అయిదవ ఫారం చదివేటప్పుడు తీవ్రమయింది. దాని కప్పుడే యీడొచ్చింది. ప్రేమించడం తెలుసుకొంది. తర్వాత నా ముభావాన్ని చూచి అసహాయతతో యేడ్చేదిగూడా, మా తలిదండ్రుల తర్వాత దానికి నేనే అన్నీ. అసలు వారి స్థానంలో సీతే నాకు ఓదార్పు. దాన్ని సంతోష పెట్టాలి. నేను ఆడదాన్ని. ఏం చెయ్యగలను? ప్రేమంటే యేమిటో ఒక్క స్త్రీకే తెలుసు. అంచేత దాని ప్రేమను అర్థం చేసుకున్నా. దాని బాధ బాగా అవగతమైంది. అయితే నేనేం నెయ్యగలను. రాయబారం పోవడానికన్నా మురళివంటి స్థితి పరులం కాముగదా! ఆలోచించాను. అప్పట్లో మురళీ, సత్యారావులు బలే స్నేహితులు. సత్యారావు సంగతి మనకు బాగా తెలుసు. మేము మరీ అసహ్యించుకొనే వారం. అయినా అతనిలో కొన్ని మంచి లక్షణాలు లేక పోలేదు. అతని సాయం కావాల్సి వచ్చి అతన్ని పిలిచాము. అంతకుముందు

సత్యారావుతో నేను మాట్లాడేదాన్ని గాదు. నాతో మాట్లాడాలని ప్రయత్నించే వాడు. ఒకనా డెవర్తోనో 'ఒరే లక్ష్మి నిమ్మపండులాగా వుందిరా! బాగా వుంటుందిరా' అంటూ పోతున్నాడు. ఆ మాటలు నా కింకా జ్ఞాపకం వున్నాయి.

మేము ఆ జామతోటకు కావలి వొప్పుకొన్నాం. అక్కడ కావలి వుండేవారం. నేను ఆ జామతోటలో వుండగా మురళి, సత్యారావు లొచ్చారు దొంగతనానికి. ఆ రోజు సత్యారావు నా దగ్గరి కొచ్చాడు మాట్లాడాలనే సంకల్పంతో, నేనూ మాట్లాడాను. అతన్ని కార్యసాధనకోసం ఆకర్షించాల్సి వచ్చింది. అప్పటినుండీ ప్రతిదినమూ రాసాగాడు. నేను నాటకమూ మొదలు బెట్టాను. ఆ తొలినాడు, అతనితో మాట్లాడాలంటే ఎంత హృదయ వ్యతిరేకంగా వుండే దనుకున్నావ్! అయినా తప్పలేదు. అవసరం వచ్చినపుడు ఏదయినా చెయ్యాల్సిందే. వసుదేవు డంతటి వాడు గూడా గాడిద కాళ్లు పట్టు కొన్నాడు. కార్యసాఫల్యానికి ఎన్నిమార్గాలుంటే అన్నిమార్గాలూ తొక్కవలసిందే నీతిపథం మాత్రం తప్పకుండా. జబ్బు బాగుకావాలంటే యిష్టం లేని మందుగూడా బలవంతంగానైనా పుచ్చుకోవాల్సిందే - సత్యారావు మాత్రం మరొక ధోరణిలో తీసుకున్నాడు, అతను చాలా సంతోషంతో యేమేమో చెప్పేవాడు. ఎన్నెన్నో ప్రమాణాలు చేసేవాడు. కుక్కలాగా తిరిగేవాడు పాపం!

ఒకనా డన్నాను: "ఆ పిల్లవాణ్ణి గూడా పట్టుక రాగూడదూ?" అని.

"ఎందుకు?" అన్నాడు సానుమానంగా.

"నీవు నా కున్నావు. మా చెల్లికి ఆ పిల్లవాణ్ణి తగిలిద్దాం" అన్నాను.

"ఓ! అదెంత!" అన్నాడు. అని గర్వంతో చూచాడు నావైపు. నేను ఆ మాత్రం పలుకులు గూడా యెంత హృదయ బాధతో అన్నానో నీకు తెలీదు. అనకపోతే వేరే దారిలేదు. మరునాడే వచ్చాడు మురళిగూడా. నేను సత్యారావును బయటికి లాక్కెళ్ళాను. తర్వాత విషయం నీకు మురళి చెప్పాడు. నేను సత్యారావును చాలా చిక్కుసమస్యల్లోకి లాగేదాన్ని. అతడు పెండ్లి తప్పక చేసుకుంటానని ప్రతిజ్ఞలుగూడా చేసేవాడు. 'తప్పక పెండ్లాడే

వారం గదా. ఇక అడ్డేమిటి?' అని అపుడపుడూ బలవంత పెట్టేవాడు గూడా. నాకు బాగా తెలుసు. యువకు లెంతమంది అట్లాంటి విషయంలో స్థిరంగా వుంటారో! స్త్రీ అమాయకత్వంచేత పురుషుడికి లొంగి. కామకార్యానికి ఒడ బడితే అంతే! ఇకదాని అధఃపతనాన్ని అది కొని తెచ్చుకున్నట్లే! ఆ వుద్రే కంలో బాగా విహరించి ఇంతే గదా. అని వెళ్ళిపోతారు. పూర్వపా కర్షణ వుండదు, మళ్లీ దీని మొగం చూడరు, ఆ విధంగా ప్రేమ వివాహం అంటూ అమాయికపు బాలికలను నాశనంచేసే యౌవను లెంతమంది! ఆ విధంగా దెబ్బ తిని జీవితాన్ని నాశనం చేసుకున్న పిల్ల లెంతమంది! అవన్నీ నాకు బాగా తెలుసు. మానాన్న ఉదాహరణ సహితంగా చెప్పేవా రట్లాంటివి! నేనూ చాలా చాలా చూశాను. సత్యారావును నిజంగా మార్చాలని చూచాను. అతని కెంతసేపూ కామతృష్ణపైన్నే కేంద్రీకరణ! అయితే నేను వాదించి నపుడంతా తప్పక పెండ్లాడతా ననేవాడు. దాంట్లో నాకు నమ్మకంలేదు. తర్వాత తర్వాత అతని చేష్టలుచూచి నేను హృదయం పూర్తిగా మార్చుకున్నాను. ఏ పరిస్థితిలో గూడా అతన్ని పెండ్లాడ ననుకున్నాను.

''అయితే వాడితో అంతగా యెందుకు తిరిగావు?''

''అంతా చెప్పనిచ్చి సీతకు రాముడేం కావాలంటా వేమిటి?'

"అందరూ వ్యభిచారిణి అనుకోరూ?''

''అనుకుంటారు. అది నాకు తెలుసు. వా ళ్ళనుకున్నంత మాత్రాన సత్య మెక్కడ పోతుంది!''

''సత్య మెవరికి కావాలి లక్ష్మి, పదిమందీ ఏదంటే అదే.''

''పదిమందీ గట్టిగా అరిచినంత మాత్రాన అసత్యం సత్యం కాదు క్రిష్ణయ్యా?''

''అయితే సత్యం కావాలని ఎవడు చూస్తాడు లక్ష్మి?''

''ప్రయత్నించకపోతే తప్పెవరిది? వీళ్లు అపార్థం చేసుకొని, సత్య మతావలంబిని అగుడు పట్టిస్తారన్నమాట!''

''అదిపోనీ, విన్నందరూ వ్యభిచారిణి అన్న తర్వాత యెవడు చేసి కొంటాడు?''

"నా విషయం పూర్తిగా అర్థం చేసుకున్నవాడే చేసుకుంటాడు."

"నీ హృదయాన్ని అర్థం చేసుకొన్నవాడే రావచ్చు. అపవాదం కోసమన్నా వెరవాలిగా!"

"అపవాదాలే గదా! నిజవాదాలు గావు గదా! అయినా, అట్లాంటి వాటికి వెఱచేవాడు నా సమీపానికే రాడు."

"అపవాదానికి భయపడకుండా యెవడూ వుండడు."

"అపవాదం అని తెలిసిగూడా జంకేవాడు మనిషేగాడు. ఎవడన్నా చేసుకొనేవాడు తన కోసమా లోకం కోసమా?"

"పోనీ, సత్యారావు నింకైనా రాకుండా చేస్తావా?"

"ఇవేంటీ మాటలు క్రిష్ణయ్యా! అత డొస్తే యేం, రాకపోతే యేం. అయినా అత డిటీవల రావటంలేదు. వచ్చినా మామూలుగానే చూస్తాం? కొంతేనా! దుర్మార్గుల యెడ జాగ్రత్తగా వుండాలని నా అభిమతం. ఇప్పటికే రున్ని జరిగాయి. వాళ్ళకేముంది! నిద్రపోయేటప్పుడు యింటిపైన రాళ్లు అవ్వవచ్చు. అగ్గికూడా పెట్టవచ్చు. వాళ్ళతో మంచిగా వుండటమే మంచిది! అంతే!"

మురళీ, సీతా వింటున్నా రిదంతా. ఎక్కడో పెట్టిన పాదం, జారిజారి ఎక్కడికో పోతూవుంది.

తటాలున బయటికొచ్చి, 'క్రిష్ణయ్యా! ఇక చాలురా నీవాదం. ఇది వరకంతా ఆ సత్యారావుగాడు యేడ్పించాడు లక్ష్మిని. మళ్ళా నీవుగూడా తయారయ్యావు. ఏదో పాడుతత్వాలు హృదయంలో పెట్టుకొని వాటితో తూకం వేస్తూ మాట్లాడ్తా రెందుకో వ్యక్తులు, అసలు సత్యం నగ్నంగా కని పిస్తూవుంటే పైగా ఈ ప్రశ్న లేమిటి? నలుగురూ అంటే మాత్రం అది అసత్యమే అని మనకు తెలిసినపుడుగూడా అనుమాన మెందుకు? ఇతర్లను మానిస్తున్నారు కాబట్టి మన మనుమానించాలా? జంకాలా? లక్ష్మిని అర్థం చేసుకోవాలంటే నీవింకా కొన్నినెలలైనా ఆమె పాదసేవ చేయాలి పద" అన్నాడు విరక్తితోటి చిరునవ్వుతో లక్ష్మి వైపుచూస్తూ.

"సెలవు" అని బయలుదేరారు. వాతావరణం అంతా నిరుత్సాహంగా వుంది. అసంతృప్తితో లోపలికెళ్ళింది లక్ష్మి. లోపలికిపోతూ అంది: ఈ మగవాళ్లు ఈ జన్మలో మారరు" అని.

అందరూ కాలేజీలకు మళ్ళా అప్లై చేస్తున్నారు. వయసు నిర్బంధం వల్ల మురళి డాక్టర్ కోర్సుకు పోవడానికి వీలులేక పోయింది. బి. యస్. సి. చదివిం తర్వాత పోవచ్చని సరళ చెప్పింది. ఆ ప్రకారమే మద్రాసు వెళ్ళాలని నిశ్చయమైంది. మద్రాసులో తన యింట్లోనే వుండాలని చంద్రమణి పట్టు పట్టింది.

ఇక రేపు వెళ్తాడనంగా ఈ దినం వచ్చాడు క్రిష్ణయ్య మురళి యింటికి, బయటికి పిల్చాడు. ఏకాంతంగా కూర్చొని, "చూడు మురళీ! నేనెంత బ్రతిమాలినా లక్ష్మి వినడం లేదు" అన్నాడు.

"ఏం, ఎందుకు?" అన్నాడు ప్రశ్నార్థకంగా చూస్తూ.

"నేను నా ఆస్తికంతా కొన్ని నెలలనుండీ యజమాని నయ్యానని తెలుసుగా! కాలేజీలో చదివిస్తా నన్నాను. ఎపుడో, ఏదో అన్నానని అది పట్టుకొని కూర్చుంది. వద్దంటే వద్దంటూ వుంది!"

"సీతేమంటూ వుంది."

"ముందే వద్దని కూర్చున్నదిగా!"

"వాళ్ళంతేనోయ్! మరి నీవేమో అంతగా తీశేసి మాట్లాడావానాడు వాళ్ళ గురించే. నీ హృదయ సంస్కార మెంత మాత్రమో, తెలుసుకుంది లక్ష్మి."

"తాను జాగ్రత్తగా వుండాలట: ఇపుడు నా డబ్బు తీసుకుంటే. తాను మొగమోటమిలో వుండాల్సొస్తుందట! ఆ మొగమోటమి వల్ల వెనక చిక్కులొస్తాయట!"

"అవును బాగానే గ్రహించి అంది, లక్ష్మికి బలే దూరాలోచన వుందిరా! అయితే యింతకూ యేం చేస్తారట!"

"మొన్న సీత వీకు చెప్పిందటగా! అంతే! ఇద్దరూ సెకండరీగ్రేడ్ చదువుతారట! అంతేనట! దానికి తిరుగు లేదట!"

"అవును. దాంట్లో అయితే ఇద్దరికీ స్థయిఫం దొస్తుంది."

మురళి సీతకు చెప్పడానికెళ్ళాడు. అతన్ని చూడగానే సీత కన్నీరు పెట్టింది.

"ఎందు కేడుస్తావ్ సీతా" అన్నాడు లోపలికి తీసుకెళ్ళి పోతూ.

"నేను నీ మాట వినలేదని కోపమా?"

"లేదు సీతా! ఆ ప్రతిజ్ఞతో రెండేండ్లు గడిపాం. ఇక రెండేడ్లు అట్లాగే వుందాం. అది యిద్దరి మంచికి."

"అవును మురళీ! యిద్దరి మంచికి, అయితే, ఇక నీవు నాకు కనబడవు గదూ" అంది దీనంగా చూస్తూ సజల నేత్రాలతో.

"అదేమిటి సీతా?"

"నన్ను మరిచిపోకు మురళీ! ఎందుకో నీవు బయటి కెళ్ళితే నమ్మకం వుండదు. నీ కింత చక్కదనం లేకుండా వుంటే బాగుందేదని అనుకుంటూ వుంటాను," అంది.

"అంతమాత్రం లేకపోతే నీ అందానికి ఈడు సరిపోదు సీతా" అంటూ ఓదార్చి, బయటి కొచ్చాడు. లక్ష్మితో ఈ దినం చాలాసేపు మాట్లాడాడు.

# 9

ఆ రోజు చంపక పుట్టిన దినం. ఆమె చాలా చాలా బలవంతం చేయడం వల్ల మరునా డుదయం బయలుదేరాడు మురళి. మురళిని చూస్తుండగనే చంపక పరుగెత్తుకుంటూ వచ్చి, చెయ్యి పట్టుకొని, అక్కడ కూర్చున్న వాళ్ళ దగ్గరికి పిలుచుకొచ్చింది. అదొక పెద్ద హాలు. హాల్లో గోడలకు నాలుగు వైపులా నాలుగు పెద్ద ఫోటో లున్నాయి. హాల్లోకి ప్రవేశించగానే ఎదురుగా గాంధీజీ ఫోటో కనిపిస్తుంది. దాని కెదురుగా రామకృష్ణపరమహంస ఫోటో

కనిపిస్తుంది. ఎడమ ప్రక్కన వివేకానంద దాని ప్రక్కన సన్యాసి రావుగారి యౌవ్వనకాలపు ఫోటో, కుడిప్రక్కన వీరేశలింగం ఫోటోలు కనిపిస్తాయి. అంతే. ఇంకే విధమైన అలంకారాలూ కనిపించవు. గోడల కానుకొని దిగువ భాగాన కుషన్ సోఫా లమర్చబడి వున్నాయి. ప్రస్తుతం హాలు మధ్య భాగాన ఒక దీర్ఘమైన బల్లా, దాని కిరువైపులా కుర్చీల వరసలూ వున్నాయి. ఎదుటి వైపు ఒక పెద్ద కుర్చీలో గడ్డం పెంచుకొన్న స్ఫురద్రూపి సన్యాసిరావు కూర్చొని వున్నాడు. బల్లకిరువైపుల కుర్చీల వరసల్లో ఒకవైపు యౌవ్వనులు మరొకవైపు యౌవతలూ కూర్చొని వున్నారు. ఇత నెరిగినవారు ఏకొద్ది మందో వున్నారు. తటాలున హాల్లోకి ప్రవేశిస్తున్న మురళిని చూచి అంద ర్లోనూ కాస్త సంచలనం బయలుదేరింది. ఆడవాళ్ళల్లో యింకా యెక్కువ సంచలనం బయలుదేరింది. అందరి దృక్కులూ అతనిపై కేంద్రీకృతం కాగా పంచ రంగుల చిత్రంలో ఒకే వ్యక్తిపై లైటు ఫోకస్ చేస్తే కనబడి నట్లే వివిధ విధాలుగా భాసిస్తున్నాడు. ఒక విధమైన రంగులో తళ తళ లాడాడు. ఆడవాళ్ళ వరస కెదురుగా వివేకానంద ఫోటో వున్నది. అది షికాగోలో ఉపన్యసిస్తున్న పోజు, అదే మాదిరిగా వున్నాడీ వస్తున్న వ్యక్తి. మురళి కప్పటికి పద్దెనిమిది పడ్డాయి. వెడలైన ఎద. ఎత్తైన మూర్తి. విశాల మైన కండ్లు. పెద్దకపోలం. వెడల్పయిన ఫాలం, చక్కగా చెక్కి చేసిన ట్లున్న తొడలూ, మీగాళ్ళూనూ. తెల్లని డ్రస్సు వేశాడు. ఒక పొడుగాటి జుబ్బా! తెల్లని పైజామా.

ఇక ప్రక్కన నడుస్తున్న వ్యక్తి అదే రూపంలో కాస్త చిన్నసైజు, వర్ణంగూడా అదే. వీళ్ళిద్దర్నీ ఒకే ఆకారం గలిగినట్టి, సైజు భేదంగలట్టి మూసలలో పోతపోశారా అన్నట్లున్నది. వీళ్ళిద్దరూ అదొక ధోరణిలో అదొక రకమైన భావప్రకటనలతో నడిచి వస్తూవుంటే అందరికీ క్యామేరాల పైకి పోయింది మనసు. ఆక్షణం వాళ్ళంతా అనిమిషు లయ్యారని చెప్పాలి. ఆ యెదు రుగా కూర్చున్నవ్యక్తి తదేక దృష్టితో చూస్తున్నాడు. ఏమిటో తనశక్తి, తన తేజస్సు, తన ఆత్మ, ఒక ఆకారం దాల్చి వస్తున్నదా అన్నట్లు తదేక దృష్టితో

చూస్తున్నాడు మురళీ వైపు. ఏదో భావం మనసులో కదిలింది. అంతా విశ్శబ్ద వాతావరణం. నిదానంగా నడిచి వస్తున్నారు మురళీ చంపకలు, బల్ల కీవైపున, సన్యాసిరావుకు అభిముఖంగా నిలబడ్డారు. అతనివైపు వేలుచూపిస్తూ "నాన్న గారు!" అంది. మురళీ ముత్యాలోలికే కించిద్విహసనాన్ని ప్రకటిస్తూ నమస్కరించాడు.

"నాన్నా" అని ఇటు తిరిగి, "నాకు దొరికిందన్న రత్నం యిదే! ఎంతో ధన్యనని నేను గర్విస్తున్నాను. అదృష్టం అట్లా వుంటుం దొక్కొక్కసారి!" అంటూ అట్లా పారజూస్తూ అనుమానిస్తున్న మహేంద్రను చూచింది. హృదయంలో జరుగుతున్న ఏదో కలకలం అతని ముఖంపై ప్రతిబింబిస్తూ వుంది. మురళీ ఏదో నాటకంలాగుందే అనుకుంటున్నాడు. "ఆ రత్నం యిదే! నా అన్నయ్య" అంది. వెంటనే అందరినీ పరిచయం చేయడం మొదలు పెట్టింది. కడపటికి ఆ అనుమానిస్తున్న వ్యక్తి దగ్గిరి కొచ్చాడు. అతని వదనం యిపుడు సంతోషంతో వికసిస్తూ వుంది. అతన్ని చూపి, "ఇతను మహేంద్ర. మా మేనమామ కొడుకు. యం. బి. బి, యస్. చదువుతున్నాడు. వచ్చే సంవత్సరం నీవూ చదువుతారుగా" అంది.

గాఢంగా కరస్పర్శచేశాడు మహేంద్ర. అతని ప్రక్కన ప్రథమ స్థానంలో కూర్చున్నాడు మురళీ. ఆ కుర్చీ అతని కోసమే ప్రత్యేకింపబడి వున్నది. ఎదుటివైపు వరసలో ప్రథమస్థానంలో చంపక కూర్చున్నది. ద్వితీయస్థానం రుక్మిణిది. ఆమె మురళిని తప్పవేరే చూడడమేలేదు.

టీ పార్టీ అయిపోయింది. అందరూ సెలవు తీసికొని బయలుదేరారు. అక్కడ మిగిలినవారు సన్యాసిరావు. చంపక, మురళీ, మహేంద్ర. అంతే. ఆ గడ్డం వ్యక్తిని ఇదివరకే చూశాడు మురళీ. అయితే ఎక్కడ? సన్యాసిరావుగూడా ఆలోచిస్తూనే అన్నాడు.

"మిమ్మల్నెక్కడో చూశానండీ! క్షమించండీ! జ్ఞాపకం రావటంలేదు."

"అవున్నాయనా. నేనూ అట్లాగే అనుకుంటున్నా. చూచి నప్పటి నుండి యోచిస్తున్నా" అన్నాడు సన్యాసిరావు.

"పూర్వజన్మలో చూచి అంటారు నాన్నా" అంది చంపక.

"ఔనౌను," అన్నా రిద్దరూ ఒక్కసారిగా.

"నేను పోయిన సంవత్సరం ఇంటరు చేరినపుడు చూశా నాన్నా. తర్వాత మా కాలేజీలో ఉపన్యాస పోటీల్లో చూశాను. ఒకనాడు చంద్రమణి పరిచయం చేసింది. తర్వాత అక్కడి కెళ్ళి నపుడంతా మాట్లాడించేదాన్ని. మాకు పరస్పరం తెలియకుండానే సంబంధం తెలుసుకున్నాం. అసలు అత నితో తొలిగా మాట్లాడేనాడే 'అన్నా' అనే శబ్దం నానోటినుండి అప్రయ త్నంగా వచ్చింది. తర్వాత ఎన్నిసార్లడిగినా చెల్లి యింటికి రాలేదు. ఈనాడు గూడా బలవంతంపైన్నే వచ్చాడు. ఆడపిల్లల యిండ్లకుపోతే అనుమాని స్తారేమో అనే భావం ఇతనిలో పట్టుకొన్నట్లుంది!" అని ముగించింది క్లుప్తంగా.

చిరునవ్వు నవ్వుకుంటూ కూర్చున్నాడు మురళి.

"నీవు అపుడపుడూ వస్తూ వుండు నాయనా" అన్నాడు సన్యాసిరావు వాత్సల్య ముట్టిపడేటట్లు.

"సరే లెండి!"

"మీ దేవూ రసలు?"

"బెజవాడ."

"ఓహో అక్కడ చంద్రమణి అక్క అంది గదూ?"

"అవును."

"బంధువులా?"

"కాదు."

"అయితే ఆమె మా అల్లుడందే?"

"నేను అన్నయ్యన్నట్లే నాన్నా" అంది చంపక.

"అవునమ్మా, బాంధవ్యమే కావాల్నా? భావం వుంటే సరి!"

"ఆ భాంధవ్యం గూడా భావం పైన్నే యేర్పడుతుంది" అన్నాడు మురళి.

''అది నిజం! వీడు నా అన్న! ఇది నా చెల్లి, ఇతడు మా నాన్న. ఆమె మా తల్లి, అని భావించితేనే - బంధించుకుంటేనే - బాంధవ్య మేర్పడు తుంది.''

''అనుకుంటూనే ఏర్పడుతుందా నాన్నా?''

''కాదమ్మా, హృదయం అందుకు తర్ఫీదు పొందాలి. ఆ భావనలోని అర్థం హృదయంలో బాగా నాటుకపోవాలి. అదంతా అనుబంధ జీవనంవల్ల వస్తుంది. నీవు 'అన్న' అని ఒకసారి అనుకుంటూనే అన్న కాలేడు. ఆ భావం నీ హృదయంలో నాటుకొని, దాని అర్థాన్ని ఆచరించిన నాడే నీకు అన్న అవుతాడు. ఏ బాంధవ్యమైనా అంతే.''

''సత్యం నాన్నా, అయితే యింతకూ భావం ప్రధాన మన్నమాట?''

''అంతే! నిన్ను నేనొక దృష్టితో చూస్తున్నా. మురళి ఒక దృష్టితో చూస్తున్నాడు. నాన్న వేరొక దృష్టితో చూస్తున్నాడు. ఇదంతా భావభేదం. నీ వేమో ఒకే వ్యక్తివే, నీలో మార్పులేదు. ఆ మార్పు మా హృదయాల్లోనే,'' అన్నాడు మహేంద్ర.

''అంతా భావంపైన ఆధారపడి వుందని అంటూన్నావు గదా! ఒక తండ్రికి పుట్టినవాళ్లు అన్న చెల్లి అనుకోకుండా వేరే భావంలో వ్యవహరించ డానికి వీలుందా?''

''ఉంది!''

''అవునా నాన్నా'' అని నవ్వింది దా వైపు చూచి.

''లేకపోలేదమ్మా. ఒక తల్లికి ఒక కొడుకూ, ఒక కూతురూ పుడతా రనుకో. ఎవరికీ అంతు తెలీకుండా, ఎవరో ఎక్కడికో చెరొక చోటికి తీసుకెళ్ళా రనుకుందాం. వాడెవడో ఆ పిల్లకూ, ఈ పిల్లెవరో వీడికీ తెలియదు. ఒక తల్లి బిడ్డలని తెలీదు. పెద్దయ్యాక ఒకర్నొకరు చూచుకోడం తటస్థిస్తుందనుకుందాం. మామూలుగా యితర్లు చూస్తే యేభావం కలుగు తుందో, అంతకంటే అన్యమైన భావం వుండదు. స్నేహం చేసుకోవచ్చు గూడా! ప్రణయం సాగవచ్చు. ఆ పైన వివాహం గూడా చేసుకోవచ్చు.

అంతే! మరొక విషయం చెబుతాను. ఒక తల్లికి ఒక కూతు రుందను కుందాం. తర్వాత ఒక పిల్లవాణ్ణి తెచ్చి సాకుతా రనుకుందాం. ఆ పిల్ల, వాణ్ణి, తన తల్లికి పుట్టిన వాడే అని నమ్ముతుంది. మామూలుగా తమ్ముణ్ణి అక్కలు ఏ భావంతో చూడాలని సంఘం నిర్దేశించి వుందో ఏ బాంధవ్య భావ మయితే సంప్రదాయంగా వస్తున్నదో - ఏ బాంధవ్య భావమైతే రక్తంలో జీర్ణించిపోయి వుంటుందో - ఆ భావంతోనే చూస్తుంది. సత్యరీత్యా వాడు తన తల్లి కొడుకు కాకపోయినా, వీడూ అంతే - ఒకవేళ బాంధవ్యం తెలిసిం దనుకుందాం. అలవాటు పడిన భావం, జారిపోక పోవచ్చు. లేకపోతే పరు లను ఏ భావంతో చూస్తామో ఆ భావంతోనే చూడవచ్చు. ఆత్మీయ భావం వదిలి, పరభావం ఎప్పుడైతే మనసులో చొరబడుతుందో, అపుడు వారి బాంధవ్య బంధం గూడ భిన్నమైన దవుతుంది.''

''ఆత్మీయభావం, పరభావం, అన్నది సరిగ్గా బోధపడలేదు నాన్నా!''

''తనవారిని తనవారుగా భావించడం,పరులను పరులుగా భావించడం-''

''మరెట్లా భావించాలి?'' అని నవ్వింది చంపక.

''సంఘ భావం అదే! కొన్ని కొన్ని సంఘాల్లో నివసించే జనులు, కొన్ని కొన్ని అలవాట్లకు లోబడి వుంటారు. కొన్ని కొన్ని నియమాలు కలిగి వుంటారు. ఆ నియమాలను ఉల్లంఘించ కూడదని వారి నమ్మకం. అవన్నీగూడా భావంపైన ఆధారపడినవే. ఉదాహరణకు: ఉత్తర హిందూ స్థానంలో మేనమామ మేనత్త బిడ్డల చేసుకోరు. తల్లికూతురు తనకు చెల్లి అయితే, తల్లి అన్నకూతురు పెండ్లా మవుతుందా? ఛీ! ఛీ! అంటారు వారు. తల్లి చెల్లెలి కూతురెంతో, తల్లి అన్నకూతురు గూడా అంతే వారికి. మన దాక్షిణాత్యులకో! మహేంద్ర మీ మేనమామ కొడుకుగదా! నీవు ఉత్తర హిందూస్థానవాసుల దృష్ట్యా చూస్తే ఏమవుతుంది? ఇంకొకటి! అదింకా దారుణం! అక్కకూతుర్ని చేసుకోడమూ అన్న శబ్దం వింటే ఉత్తరహిందూ స్థానీయులు వాంతి చేసుకుంటా రనుకుంటాను. అంతకంటే అన్నకూతురి నెందుకు చేసుకోగూడదూ? అంటారు! అదే బాగుంది! మరి మనమో!

అవ్యర్థా భావిస్తున్నాము. కొంతమంది మూఢులు,- 'మా చెట్టుకు కాసిన కాయను మేమే అనుభవిస్తాం,' అంటూ వుంటే విన్నాను స్వయంగా! ఇట్లాంటి వెన్నో వున్నాయి. మన సంఘం ఒక విధంగా భావిస్తున్నదా బాంధవ్యాన్ని. ఆ సంఘం దీన్నే విరుద్ధంగా భావిస్తున్నది. అదీ సంఘభావ మంటే! ఒకడెవడో మొదట కక్కుర్తికి ఏదో గడ్డి కరుస్తాడు. వాణ్ణి మరొక డనుకరిస్తాడు. మనది హిందూమతం. హిందూమతం వేదాన్ని నమ్మడంపై ఆధారపడివుంది. వేదాలు విధులను విధిస్తాయి. వాటిని ప్రశ్నించగూడదనే వాదం అనాదిగావుంది. అదేవిధంగా పెద్దవాళ్లు చెప్పినదాన్ని ప్రశ్నించగూడదని అందరి యొక్క నమ్మకం. పెద్దవాళ్లు తప్పుచేసినా, మంచి చేసినా ప్రశ్నించగూడదు అని అనాదిగా వస్తున్నది మనమూఢాచారం.అంచేత మీ పెద్దవాళ్లు చేసినట్లు చెయ్యాలి అనే భావం అజ్ఞానుల్లో కలిగింది. దాన్ని చెయ్యటమే. దాని మంచి చెడ్డలు తెలుసుకోకుండా, విధిగా చెయ్యాలి అన్న మూఢ విశ్వాసమే ఆచారము! ఆ ఆచారాన్ని అనుమతించిన వారంతా ఒక ముఠా. ఆ ముఠా ఒక సంఘం. ఆ సంఘం ఆ ఆచారాలను విధులుగా స్వీకరిస్తుంది. గ్రుడ్డిగా వాళ్ళ మాదిరి యెవడైతే ఆచరించడో వాణ్ణి వెలివేస్తానంటుంది. వీటికన్నిటికీ మూలకందం స్వార్థం. తనవాడు, తనది, తనకోసం, అన్నదే స్వార్థం. తన తల్లికి పుట్టినవాడు తమ్ముడు. తన నాన్న తర్వాత పుట్టినవాడు తన చిన్నాన్న. తన తల్లిని ముట్టగూడదు. తన చెల్లిని, అక్కను కామించ గూడదు. ఇల్లాంటి వన్నీ ఆత్మీయ భావాలు! పరులతో ఎట్టి బాంధవ్యంతోనైనా మెలగవచ్చు, అదే పరభావం అంటే.''

''ఇది వరకు మీరన్న దానిలో, పెంచబడుతున్న ఆ పిల్లవాడు తన తల్లి కొడుకుకాదని తెలుస్తుం దనుకుందాం. అపుడు భావంలో మార్పు వస్తుందా?''

''నే చెప్పానుగా! చిన్నప్పటినుండీ అనుబంధంవల్లా - భావానుకరణ వల్లా - తన తల్లికొడుకు తమ్ముడనే అనుకుంటుంది. తమ్ముడనే భావం కలిగితే ఆ బాంధవ్యం యిక కామించడానికిగానీ, మోహించడానికిగానీ, అనువు

తించదు. తన తమ్ముడు కాదు అని తెలిసినా ఇదివర కేర్పడిన సోదరభావం మారక పోవచ్చు. అయితే ఆ నిగూఢ బాంధవ్యం యెపు డయితే తన యదార్థ స్వరూపంతో బయటపడుతుందో, భావం తటాలున మారవచ్చు. పర భావం కలగవచ్చు."

"అట్లా మార్చుకోడానికి సంభవమా నాన్నా?"

"తప్పక! అందులో సందేహ మేమాత్రమూ లేదు" అన్నాడు మహేంద్ర.

"ఇన్నెందుకు? ఒక పడుచు ఒక పిల్లవాణ్ణి కనిపారేసి వెళ్ళి పోతుం దనుకో. ఎక్కడో ఎవరికీ తెలీకుండా పెరుగుతాడు. మళ్ళా ఆ తల్లి నే మోహించడానికి ఆస్కారం వుంది" అన్నాడు మళ్ళా మహేంద్ర.

"ఛీ! ఛీ! వాదమంత కంతకూ చిద్రంగా తయారౌతున్నది" అంది చంపక చీదరించుకుంటూ చిరునవ్వుతో.

"శాస్త్రయుక్తంగా చూద్దాం చంపకా ఇందులో యే ముంది?"

"ఏవి అర్థాపు మాటలో, ఏవి కావో ఆలోచించబనిలేదా?"

"అర్థా తానర్థాతలు భావంపైన ఆధారపడ్డవే చంపకా!"

"చూడన్నయ్యా ఎట్లా వాదిస్తాడో" అంది మురిపెంగా మురళి వైపు చూచి.

"అది సత్యం" అన్నాడు మురళి ముక్తసరిగా.

కాసేపు ఊరుకున్నాక, సన్యాసిరావు మురళి కుటుంబానికి సంబంధించిన ప్రశ్నలు వేశాడు. అతడు జవాబిస్తూ సరళకు యం. ఎ. చదవాలని అభిప్రాయమున్నా, రెండేండ్లు నుండి వాళ్ళ తండ్రికి దగ్గు పట్టుకొంది కనుక రాలేదని చెప్పాడు. ఇంకా అమాటా యీమాటా మాట్లాడినాక 'వస్తానండీ' అంటూ నమస్కారం చేసి లేచాడు మురళి.

"అట్లాకాదు. భోంచేసి పోవాల్సిందే" అని లాగింది చంపక.

"అంతే! అంతే" అన్నా రందరూ,

అందరూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ భోంచేశారు. భోంచేశాక

వీళ్లు ముగ్గురూ వచ్చి రేడియో పెట్టుకున్నారు. పాటలు రానపుడు గ్రామఫోను పెట్టుకున్నారు. పాటలు వింటూన్న మురళి అక్కడే సోఫాపై నిద్రపోయాడు నిద్రలేచేటప్పటికి మూడు దాటింది. కాఫీ, ఫలహారా లయ్యేటప్పటికి నాలు గయింది. 'వెళ్తా' నంటూ మరలా లేచాడు మురళి. అప్పటికి ప్రక్కనే వున్న చంపక, అతని రెండు భుజాలపైనా చేతులువేసి, అదిమి, ''కూర్చో వయ్యా'' అని కుర్చీలో కూర్చోబెట్టి, ఆ చేతు లట్లాగే వుంచి, వాని మొగం పైకి వంగి అర్థించే ముఖభంగిమతో, ''అన్నయ్యా, ఈ పూట వుండవూ సినిమాకెళ్దాం మన మ్ముగ్గురం.'' అంది. ఆమురిపాన్ని చూచి, చెల్లెలు లేని కొదవ చంపక తీరుస్తున్నట్లుగా హృదయంలో అనిపించింది మురళికి. ఆమె వేడికోలు కాదన లేకపోయాడు. అయితే తటాలున ''వెళ్ళాలమ్మా. అత్తయ్య అరుస్తుందేమో!'' అనే మాటలు దొర్లాయి! తక్షణమే పరుగెత్తింది చంపక ఫోను దగ్గరికి.

''అన్నయ్య యీవేళ యిక్కడే వుంటాడు'' అంది చంద్రమణితో,

''అవును, మా అన్నయ్యతో నివసించేవాళ్లు ఒక క్షణం చూడకపోతే గూడా వుండలేరు.''

''నా సరసాలకేం గాని చెప్పాలి మరి!''

''.... .... .... ....''

''మీ అల్లుడుగార్లేకపోతే ఒక పూటయినా జరగదు గాబోలు!''

''.... .... .... ....''

''సరేలే! సినిమా తర్వాత ఫోంచేసి వస్తాళ్ళే.''

''రెండు పూటలుగాదు. మా యన్న మా యింట్లో యెన్నేండ్లు తిన్నా తృప్తి తీరదు.''

''.... .... .... ....''

"అబ్బా! సరేలే, భోజనానికట అక్కడికేనట పోవయ్యా" అని యేడుపు మొగంతో చూస్తూ రిసీవర్ అట్లా పారేసి, మూతి బుద్ధగించుకొంది ఒక మూలగా కూర్చుంటూ.

"రోజూవచ్చి తింటాలేమ్మా. ఇక యీ యిల్లుమందేగా" అన్నాడు మురళి దగ్గరగావచ్చి కూర్చొని చుబుకం స్పృశిస్తూ.

"మరి ఆమెకే అంత పట్టుదలయితే నాకో! నాకు మాత్రం అంత హక్కు లేదు కాబోలు!" అంటూ దుఃఖజనితంగాని అశ్రుజలాన్ని తుడుచుకొంది చిరునవ్వు నవ్వుతూ.

"లేకేమమ్మా! కాబట్టేగదా సినిమాకు పోవడానికి నేనూ, ఆమె ఒప్పుకోడం!"

సినిమా హాల్లోకి ప్రవేశించటం, చిత్రం మొదలు పెట్టడం, ఒక్కసారే జరిగింది. బాక్సులో కూర్చున్నారు వీరు. వీళ్ళ ముందువైపు యిద్దరాడవాళ్లు కూర్చొనున్నారు. అది మర్చెంటాఫ్ వెనీస్ అనే షేక్స్పియర్ రచన. పోర్షియో కోసం వచ్చిన వరులకు పరీక్ష జరుగుతున్నది. బెసానియో విషయంలో నాయిక పక్షపాతం చూపి సాయం చేస్తూవుంది. మాట్లాడిస్తూవుంది. ఎంతో వలపుతో మాట్లాడుకుంటూ వుంటారు - అంతలో తటాలున ఫిల్ము కాలిపోయింది. ప్రేక్షకుల కేకలతో పాటు ఒక్కమాటుగా హాలంతా విద్యుద్దీప కాంతితో వెలిగింది. "అదే ప్రేమ ప్రోత్సాహం" అంటూ వుంది లలిత. ఆమె ఆమాట అనడమూ, లైట్లు పడటమూ, ఆ వెలుగులో తనకు ఎడమవైపున కాస్త వెనుక భాగంలో కూర్చొని వున్న మురళి దృష్టుల తన దృష్టు లెదుర్కొనడమూ - ఒక్కసారే తటస్థించింది. కండ్లు వెనక్కి తీసుకుందామన్నా రాలేదు. మంత్రించి బంధించినట్టుగా ఆ యువకునిలో యిరుక్కొని పోయినట్లయింది. అసలు మనసంతా చక్షురింద్రియం గుండా కేంద్రీకరింపబడి, వానివైపు ప్రవహిస్తున్నదా అన్నట్లు తోచిం దామెకు! మనస్సు చేస్తున్న యీ వ్యాపారం దానిపై అంతస్తులో వున్న బుద్ధి గ్రహించింది. దాని కావలనున్న అహం, ఏదో మెరుపు మెరిసినట్లుగా గ్రహించింది.

తక్షణమే గొంకుహృదయంలో చొరబడింది. ఆ గొంకు భావ లౌల్యాన్ని ప్రసాదించింది. అది నేత్రలౌల్యాన్ని కల్గజేసింది. లోపలి సంతోషం నేత్రాలకు విస్తీర్ణతను ప్రసాదించింది. కోర్కెలు కెళ్ళింతలు కాగా, మెచ్చికోలు రెప్పలల్లార్చునట్లు చేసింది. ఇంతలో "ఓహ్, లలితగారా!" అన్న శబ్దం ఆమె కర్ణపుటాల్లో దూరగా, మనస్సును అక్కడుంచి దృష్టిని మాత్రం మరల్చింది. మనస్సు అన్యాక్రాంతంకాగా తనకు తానే భిన్నవ్యక్తిగా భావించుకుంటూ వుంది లలిత.

"నమస్తే లలితగారూ?" అన్నాడు మహేంద్ర.

"ఓహ్! మహేంద్రగారా? నమస్తే" అంది ఒక మోస్తరు సిగ్గుతో మొగంమీది చెమట బిందువుల తుడుచుకుంటూ.

"అతడు మా స్నేహితుడు; మురళి. బి. యస్. సి. పరీక్షలకు కూర్చున్నాడు. ఈమె మా మెడికల్ కాలేజీలో డిమాన్‌స్ట్రేటరుగారు పేరు లలితగారు-" అన్నాడు పరిచయం చేస్తూ మళ్ళా.

"ఈమె, మా మేనమామ కూతురు చంపక. వచ్చే సంవత్సరం వీళ్ళిద్దరూ మన కాలేజీలో చేర్తారు." అన్నాడు.

"చాలాసంతోషం" అంటూ, మురళి వైపు చూచి, చంపక చెయ్యి నొక్కింది లలిత.

ఇంతలో లైట్లు ఆరిపోయాయి. తెరపై, పోర్షియో, బెసానియోలు కనిపిస్తున్నారు. లలిత దృష్టి మాత్రం ఆ బొమ్మలపై పెట్టిందిగాని మనసు అందులో లేదు. 'ఏమిటీ విచిత్రం! ఈ యువకు దెవరు? ఎక్కడో, ఎప్పుడో చూచినట్లున్నది. నిత్యమూ ఇతని కోసమే వెదకుతూ వున్నట్లుగానూ, హఠాత్తుగా లభించినందువల్ల అతి తృప్తిగానూ వుంది నా మనసు. వద్దనుకున్నా, సర్వేంద్రియాలూ అతని ఆకర్షణలోబడి స్పర్శసుఖాన్ని కోరుతున్నాయి....ఛీ! ఛీ! ఏమిటిది; ఇతనితో గల ఈ తాత్కాలిక, క్షణిక పరిచయం ఈ సినిమా చూడడంలాంటి దానికంటే భిన్నమెట్లా అవుతుంది?- ఈ విధంగా ఆలోచిస్తూ కూర్చున్నది లలిత, సినిమా చూస్తూ అపుడపుడూ దృష్టి వెనక్కి సారించేది

గూడ. అట్టి సమయాల్లో, అంత చీకట్లోగూడా ఆ రెండు కండ్లూ అభి ముఖంగా కనిపించేవి.

చంద్రమణి ఆ దినం యెక్కడికీ పోలేదు. ఆ దినమంతా అల్లుడితో గడపాలని ప్రోగ్రాం వేసుకుంది. సినిమాకు వెళ్ళాలనుకుంది. బీచీకి వెళ్ళాలను కుంది. ఇంకా యేమేమో అనుకొంది. మురళి తప్పించుకు పోయాడు. చంపక పట్టిన పట్టులో, ఇంకేమి చేసినా అనుమాన పడుతుందేమో అని అనుమా నించి, మురళి సినిమాకు పోవడానికి ఒప్పుకొంది. తానుగూడా అదే సిని మాకు వెళ్లాలని ఊహించింది. కాని, వాళ్ళంత మంది వుంటారు గదా, ప్రయోజనం యేమిటి? అని విరమించుకొంది. సెలవు పెట్టిన దినమంతా వృధా అయిపోయెనే అని చింతించింది. హృదయ కుహరంలో భావసంచ లనం రేగింది. తన పడక గదిలో ఏదేదో ఊహిస్తూ పడుకొంది కాసేపు. పడుకోలేకపోయింది. మంచం దిగి, కాలుగాలిన పిల్లి లాగా అటూ యిటూ తిరిగింది కాసేపు గదిలోనే, కూర్చొని కాసేపు రేడియో పెట్టుకుంది. అదీ సహించక మూసేసింది. బయలుదేరింది బీచీకి కారు లేకుండా. ఆ దినం తానూ, తన అల్లుడూ కూర్చున్న చోటికి పోయింది. ఆనాడు-ఇప్పటికి నాలు గేండ్లనాడు-తన అల్లుడూ తానూ ఇక్కడే కూర్చున్నారు. ఇక్కడే అతన్ని గట్టిగా చుంబించి హృదయానికి హత్తుకున్నది! ఇక్కడే ఆ కసిగాయను ముదరడానికై వదిలింది. అదేచోట కూర్చొని, ఆ దృశ్యాన్ని ఊహించే టప్పటికి, ఆమె హృదయంలో చక్కిలి గింతలు పెట్టినట్లయింది. ఏమిటో - హృదయాన్ని పట్టలేకుంది. పెదవులు బిగించి, మోకాళ్లు ముడిచి, తన యెద కేసి గట్టిగా బంధించుకొంది. అదే మురళి అయితే.........అట్లా అర్ధనిమీ లిత నేత్రాలతో సముద్రం వైపు చూచింది. అప్పటికి ప్రొద్దుక్రుంకి గంట యింది. చంద్రుడు మింట తళతళలాడుతున్నాడు. ఆ చంద్రకిరణాలు దట్టంగా పడి నీటి పైనంతా బంగారురేకు పరిచిన శోభను కల్గిస్తున్నాయి. ఎత్తైన అలలు లేస్తున్నాయి. ఆ అలల కదలిక. గాఢోచ్ఛ్వాస నిశ్వాసములచేత ఎత్తుగా ఉబ్బుతూ, పడుతూ వున్న తన వక్షాన్ని అనుకరిస్తున్నది. ఆ అలల పై చంద్రకాంతి మెరిసిపోతూ వుంది. చల్లని మారుతం వీస్తూ తనువును

తాకుతూ వుంది. ముందే ఆమె ఉద్రిక్త అయింది, ఈ వాతావరణం రెచ్చగొట్టిందా వుద్రేకాన్ని. ఉన్మాదం కలిగినట్లుగా లేచింది. బిరబిర వచ్చేసింది. కాసేపటికి సినీమా వదిలే టైమయింది. కారేసుకొనిబుర్రున వెళ్లింది. గేటు దగ్గర కాచింది. మురళీ కనబడగానే అరువు యిచ్చిన తన వస్తువును, అధికారంతో లాక్కున్నట్లు లాగి కార్లో కూర్చోబెట్టింది. ఒక క్షణం - యింట్లో వాలింది.

ఆమె తొందరపాటును మురళీ కనిపెట్టకపోలేదు. అయితే ఆమె చర్యలపైన మనసును కేంద్రీకరించలేదు. సినీమాలో జరిగిన సంఘటనను గురించే ఆలోచిస్తున్నాడు. సినీమా అనంతరం ఆమె అట్లా యెందుకు తన వయిపు అంత తమకంతో చూచింది. చూపుల్లో ఎంత వాత్సల్యం కనబడుతుంది? ఆ వాత్సల్యంలో ఎంత మాధుర్యముంది? పోతూపోతూ వదలలేక వదలిపోతున్నట్లుగా చూచిన ఆమె చూపులు తన హృదయాన్ని ఎంతగా బంధించి లాగుతున్నా యిపుడు గూడా!

"మురళీ స్నానానికి లే?" అన్న తొందరపాటు సంబోధన విన్నంత వరకూ మురళీ యీ లోకంలో లేడు. సబ్బు, టవల్, పంచ అన్నీతెచ్చి అక్కడపెట్టి బిరబిరా వెళ్ళిపోతూ, త్వరగా కానీ స్నానం అంది. 'ఎందుకీ తొందరీ దినం' అని అందామనుకున్నాడు గాని మళ్ళా ఉపేక్షించి ఊరుకున్నాడు. అతడు స్నానంచేసి రాగానే తానూ వెళ్ళి త్వరత్వరగా స్నానం చేసి, గదిలో కొచ్చింది. జుట్టు జారుముడి వేసుకుంది. క్షణంలో సింగారించుకొంది. దట్టంగా పౌడరుగూడా మెత్తుకొంది స్నోపైన. విలువు టద్దం ముందు నిలబడింది.

చంద్రమణి చామనచాయ మనిషి. తగినంత యెత్తు, అంతమాత్రం దార్ఢ్యం! ముప్ఫయి యేండ్లుంటాయి. మంచి ప్రౌఢ. చక్కదనంలో, సోయగంలో, ఆమెకు సాటి ఏ కొద్దిమందో వుంటారు. ఈ లక్షణాలకు ఆమెలో కలిగిన ఆనందం తోడుకాగా, ఉద్రేకం ఉబికిరాగా, కోర్కెలు గుబ్బటిల్లగా శరీరమంతా ఒక్కసారి ఉబికిపోయింది! నరములంతా ఒక్కసారిగా బిర్ర

బిగిసినయ్! తన సోయగాన్ని తాను చూచుకొని మురిసిపోయింది. ఆ లావణ్యా నికి తానే ఆకర్షింపబడి వివశత్వాన్ని చెందింది. 'మురళీ' అని మధురమైన కేకవేసింది. మధురభావాలతో మురళివచ్చి వెనుక నిలబడ్డాడు. అద్దంలో ఒక ర్నొకరు ఒకక్షణం చూచుకున్నారు, ఆకర్షణబాణాలు వేసుకుంటున్నట్లు. తమకంతోడి ఆ చూపులు పాశాల్లాగా లాగగా 'మురళీ' అంటూ వివశత్వం జెంది అతన్ని బంధించింది.

కాసేపటికి లైటు వెలిగించింది. చంద్రమణి లేచి, చెదిరినవన్నీ సర్దు కుంటూ ప్రక్కన కూర్చుంది. అటుతిరిగి పడుకున్నాడు మురళి. "మురళీ" అని ముద్దుగా సంబోధిస్తూ వాని తలపట్టి తనవైపు తిప్పుకొంది. వాని కండ్ల ల్లోంచి నీరుకార్తున్నది. ఆమెమొగం చూడలేకపోయాడు.

"మురళీ! ఇట్లా చూడు! ఎందుకట్లా వున్నావ్? తప్పు చేశానని అను కుంటున్నావా?"

'అవు'నన్నట్లుగా కండ్లుతెరిచి మళ్ళా మూసుకున్నాడు.

"నీవు మంచివాడవు గదూ! నువ్వు తప్పు ఎప్పటికీ చెయ్యవ్" అంటూ గట్టిగా ముద్దుపెట్టి వాడి తల తనవొళ్లోకి తీసికొని, గవదలు నిము రుతూ తన అదృష్టానికి మురిసిపోతూ కూర్చుంది.

పునఃస్నానానంతరం ఒకేచోట భోజనానికి కూర్చున్నారు పార్వతీ పరమేశ్వరుల్లాగా. ఒక్కొకముద్ద, ఆకొన్న పసిబిడ్డనోటి కందించినట్లు అంది స్తున్న దామె మురళి నోటికి. "నువ్వుగూడా తిను" అన్నాడు మురళి.

"అబ్బా! వద్దు మురళీ! నాకేమో అమృతాన్ని కడుపునిండా సేవించి నట్లుంది. అమృతమాధుర్యం రక్తంలో కలిసి అన్ని నాడులలోనూ ప్రవ హిస్తున్నట్లుంది. హృదయం నిండిపోయినట్లుంది" అంది.

ఊదువత్తుల పొగ వాసనతో నిండిన గదిలో, పన్నీటి ఆవిరితో నిండిన వాతావరణంలో, మల్లెపూవులాంటి తెల్లని శయనంపై దట్టంగా పూలుచల్లి అందుపై శయనించిన రంభలాంటి చంద్రమణితో ఎంత వరకూ మేలు కొన్నాడో గాని, మరునా డుదయం యేడున్నరకు గూడా నిద్ర లేవలేదు

మురళి. అతన్ని స్టేషనులో దిగబెట్టడానికి కారేసు కొచ్చిన చంపకా, మహేంద్రలు వచ్చి "డాక్టరుగారు లేరా!" అన్నారు. మూసివున్న గదిని చూస్తూ. "లోపలే వున్నారండీ" అంది పని మనిషి. కొంచెంకొంచెం మెలకువ గంటున్న చంద్రమణి అది వింది. ఉగిత్తలగా లేచింది. హడలెత్తి పోయి నట్లుగా. హడావుడిగా వూపిలేపింది మురళిని. ఏదో శబ్దం చేయబోయినవాడి నోటినిమూస్తూ, చెవిలో చెప్పింది. గాభరాపడ్డాడు మురళి. అదృష్టవశాత్తు ఆ గదిలోనుంచి మురళి గదిలోకి దారి వుండడంవల్ల సరిపోయింది. బ్రతుకు జీవుడా అంటూ తనగదిలో పడ్డాడు మురళి. అతడట్లా దూరగానే చంద్రమణి తన గదితలుపు తీసి బయటి కొచ్చింది. "నమస్తే" అన్నా రిద్దరూ. "నమస్తే" అంటూ మొగం కాస్త పక్కకు తిప్పింది చంద్రమణి ఆవళిస్తూ. "అదేమిటండీ! డాక్టరుగారూ! రాత్రంతా శివరాత్రిజాగారం చేశారా" అని చంపక అంటూ వుండగానే ఆమె స్నానాల గదివైపు వెళ్ళిపోయింది. తన గదిలోనుంచి వస్తున్నట్లుగా బయటికొచ్చాడు మురళి కండ్లు పులుంకుంటూ. వచ్చి, వళ్లు విరుచుకుంటూ కూర్చున్నాడు.

"అన్నయ్య యీపాటికి స్టేషనులో వుంటాడు" అంది చంపక నవ్వుతూ.

"లేదు, లేదు. కార్లోపోతూవుంటా డీపాటికి" అన్నాడు మహేంద్ర నవ్వుకుంటూ. అట్లాచూచి

"ఏంటన్నా, కండ్లు ఎర్రగా పత్తికాయల్లాగా వున్నాయి. రాత్రంతా నిద్రపోయినట్లు కనిపించదే? ఏదో కొట్టిపదేసిన మనిషిలాగా వున్నావ్! పక్కలో నలిగిన గులాబీపువ్వులాగా వున్నావు." ఈ కవిత్వాన్ని మాట్లాడుతున్న చంపక వైపు చూడకుండానే తలవొంచుకొని కూర్చున్నాడు మురళి. తనకూ, మొగం తుడుచుకుంటూ, స్నానాల గదిలోనుంచి వస్తూన్న చంద్రమణికీ, హృదయాల్లో సమ్మెటపోటుల్లాగా తగులుతున్నాయా మాటలు. 'ఇది పిల్లగాదురాబ్బా, పిడుగు.' అనుకుంటూ, బయటికి మాత్రం గంభీరంగా "రాత్రి పడుకునేటప్పటికి చాలా ఆలస్యమయింది" అంది చంద్రమణి. అంటూ తన టాయిలెట్ గదిలో కెళ్లింది.

ఆనాడు మురళి వెళ్ళలేదు. మరునాడు వెళ్ళలేదు. ఒక మూడు వారాలు పోలేదు. చంద్రమణిగూడా ఒక నెలసెలవు పెట్టింది హాయిగా గడప వచ్చని. చంపక అడిగింది యింటి కెందుకు పోలేదూ అని, రిజల్ట్సు చూచు కొని వెళ్ళాలని వుందన్నాడు. అదీగాకుండా చంద్రమణి తనకు డాక్టర్ కోర్సులో సీటుకోసం ప్రయత్నం చేస్తూవుందన్నాడు. చంద్రామురళులు అహర్నిశలూ ఒకరొన్కకరు విడవకుండా అయిపోయారు. బాగా తినడం, జల్సాగా తిరగడం, సినిమాలకు వెళ్ళడం, హాయిగా భోగించడం - ఇంతే! ఇటీవల ఒకక్రొత్త అలవాటుగూడా అలవడింది మురళికి. ఎపుడు గూడా కాఫీని గూడా ముట్టనివాడు, సిగరెట్ గూడా త్రాగటం నేర్చుకున్నాడు, రాత్రి పూట కాస్త బ్రాందీగూడా త్రాగడం నేర్చుకున్నాడు.ఇదివరకు తన మిత్రులతో తిరుగుతూ నేర్చుకున్న చంద్రమణి, మురళితోపాటు అలవాటు చేసుకున్న ట్లుగా త్రాగటం మొదలుపెట్టింది అతన్ని ప్రోత్సహిస్తూ, దేవేంద్రభోగం అనుభవిస్తున్నాడు మురళీ, ఆమె దాసిలాగా అన్నీ అమరుస్తూ వుంటే. ఈ నూత్నానుభవంలో, ఈ కొత్తకైపులో, ఈ తీయని మైకంలో, పాతవన్నీ మరిచాడు మురళి తాత్కాలికంగా. ఇంటి ధోరణేపోయింది, సీతాదులు ఒక నాటి పరిచయస్థులుగా కనిపిస్తున్నా రిప్పుడు.

ఇద్దరూ ప్రేమమైకంలో మునిగి తేల్తూన్న ఒకానొకనాటి రాత్రి చంద్ర మణి అంది:

"మురళీ! మనమిద్దరమూ వివాహమాడదామోయ్. నిన్ను నా ప్రాణం పోయేంతవరకూ విడిచి వుండలేనేమో అనే అధైర్యం పుట్టుకొస్తున్నదోయ్ యేందుకో. ఒకప్పుడు వివాహం అంటే బంధమనీ - బానిసపు జీవితమనీ - ఒకప్పుడు కాకపోయినా మరొకప్పుడయినా పురుషాధిక్యానికి లొంగి పోవా ల్సొస్తుందనీ - వివాహం చాలించుకున్నాను. అయితే ఆనాటినుండీ - కాదు - అంతకు ముందునుండిగూడా - నిన్ను చేసుకోవాలనీ - నీతోడి వివాహం ఆనందమయ సంబంధం అనీ - నీపాదసేవ అహరహమూచేసి తృప్తిపడా లనీ - అనిపిస్తూవుంది," అంది అట్లా సోలివాడిపై పడుతూ.

"అయితే యీడు సరిపోవద్దూ?" అన్నాడు మురళి.

"ఇన్ని సరిపోయిన తర్వాత యీడొక టడ్డొచ్చిందా?"

"నీ వయసెంత చంద్రా?"

"ఆడవాళ్ళ వయసడిగితే కోపమొస్తుంది తెలుసా?"

"నీకూ గూడా వస్తుందా?"

"నీదిచెప్పు ముందూ."

"నాకు పద్దెనిమిది పడింది."

"నాకు ముప్ఫయిపడింది" అంది కాస్త సిగ్గభినయిస్తూ.

"అబ్బో! పన్నెండేండ్లు పెద్ద పెండ్లామే!"

"ఏమోయ్ అయితే? ముప్పయ్యేండ్ల మగవాడు, పద్దెనిమిదేండ్లు పిల్లను చేసుకోడం లేదూ?"

"ఓహో! తద్వ్యతిరేకంగా చేసుకుందా మనుకున్నావా?"

"అంతే!"

"ఉల్టాసీదా కావాలన్నమాట!"

"కానీ!"

"అవును చంద్రా! పురుషుడు పెద్దవాడూ స్త్రీ చిన్నదీ, ఎందుకుండాలి. ఆ వయోభేదం స్త్రీ పురుష క్రమంలో యెందుకు పాటించరాదు?"

"అది వేరే గొడవలేవోయ్. దాని విషయ మెందుకు! బిడ్డలు కలగని స్త్రీ అయితే పెద్దదయినా చేసుకోవచ్చు."

"నీకు బిడ్డలు మాత్రం లేరు కాబట్టి నిన్ను చేసుకోవచ్చన్న మాట."

# 10

తాను బయలుదేరా లనుకొన్న దినానికి బయలుదేరక పోగా - రావలసిన దినానికి రాలేదెందుకా అని సరళ యోచిస్తూ కూర్చుంది. మురళి కోసం సరళే కాకుండా రాజామణి గూడా యెదురు చూస్తూ వుంది. సీత అర్రులు

బాధకు కూర్చుంది. పన్నెండు దినాలు గడిచినాక ఒక కవరొచ్చింది సరళ నుండి తక్షణం రమ్మని. "నాన్న జబ్బు అట్లాగే వుంది. నిన్ను రమ్మని కోరాడు. తక్షణం బయలుదేరు" ఇదీ అందులోని ముఖ్య విషయం. దాన్ని ముఖ్య విషయంగా తీసుకోలేదు మురళి. జవాబు వ్రాశాడు. మళ్ళా వస్తానన్న సమయానికి రానందువల్ల అనుమానం తగిలింది సరళకు. ఈదపా తంతి యిచ్చింది. వస్తున్నానని తానూ తంతి యిచ్చి బయలుదేరాడు.

మురళి ఆగమనవార్త అందింది గుడిసెల్లో వారికి. సీత చాలా ఆనంద పడింది. సాయంకాలం అయిదుగంటలకా వార్త అందింది సీతకు. రేపు తెల్లవారేటప్పటికి మురళి బెజవాడ వస్తాడు. ఉదయం యెనిమిది లోగానే తన దగ్గిరికి వస్తాడు! ఎన్నాళ్ళయింది అతన్ని చూచి! అబ్బా! రేపటివరకూ....

బయలుదేరింది సీత కృష్ణా తీరానికి, ఆనాడు. తనకు జ్వరం పోయిన నాడు మురళి ఒడిలో కూర్చున్న ప్రదేశానికి వెళ్ళి కూర్చుంది. అదొక పెద్ద వృక్షం. దాని మూలంలో ఒక లావుపాటి వేరుపైన కూర్చుంది వీపు తరు కాండాని కానిచ్చి. తమ పరీక్షా ఫలితాలు గూడా రావచ్చు. వెంటనే తానూ, తన అక్కా పంతులమ్మ లైపోతారు. స్వతంత్ర జీవనం, గౌరవ జీవనం రెండేండ్ల క్రితంనాటి మా స్థితికీ ఇప్పటి మా స్థితికీ ఎంత తేడా? మురళివల్ల ఎంత మేలు జరిగింది. అసలు మురళి పరిచయంలోనే వుంది భాగ్యమంతా - ఈ విధంగా మధుర మధురంగా ఆలోచిస్తూ కూర్చుంది. అప్పటికి ప్రొద్దు కుంకుతూ వుంది. పడమటి దిశంతా ఎఱ్ఱబడి పోయినట్లుగా వుంది. ఎరుపూ తెలుపూ కలిసిన పుణ్యాంగన నొసలిపై పెట్టిన సిందూర తిలకం లాగా ప్రకాశిస్తూన్నాడు సాయం సూర్యుడు. ఆ బంగారు వన్నె యెండలో పడవలు సంచరిస్తూ వుండడం చూస్తే ఎంతో మనోహరంగా వుంటుంది. సందర్భ సంబంధికమైన పాటలు చిన్నగా పాడుకుంటూ కూర్చుంది సీత. నదికి ఎగువ భాగాన సూర్యుడు క్రుంకి తడిసి దిగువ భాగం నుండి మళ్ళా పుట్టుకొచ్చాడా అన్నట్లుగా వచ్చాడు చంద్రుడు. చిన్న చిన్న నదీ తరంగాలపై మిల మిల మెరుస్తున్నాయి చంద్ర కిరణాలు. అక్కడక్కడ ఇంకా చేపల పడవలు

సంచరిస్తూనే వున్నాయి. అప్పు డప్పుడూ బేడిసలు నీటిపైన ఛళుక్కుని ఎగిరి మళ్ళా మునిగి పోతున్నాయి. అట్లా చూస్తూ వుందామె. క్షణంలో ఒక మబ్బు అడ్డుగా వచ్చింది తనకూ చంద్రుడికీ మధ్య. మబ్బు కావల నదీ జలంపై చంద్ర కిరణరాశి అంతా కేంద్రీకరింప బడినట్లుగా వుంది. ఈవైపు చీకటి. నాటకరంగంలో అది దృశ్యమాన నేపథ్యంలాగా వుంది. అక్కడ ఒక పడవమాత్రం కనిపిస్తూ వుంది. దృశ్యం ఎంత మనోహరంగా వుంది! అదే ఒక సముద్రం అయిపోతే! ఆ పడవలో నేనూ నా ప్రియుడూ............ఎంత హృద్యంగా వుంటుంది! హాయిగా అనుభవిస్తూ ఆ అలల కదలికపై తేలియాడుతూ....పరస్పరం గట్టిగా కౌగిలించుకొని, బంధించుకొని సముద్రంలో దూకి అందులో లీనమైపోతే....! కాదు కాదు! విమానంలో ఎగిరి విహాయస వీథిలో విహంగాల్లాగా, విచ్చల విడిగా విహరిస్తూ, పైకి ఎగిరి ఎగిరి, పరస్పరం బంధించుకొని ఒక సముద్రంలోకి దిగదూకితే——! అదీకాదు! వర్షాకాలంలో, ఉత్తుంగ ప్రవాహంలో ఉన్న సమయంలో రైల్లో వస్తూ వస్తూ తటాలున క్రిష్ణా ప్రవాహంలో దూకి సుడులలో కలిసి, ఇసుకలో కూరుకుపోతే....——! అదీ గాదు. గంటకు ఎన్నోమైళ్ల వేగంగల కారులో ఇద్దరమూ కౌగిలించుకొని కూర్చొని, శర వేగంతో ప్రవహిస్తున్న గొప్ప నదీ ప్రవాహంలోకి వదిలేస్తే........! అట్లా కాదు! ఇరువురమూ ఉన్నత పర్వత శిఖరాన్నెక్కి పాముల్లాగా పెనవేసుకొని, దొర్లితే....——; కాదు కాదు! నిర్వాతమై, నిరుష్ణమై, నిర్దృష్టమైన హిమవత్పర్వతాంత శిఖరి నెక్కి ఆలింగన స్థితిలో మంచు ముద్దలైపోతే....! ఎంత శాశ్వతంగా వుంటామో గదా; మా ప్రేమ ఎంత ఘనీభవించి పోతుందో గదా! మా శరీరాలే కాక, మా ఆత్మలుగూడా ఏకమై, జన్మ జన్మాలకూ, కాల కాలాలకూ, ఇద్దరమూ ఒక్కటై వుండమా!!

ఉప్పొంగి పోతూన్న హృదయానందంతో ఉక్కిరి బిక్కిరి ఐపోతూ ఊరికే ఊహించుకుంటూ పోతున్న సీత భుజంపైన చెయ్యేసి "ఇక రా సీతా!" అని లక్ష్మి అన్నంతవరకూ సీత ఏ లోకంలో వుందో తనకే తెలీదు.

ఎంత యోగంలో వుంది సీత! "నిర్వికల్ప సమాధిలో నిమగ్న అయిన. నాకు సమాధి భంగం కల్పించావు అక్కా–" అంటూ లేచిపోయింది.

మురళి మూన్నాళ్ళవరకూ రూమే వదలలేదు. క్రిష్ణయ్య పిలిచినాగూడా కృష్ణాతీరంగూడా పోలేదు. ఆ దృశ్యాలూ, అనుభవాలూ, ఊహిస్తూ కూర్చు న్నాడు. ఎంత వినూత్నానుభావాలు! ఎంత మధురాతి మధురతరానుభవాలు! ఎంత ఆనందదాయక జీవితం!....ఇతని ఊహల్ని ఇంకా రెచ్చ గొట్టింది చంద్రమణి జాబు. అతను వచ్చిన మరునాడే జాబొచ్చింది. అంతా విరహ వేదన. మురళికి అట్లాంటి జాబులు కొత్త. ఇదే ప్రథమం. వ్రాయ చేత నయిన వారిలోని ఈ విరహ వేదన, అత్యుక్తులతో, అతిశయోక్తులతో బయటికొస్తుందని అతని కప్పటికి తెలీదు. సరళ యివన్నీ కాస్త కనిపెట్ట గలిగింది, అసలు వాని శరీరంలోని కొద్దిపాటి మార్పుల చూచి గ్రహించ గలిగింది. నానాటికీ మురళిలోని విరహమూ, చింతనమూ తగ్గాయి. నాలుగో నాడు క్రిష్ణయ్య వచ్చి సీత అమితంగా యేడుస్తూ వుందని చెప్పాడు. పాత అనుభవం మళ్లా పొడసూపగా, కొత్తవిరహం సానుభూతి చూపగా, బయలు దేరాడు. ఇతన్ని చూడగానే ఎదురుచూస్తూవున్న సీత కండ్లనిండా నీళ్లు నింపి ముఖాన్ని రెండుచేతులతోనూ కప్పి, మోకాళ్ళపై పెట్టుకొని ఏడుస్తూ "నీకు నే నేమన్నా ద్రోహం చేశానా మురళీ అంది" గాద్గదికంగా.

"నీవేమీ చేయలేదు సీతా" అన్నాడు దగ్గరగా జరిగి కూర్చుని.

"అయితే నీయిల్లు ముందా సీత ముందా అని పరుగెత్తేవాడివి యిన్ని దినాలుగా రాలేదేం?"

"..............."

"పైగా ప్రోద్బలం కావా ల్సొచ్చిందా?"

"మనసులో అంతబాగుండక రాలేదు సీతా!"

"ఎందుకు? ఏదన్నా జరిగిందా!" అంది చెయ్యి పట్టుకొని వొత్తుతూ.

"ఏమీలేదు. ఊరికేనే!....అయితే నీవు పరీక్షల్లో బాగా వ్రాశావా?"

"చాలా బాగా వ్రాశాను."

"మీ అక్కా?"

"బాగానే వ్రాశాను" అంది లక్ష్మి లోపల్నుండి వచ్చి.

"మీకేంలే, బాగా వ్రాస్తారు" అన్నాడు చిరునవ్వు నవ్వి.

నులక మంచంపై కూర్చుని వున్నాడు మురళి. దానిపై కూర్చొని సీతను చూస్తూ పూలపాన్పుపైన తనతో క్రీడించిన చంద్రమణిని గురించి ఊహిస్తున్నాడు. ఆ గుడిసెలో అతి సాధారణ వేషంలో వున్న సీతను చూస్తూ, ఆ వున్నతమైన మేడలో ఘడియకొక వేషం మారుస్తూ వచ్చిన చంద్రను గురించి వూహిస్తున్నాడు. ఇక్కడ దీనంగా చూస్తూ తన పాదసేవ చేసే సీతను చూస్తూ, అక్కడ అధికారంతో తన హృదయాన్నీ, తన శరీరాన్నీ ఏలిన చంద్రనుగూర్చి వూహిస్తున్నాడు. ఆ కాసేపూ ఆ ముగ్గురూ ఒకరి కొకరు సంబంధం లేనట్లుగా కూర్చున్నారు. లక్ష్మి బాగా పరిశీలించింది. ఏదో జరిగిందని బాగానే ఊహించింది:—

"మురళీ!" అంది శాంతంగా.

"ఆఁ ఆఁ" అన్నాడు మేలుకొన్న వాడి మాదిరిగా.

"గుడిసెలకూ మేడలకూ - గుడిసెల్లో వున్నవారికీ - మేడల్లో వున్న వారికీ - పల్లెవాసులకూ పట్నవాసులకూ - బీదవారికీ ధనాఢ్యులకూ మధ్య వుండే వ్యత్యాసా లాలోచిస్తున్నావా?" అంది. తన భావాన్ని పట్టేసినట్లుందే అనుకున్నాడు మురళి. తక్షణమే—

"అబ్బెబ్బే! అట్లాంటి దేమీ లేదు" అన్నాడు.

"లేకపోవడమేంటి మురళీ! ఉన్నభేదాలు లేవంటే పోతాయా! కండ్ల కెదురుగా కనిపిస్తూవుంటే, అనుభవిస్తూగూడా కాదనగలమా? ఇట్లాంటి భేదాలు లేవనటం కేవలం ఆదర్శపు పలుకులు. ఎవరూ ఆచరణలో పెట్టరు. ఏదో తాత్కాలికోద్రేకంతో, కార్యసాఫల్యానికి, ఎంద రెందరో, యెన్నెన్ని విధాలుగానో మాట్లాడ్తారు. ఆ వుద్రేకం కాస్త తగ్గితే, లేక, అంతకంటే మించింది అన్నది ఏదైనా దొరికితే, ఆదర్శాలు ఎక్కడో పోతాయి. నీలో తప్పు లెన్నడంలేదు. అసలు

**నీవు తప్పేమి చేశావు కాబట్టి? అయినా బాగుపడబోయే యువకుడివి గనుక** ఈ రెండు మాటలూ అనాల్సొచ్చింది. ఈ పిల్ల నీ కోసం ఎంత తల్లడిల్లిందో ఎంత తపస్సు చేసిందో నీకు బాగాతెలుసు. దీనికోసం నేనెంత నాటక మాడ వలసి వచ్చిందో - ఊరికే అపనింద లెందుకొచ్చాయో నీకు తెలుసు! నీకోసం అది చదువుగూడా మానుకొని కొన్నిరోజులు ఆలోచిస్తున్న దినాల గురించి నాకు మాత్రం తెలుసు. అట్లాంటి పిల్ల నీకు ఎంతో ప్రేమతో జాబువ్రాస్తే జవాబీలేదు. మళ్ళా మొత్తుకుంటూ వ్రాస్తే పలకనేలేదు. కడకు ఈ వూరికి వచ్చావు చాలా బలవంతంగా. వెంటనే యిక్కడికి వచ్చావా అంటే అదీ లేదు. ఈ నాటి కొచ్చావు. ఈ ధోరణిలో వున్నావు!....చూడు మురళీ లోలోపల ప్రవహించే అంతర్వాహిని ఎవరికీ కనబడదు. పైన ప్రవహించేదీ సముద్రంలో వుండేదీ కనబడుతుంది. సముద్రం మనకు వర్షాన్ని యిస్తుంది. వీలుపడితే ముంచేస్తుంది. నదీ ప్రవాహం మన పంటల పండిస్తుంది. వీలుపడితే ముంచేస్తుంది. అంతర్వాహినో! ఏమీ చెయ్యదు. పై చెప్పినవి జలాన్ని యివ్వని సమయంలో, కాస్త త్రవ్వితే సలిలాన్ని ప్రసాదిస్తుంది. అపాయం లేనిది. దానగుణం తప్ప మరేమీ యెరగనిది. దానికి ఒడుదుడుకులు లేవు, పైవాటి మాదిరిగా క్షణక్షణానికి మారుతూ, వన్నె చిన్నెల కులుకుతూ, నిన్ను భ్రమపెట్టదు. అంతే ప్రేమ విషయంలోగూడా. నిజమైన ప్రేమ, నిస్వార్థప్రేమ, నిష్కపటప్రేమ, అన్నదే అంతర్వాహిని. తద్విరుద్ధమైనది రెండవ రకపుది. అయినా అసలు ప్రేమను తెలుసుకొనే వా రెవరు? అంతర్వాహిని సులభంగా ఎవరికి దొరుకుతుంది? అంత ఓర్పుతో దాన్ని త్రవ్వి కనుగొనే వా డెవడూ? కష్టంతో గూడుకున్న దానిపై అంత ఆకర్షణ వుండదు. నీ పీ విధంగా మారావని నే నెప్పుడూ అనుకోలేదు. చదువుకున్నవాడివి. బాగా ఆలోచించు. ఈ విధంగా యేడ్పించకు'' అని లోని కెళ్ళింది. మురళిలో ఏదో ఘనీభవించిన వస్తువు ద్రవీభూత మౌతున్నట్టుగా ఫీలయ్యాడు. పరగతమయిన మమత, ప్రేమ, కొంచెం కొంచెమే **స్వాధీనమై సీత వైపు ప్రవహిస్తున్నాయి. అట్లా జాలిగా చూశాడు సీతవైపు.**

ఆమె కన్నీళ్లు రాలుస్తూ వుండట్లా మళ్లీ. 'సీతా,' అంటూ ఆమె చేయిపట్టు కున్నాడు.

మరునాడు మురళి వచ్చేటప్పటికే పయనమౌతూవుంది లక్ష్మి సరళను చూడ్డానికి. చాలా కుతూహలపడ్డాడు మురళి. లక్ష్మి వెళ్లిపోగానే సీతతో చాలా హాయిగా మాట్లాడాడు. సీతగూడా ఆనందడోలికలలో హాయిగా ఊగింది. ప్రక్కన కూర్చుని సరసంగా మాట్లాడుతూవుండిన మురళి సీతను అమాంతంగా జవురుకొని కౌగిట్లో బిగించాడు. బిగించి తమకంతో సొక్కి పోతూ చూస్తున్నా డామె మొగంలోకి. ఆ భంగిమం చూచి సీత చకితురాలైంది. అతని చూపుల్లో ఏదో తృష్ణ ఉట్టిపడుతూవుంది. ఎన్నాళ్లో జబ్బులో పడినవ్యక్తి పథ్యంవల్ల యితర వస్తువుల తిననీకుండా చేయగా, పథ్యం విడువగానే ఇదివర కతియిష్టంతో తింటూ వుండిన వస్తువుల చూచి మొగం వాచినట్లుగా చూస్తూ ఎట్లాగైతే కాంక్షిస్తాడో - అట్లావుంది అతని ముఖ ధోరణి. తటాలున పామునోట్లోనుండి తప్పించుకొని బయపడ్డ కప్పలాగా ఎగిరిపడింది కౌగిట్లోనుండి సీత. జడిసిన జింకలాగా బెదిరిచూస్తూ కాస్త జరిగి కూర్చుంది. దగ్గిరగా జరిగాడు మురళి. ఆమె యెదపై చెయ్యేసి,

"గుండెలంత తీవ్రంగా యెందుకు కొట్టుకుంటున్నాయి సీతా?" అన్నాడు. అతని ముఖమంతా యెర్రగా జేవురించినట్లుంది. కాంక్ష ప్రచండంగా తాండవిస్తూవుం దతని సర్వాంగాల్లోనూ. ఆమె హృదయంలో తీవ్ర సంచలనం బయలుదేరింది, తృష్ణ బయలుదేరింది. భయం ఆవేశించింది. మురళి చేతిని లాగి తన పెదవులపై ఆనించి తమకంతో చూస్తూ,

"మురళీ వద్దు" అంది దీనంగా.

"ఉండలేను" అన్నాడు తన తల ఆమె యెదపై నానించి.

"తొందపడవద్దు, చూడూ!" అని అతని మొగాన్ని లేపింది.

మురళి కౌగిలి వదలలేదు. మరింతగా బిగించాడు. సీత ఊరికే వుండి పోయింది. ఇష్టంవున్నా ఆమె మనస్సుకు కష్టంగానే వుం దా సమయంలో. వీనికి చాలా ఆనందంగా వుండింది. చంద్రమణి ఎంతో సుముఖత్వం చూపిన

నాటి రతికంటే కించి ద్వీముఖత్వం నటిస్తున్న సీతతోడి రతి అతని కెంతో పరమానంద దాయకమైంది.

వివశయై పడిపోయివుంది. ఏదో శక్తి తన నరనరాల్లోకి ప్రాకిపోతూ న్నట్లుగా భావించింది. ఆమె గుడ్డలన్నీ చెమటతో తడిసి ముద్దముద్దగా అయి పోయాయి.

చాలాసేపు కండ్లు మూసికొని తెరిచింది కాస్త సిగ్గుపడుతూ "మంచి పనిగాదు" అంది.

"ఎందుకు?"

"వివాహం కాందే?"

"ఎందుకు కాలేదు? మనం యేనాడో వివాహమాడాం."

"సాక్ష్యం?"

"మనమే సాక్ష్యం! మన హృదయాలే సాక్ష్యం! పరస్పర సాక్ష్యాన్ని మించి పరసాక్ష్యాన్ని కాంక్షించే వారు కేవలం మూర్ఖులు? తాళీతలంబ్రాలు, మేళతాళాలూ, బంధుమిత్రులూ ఇవన్నీ వుంటేనేగాని వివాహం కాదూ అన్నది ఏదో తప్పించుకుపోతామేమో అనే అధైర్యపరులకూ. అసత్యపరులకూ, గాని మన కెందుకు? మనకు సాక్షి ఆ కర్మసాక్షి. భగవంతుడే. అతని యెదు రుగా పెండ్లాడాం మనం. దీనికి తిరుగులేదు."

"అయితే పదిమందికీ తెలిసేటట్లు ఆడవద్దా?"

"అది తప్పకవుతుంది! ఈనాడు కాకపోతే రేపవుతుంది?"

"మరి యింతలోనే త్వరపడ్డా వెందుకు?"

"భయ మెందుకు సీతా!"

"ఏదన్నా అయితే?"

"అయితే యేమౌతుంది! త్వరలో పెండ్లాడ్తాం."

లక్ష్మి తిరిగి వచ్చినంత వరకూ అక్కడే వున్నాడు మురళి. వాళ్ళిద్దర్నీ చూడగానే ఊహించిరిది లక్ష్మి యేం జరిగిందో! మురళి వెళ్ళిపోగానే లేచి స్నానం చెయ్యమంది సీతను. మళ్ళా స్నానా నంతరం యేవో కబుర్లు చెప్ప

కుంటూ భోంచేశారు. అనక, చాపపై కూర్చుంది లక్ష్మి. సీత వచ్చి పక్కలో కూర్చుంది. లక్ష్మి తిన్నగా సీతను తన వొళ్లోకి తీసుకొంది. కింద నుండి మక్కువతో అక్క మొగంలోకి చూస్తూవుంది సీత. చెలిమితో చెల్లిలివైపు చూచి, చెంపలు నిమురుతూ "చాలా కలకల లాడుతూ వున్నావే సీతా," అంటూ చెంపన ముద్దు పెట్టి "మురళి ముద్దంత మధురంగా లేదు గదూ" అంది నవ్వుతూ. సీత ఊరికే చూస్తూ పడుకొంది మందహాసంతో.

"చూడు నాన్నా యెందుకు త్వరపడ్డావు?" అంది లక్ష్మి.

"ఏం చేశానక్కా" అంది గుమ్మడికాయల దొంగలాగా!

"హృదయం కప్పిపుచ్చాలనుకున్నా నీ దేహం కప్పిపుచ్చడం లేదు సీతా! ఉన్నదున్నట్లు చెప్పేస్తూవుంది నీ దేహం."

"అబ్బా! యెంత హాయిగా వుందే యిపుడు నీవే మురళి అయి వుంటే ...." అంటూ ఆమె నడుమును కౌగలించుకొని ఆమె పొత్తి కడుపుపై ముఖాన్ని అదిమి అట్లా పడుకొంది, లక్ష్మి ఆమె వీపును నిమురుతూ కూర్చుంది. ఒక్క క్షణం నిశ్శబ్దం.

"చాలా పొరపాటు చేశావు సీతా" అంది లక్ష్మి. గొంతు ధోరణి కనిపెట్టి తటాలున తల యెత్తింది సీత. లక్ష్మి ముఖభంగిమ మారినట్లు కనుగొంది. ఏమీ మాట్లాడలేదు.

"ఇపుడు హాయిగా వుంటుంది చెల్లీ! అంతే గాదు, స్వర్గభోగ తుల్యంగా గూడా వుంటుంది. అయితే అది ఒక క్షణంతో, ఒకనాటితో, ముగిసిపోతే యెట్లా?" అంది లక్ష్మి మళ్ళా గంభీరంగా.

"ఒకనాటిదే యెందు కవుతుం దక్కా?"

"లేకపోతే కొన్నాళ్లు! ఇట్లా లొంగగూడదు సీతా. ఇటువంటి పని వివాహానంతరమే చెయ్యాలి. త్వరపడితే చాలా నష్టా లున్నాయి"

"ఇందులో తొందర పాటేముంది?"

"వివాహం కాకముందే కామకార్యానికి ఒప్పుకోవడమే?"

"చేసుకుంటామని నిశ్చయమైన తర్వాత జరిగితే యేం?"

"పొరపాటు సీతా! అట్లా జరిగితే ఆకర్షణ చస్తుంది. సకల సౌందర్యానికీ ప్రతిబింబంగా వుండేట్లు సృష్టికర్త స్త్రీ జాతిని సృష్టించాడు. సౌందర్యం హృదయాన్ని ఆకర్షిస్తుంది, హృదయం అయస్సంబధికమైతే- సౌందర్యము అయస్కాంత తుల్యమైనది. సౌందర్యం చేత ఆకర్షింపబడవచ్చు. అనుభవించాలని తృష్ణ కలగవచ్చు. మానసికంగా దాన్ని రమించవచ్చు. అంతే, దైహికంగా రమించాల ననే ఆశ యెప్పుడైతే పుడుతుందో - అది జరుగుతుందో - ఆకర్షణోత్కర్ష అపుడే చస్తుంది. ఆకర్షణ చస్తే అందులోని ఉదాత్తతను, ఉత్కృష్టతను చూడడం కష్టం. ఇదే ప్రేమ కామముల కుండే భేదం. అందుకే వివాహం ముందూ, కామకార్యం తర్వాత జరగాలి."

"మాకు వివాహం కాలేదని ఎట్లా తెలుసు? మా హృదయ బంధన ఎపుడో జరిగింది. అప్పట్నుండీ మేం భార్యా భర్తలమే. అతనుగూడా అదే అన్నాడు పదే పదే."

"తానే గాదు సీతా! ఎందరో యువతీ యువకులు అట్లాగే అంటారు. సంఘం చాలా దౌష్ట్యంగా ప్రతిఘటిస్తుందని వారికి తెలుసేగాని, అనుభవం వుండదు, ఆత్మధైర్యం వుండదు. సంఘానికి బుద్ధి చెప్పుతాం అంటూ ప్రగల్భాలు కొడతారు. యౌవనోద్రేకంలో వాళ్ళకేమీ కనిపించదు. ఆ ప్రగల్భాలు అమాయిక యువతులు నమ్ముతారు. నమ్మి వాళ్ళ వలల్లో పడతారు. ఆపైగా చెడతారు. తర్వాత సంఘం కథ తెలుస్తుంది వాళ్ళకు. ఇపుడు సంఘాన్ని వాళ్ళేమీ చెయ్యలేరు. ఎందుకంటే నీతి విషయంలో చెడినారు కాబట్టి. నీతి లేందే సంఘాన్ని ఎట్లా ఎదిరిస్తారు? సంఘ క్రూరదంష్ట్రల్లో పడి యిరుక్కుంటారు. బయటికి రాలేరు. ప్రగల్భాలు పోతాయి. ఆదర్శాలు పోతాయి. అధీనులై పోతారు. దాసులై పోతారు. వాళ్ళమాటలు మాటలుగానే వుంటాయి. చేష్టలు ఫలించి వికృతరూపాన్ని ధరిస్తాయి. తత్ఫలితంగా, ఎందరో యువతులు అనుమానాల పాలౌతారు. ఎందరో ఆత్మహత్యలు చేసుకుంటారు. వాళ్లు మళ్లా ఆ నీచపు సంఘంలోనే వ్యక్తులై, చలామణి అయిపోతూ...."

వేడి కన్నీటి చుక్క సీత చంపన పడింది.

"అక్కా! తప్పే చేశానక్కా! క్షమించు" అంది సీత దీనంగా కన్నీటితో తడిసిన ఆమె కుడిచంప నిమురుతూ.

"నీవు వొప్పుకున్నా, ఒప్పుకోక పోయినా ఫరవాలేదు తల్లీ. నేను క్షమిస్తేమాత్రం రానున్న బంధాలూ, ఆపదలూ తప్పుతాయా?"

సీత అయోమయంగా చూస్తూ వుంది. ఏమీ ఆలోచించ లేకుండా వుంది. మెదడు శూన్యంగా వున్నట్లుంది. లక్ష్మి మళ్ళా: —

"రేపు యేమన్నా జరిగితే యెంత అవమానం! అతడు తక్షణం పెండ్లాడితే సరిపోతుంది. లేకపోతే నీ గతేం కావాలి. ఇటువంటివి నాన్న యెన్ని చెప్పేవాడో తెలుసా? అంతెందుకూ? మనం యెన్నిచూశాం! తీరా గర్భవతులైనాక తాను తప్పించుకోడమే కాకుండా, నేనందుకు కారకుణ్ణి కాదంటా డొకడు. అసలెవడో చేశాడు నాకేం తెలుసు? అంటాడు మరొక భీరువు! కడపటికి చిక్కేదీ, అనుభవించేదీ యెవరో మనకు తెలుసు! అటువంటి నీచ పురుషులకు ఈ పాపిష్టి సంఘంలో స్థానముంది. తనకు స్థానం లేని సమయంలో స్త్రీ కాస్త భద్రతతో మెలగాలి."

"అయితే మురళిని గూడా ఆ దృష్టితో చూడడమేనా?"

"చూడడం గాదమ్మా. అతన్ని మనం అనుమానించగూడ దనుకో, అయితే కాస్త యోజిద్దాం. పరీక్షలవుతూనే, నీపైన పూర్వపు మమతవుంటే. పరుగెత్తేవాడుగా! రాలేదు. నీవు జాబు వ్రాసినా జవాబివ్వ లేదు. సరే, తర్వాత వచ్చాడుగదా! మూన్నాళ్లీ ముఖంగూడా పెట్టలేదు. ఏదో బలవంతాన యిక్కడికి వొచ్చాడు గదా, సరిగ్గా మాట్లాడనుగూడా లేదు. విన్నటి అతని వాలకం, ఈ నాటి అతని చేష్టా, చూస్తే అతడు పట్నంలోనే కాస్త రుచి మరిగి వచ్చినట్లు నాకేమో నమ్మకమే! నీ వంతగా ఆలోచించి వుండవు. నీ కతనంటే అమితమైన మమత. నీవు ఆలోచించకపోయావ్. నీవేగాదు. ఏ యువతిగూడా ఆ సమయంలో, అనుమాన భావాలకు ఆస్పదం యివ్వదు. అట్లా అనుమానించడమే కించగా భావిస్తారు. ఆ సమయం వస్తే ప్రతి పిల్ల

గూడా లొంగుతుంది....అసలు నేనుంటే యెంత బాగుండేది! అసలా పిల్ల వాడుగూడా మంచి సమయం చూచుకున్నాడు!''

''ఒక్కసారికే యేమవుతుందక్కా! ఇక మీదట భద్రంగావుంటాను.''

''అదెట్లా చెప్పగలం తల్లీ! నీవు మంచి యౌవనవతివి; ఆరోగ్యంగా వున్నావు; అతనికోసం నీ హృదయం స్వాతికార్తెలో ముత్తెపుచిప్ప మాదిరిగా తెరుచుకొని వుంది. అతడూ మంచి యౌవనవంతుడు. దేహసౌష్ఠవం గలవాడు. యౌవనోద్రేకంలో వున్నాడు-నిన్ను కలవాలనే తమకంతో కలిశాడు. ఇంకేం? స్వాతిచినుకుపడ్డ తర్వాత. ముత్యం తయారుకాకపోతుందా?''

కాసేపు ఆగింది లక్ష్మి. ఆ కాసేపూ ఆలోచనల్లో పడింది సీత. ఏదో భయం ఆవేశించింది. కన్నీరు దానిపాటి కదే దొర్లిపోతూవుంది. అది చీరలో యింకి, తొడపై ప్రవహించేటప్పటికి లక్ష్మి తెలుసుకుంది సీత యేడుస్తూ వుందని. ఓదార్పు సూచకంగా అంది మళ్ళా లక్ష్మి:-

''ఇవన్నీ మన అనుమానాలు సీతా! ఏ పనికైనా ముందూ కీడెంచి మళ్ళా మేలెంచమన్నారు. అంచేత అన్నాను. ఇకమీద భద్రంగా వుంటే చాలు!'' అంది ముందువైపు చూస్తూనే చేతుల్తో ఆమె చెంపలు నిమురుస్తూ.

''అక్కా'' అంటూ గట్టిగా యేడ్చి, ఆమె అధోగర్భానికి ముఖం అదిమి కౌగిలించుకొని పడుకొంది సీత చిన్న పసిబిడ్డలాగా. లక్ష్మి సీత వీపు మీదికి వాలి, వీపుమీద ముఖంపెట్టి, నితంబాల నిమురుతూ,

''లేమ్మా! ఫరవాలేదు లే, పడుకుందాం పద'' అంది.

మురళి అక్కణ్ణుంచి బయలుదేరి కృష్ణాతీరానికివెళ్ళి కాసేపు కూర్చున్నాడు. ఆ చల్లగాలి శ్రమించివచ్చిన ఆ శరీరంపై తగులుతూ వుంటే ఎంతో హాయిని అనుభవిస్తూ, సీతవుంటే యెంత బాగుండు! అనుకుంటున్నాడు. తన మనోనేత్రాలముందు సీత ప్రత్యక్షమయింది మందహాసంతో. ఆమెను ఆప్యాయతతో కౌగలించుకొని తనివిదీరా అనుభవిస్తున్నట్లు భావిస్తున్నాడు - అబ్బా! ఎంత తేడా! చంద్రమణి సాంగత్యానికి సీత సాంగత్యానికి ఎంతతేడా? సీత శరీరం ఎంత మార్దవంగా ఎంత సౌష్టవంగా, ఎంత లలితంగా, ఎంత

సుఖదాయకంగా వుంది; ఎన్నయినా అనాఘ్రాతపుష్పం. అనాఘ్రాతపుష్పమే అనుకున్నాడు. మళ్ళా తనలో ఏదో కోర్కె ప్రబలి పొల్లుకొచ్చింది. పైకి లేచాడు. నాలుగడుగులు ముందుకేశాడు. లక్ష్మి జ్ఞాపక మొచ్చింది. లక్ష్మి ముందు తన పని సాగదనుకున్నాడు. వెనక్కి తిరిగాడు. నేరుగా రాజామణి యింటి కెళ్ళాడు. అప్పటికి యెనిమిదయింది. అతన్ని చూడగానే 'రా అల్లుడూ' అందామె ఆప్యాయంగా. పీడిలో కామశక్తి ఆవేశించివుంది. రాజామణి మందహాసమూ ఓరచూపూ, దాన్ని విజృంభింప చేశాయి. అయితే దాన్ని అట్లా అజ్ఞాతంలోకి పంపి, కుర్చీలో కూర్చున్నాడు రాజామణి తట్టు చూస్తూ. అంత తమకంతో తనవైపు చూస్తున్నాడని రాజామణి అనుకున్నా అతను చూస్తున్నది సీతను. ఆ దృశ్యాన్ని. తనను గురించి ఆలోచిస్తున్నా దేమో అని రాజామణి అనుకుంటూన్నది గాని మురళి ఆలోచిస్తున్న, ఆ సంఘటనను గురించి.

''యేం అల్లుడూ; ఈ రాత్రికి అత్తకు అతిథిగా వుంటావా?'' అంది వయ్యారంగా చూస్తూ మందహాసంతో.

''అందుకేగా వచ్చాను'' అని అంటూండగా సరళ సరాసరి లోపలి కొచ్చింది. ఆమెను చూడగానే గాభరాపడి తల వాల్చాడు మురళి. కొత్త గాబట్టి మామూలు వికారాల దాచుకోడం యింకా నేర్చుకోలేదు మురళి; గుమ్మడికాయల దొంగలాగా ఫీలవుతున్నాడు. రాజామణి కవన్నీ మంచినీళ్ళ ప్రాయమేగా; మొగంలో యేమీ మార్పు కనిపించలేదు. ప్రశాంతంగా అంది:

''ఏమే సీరియస్‌గా వచ్చావు?'' అంది అనుమానంగా చూస్తున్న సరళతో.

''చూడత్తా మురళి యీ దినం యిల్లు వదిలి అయిదుగంటలయింది. దగ్గుతో నాన్న సతమతమవుతున్నాడు. ఆయన్ను కనిపెట్టుకొని నేను కూర్చున్నాను. అదేమో యీయన మద్రాసు నుండి రావడమే అంతంత; వచ్చిన తర్వాత గూడా యింటి విషయాలే అనుకోడంలేదు,'' అంది ఏడుపు మొగంతో సరళ.

"అదేమిటి మురళీ! జబ్బు మనిషిని కాస్త కనిపెట్టి వుండొద్దూ అక్కకు సాయంగా వుండకపోతే యెట్లా?"

"ఇక్కడే వున్నాడా అప్పట్నుండీ?"

రాజామణి జవాబు చెప్పలేదు. తెలివిగా ఊరుకుంది వానివైపు చూచి.

"ఇప్పుడే వచ్చానక్కా ఇంటికే వస్తూ దారిలో ఇక్కడ ఆగాను కాసేపు" అన్నాడు మురళి.

"సరే యింకన్నా రావయ్యా! నాన్న కలవరిస్తున్నాడు."

మంత్రముగ్ధుడుగా లేచాడు "వస్తా నత్తయ్యా" అంటూ. సరళ ముందు వెళ్తూవుంది. వెంటనడుస్తున్నాడు మురళి ఖైదీలాగా. పోతూ పోతూ ఒకసారి వెనక్కి చూశాడు. ఫరవాలేదనుకొని లోపలి కెళ్ళింది రాజామణి.

సరళ యేమీ మాట్లాడలేదు దారిలోగానీ, యింట్లోగానీ, లోలోపలే దుఃఖిస్తూ వుంది. తనబాధ యెవరికీ చెప్పుకోలేదు. ఎవరూ తీర్చలేని వ్యధ. తీర్చగలవాడు ఆ మురళి ఒక్కడే. వా డా స్థితిలో వున్నాడు. ఎంతో అసహాయత్వంలో వుంది సరళ. భోజనానంతరం నాన్నపిలుస్తున్నాడని చెప్పగా లోపలి కెళ్ళాడు మురళి ఏమడుగుతాడో, యేం జవాబు చెప్పాల్నో అనుకుంటూ. ప్రశ్నలూ జవాబులూ తానొక్కడే వితర్కించుకుంటూ కూచున్నాడు.
"ఏరా నాన్నా, మళ్ళా కాలేజీలు తెరిచే సమయ దగ్గిరపడుతున్నది గదూ?" అన్నాడు బ్రహ్మారావు దగ్గుతూనే.

"ఇంకా ఒక నెల దాటాలి నాన్నా."

"నెలంటే యెంతరా! ఈదపా అక్కనుగూడా పిలుచుకపో చదువుకు."

"నాకింకేం చదువు నాన్నా! నీ వారోగ్యాన్ని పొందితే, ఆ తర్వాత అవన్నీ" అంది అపుడే వచ్చిన సరళ నిరుత్సాహంగా.

"దగ్గు విచిత్రమైన జబ్బమ్మా! ఇది మనిషిని తటాలున చంపనూ చంపదు, బ్రదుకనూ బ్రదుకనీదు. నయంకాదు. ఇది యింతే. నన్ను కని

పెట్టుకొని కూర్చొని నీవూ సోమరివయిపోతావు. అయినా ఈ జబ్బుగల రోగి దగ్గర వుండడం అంత శ్రేయస్కరం కాదు.''

''ఏమీ ఫర్వాలేదు నాన్నా! ఆ జబ్బు నాకేవచ్చి, నీకు నెమ్మదించే టట్లయితే సంతోషంగా స్వీకరిస్తాను. అట్లయినా మీ ఋణం తీర్చుకుంటాను. ఏ ఆశతో యీ ప్రపంచంలో బ్రదకాలో నాకే అర్థంకావటంలేదు'' అంది దీనంగా మురళివైపు చూస్తూ.

అదంతా వింటున్నాడు మురళి. ఆ పరిస్థితిచూచి తానుగూడా చాలా వ్యసనపడ్డాడు. అక్కపైన జాలేసింది. అంత నిరాశావహమైన పలుకులామె ఎందుకన్నదో మురళికి అపుడు నిజంగా అర్థంకాలేదు. తండ్రిపైగల ప్రేమా, ఆమె వివాహవిచ్ఛేదనా, అందుకు కారణా లనుకున్నాడు. అంతకంటే ప్రబల మైన కారణాలు దొరకలేదు. ఇంతలో బ్రహ్మారావు ప్రాణం పోయేతం బాధతో దగ్గాడు. దగ్గి శోషకపోయినట్లు పడిపోయాడు.

''నాన్నా నాన్నా'' అంటూ మురళి దగ్గిరికెళ్లాడు. నోట్లోనుంచి కారిన కళ్లెను, సరళ తొలగిస్తూవుంది. ఒకక్షణంలో కండ్లు తెరిచాడు బ్రహ్మారావు మళ్ళా.

''మురళీ! నీవు నన్ను ముట్టకు. అపాయకరమైన జబ్బు. నీవిక మీదట ఇక్కడికి రావద్దుగూడా నాన్నా'' అన్నాడు.

''అక్కయ్యా!''

''నేను రావచ్చు, నాకు అలవాటయింది. దగ్గులేకున్నా నేనూ అంతటి రోగినే. నా హృదయంగూడా క్షయకంటే మించిన రోగంతో ఒరపిడి పెట్ట బడి వ్యథపడుతూ వుంది'' అంటూ బయటికెళ్లిపోయింది. బ్రహ్మారా వామెను వెనక్కి పిల్చాడు.

''చూడుతల్లీ! నేను మదనపల్లి శానిటోరియంలో చేర్తాను. అది ఈ వరకే తీర్మానించుకున్నాను. మీరిద్దరూ చదువుకొండి. నామాట తప్పవద్దు.'' అని చెప్పి ''మురళీ, ఒకసారి క్రిష్ణారావును పిలు'' అన్నాడు.

మరునాడుకూడా లక్ష్మి బయలుదేరేవేళకు మురళి బయలుదేరి వాళ్లిల్లు

చేరాడు. చెల్లెలిపైన నమ్మకం వున్నా, ఏమో అని జంకింది లక్ష్మి. ఉండి పోవాలనుకుంది. నిన్న సరళ ఎంతో ప్రతిమాలి చెప్పింది. ఇటీవల తన మనసు బాగుండడం లేదని గోలపెట్టింది. అన్నీ విన్నతర్వాత, తప్పకవస్తా నని చెప్పివచ్చింది లక్ష్మి నిన్న. సరే, బయలుదేరింది. ఆమె గుమ్మం దాటగానే, గట్టిగా కౌగలించుకున్నాడు మురళి సీతను నిన్నటి లాగానే,

"ఆగు మురళీ" అంది సీత కోప్పడ్డట్టుగా, చకితుడై వదిలాడు కౌగిలి. అతని చెయ్యిపట్టుకొని దీనంగా అతని మొగంలోకి చూస్తూ-

"క్షమించవూ?" అంది.

"చూడూ. ఇకవద్దు. నాపైన నీకు నిజమైన ప్రేమవుంటే వద్దు."

"ప్రేమ వుండబట్టే సీతా కావాలంటున్నాను."

సీత ఏమీ మాట్లాడలేదు. అది అవకాశంగా మళ్ళా పైనబడ్డాడు. ఎంతో ప్రతిమాలింది సీత. వాడు పట్టువదలలేదు. ఆమె మనసు విముఖత్వం నటిస్తున్నా, శరీరం సుముఖత్వం చూపుతూ వుంది. మళ్ళా లొంగిపోయింది, తర్వాత అక్క చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి. భయపడి కన్నీరు కార్చింది.

"ఎందుకు సీతా యేడుస్తావ్?" అన్నాడు మురళి.

"ఏముంది మురళీ! పురుషుని సాంగత్యాన్ని కోరిన స్త్రీ గతి యింతే నేమో యెప్పటికీ. పురుషుడి దౌర్జన్యం క్రింద నలగాల్సిందే. చూశావా నీలో యెంత దౌర్జన్యమో! నేను వద్దంటూన్నా గూడా బలాత్కరించావు. ఇదేనా ప్రేమంటే? స్వార్థంకాదూ!"

"ఎందు కిట్లా మాట్లాడుతున్నావ్ సీతా? నా పైన నీ కిష్టంలేదా?"

"మురళీ" అంటూ బిగ్గరగా అరిచి కౌగిలించుకొని రుద్ధ కంఠంతో "నాకు నీ పైన వున్నంత మమతా, ప్రేమా ప్రపంచంలో మరే స్త్రీకీ మరొక వ్యక్తిపైన వుండదు మురళీ" అంది. ఆమె కన్నీటితో వాని వీపుపైన చొక్కాయంతా తడిపింది. మళ్ళా వానికి అభిముఖమై, "చూడు మురళీ.

యికమీదటనైనా చాలించు. మనం పెండ్లాడే నంతవరకూ ఒక ర్శొక రంట గూడదని ప్రతిజ్ఞ చెయ్యి'' అంది.

''నే చెయ్యలేను సీతా! అదేమిటో యెపుడు గూడా నీతో కూడి, తిండి తీర్థాలు లేకుండా అనుభవించాలనే ఆశ ఆవేశించింది నాలో. ఎపుడు గూడా నీ కబిముఖంగా కూర్చొని నీ కనుపాపల్లో, నా ప్రతిబింబాన్ని చూచు కుంటూ వుండాలనే కోర్కె ప్రబలిపోతూ వుంది నాలో. ఎట్లా ప్రతిజ్ఞ చెయ్యను? తర్వాత విషయం యెట్లా చెప్పగలను?''

''కాదు మురళీ, మనసును అంతమాత్రం స్వాధీనం చేసుకోకపోతే ఏమీ చెయ్యలేం ప్రపంచంలో. దానిపాటికి దాన్ని వదిత్తే ఎందుకూ పనికి రాని వారమౌతాం.''

''మనసును చిక్కబట్టి ప్రపంచంలో యేదో చెయ్యాలని, సౌఖ్యాలను వదులుకోవడం వెర్రిగదా సీతా! ప్రత్యక్షంగా దొరికేదాన్ని కాలదన్ని లేనిదాన్ని ఊహించి కృషిచేస్తే లాభం యేమిటి చెప్పు.''

''వాదనవద్దు మురళీ. ఇట్లాగే వాదించుకోవచ్చు ఎన్నాళ్ళయినా. దృష్టి భేదం వున్నప్పుడు, మాటలు చేతనయితే, కుతర్కం వుపయోగించి, దినాల పర్యంతం పట్టుదలతో వాదించుకోవచ్చు. నీవు మాత్రం ప్రతిజ్ఞ చెయ్యక తప్ప దీ దినం.''

''తప్పదా?''

''తప్పదు'' అంది సీత తల అడ్డంగా ఊచి.

''బలవంతం చేస్తున్నావు సుమా!''

''నీవు బలవంతం చేశావుగా నిన్నా యీనాడూ. పురుషుడు చెరచ డానికీ, పతనావస్థ కీడవడానికి బలాత్కారాన్ని ఉపయోగించినపుడు, ఇద్దర్నీ రక్షించు కోడానికి స్త్రీ బలాత్కరిస్తే తప్పా!''

''నే చెయ్యలేను సీతా'' అన్నాడు దృఢంగా. అంటూ లేచాడు ఏదో నిర్ధారించుకున్న వాడులాగా. ఒకడుగు ముందు కేశాడు.

''మురళీ'' అందామె ఆశ్చర్యంతో, దుఃఖంతో. వెనక్కి వాలి.

"చనువిస్తే ఆడవాళ్లు నెత్తికెక్కుతారు సీతా" అంటూ వెళ్ళి పోయాడు.

వాని నిర్గమనాన్ని, మౌఢ్యంతో, ఆశ్చర్యంగా చూస్తూ అట్లాగే కూర్చుండి పోయింది సీత. తానేమంది? యిరువురి ముక్తికే గదా ప్రతిజ్ఞ కోరింది. పురుషుడిలో ఎంత పశుత్వం! కామ తృప్తికోసం స్త్రీని ఎంత యిదిగా ఉపయోగించు కుంటాడు; తా నుపయోగించిందే స్త్రీ ఉపయోగిస్తే ఓర్చుకో లేడు! స్త్రీకీ, పురుషుడికీ ఒకే తీరు న్యాయం లే దెందుకో! చదువుకున్నా, సంస్కారాన్ని అలవరచుకున్నా, ఇంకా వాళ్ళ రక్తంలో జీర్ణించివున్న ఆ ఆధిక్యభావం, ఆ దౌర్జన్యం. ఇంకా పోలేదు! ఒక స్త్రీని మోహించి, కామించి, పీల్చి పిప్పిచేసి దూరంగా వెళ్ళిపోవచ్చు పురుషుడు! మళ్ళా ఇం కొకదాన్ని పెండ్లాడవచ్చు! సంఘం వాణ్ణి స్వీకరిస్తుంది! ఛీ! ఛీ! మళ్ళా మరొక స్త్రీ ఎంత తెలివి లేకుండా వాణ్ణి వచ్చి చేసుకుంటుంది! పాడు బ్రదుకు...........ఈ విధంగా ఆలోచిస్తూ కూర్చుంది సీత. ఏమి టాలోచిస్తు న్నదో - అట్లాంటి భావాలన్నీ యిపుడు తన కెందుకు కలిగాయో తనకే తెలీ కుండా వుంది. అక్క వచ్చినంత వరకూ అక్కడే కూర్చుంది. ఇంట్లో దీపం కూడా ముట్టించలేదు. అపుడే వచ్చిన లక్ష్మి ఏదో జరిగిందని ఊహించి, కాళ్ళు కడుక్కొని, దీపం వెలిగించి, చెల్లి ప్రక్కన కూర్చొని భుజంపై చెయ్యేసి,

"ఏమిటే ఆలోచిస్తున్నావ్! మురళేడీ?" అంది.

ఏం చెప్పగలదు? తాను మళ్ళా యీ నాడు లొంగిపోయింది. లొంగి పోయి గూడా తృప్తి లేకుండా పోయింది. పైగా అక్క కోప్పడుతుంది. ఇపు డీ అవస్థకంటే అపు డూరకున్నా బాగుండేదిగా! భయపడుతూనే తల వొంచుకొని,

"ఈ దినం గూడా లొంగిపోయాను" అంది సీత ముక్తసరిగా.

"ఫరవాలే దమ్మా. ఇందులో నీ దోష మేముంది?" అంది లక్ష్మి ఆమె తలెత్తి.

"దోషం లేదా?" అంటూ లక్ష్మిని కౌగలించుకొని యేడ్చింది సీత.

"స్త్రీ కథ అంతే సీతా! ఈ పురుషులు ఎంత చదువుకున్నా, ఎన్ని ధర్మపన్నాలు పలికినా, స్త్రీని ఆటబొమ్మగా ఉపయోగించి తీర్తారు. వివాహం అని ప్రస్తుత నమాజంలోని స్త్రీ కోరిందో, బానిస అయిందనే అనుకోవాలి. ఆ యిచ్ఛతో పురుషుని సమీపింపనీకుండానే వుండాలి. అంతవరకూ వచ్చిందో, ఎవరూ వుండలేరు. నీవేగాదు. ఎవరికైనా ఆపడం కష్టమే. అయస్కాంతం ముందూ యినుప ముక్కనుపెట్టి ఆకర్షించకుండా వుండమంటే వుంటుందా? అంతే....ఇందులో నీవు చేసిన ఘోరాపరాధ మేమీ లేదు. అయితే యికముం దయినా జాగ్రతపడు." సీత చల్లగా విన్నది. ఆమె మాటలు పైకి ఎంత చల్లగావున్నా లోపల జ్వలన స్వభావంతో నిండివున్నవని సీతకు తెలుసు. తన్ను తాను లోలోపల దూషించుకుంటూ అట్లాగే కూర్చుండి పోయింది. లక్ష్మి వంట ప్రయత్నంలో వుండిపోయింది.

అక్కడనుండి బయలుదేరిన మురళి సరాసరి యింటికొచ్చేశాడు. ఎవర్తోనూ పలకలేదు. సీత దగ్గరనుండే వచ్చాడని సరళ పసికట్టక పోలేదు. విన్ననే సరళ లక్ష్మిని అడిగింది నైపుణ్యంతో. లక్ష్మి అబద్ధాలు చెప్పవలసిన అగత్యం కనబడక పోగా, "మురళి వస్తూ వుంటాడు మా యింటికి" అని చెప్పింది. ఇపుడు మురళితో సరళగూడా అంతగా మాట్లాడలేదు. అయితే ఒకసారి మాత్రం గదిలోకొచ్చి, "యేం మురళీ అట్లా వున్నావ్?" అంది.

పోగూడదు, పోగూడదు అని యిరవై గంటలనుండీ అనుకుంటూ వుండిన మురళి, సరిగ్గా రైంకు సీత ప్రక్కలోవచ్చి కూర్చున్నాడు. ఎదురు చూస్తూవున్న సీత ఇతన్ని చూడగానే మొగం కాస్త అటు తిప్పింది. ఇత డామె తొడపై తలపెట్టి పడుకొని, ఆమె మొగాన్ని అభిముఖంగా చేసు కుంటూ, "సీతా! నిన్ను విడిచి వుండలేనే!" అన్నాడు పసిబిడ్డలాగా. సీత వాడి తలను యింకా ముందుకు లాక్కొని నిమీలిత నేత్రాలతో వంగి, నును చెక్కులు నిమురుతూ ముద్దుపెట్టి,

"చాలా? ఇంకా కావాలా?" అంది తృప్తిగా.

"చాలదు."

"ఇవిగో" అంటూ మరికొన్ని—

"చాలదు."

"మరికొన్ని" అంటూ యంత్రంలాగా ముద్దులు కురిపించింది.

సీత ఆ పని చెయ్యకున్నా బాగుండేది. వచ్చిన వాడితో కాస్త గంభీరంగా మాట్లాడి ఒక పద్ధతికి ఒప్పించివుంటే బాగుండేది. ఆ ప్రయత్నమే చేసివుంటే ఈనా డామె నెగ్గేది. అయితే ఆమె గూడా వాని రాకకై బాధ పడుతూ వుండింది కాబట్టి వాణ్ణి జూడగానే ఇదివర కనుకుంటూ వుండిన దంతా గాలిలో ఎగిరి పోయింది. అతన్ని తృప్తి పరచాలని, తన అధో శరీరంపై పడుకో బెట్టుకొని, పైగా ముద్దులిచ్చే టప్పటికి, వానిలో ఉత్థానశక్తి అతిశయించి గ్రుడ్డివాణ్ణి చేసింది. వివశుడై గట్టిగా బంధించాడు లేచి కూర్చుని. మళ్ళా చిక్కొచ్చింది సీతకు. నిన్న గట్టిగా ప్రతిజ్ఞ తీసుకొంది లొంగగూడదని, హృదయపు త్రాసుయొక్క ముల్లు లొంగుబాటువైపే సూచిస్తున్నది. ప్రతిజ్ఞ తేలిపోతున్నట్లుగా కనిపించింది. ఒక్కమాటుగా హృదయంపైనే కోపమొచ్చింది.

"మురళీ!" అంది గ్రుడ్లు పెద్దవి చేసి చేత్తో అతన్ని ఆపుతూ. వానిలో కామ విజృంభణ ఎంత ఉన్నత దశలో వుందో, ఈమెలో తద్విముఖత్వ దృష్టి అంత తీవ్రంగా వుంది. అట్లా కాసేపు ఆమె మొగంలోకి చూచాడు. కామం కోపంగా మారింది. వదిలి లేచాడు చటుక్కున,

"ఎందు కంతగా రొప్పుతావ్?" అన్నాడు తీవ్రంగా చూస్తూ. రావి ఆకులాగా అల్లల్లాడింది సీత.

"కోపమా మురళీ" అంది మళ్లా దీనంగా.

"అయితే వూరుకో" అని మళ్ళా విజృంభింపబోయాడు.

"ఛీ!" అంది విరక్తితో ముఖం చిట్లించుకుంటూ. మరలా,

"ఏమిటీ పశుత్వం! నా హృదయాన్ని కాస్తయినా పరిగణించ బన్లేదా? నీ విషయమేనా యెంతసేపూ! ఇదేనా సమత్వం. నీవిచ్చే స్వాతంత్ర్యం!" అంది.

"ఇందులో నిన్ను న్యూనత పరిచిం దేమీ లేదు సీతా" అన్నాడు ముడుచుకు పోయిన ముఖాన్ని అధోముఖంచేస్తూ.

"న్యూనతే! నా హృదయ విరుద్ధంగా ఒక కామి పశువులాగా ప్రవ ర్తిస్తూవుంటే చూస్తూ లొంగి పోవటం న్యూనత కాక మరే మవుతుంది?" అంది తల యెగరేసి.

"కావచ్చు" అంటూ బయలుదేరాడు మురళి. సీత చూస్తూ కూర్చుంది కాని బాధ పడలేదు. ప్రతిజ్ఞలో గెలుస్తున్నానన్న తృప్తివల్ల కాబోలు! అయితే ఆమెకు తెలియని అవ్యక్తబాధ ఏ మూలో మెదుల్తూవుంది.

ఆ రావడం రావడం సరాసరి వచ్చేశాడు రాజామణి యింటికి. అప్ప టికి యేడున్నర అయివుంటుంది. రాజామణి అప్పుడే స్నానంచేసి, ఏదో అట్లా విడీబడీగా చుట్టుకొనివస్తూ వుం దప్పుడే స్నానాల గదిలో నుంచి, ఆమె బయటికి రావటం, మురళి అక్కడికి పోవడం ఒకేమారు సంభ వించింది. ఇద్దరూ చూచుకున్నా రొక్కసారి. అపుడే స్నానంచేసినందువల్ల కించి దుష్ణంగా వున్న ఆమె రక్తం మరికాస్త ఉష్ణంగా అయి, వడివడిగా ప్రవహించింది దేహంలో. ఒక ఆశాభావం కనబడిం దామె మొగంలో. ఇది వర కెక్కడో తనను రెచ్చగొట్టిన దృశ్యమే అది మురళికి. వీనిలోని కామ శక్తి విజృంభించగా, కోరిక ఉట్టిపడుతున్న చూపులతో ముందు కడుగేశాడు.

"మురళీ" అంటూ చేయి చాపిందామె. చేతులు కలిశాయి. కండ్లు విశదంగా మాట్లాడు కున్నాయ్. చేయి వదిలిపెట్టి సిగ్గభినయిస్తూ గదిలోకి వెళ్ళిపోయింది. పెంపుడు కుక్కలాగ వెంట బడ్డాడు. నిలువుటద్దంముందా నిలబడిం దామె కురులు దిద్దుకుంటూ. వెనుక నిలబడ్డాడు మురళి. ఇదివర కొకనాటి చంద్రతోడి దృశ్యం జ్ఞాపకమొచ్చింది. వెనుక సోలిపోతున్న మురళి శరీరానికి తన శరీరాన్ని ఆనించింది. వాని భుజంపై తలపెట్టి, తన రెండు చేతులూ వెనుకగుండా పోనిచ్చి. వాని మెడచుట్టి అద్దంలో ఒకమారు చూచుకొని, మళ్ళా వాని ముఖంలోకి చూస్తూ,

"ఎన్నాళ్ళెదురు చూశానోయ్ నీకోసం! అదృష్టవంతురాల్ని" అంది.

"..... ..... ..... ....."

"రాత్రి కిక్కడే వుండు" అంది అర్థించినట్లుగా.

"అత్తా" అంటూ సరళ వచ్చిం దింతలోకే.

"చూడు మురళీ, జబ్బులోవున్న మనిషిని కాస్త జాగ్రత్తగా చూడాలి" అంటూ జుట్టు సర్దుకుంటూన్నట్లు నటిస్తూవుంది రాజామణి.

"చూడత్తయ్యా, మురళి యింటిపూటే అనుకోడం లేదు! నాకూ అదేమిటో మురళి లేకపోతే పిచ్చిపట్టినట్లుంటుంది. ఎక్కడికో వెళ్తాడు! ఎప్పటికోగాని రాడు." అంది సరళ ప్రవేశిస్తూనే.

"ఇపుడే వస్తున్నాడు. నీ తమ్ముణ్ణెవరూ యెత్తుకు పోరులే. నేను జాగ్రత్తగా చూస్తాలే యీ రాత్రికి, ఇక్కడే వుంటాడట వెళ్లు."

"నాకొక్కతెకే భయంగా వుంటుందత్తా!"

"ఈ దినం యిక్కడే బాగానిద్రపోతా నక్కా, అక్కడ డిస్టర్బెన్స్‌గా వుంటుంది" అన్నాడు మురళి.

సరళ యేమీ మాట్లాడ్లేక పోయింది! వెనక్కి అట్టే తిరిగి పోయింది. వీళ్లిద్దరూ మళ్ళా పడక గదిలోకి బరబరా వచ్చి కరస్పర్శ చేసుకున్నారు, పరస్పరాభి నందన సూచకంగా. రాజామణి పని మనిషికి సెలవిచ్చిందా రాత్రి.

సరళ రాత్రి అక్కణ్నుంచే పోతూపోతూ ఆలోచించింది, రాజామణి మురళిని యెందుకింట్లో వుంచుకుంది? ఇదివరకు మాదిరి పిల్లవాడు గాదుగదా! యౌవ్వన వంతుణ్ణి ఒంటరి పాటుతో వున్న స్త్రీ రాత్రిపూట ఇంట్లో వుంచుకున్నదంటే అర్థమేమిటి? అందులో ఆమె అవివాహిత! ఆమె కామతృప్తి యిలాగే తీర్చుకుంటూ వుంటుంది - ఛీ ఛీ! ఏమిటీ వూహలు, చిన్నప్పటి నుండీ చూస్తున్న పిల్లవాడితో అట్లా చేస్తుందా? దానికేం? ఎంతమంది తమ కంటే యెంతో చిన్నవాళ్ళతో వ్యభిచారం చేస్తూ వుండ్లేదు! అబ్బా! ఏమిటీ పిచ్చి ఊహాలు - ఇట్లా ఆ రాత్రంతా గడిపింది.

ఉదయం వచ్చిన మురళి మొగం చూచింది సరళ. వాడిపోయినట్లుంది. కండ్లు యెర్రగా కాలిక్కాలని యినుప ముద్దల్లాగా వున్నాయి. అనుమానం స్థిరమయింది; లోలోపల యేడ్చుకుంది.

ఆ మరునాడంతా యెక్కడికీ పోనీలేదు మురళిని. ఆ మరునాడు రాజామణి వచ్చి ఆ యింట్లో ఎపుడూ ఆ రోగి దగ్గర వుండడం అంత శ్రేయస్కరం గాదని చెప్పింది.

"మీ రిద్దరూ మా యింట్లో వుండండి. అంతగా అయితే నేను మా నర్సును ఇక్కడేపెట్టి చూస్తూవుంటాను" అంది.

"అట్లాగే చెయ్యండి" అన్నాడు బ్రహ్మరావు.

"నే నిక్కడే వుంటాను నాన్నా. అంతగా అయితే మురళిని పోనీ" అని అంది జారి. మురళి పోవడం తనకు బొత్తిగా యిష్టం లేకున్నా, రాజామణి పైగల ఈర్ష్యచేత అట్లా అంది.

"సరే నర్సునుగూడా పంపుతా" అంటూ. రా మురళీ' అంది. "తర్వాత వస్తా పద" అంటూ నాన్న దగ్గర కూర్చున్నాడు.

సరళ తన గదిలోకి వెళ్ళింది. కిటికీ గుండా చూస్తూ వుంది. బ్రహ్మరావు మురళితో మాట్లాడుతున్నాడు.

"మురళీ! యిది చాలా ప్రమాదమైన జబ్బు! ప్రాణం యెపుడు పోతుందో గూడా తెలీదు. నేనొక్క మాటమాత్రం చెబుతా. నీవు బాగా చదువుకున్నావు. ఇంకా చదువుతావు. నేను నీ కిస్తూన్న ధనం ఆ మాత్రమే! ఇకేమీ లేదు. ఈలోగా నేను దాటుకున్నానా, నిన్నూ. అక్కనూ బికార్లచేసి పోతున్నా నన్నమాటే. నీకు ఫరవా లేదు. అక్క విషయం జాగ్రత్త. అమ్మ చనిపోతూ దీన్ని అన్యాయం చేసింది. అది కోరినవాణ్ణి అది వివాహమయ్యేటట్టు చూడు కోరితే. ఎప్పటికిగూడా దాని మాట అకారణంగా మీరకు. అది తెలివైంది. చురుకైంది. అభిమానిని, జాగ్రత్త! ఇంతకంటే నీకు నేనేమీ చెప్పలేను. అట్లాగే చేస్తానని చేతిలో చెయ్యి వెయ్యి" అన్నాడు. ఆ అప్ప గింతలు వింటూన్నకొద్దీ మురళికి కన్నీళ్లు కార్తున్నాయి. ఇప్పటికే వీళ్ళకు తెలీకుండా చెడ్డపనులు చేశాడు. అక్కను బాధపెట్టే వున్నాడు. ఇపుడు బాధ పెట్టనని ప్రతిజ్ఞ చెయ్యాలి.

"నా కివన్నీ చెప్పాలా నాన్నా" అంటూ చేతిలో చెయ్యేశాడు. ప్రక్క చూస్తే అక్కలేదు.

జూన్ నెల మొదటి వారంలోనే మదనపల్లి శానిటోరియంలో తాను చేరేటట్లూ మురళి యం. బి. బి. యస్. సరళ యం. ఎ. చదివేటట్లూ ఏర్పాటయింది.

# 11

లలిత ఆలోచనా సముద్రంలో మునిగి పోయింది. నీ వాడే అని హృదయం రహస్యంగా చెబుతూన్నట్లుంది. నావాడతడెట్లా అవుతాడు? నన్నాతడెందు కంతగా ఆకర్షించాడు? నేనెందు కంతగా లొంగిపోయాను? ఛీ! ఎంత బేలనయి పోతున్నాను! ఇన్నేండ్లుగా బ్రహ్మచార్యాన్ని సాగిస్తూ వచ్చిన నేను ఈనాడు భావ లౌల్యంచేత యెంతగా బాధపడుతున్నాను! ఇట్లా ఆలోచింప మొదలు పెట్టింది. ఒకనాడుగాదూ రెన్నాళ్లగాదు. అనుదినమూ అంతే! మొదట మొదట కొన్ని దినాలు అన్నం దగ్గిర కూర్చుంటే దాన్ని చూడగానే తృప్తి కలిగినట్లుండేడి. తినబోతే వెగటుగా వుండేది! పడుకుంటే నిద్రరాదు. కాని కండ్లు మాత్రం మూతలు పడేవి. కను రెప్పలు సినిమా తెరల్లాగా కాగా, ఆ తెరలపై ఆనాటి యువకుడు-! ఎంత అందంగా వున్నాడు! ఎంత బలంగా వున్నాడు! ఎంతగా మిలమిల లాడు తున్నాడు! ఛీ! ఇదేమిటి? ఊరకే ఆలోచిస్తున్నాను! భావాలకు దాసురాలనై పోతున్నాను. ఎంత అబలనై పోయాను! ఎంత నైతికచ్యుతం! - రెండు నెల లీ విధంగా అవస్థ పడింది లలిత. అంతర్నిరోధం ఆమెవల్ల కాకపోయింది. మనస్సుపై గల ఆధిక్యం అంతరించింది. మనసు ప్రకారమే నడుచుకోవా లనుకుంటుంది. మనసు అతన్ని చూడాలని తహతహలాడ సాగింది. కాలేజీలు ఎపుడు తెరుస్తారా అని ఎదురు చూస్తూ కూర్చుంది.

కాలేజీకి మురళి దరఖాస్తు పంపాడు. ఒకనాడు పనికట్టుకొని లలిత వెళ్ళి, కాలేజీ ఆఫీసులో ఆ దరఖాస్తుగూడ చూచింది. ఆ అక్షరాలు చూచి

మనసులో ముద్దుపెట్టుకొంది. తర్వాత కొన్ని దినాలకు శీటుగూడా వచ్చినట్లు తెలుసుకొంది.

కాలేజీ తెరిచారు. ఆ దినం ఆ అబ్బాయి రాలేదు. మరుదినం గూడా కనుపించలేదు. డబ్బు చెల్లించాల్సిన దినం గూడా వచ్చేసింది. ఆ దినం చెల్లించకపోతే శీటు పోయినట్లే. లలిత ఆఫీసులోకి వెళ్ళి జీతం చెల్లించిన వారి పేళ్ళంతా చూచింది. వాటిల్లో ఆ పేరు లేదు. అపుడే జీతం చెల్లించి పోతున్న చంపకను చూచి బిర బిరా బయటి కొచ్చింది లలిత. ఆమెను చూడగానే మహేంద్ర చంపక లిద్దరూ 'నమస్తే' అన్నారు. ఇద్దరికీ ఒక్క సారి నమస్తే అని "మహేంద్రగారూ...." అని ఏమో చెప్పబోయి మళ్ళా వద్దనుకొని,

"జీతం కట్టడాని కొచ్చారేంటి?" అంది మెల్లగా.

"అవునండీ, మా చంపక చేర్తుందని ఆనాడు సినిమాలో చెప్పానుగా" అన్నాడు మహేంద్ర.

"అవునవును. అయితే, యింకెవరో అబ్బాయి మురళీధర్ చేర్తా రన్నారుగా!"

"అవును బావా. అన్నయ్య రాకపోతే యేం, జీతం చెల్లించవచ్చుగా. శీటు పోదూ లేకపోతే" అంది చంపక.

"ఇంతకూ అతను పంపి వుంటాదేమో?" అన్నాడు మహేంద్ర.

"అది కనుక్కుంటే!"

"ఆఫీసుల్లో క్లర్కులు సరిగ్గా పలక రిప్పుడు. చాలా టెక్కుగా వుంటారు."

"నే చూచి చెబుతా రండి" అంది లలిత కేవలం సాయం చేసే భంగిమలో. కలిసి వెళ్ళారు. లలిత చరచరా తిరగవేసినట్లు నటించి. "చెల్లించ లేదండీ" అంది.

"అయితే డబ్బు కట్టేద్దాం బావా!" అంది చంపక.

"తొందరపడకు చంపకా, ఒకవేళ అతను రాకపోతే!"

"రాకపోతే మా అన్నయ్య పేరట యెవరికో దానం చేశాననుకుంటా: మా నాన్న గూడా సంతోషిస్తాడు'' అంటూ డబ్బు చెల్లించింది చంపక.

"చెల్లించడమేగాదు. చెల్లించాం రమ్మని తంతియ్యాలి'' అంది కర్తవ్యాన్ని బోధిస్తూ లలిత.

అన్నీ ముగించుకొని చంపక చంద్రమణి యింటి కెళ్ళింది. చంద్రమణికిగూడా మురళి రాక విషయం తెలియదు. కొన్నాళ్ళ క్రితం వాళ్ళ నాన్నకు జబ్బు ఎక్కువయిందనీ చదువు విషయం సరిగ్గా చెప్పలేననీ వ్రాసినట్లుగా చెప్పింది చంద్రమణి.

''అయితే నేను వైరిచ్చాను రమ్మని. డబ్బు కట్టేశాను గూడా'' అంది చంపక.

''వైరిచ్చినా యివ్వకపోయినా అక్కడ పరిస్థితులు పరిష్కార రూపంలో వుండందేరారు'' అని చంద్ర అంటూ వుంది. అంతలో ఎగిరిపడి,

''అడుగో!'' అంటూ చంపక లేచి ముందుకు పరుగెత్తింది. నవ్వుకుంటూ వస్తున్నాడు మురళి. ఎగుర్తూ వచ్చి ''అన్నయ్యా. అన్నయ్యా'' అంటూ చెయ్యిపట్టుకొని, ''నీ మాటే మాట్లాడుకుంటున్నాం యిపుడే'' అంది ఉత్సుకతతో అతని మొగంలోకి చూస్తూ.

చంద్రమణి యిదివరకైతే తాను గూడా చెయ్యిపట్టుకుని 'ఏమోయ్ అల్లుడూ' అంటూ సరసా లాడేది! ఇపు డెవరన్నా అనుమానిస్తారేమో అని భయపడుతూంది! అయితే బిగబట్టుకొన్న సంతోషం, పెదవులపై మందహాసంగా మారింది.

"ఏం సరళా! నాన్న కెట్లా వుంది?'' అంది నెమ్మదిగా.

"బాగానే వుందత్తా."

"అన్నా! ఆమెవరు?''

''ఆమే అక్కయ్య. సరళ!'' అన్నాడు నవ్వుతూ మురళి. ఆ మాట వినగానే 'అక్కా' అంటూ నమస్కరించింది. దగ్గిరికొచ్చి నిలబడింది. సరళ సంతోషంతో ఆమెను తన ప్రక్కకు చేర్చి శిరస్సును ఆఘ్రాణించి ''చంపక గదూ!'' అంది.

"ఆ," అంటూ ఆనందంతో గుడ్లాడించింది చంపక.

"నీవు చెప్పిన లక్షణాలనుబట్టి చూస్తూనే కనుక్కున్నా" అంది సరళ, మురళి నుద్దేశించి.

"చూశావా మురళీ! నీ చెల్లి నీ కోసం కాలేజీలో దబ్బు గూడా కట్టేసింది!" అంది చంద్రమణి.

"నాకు తెలుసత్తా చంపక అంతపనీ చేస్తుందని నాకు తెలుసు" అంటూ వాత్సల్యంతో చూశా డామె వైపు. చంపక చెయ్యి నొక్కి ఆమె ప్రక్కకు గట్టిగా అదుంకొంది సరళ.

"డాక్టరుగారూ, మా అక్కయ్యా, మా అన్నయ్యా, మా యింట్లో వుంటా రిక మీదట." అంది చంపక.

"తీసుకపో. నన్ను గూడా తీసుకుపో!"

"రండి! మాకు జబ్బులొస్తే మందులిస్తూ వుందురుగాని."

"మరి యిల్లెక్క డత్తా?" అంది సరళ.

"దగ్గర్లోనే వుంది సరళా! అయినా మళ్ళా బాడుగపెట్టి వేరే యిల్లెందుకు? ఇక్కడే వుంటే పోతుందిగా!"

"ఎందుకూ! వేరేవుంటే పోతుంది. మా వంట మనిషిగూడా వచ్చింది."

"వస్తే ఫరవాలేదు యిక్కడే పని చేసుకుంటూ వుంటుంది."

కాలేజీలో ప్రాక్టికల్సు మొదలైననాడు చంపక, మురళి, మొదటి బ్యాచీలో వున్నారు. ఏదో చేస్తున్నారు. అక్కడ ప్రాక్టికల్సు జరపడం లలిత కొద్దిగా లేటుగా వచ్చింది. అప్పటికే అందరూ ఎవరి శీటు దగ్గిరికి వారు వెళ్ళి పనిచేస్తున్నారు. బాహాటంగా మగపిల్లలు ఏదో నెపంతో ఆడుపిల్లల వైపు చూస్తూ తమపని తాము చేసుకుంటున్నారు. ఆడుపిల్లలు 'ఇట్లా చూస్తారెందుకు గొర్రెల్లాగా' అనుకుంటూ వారకంట చూస్తూనే వున్నారు. లలిత, మురళీ చంపకల దగ్గరికొచ్చి వాళ్ళిద్దరి వెనకా నిలబడింది నద్దుగాకుండా చూస్తూ.

"అన్నయ్యా, ఆ దినం డబ్బు కట్టకపోయివుంటే నీకు శీటు రాక పోయేదిగా" అంది చంపక.

"కానున్నది కాక మానదుగా!" అంటున్నాడు మురళి ఏదో రెండు ద్రవాలు కలుపుతూ.

"అయితే ఆ దినం యింకోరుగూడా సాయం చేశారు!"

"ఎవరు?"

"ఆ దినం మనం సినిమాలో చూశామే, ఆమె!"

"ఏమిటా చెప్పటం?"

"నీవు నాతో అనలేదూ ఆమెవరో రంభలా వుంటవని! ఆమె!"

"ఓహో, లలితగదూ! ఇక్కడేగా ఆమె పనిచెయ్యటం!"

"అవును. ఆమె నీవు జీతం కట్టినట్లు లేదని మన కోసం శ్రమ తీసుకొని చూచి చెప్పింది."

"చంపా, నా కామెను చూడాలని వుంది. ఎట్లా?" అంటూ వెనక్కి చూశాడు. లలిత వెనుక మందహాసంతో నిలబడి వుంది. మందహాసమూ, గాంభీర్యమూ మిశితమై ప్రకాశిస్తున్నా యామె వదనంలో. అట్లానే ఒకక్షణం చూచాడు. తల వంచుకున్నాడు మళ్ళా. గంభీరంగా ఆమె మత్త గజ గమనంతో తొలగి పోయింది. చంపక అదంతా ఒక్కక్షణంలో కనిపెట్టి, ఏమీ తెలియనట్లుగా తనపని చేసుకుంటూ వుంది. మురళి మనసు లలిత వెంట పడింది. కండ్లుమాత్రం బల్లవైపు చూడక తప్పింది కాదు. మనసు నిమగ్నం గాని చూపులు చేసేపనులు చంపక తక్షణమే కనిపెట్టింది. అక్కడేదో కత్తితో చేయవలసిన పని పేనాతో చేయబోతాడు.

"అదేం టన్నా" అని చంపక కత్తి అందిస్తే,దాంతో నోటుబుక్కులో యేదో వ్రాయబోతాడు. "మతి పోతూవుందా యేమిటి?" అంటూ చంపక డొక్కన పొడిచింది. అప్పటికి కాస్త తిరి గొచ్చింది మనసు యథాస్థానానికి. ఏదో గాభరాగా "కానీ చంపా ఏం చెయ్యా లిపుడు?" అన్నాడు నుదుటి చమట తుడుచుకుంటూ. టైం అయింది. అందరూ పోతున్నారు. వీళ్ళ పని

పూర్తికాలేదు. అక్కడే వున్నారు. లలిత వచ్చింది. చిరునవ్వు పెదవులపై చిందులుతొక్కగా కొంచెంగా పెదవులు తెరచి,

"ఏం రాలేదా?" అంది.

ఏమీ జవాబు చెప్పకుండా అట్లా నిలబడ్డారు చూస్తూ.

ఆమె నిజంగా లలితమూర్తి. మనిషి సన్నగా వుంటుంది. ఎత్తుగూడా సుమారుగా వుంటుంది. సర్వావయవాలూ సుందరంగా వున్నాయి. చూపు లతి సాధారణంగా వున్నాయి. కనుబొమ్మలు. శిరోజాలూ, చాలా నల్లగా వున్నాయి. జడలేదు. అవన్నీ సాధారణంగా ముడి వేసింది. అంతా తెల్ల డ్రస్సు, అతి సాధారణంగా వుంది. ఒంటిపై ఒక్క ఆభరణం గూడా లేదు. ముడిలో ఒక్క గులాబీపుష్పం మాత్రం వుంది. చేతికొక చిన్నవాచి, మెడలో ముత్యాలపేరు. ఇవన్నీ చూస్తూ నిలబడ్డాడు మురళి.

"పూర్తయిందా?" అంది లలిత సన్నగా నవ్వుతూ.

"కాలేదు" అంటూ బల్లవైపు తిరిగాడు.

"ఇక యిప్పుడుగాదు. మీరిద్దరూ రేపు ఉదయం రండి. నేనూ వస్తాను, అపుడు ముగించుకొని పోదురుగాని. సరిగ్గా 7-20 కి రావాలి."

"అట్లాగే" అంటూ వెళ్ళిపోయారు మురళీ చంపకలు.

# 12

చంద్రమణి చాలా కులాసాగా వుంటూ వుంది; ఆమె పడక గదికి ప్రక్కనుండే గది మురళి కిచ్చింది. కాస్త సంబంధంలేని గది సరళ కిచ్చింది. అది సరళకు కాస్త అనుమానాన్ని కలిగించింది. ఇటీవల వారి చూపులూ, మాటలూ. ఎంత జాగ్రత వహించినప్పటికీ-కనిపెట్టిన సరళకు, అనుమానం హెచ్చింది. దాని అంతర్య మేమిటో కనిపెట్టా లనుకుంది. అనుమానపడడం సమంజసం కాదనుకుంది మళ్ళా వాళ్ళ వయోభేదం చూచి.

ఒకనాడు చంపక సరళను తన యింటికి లాక్కెళ్ళి, ఆ రాత్రి యింటికే రానీలేదు. బలవంతంగా పడుకోబెట్టింది. పడుకొందే గాని నిద్రపట్టలేదు సరళకు. అంతకుముందు రెండు దినాలనాటి రాత్రి విషయం జ్ఞాపక మొచ్చింది, నగంరాత్రి సమయంలో చంద్రమణి గదిలో గుసగుసలు జరుగుతున్నాయి. అబ్బా అనే ఆనంద ప్రకటనలు అస్పష్టంగా వినిపించాయి. కాసేపటికి చంద్రమణి మురళి గదుల మధ్య తలుపు తెరువబడి మళ్ళా జాగ్రతగా మూయబడుతున్న చిన్నశబ్దం వినిపించింది. ఇవన్నీ పాముచెవులతో వింది సరళ. అప్పటికి తన అనుమానం నిజమైనట్లుగా భావించింది. ఇపుడా దృశ్యాలు ఈమె మనోనేత్రాల ముందు ప్రతిబింబించి ఆమె ఆలోచనల రెచ్చగొట్టాయి. ఇక అక్కడ వుండలేకపోయింది, చంపకను లేపి,

"చంపా! ఎందుకు అని ప్రశ్నించకు. నీవు కారు నడుపుతావ్‌గా!" అంది.

"అవును" అంది చంపక.

"చూడూ! నన్ను అర్జెంటుగా మా యింటిదగ్గర వదిలి రావాలి."

"ఎమిటక్కా యీ పన్నెండుగంటల సమయంలో?"

"ఏమిటి తల్లీ! ప్రశ్నించ నన్నావుగా! తర్వాత చెబుతా పద."

చంపక యేమీ బదులు చెప్పలేకపోయింది. సరళ కంఠ ధ్వనిలో అధికారస్వరం వినిపించదుగాని, ఆ అర్థంలో మాత్రం అది గోచరిస్తుంది. స్వరంలో ప్రేమ, లాలిత్యం కనిపిస్తాయి గాని అంతరంలో శబ్దస్వభావ కాఠిన్యం గోచరిస్తుంది. పైకి సరళంగా కనిపిస్తుందిగాని లోపల గాంభీర్యం ఆవరించి వుంటుంది. పలుకులు చెవులకు ఆదేశాలుగా కనిపించవుగాని హృదయానికంతే. చంపక మారు మాట్లాడకుండా లేచింది. ఇద్దరూ కార్లో కూర్చున్నారు. కారు సరాసరి వెళ్ళి యింటి దగ్గర ఆగకుండా కాస్త దూరంలో ఆగింది. చంపక వెళ్ళిపోయింది. సరళ గేటు దగ్గర కొచ్చింది. గేటుతాళం వేసివుంది. బయట యెక్కడా నర సంచారం కనిపించలేదు. కాస్త భయంగూడా వేస్తూ వుంది. వంటమనిషి దగ్గరగా వరండాలో పడుకొని వుంది.

అపుడే తానెందుకో మేల్కొన్నది, అట్లా చూస్తున్నది. స్త్రీ వ్యక్తి గేటువద్దకు రావటం, నిలబడటం, చూస్తూనేవున్నది. ఆ ఆకారం చూచి సరళేమో అని అనుమానించింది గానీ, ఆమె యింత రాత్రివేళ ఒంటరిగా యెందుకొస్తుంది అన్న భావం ప్రక్కనే కలిగింది. లేవబోయింది. లేచి అరుస్తుందేమో అని అనుమానించి 'స్స్' అంది సరళ హస్తం పైకెత్తి. మరు క్షణమే 'నేనే సుబ్బమ్మా తాళం తీ' అంది వినబడీ వినబడనట్టుగా. అప్పటికి సరళే అని తెలిసికొని లేచివస్తూ 'ఏమ్మా' అంది కాస్త సుమారుగా. సరళ ఆతురతతో తనచేత్తో నోరు మూసుకొని మరొక చెయ్యి పైకెత్తి 'అరవ వద్దు' అని సైగ చేసింది. ఈ శబ్దం లీలగా వినిపించింది లోపలి వారికి. కాసేపు శ్రద్ధగా విన్నారు మరేదైనా వినిపిస్తుందేమో అని; ఏమీ వినిపించకపోగా మళ్ళా తమ ధోరణిలో పడ్డారు ధైర్యంగా, సరళ నిశ్శబ్దంగా లోపలి కొచ్చింది. హాలు మూసివుంది, లోపల గడియ వేసినట్లుంది, ఇక లోపలి కెట్లా పోతుంది; తన ప్రయత్నం విఫల మైనట్లుగా భావిస్తూ తలుపు కానుకొని నిలబడింది యోజిస్తూ. అట్లా కొన్ని క్షణాలు యోజించి బరబరా సుబ్బమ్మ దగ్గరకొచ్చి

"సుబ్బమ్మా! ఒక పని చెయ్యాలి. నే చెప్పినట్లు చెయ్యాలి యెందుకని మాత్రం అనక" అంది.

"ఏమిటమ్మా?"

"చూడూ! నీవు తలుపుకొట్టి అమ్మగారూ అని అణగబట్టిన గొంతుతో ఆదుర్దా కనబరుస్తూ అరు. వాళ్లు బయటికొస్తారు; నీ వింకా ఆదుర్దా చూపిస్తూ ఆ గేటువైపు చేతులు చాపి 'ఎవరో వీధిగేటు తలుపు దగ్గరకొచ్చి తొంగితొంగి చూచి యిపుడే అట్లా పోతున్నారని' అంటూ నీవు బిరబిరా గేటువైపు నడిచిపో; వాళ్లు నీ వెంట పడుతారు. నేను ఎవరికీ తెలీకుండ లోపలి కెళ్తాను. జాగ్రత్తగా చెయ్యి."

సరళ గోడమూల నక్కింది: సుబ్బమ్మ తన పని చేసింది. చంద్రమణీ మురళులు ఆదుర్దాతో, ఆదరాబాదరాగా గేటువైపు పరుగెత్తేటప్పటికి, సరళ తటాలున లోపలికెళ్ళి తన గదిలో దూరి తలుపు వేసుకొంది.

"ఏమిటి సుబ్బమ్మా యెవరూ లేరే!" అంది చంద్రమణి బాగా చూచి.

"ఏమన్నా కల గన్నావటమ్మా?" అన్నాడు మురళి.

"ఏమిటో మెలకువ వచ్చి అట్లా చూచేటప్పటికి ఎవరో కనిపించారు. కనిపించగానే కాస్త భయమేసింది. వెంటనే మిమ్మల్ని పిలిచాను."

"ఆమె వెళ్లికేం పద" అన్నాడు మురళి.

"గేటు తాళం వెయ్యి" అంటూ లోపలి కెళ్ళి హాలు గడియ వేసింది చంద్రమణి. ఆమె భుజం పట్టుకొని చంద్రా అంటూ ఎగిరాడు మురళి హాల్లో. అక్కణ్నుంచి చంద్రమణి గదిలోకి వెళ్ళిపోయారు, సరళ కాస్త తలుపు తెరిచి చూడా లనుకుంది. కాని మంచంమీద అట్లాగే పడుకుంది వింటూ, దుప్పటి దులిపిన శబ్దం వినిపించింది. మళ్ళా లైటు ఆరిపోయింది. కిల కిల నవ్వుకుంటూ మంచం పైన పడినట్లు విన్నది.

"అక్కయ్య లేకపోతె మనమెంత భయ రహితులంగా వుంటామో చూడు చంద్రా" అన్నాడు మురళి.

"అవునోయ్! అసలది యిక్కడి లేకుంటేనే బాగుంటుంది! ఈ దినం చూడు ఎంత హాయిగా వున్నామో; అది వుంటే రోజూ భయం భయంగా వుండేది మనకు. మన వ్యాపారం యాంత్రికంగా వుండేది. ఎన్నన్నా అప్పటి స్వేచ్ఛా జీవితం యిక చూడ బోము!"

"ఆమెను చూస్తే నాకు బలే భయం చంద్రా! చిన్నప్పట్నుండీ అంతే"

"ఇంకా భయ మేంటోయ్!" అంది చంద్రమణి. అంతే, తర్వాత మానవ సంబంధిక శబ్దం వినిపించలేదు.

సరళకు కన్నీరు కారిపోతూ వుంది. ఎంత కాలం నుండో, తన కోసంగా, జాగ్రత్తగా కాపాడుకుంటూ వస్తున్న వస్తువును, ఎవరో అమాంతంగా లాక్కొని అనుభవిస్తునట్టుగా ఫీలయింది. కోపం కొంచెం కొంచెమే అతిశయిస్తూ వుంది. మురళి రూం దగ్గర కెళ్ళింది, అది లోపలనుండి గడియ

వేసివుంది, నిలబడి ఆలోచించింది. సంశయంతో వెనక్కివచ్చి మళ్ళా పడుకొంది.

అక్కణ్ణుంచి లేవడానికి తన సంస్కారం అనుమతి యివ్వలేదు. అట్లాగే కూర్చుంది. నాలుగు గంటలు కొట్టా రెక్కడో ఆఫీసులో; నాలుగు అని లెక్క పెట్టింది గూడా సరళ. లోపల మళ్ళా మాటలు వినిపించాయ్:

"ఇక పడుకుందాం చంద్రా" అన్నాడు మురళి.

"అబ్బా! ఇక నిద్రెందుకోయ్! అంతగా అయితే పగలంతా నిద్రపోదూరే! ఈ నాడన్నా స్వేచ్ఛగా రాత్రంతా అనుభవిద్దాం."

"మురళీ, మనం పరస్పరం ప్రేమించుకొని గూడా స్వేచ్ఛగా అనుభవింపలేక పోతున్నాం. ఏమిటీ భయం మనకు?"

"ఏమంటావు?"

"సరళ యిక్కడున్నంత వరకూ స్వేచ్ఛ వుండదు."

"అయితే యేమంటావు?"

అతని ధోరణి కాస్త పసిపట్టింది చంద్రమణి.

"అదిగాదు మురళీ, మనం వివాహం చేసుకుందామని!"

"అక్కయ్యకు చెప్పేద్దాం" అన్నాడు మైకంలోనే.

"కాదు. అది బొత్తిగా ఒప్పుకోదు; కారణాలున్నాయి."

"ఏమిటా కారణం?"

"ఇపుడు చెప్పను."

"అదంతా యిపుడెందుకు పోనిద్దూ!" అన్నాడు మురళి ఉపేక్షగా. తర్వాత శబ్దంలేదు.

మరునాడు నిద్ర లేస్తూనే మంచంపై గంభీరంగా కూర్చుని ఆలోచిస్తూన్న సరళను చూచి విచలిత అయింది చంద్రమణి. చంద్రమణి తల వంచుకొని సరళవైపు చూస్తూ వుంది నిలబడి. సరళ కాస్త తలయెత్తి అట్లా చూచింది చంద్రమణి ముఖంలోకి. ఆమె ముఖంలో సహజంగా కనుపించవలసిన సిగ్గూ, అవమానామూ, కనబడక, కాఠిన్యం, అసూయా కనబడగా-

అసూయా మిశ్రితమైన ఆక్రోశం వచ్చింది సరళకు. ఆ భావాన్ని కాస్త అణుచుకుంటూ,

"ఇంత పనికి దిగుతా వనుకోలేదు" అంది.

"ఎంత పనేమిటి? అంత వింత పనా?" అంది మెడనిక్కబెట్టి.

"కాదా?"

"ప్రపంచంలో అంతా జరిగేదే. అవసరమైంది గూడా!"

"అవసరమైతే మాత్రం ..." ఏదో అనబోయి చాలించుకుంది."

"అనవసరంగా మాట్లాడొద్దు సరళా" అంటూ బుర్రున బయటి కెళ్ళిపోయింది చంద్రమణి.

వింటున్నాడు మురళిదంతా తన గదిలో కూర్చుని. భూమిలోకి క్రుంగి పోతున్నట్టుగా వుంది. ఆకాశం విరిగి నెత్తిన దూకినట్లుగా వుంది. సముద్రపు సుడులలో తగులుకొని ఉక్కిరి బిక్కిరవుతూన్న ట్లున్నది. ఇంతలో సరళ రానే వచ్చింది గదిలోకి. మురళి దీనంగా చూచి "అక్కా" అంటూ రెండు కాళ్ళూ పట్టుకున్నాడు.

"మురళీ" అంటూ ఆమె వాడిపైన ఒరిగింది.

కొన్ని దినాలైంది యిల్లు వేరే తీసుకొని కాపురంపెట్టి. ఇపుడు మురళికి రాత్రులు ఎక్కడా వుండటానికి వీలు పడింది కాదు. అంచేత అపు డపుడూ పగలే వచ్చేవాడు చంద్రమణి యింటికి. సన్యాసిరా వింటికి మాత్రం విశేషంగా వెళ్ళేవా రిద్దరూ గూడా. చంపక యిటీవల సరళ దగ్గర విశేషంగా వుంటూ వచ్చింది.

కాలేజీలో బాలబాలికలు యిరుతెగలనుండీ మురళికి గుడ్‌మార్నింగ్‌లు లభిస్తూ వుండేవి. చాలామంది ఆడుపిల్లలు పనిలేకున్నా ఉన్నట్లు మాట్లాడించే వారు. మెడికల్ గర్ల్స్ కాబట్టి ఏమీ అధైర్యంలేకుండా బాతాఖానీ వేసి ఎగ తాళిగూడా చేస్తూ వుండేవారు. వాళ్ళందరిలోనూ ఒక అమ్మాయి ఎక్కువగా మోహించిం దతన్ని. ఎపుడూ గూడా దగ్గర నిలబడేది. ఎవరన్నా మాట్లా డుతూ వుంటే నెమ్మదిగా నిలబడి చూస్తూ వుండేది. ఎక్కువ మాట్లాడదు.

మురళి యెక్కువగా మాట్లాడేవాడు గాదుగాబట్టి, ఆమె గూడా ఆ ధోరణి అవలంబించింది. చంపకకు మంచి స్నేహితురా లయింది. ఒకనాడు చంపక అంది:-

"ఏం రుక్మిణీ! నీ ధోరణిచూస్తే వదినె వయ్యేలా గున్నావే" అని. నవ్వుతూ అన్న ఆమె మాటలకు రుక్మిణి నవ్వుతుం దనుకొంది. అయితే నవ్వలేదు.

"ఉందో, లేదో!" అంది దిగులుగా. ఆ ధోరణి చూచి ఎగతాళి చెయ్యాలనే బుద్ధి పుట్టలేదు చంపకకు. తర్వాత మరునాడు మురళితో ఏకాంతంగా అంది చంపక.

"అన్నయ్యా! రుక్మిణి నీ కిష్టమేనా?" అని.

"మంచమ్మాయేనమ్మా. నెమ్మదిగా వుంటుంది."

"అయితే దాన్ని చేసుకుంటావా?"

"ఏం! నీతో అందా?"

"అవును ఆ ధోరణిలోనే అంది మొన్న."

"ఎంతమందిని చేసుకొనేదమ్మా?" అన్నాడు నిరుత్సాహంగా చిరునవ్వు నవ్వి.

ఒకవిషయం యిదివరకే గడిచిపోయింది. సీత ఆ దినం ప్రతిజ్ఞ తీసికొని, తనను ప్రతిజ్ఞ తీసికొమ్మని బలవంత పెట్టగా అలిగి వచ్చిన మురళి, తర్వాత అవైపే వెళ్ళలేదు. తనకు కావలసిన కామతృష్ణ రాజామణి తీరుస్తూ వుండగా సీతపైగల తనకోపం, త్వరగా ఉపసంహరించుకో నవసరం లేకపోయింది. అంతే గాకుండా యింటి విషయాలుగూడా అంత ప్రోత్సాహకరంగా లేవు.

మురళి బయలుదేరేనాడు సీతకు చెప్పనుగూడా లేదు. సత్యారావొకసారి సీత నైతిక ప్రవర్తనను గురించి అవలీలగా, హేళనగా అన్నాడు. సీతకూ, క్రిష్ణయ్యకూ కాస్త ముడిపెట్టాడు. అదీగాక మదనపల్లె కందరూ ప్రయాణమయ్యే టప్పుడు స్టేషను కొచ్చిన క్రిష్ణయ్య ఏదో సీత విషయమే

మాట్లాడాడు. అదీగాక తనను బ్రతిమాలడానికి సీత యత్నించలేదు. తన కోపానికి కాస్త అనుమానం తోడుకాగా, అది ఉపేక్షాభావాన్ని ప్రసాదించగా, సీతను మరవడానికి మురళి చేసిన యత్నం సుగమంగానే వుండింది.

మురళి వెళ్ళిపోయిన అనంతరం సీత యెంతగానో యేడ్చింది. మరునాడు చూచింది. రాలేదు, ఆ మరునాడూ చూచింది, రాలేదు. కొన్నిదినాలు గడిచాయ్. సీత దుఃఖం పెరగడంచూచి "మురళితో మాట్లాడి వస్తా" నన్నది లక్ష్మి. వద్దని ఆపింది, కాస్త గంభీరంగా వుండాలని. మురళి కుటుంబం అంతా మదనపల్లెకు వెళ్ళారని సరళను గురించి దిగులుగా లక్ష్మి అనేటప్పటికి మురళి విషయమై సీతకు గుండెలు పగిలిపోయేంత పనయింది.

"అక్కా! అతని యిష్టప్రకారమే చేసివుంటే బాగుండేదేమో గదూ?" అంటూ యేడ్చింది సీత.

"ఎట్లయినా ఒకటేనమ్మా అట్లా చేసేవాళ్ళకు. ఒకవేళ అతని యిష్ట ప్రకారం నీవూ లొంగితే ఇంకా కొన్నిదినాలు వచ్చేవాడు. అసలు నిష్కల్మష ప్రేమ వున్నవాడు ఆ విధంగా ప్రాకులాడడు. అట్లాంటి కామి మనం పట్టుకున్నా వుండడు! కానీ! నీవు ప్రేమించినట్టు, అతనూ ప్రేమిస్తే నీవాడు కాకపోడు" అని ఓదార్చింది లక్ష్మి. సీతకు చాల్లేదా ఓదార్పు. కొన్నాళ్లు దుఃఖించి దుఃఖించి, జాబు వ్రాయమంది అక్కను. ఆమె వ్రాసింది చాలా విషయాలు. ఆ జాబు చంద్రమణి చేతికి చిక్కింది. సీతపై అసూయ ప్రబలగా మురళిపై మోహమూ, మమతా, అతిశయించాయి. జారిపోతాడేమో అని పెండ్లి కోసం బలవంత పెట్టసాగిం దప్పట్నుండీ.

తమ వివాహాన్ని రిజిష్టరు చేసుకోవాలని చేస్తూ వచ్చిన చంద్రమణి ప్రయత్నాలను మురళి కొనసాగనీయలేదు. ఆమె మొదట బలవంత పెట్టింది, తర్వాత బ్రతిమాలుకొంది. అతనికి ఆమె యెడ అయిష్టత లేకున్నా పెద్ద యిష్టం మాత్రం లేదు. ఒకనాడు చాలా విషయాలపై విరక్తిగా వున్న తరుణంలో తన ప్రాముఖ్యాన్ని నెఱపి ఒప్పించి రిజిష్ట్రాఫీసుకు వెళ్ళడానికి సుముఖుణ్ణి చేసింది, తొందర తొందరగా ముస్తాబౌతున్నది చంద్రమణి.

బెల్లంకొట్టిన రాయి మాదిరిగా నిలబడి వున్నాడు మురళి బీరువా దగ్గిర. ఆమె ఇంతలో తటాలున ఒక చీరె లాగింది బయటికి; దాని క్రింద నుండి ఒక కవరు బయట పడింది. దానిపైన మురళి అడ్రసుంది. తటాలున వంగి అందుకోబోయాడు, లాక్కుందామె హఠాత్తుగా. బలవంతంగా ఆమె చేతిలోంచి లాక్కున్నాడు.

"ఎందుకు దాచావు దీన్ని?" అన్నాడు మురళి సీరియస్‌గా.

చంద్రమణి కాస్త చురుగ్గా,

"ఆ జాబులో పిల్లెవరు?"

"అదంతా నీ కనవసరం."

"ఇట్లా యెందరిన్ని అన్యాయం చేద్దామనుకున్నావు?"

"చెయ్యలే దన్నానుగా!"

"ఆ జాబులో పిల్లను చేశావ్. నన్ను చేశావు, ఇంకొకరిని చేస్తున్నావు. ఇంకా ఎందరికి చేస్తావో!"

"నేనెవర్నీ మోసం చెయ్యలేదు. నేనుగా చేసుకుంటాను రమ్మని ఎవర్నీ కోరలేదు. నిన్ను నేను కోరానా? నీవే నన్నుకోరావు. ఉపయోగించుకున్నావు. పెండ్లికావా లన్నావు. అంతేగాని నేనెప్పుడూ ముందడుగు వెయ్యలేదు."

"అయితే వివాహాని కిష్టం లేనివాడి వట్లా యెందుకు చేశావు?"

"నీవామాట మొదట అనలేదుగా"

"అయితే మాత్రం తెలియక్కర్లేదూ? ఒకరికి ద్రోహం చేస్తున్నామే అనే జ్ఞానం వుండక్కర్లేదా? చెరిచిన తర్వాత వివాహ మాడాలనే నీతి అయినా ఉండక్కర్లేదా?"

"నీవా నీతో మొదట్నుండీ పాటించి వుంటే యెన్ని పెండ్లిండ్లో అయ్యేవిగా యీ పాటికి?"

కోపం బాగా వచ్చింది చంద్రమణికి.

"మురళీ జాగ్రత్తగా మాట్లాడు. అంతా చేసేదీ మీరే? పైగా న్యూనత పరిచేదీ మీరే!"

"ఇపుడు నేనేం అన్నాను?"

"అంతకంటే అనా లనా? నీవు నాకెన్నో వాడివో అనే ధోరణిలో అంటున్నావు - ఇంకేమనాలి?"

"మీ పురుష జాతే అంత. అనుభవించేటప్పుడు రాదు. పెండ్లాడ మన్నపు దొస్తుందంతా. నీతీ, నడతా, అన్నీ అపుడొస్తాయి! అప్పుడు వాటితో లేని అవసరం పెండ్లి విషయం వచ్చేటప్పటికే యెందుకు రావాలి? పెండ్లి కాకుండా అనుభవించడానికి నడత యెట్లా వున్నా ఫరవాలేదు. పెండ్లి విషయం వస్తే నడత కావాలి, నీవొక స్త్రీని చెరిచి అది వివాహ యోగ్యం గాదని వదిలిపెట్టి మరొక దానికోసం పోతావే, నీవంటివాడే యింకొకడు అదేమాదిరి చేసివుంటాడని యెందుకు వూహింపవు. నీవు చేసుకోబోయేపిల్ల చెడలేదన్న గ్యారంటీ యేమిటి! నీకు తెలియదు గాబట్టా? అంతమాత్రం జ్ఞానం గలిగి యోచించరెందుకు పురుషులు! మీ జాతంతా మంచి నడత కలిగి వుంటే ఏకన్యగూడా చెడదని తెలియదూ! ఆ నీతీ, నడతా, స్త్రీ పురుష లిరు తెగలకూ అవసరమే అని ఎందుకు భావించరూ?

పురుషుడేమో వేయి మందిని అనుభవించి వుండవచ్చు. తనకు మాత్రం యెక్కడా చెడని పిల్లగావాలి వివాహానికి. ఇంత వలపక్షరం యెందుకూ? స్త్రీ కొకన్యాయం, పురుషుడి కొక న్యాయమూనా? ఎవరో మూఢులయితే అనుసరించారు. చదువుకొన్నవారయినా దాన్ని మార్చుకుంటే యేం?-ఇదివరకు అన్ని విధాలా సరిపోయిన నేను, అన్ని సుఖాలనూ ఇచ్చిన నేను, ఆనందాన్ని ప్రసాదించిన నేను, పెండ్లి చేసుకోడానికి అనర్హురాల నయ్యానా? మీరంతా ఒకటి గమనించాలి. ఎంతకాలమైతే పురుషుడిలో వ్యభిచారం, అవినీతి, వుంటాయో, అంతకాలమూ చెడని కన్యలు దొరకడం సాధారణంగా దుర్లభమని గమనించాలి.

"నిన్ను వివాహమాడటంలో నా భావం అదిగాదు చంద్రా. వయో భేదం ఉందని" అని అన్నాడు మురళి తప్పించుకుందామని.

"అదే చెప్పావింతసేపు. అనుభవించడంలో ప్రమేయం వహించవి వయసు, వివాహం అంటే యెందుకు రావాలీ అని! ఎందుకిట్లా అజ్ఞానంగా మాట్లాడుతావు మురళీ?"

మురళి యేమీ మాట్లాడలేక పోయాడు. ఉత్తరం జేబులో పెట్టుకొని, అడుగులో అడుగేసుకుంటూ బయటికి నడిచాడు.

# 13

పరిచయమూ, తద్వారా కలిగిన సాన్నిహిత్యమూ, అందువలన కలిగిన స్నేహమూ, నానాటికీ అభివృద్ధికాగా, కృష్ణయ్యకు లక్ష్మిపైన చాలా మంచి అభిప్రాయం పడింది. ఏమి టేమిటో మాట్లాడేవా డామెతో. అభిప్రాయ భేదాలు చాలాసార్లు వచ్చేవి. ఒకనాడు అత నన్నదానికి,

"అవును. అంతే! ఎంత చదివినా, ఎంత సంస్కారం అలవర్చు కున్నాం అని విర్రవీగినా మీ పురుషజాతి యింకా పాత ధోరణి వదిలిపెట్ట లేదు." అంది.

"అవును లక్ష్మి. కొన్ని తరాలుగా రక్తంలో చొరబడి, కరుడు కట్టుక పోయింది, అంత త్వరగా వదుల్తుందా?"

"వాద మెందుకులే క్రిష్ణయ్యా! హృదయాలు మారవు అని వాదించే వారితో వాదించి లాభమేమిటి?"

"మారడం కష్టం అని చెబుతున్నానంతే."

"అది మూఢుల విషయంలో, చదువూ, సంస్కారమూ అన్నది ఇకదేనికనుకున్నావ్?"

"ఎంత చదివితే మాత్రం పాత భావాలొక్కమాటుగా ఊడ్చుకు పోవాలంటే మాత్రం పోతాయా?"

"ఎందుకుపోవు?"

"పోవు."

"అవును. ఆ "పోవు" అన్నధోరణి, మనసులోవుంటే. పోవు. అదే లొంగి పోవటం అంటాను. పోదు అనుకుంటే పోతుందా? "పోవాలి" అని దీక్ష వహి స్తే అది నిలు స్తుందా? సంస్క ర్తల గురించి పొగుడుతావు గదా! వాళ్ళంతా నీ మాదిరే 'పోదు' అనుకొనివుంటే ఏమైనా చేసేవారేనా? ఈ వెధవ సంఘం యింత మాత్రమన్నా వుండగలిగేదేనా?"

"వాళ్ళకూ మనకూ సాటా?"

"ఎందుకు కాదూ? వాళ్ళూ మనుషులేనా? ఒకప్పుడు నీ వయసులో వుండేవారనుకో, అప్పట్లో నీకన్నా ప్రబుద్ధులు కారని తెలుసుకో".

"అవన్నీ యెందుకుగాని కులీనుడొచ్చి సమకులాధిక్యతలేని వాళ్ళల్లో చేసుకోడం చాలా కష్టమనే అంటాను లక్ష్మి".

"అదే, ఆ భావమే వద్దన్నాను. ఏమిటో కులం అంటా వేమిటయ్యా! అదెక్కడుందో కా స్త నాకు చూపించు. నీ కులంతో కా స్త పోల్చి చూస్తాను. పొడుగూ లావూ, వుందేమో కా స్త తెలిసికొని అవతల ఒక నిర్ధారణ కొస్తాను!"

"నీ అవసరం కొద్దీ మాట్లాడుతున్నావ్! అంచేత కులాలు పోవా లంటావు."

"నీ వా మా టంటావని నాకు తెలుసు. నీవేకాదు. నీవంటి హృదయం వున్నవాళ్ళూ-కా స్త ఉన్నత స్థితిలో వున్నాం అనుకుంటూ భ్రమపడేవారూ-అంతా యిట్లాగే అంటారు. మా బోటివారు అవసరం కొద్దీ అట్లా మాట్లాడు తున్నారని అంటారు. చూశావా! ఇదే వ్య క్తుల్లో గల తారతమ్యం, ఇపుడు నీవే నా స్థితిలో వుండి నీ విపుడు మాట్లాడినట్టు నేనే మాట్లాడి వుంటే ఏవిధంగా భావించే వాడివి? ఎంతో చెలరేగి తిట్టేశే వాడివి, అవునా?" అంది లక్ష్మి నవ్వుతూనే, క్రిష్ణయ్య యేమీ మాట్లాడలేదు. మళ్ళా అంది లక్ష్మి:-

"నీవు ఏదో మాట్లాడదా మనివచ్చి, ఏదో మాట్లాడే స్తున్నావు! ఒక దాని కొకటి సంబంధం గూడా వుండటంలేదు. చాలా దినాలనుండీ యిదే

ధోరణిలో మాట్లాడుతున్నావ్. జన్మతః సంక్రమించే హక్కులు (Previleges) గలవాళ్ళెప్పటికీ యిట్లాగే మాట్లాడ్తారు. అవిలేనివాళ్లేమిమాట్లాడినా అదొక మోస్తరుగా కనిస్తాయి. మీ కాధిక్యం మొదట్నుండీ వస్తూవుంది. దాన్ని శిరసున ధరించే మాట్లాడతారు గాని ఎందుకు తీసేసి మాట్లాడ్తారు? చదువు కున్నావు గాబట్టి వొకటి గమనించు. ఇట్లాంటి అధిక్యాలూ, అనాదిక్యాలూ మనం సృష్టించుకొన్నవి; కేవలం అక్రమం. పుట్టేటప్పు డేమీ తెచ్చుకోలేదు. పోయేటప్పు డేమీ తీసుక పోరెవరుగూడా. మధ్య వచ్చిన భావానికీ మిడిసిపాటు శ్రేయస్కరం గా దెవరికీ. నీకు తెలియదని గాదు నే నివన్నీ చెప్పడం! ఆ పొరకాస్త తొలగుగాక! అని. అంతే.''

క్రిష్ణయ్య యేమీ మాట్లాడలేదు మళ్ళా. అవన్నీ నాకు తెలుసులే అన్నట్లు కూర్చున్నాడు. లక్ష్మి మళ్ళా అంది.

''చూడూ! ఓర్చుకొనేవా రున్నారని ఊరికే అంటూ పోగూడదు. ఆ ఓర్పుకు గూడా ఒక అవధి వుంటుంది. మితి మీరితే ఓర్పు ద్వేషంగా మారవచ్చు. ద్వేషం ప్రతిపక్ష పతనంతోగాని ఆగదు. కులీనులు, అనుకుంటూ కులం లేనివా రనబడే వారిపై అట్లాంటి అసహ్యాభావం గలిగి, న్యూనంగా భావిస్తూ, నీచంగా ప్రవర్తిస్తే పై వారికి పతనం తప్పదు. ధనం లేని వారి యెడ ఆ విధంగా ప్రవర్తించే ధనవంతుల కథా అంతే.''

''నిన్ను చేసుకుంటే నయినా మా పతనం తప్పవచ్చు.'' హేళనగా అన్నాడు క్రిష్ణయ్య.

''నే నిప్పటికి రెండు మూడు సార్లు చ్ప్పెపాను. బాగా ఆలోచించే చెప్పాను, ఇక మన వివాహ విషయం యెత్త వద్దని. నాకు బానిస కావాలని లేదు. ప్రస్తుతం విద్యాధికుడికి, విద్యాధికురాలు భార్యగా వున్నప్పటికీ. అంతగా గాకపోయినా, కొంతవర కయినా బానిసత్వం తప్పదు. నీ భావాలూ సత్యారావు భావాలూ, మురళి భావాలూ, మా పల్లెలోని అవిద్యా పరులైన యువకుల భావాలూ, నాకు ప్రత్యక్షంగా తెలుసు. ఇంకా యెన్నో చూశాను' విన్నాను. నేనెప్పటికీ స్వేచ్ఛగా వుంటానుగాని దాస్యం అనుభవించ డానికి యిష్టపడను.''

"వివాహం చేసుకోడం బానిసత్వం అంటావా!"

"అనను. కాని ఇపుడు జరుగుతున్న వివాహాల ఫలితం తొంభై తొమ్మిది పాళ్ళు బానిసత్వాన్ని ప్రసాదించడమే అవుతున్నది. వివాహానికి ప్ర ప్రథమా కర్షణ హృదయ బంధం. అది పరస్పరం బాగా అర్థం చేసుకొన్నప్పుడే గలుగుతుంది. ఆ అర్థం చేసుకోడం గూడా పరస్పరభావైక్యత పైనా, హృదయ సంస్కారం పైనా, ఆధారపడి వుంటుంది. లేనినాడు, వివాహాల ఫలితం, అక్రమాలూ, అపక తవకలూ, ఆధిక్యాలూ, స్వార్థాలూ, ద్వేషాలూ, నిండినదై పోతుంది. అట్టి వివాహం చేసుకుంటేనేం చేసుకోక పోతేయేం? నాకు మాత్రం రెండవ మార్గం కిట్టదు. అందుకై అవివాహితగా వుండటమే మంచిదని నా అభిప్రాయం."

"అవు నవును ఇట్లా ఎంతమందో అంటున్నార్లే యిటీవల?"

"నిజమే! ఎంతో మంది అట్లా అని పరిస్థితులు కలిసిరాకా. అనుకొన్నదాన్ని ఆచరణలోపెట్టే ధైర్యంలేకా, తాత్కాలికపు కామతృష్ణను పట్టుకోలేకా. ఏదో సంతృప్తి పడదామని వివాహం చేసుకుంటూన్న మాట నిజమే! వివాహం కామం కోసమే, కామం పైనే ఆధార పడింది కాదుగా! అందుచేత కొన్నాళ్ళు జరిగీ జరగక ముందే చాలా పొరపాటు చేశాం అని చాలా మందయినా అనుకుంటారు. నన్నుగూడా నీవట్లా భావించి ఎగతాళిగా నవ్వు తున్నావుగూడా. అయితే ఇందులో సత్యాన్ని చూడగలవు. నేనట్టి వారికి మార్గదర్శి నవుతాను!

"సరైన మొగుడు దొరకలేదని అట్లా వుంటారు" అని నోరంతా తెరచి నవ్వాడు క్రిష్ణయ్య.

"నీ వబద్ధం చెప్పలేదు క్రిష్ణయ్యా! సరైన పురుషులు దొరక నందు వల్లనే అని నా భావన! నీవుగూడా ఒప్పుకున్నావ్! ఇంకేం?"

క్రిష్ణయ్య దెబ్బతిన్నా ననుకున్నాడు. ఆమె అన్న మాట తన అహాన్ని కొట్టింది. నీళ్ల నమిల్తూ.

"అదిగాదు...." అని ఏమో అనబోతూండగా 'అదెట్లా అవుతుందీ'

అంటూ సత్యారా వొచ్చాడు వికట హాసంతో. క్రిష్ణయ్య ఆశ్చర్యంగా, గుమ్మిడికాయల దొంగలాగా, పీలవుతూ, క్షణంసేపు ఊపిరి బిగబట్టి నోరు తెరిచాడు. వస్తూనే. "సిగ్గువుంటేగదూ వెధవలకు! ఎంగిలికూటి కాశించే వెధవలకు బుద్ధి యెట్లా వుంటుంది?" అన్నాడు సత్యారావు మంచంపై కూర్చుంటూ.

"ఎంగిలి కూడంటే" అంది కాస్త వేడిలోవున్న లక్ష్మి.

"అంటే నీటోటి తప్పుడు రకాలే" అన్నాడు నిరసనగా.

లక్ష్మికి కోపం వచ్చింది. అయితే యేం జేస్తుంది! అవసరమేగాని అధికారం లేని కోపం యేం చెయ్యగలదు? "చక్కగా అన్నావు సత్యారావ్! మీరేమన్నా చెల్లుతుందేమో!" అంది తల పంకిస్తూ.

"నిన్నేమీ అనలేదు లక్ష్మి! నువ్వూరుకో."

"నాకు తెలుసది, గురి యెవరిపైకోగాని దెబ్బ నాకు తగుల్తున్నది. అంత తెలివిగా చేస్తున్నా వన్నమాట!"

"నిన్నే మన్నాను లక్ష్మి! ఏమ్మాట్లాడినా తరిమేశేట్టు మాట్లాడ్తావు?"

"ఏమన్నా వింతకు ముందు?"

"ఎంగిలి కూడంటే వచ్చినదోషం?"

"అంటే నీవు కొంత అనుభవించావని అర్థమేగా!"

"అబ్బే! అంత తెలివితక్కువ వాణ్ణిగాదు నీ విషయంలో లక్ష్మి! అంటే నేను వివాహ మాడాలనుకున్న స్త్రీ కోసం యెందు కొచ్చావూ, అవి యీ పురుషణ్ణి అంటున్నాను."

"ఛీ! కుక్కా!" అన్నాడు క్రిష్ణయ్య మొగం చిట్లించి.

"కుక్క బుద్ధితో కుక్కలాగా తిరిగే దెవరో తెలుస్తున్నదిగా" అన్నాడు సత్యారావు. వాదం పెరిగింది. చాలా రోషపూరితులయ్యా రిద్దరూ. నోటి కొచ్చినట్లు మాట్లాడుకుంటున్నారు. తాము విద్యాధికులమన్న విషయం మరిచిపోయి, సభ్య సమాజంలోని వారము అన్న మాటగూడా మరిచిపోయి చాలా నీచంగా తిట్టుకుంటున్నారు. లక్ష్మికి చాలా అసహ్యంగా వుంది. సీత లోపల యేడుస్తూ వుంది గూడా. ఊళ్లో వాళ్లు గూడా బైట మూగారు.

క్రిష్ణయ్య, సత్యారావులు వెళ్ళగానే బయట మూగిన ఆడంగుల్లో ఒక ముసలామె వచ్చి "ఏమమ్మా మీ యంతట మీరు తీరుతేమాత్రం యింత పబ్లిక్‌గానా వ్యభిచారం?" అంది. మరొకమ్మంది: "ఎంత విడిస్తే మాత్రం కొంచమైనా గుట్టక్కరలేదా?" అని. ఇంకొకమ్మంది "విడిచిన ముండ వీధికి పెద్దంట" అని, మరొకామె అంది;- "చదువుకొన్న వాళ్ళంతేలేయే" అని;

"ఇట్లా చాలా చాలా అన్నారు. లక్ష్మి సీతలకు ప్రాణా లెగిరి పోతున్నాయ్; చెయ్యటానికేముంది? - నానా మాటలూ అని వాళ్ళంతా వెళ్ళిపోయిన తర్వాత, సీత బిగ్గరగా యేడ్చింది. ఆమెను ఓదారుస్తూ లక్ష్మి కూర్చుంది. కాసే పయ్యాక ఒక ముసలాయన వచ్చాడు. కూర్చుని—

"ఏమమ్మా. మీరిద్దరూ చదువుకున్నవాళ్లు. ఈ విధంగా ప్రవర్తించడం బాగులేదు. మీ నాన్నా మీ అమ్మా ఎంత గుట్టుగా బ్రతికేవారో మీకు సరిగా తెలియదేమో; మీరు చదువుకొనిగూడా ఇట్లా వ్యవహరిస్తే అంత బాగుండదు. ఈ గుడిసెల్లో వాళ్ళే గాకుండా, పట్నంలో వాళ్ళుగూడా మీ విషయం విశేషంగా చెప్పుకుంటున్నారు. మాకు నిజంగా తలవంపులుగానే వుంది, మీ ప్రవర్తన విషయంలో జాగ్రత వహించవలసి వుంటుంది." అని వెళ్లి పోయాడు.

రాత్రి యెనిమిది గంటల సమయానికి ఒక ముసలామె పదేండ్ల పిల్లను వెంటబెట్టుకొని వచ్చింది. ఆమె వాళ్ళ చాకలి. "ఏమ్మా; కోప్పడక పోతే ఒకమాట చెబుతా. ఇట్లాంటి పనులు యెందుకు శాస్తారు? బాగా సదువుకొన్నవాళ్లు, పైగా యిపుడు ఆడపిల్లలకు సదువు చెప్పుతా వుండారు. మిమ్ములసూశి వాళ్లు నేర్చుకోవాలగదా; మరి మన సీతమ్మ రెన్నెల్లనుండీ ముట్టుకోకలు వెయ్యటంలేదు. యేం బాగుంటాది సూడండీ యీ రకం చేష్టలు; మీబోటి వాళ్ళ నెవరైనా కండ్లకద్దుకొని పెండ్లి శేసుకుంటారుగదా. ఎవర్నన్నా చేసుకోగూడదూ? ఇట్లాంటి పనులెందుకు - ఆ నిందలెందుకు?" అని వెళ్లిపోయింది. లక్ష్మి సీతలు వెలవెల పోయారు. అపవాదం ఆ చుట్టుపట్ల ప్రపంచావ్నంతా

వ్యాపించినట్లుగా ఒక్కసారి గుండెలు గభిల్లు మనగా 'అక్కా' అంటూ లక్ష్మిపై వాలి గట్టిగా యేడ్చింది సీత. యేడుస్తూ,

"ఎంత నిందవచ్చిందక్కా ఊరికే" అంది ఆమె వొళ్ళో తలపెట్టి. గంభీరంగా కూర్చున్న లక్ష్మి సీత వీపు నిమురుస్తూ,

"అవునమ్మా, ప్రపంచంలో ఇట్లాంటివి సాధారణమే! అసలు వివాహ విషయంలో ఇట్లాంటివెన్ని జరుగుతూ వుంటాయనుకున్నావు? నిందలైతే వేస్తారుగాని నిజం తెలుసుకోలేరు మనుషులు. దాంతో వాళ్ళకు పని లేదు. ఎవడో ఏదో అంటాడు. వాడు దాన్ని రెట్టించి మరొకడితో అంటాడు. వాడు దానికి రంగులు పూసి ఇంకొకచోట వ్యాఖ్యానిస్తాడు! మరొకడు దానికి ప్రాణంపోసి కవిత్వం అల్లి, ప్రకటిస్తాడు. ఇంతే! ఏమీ వుండదు! మొదటి విషయం యేమిటో, దాంట్లో సత్యమెంతో, తెలుసుకోడాని కెవడూ ప్రయత్నించడు. ఆ నిజమే తెలుసుకుంటే అపార్థాలు రానే రావు." అంది.

## 14

లలిత మురళి విషయంలో చాలా ఆలోచింప మొదలుపెట్టింది. ఎందుకో హృదయం అతనివైపు లాగుతూవుం దతిగా, ఎపుడూ అతన్ని చూస్తూ వుండాలనీ, మాట్లాడుతూ వుండాలనీ, కోరుతూ వుంది మనసు. చాలాసార్లు హృదయానికి చెప్పుకొంది తప్పు ఊహిస్తున్నానని. "కానేకాదు" అని జవాబుగూడా వచ్చింది. ఇదివరకంతా అక్కడక్కడా మాట్లాడడమే గాని స్వేచ్ఛగా, మనసారా, ఒక్కసారిగూడా మాట్లాడలేదు. ఒకనాడు శుక్రవారం ఏదో సెలవు. సరిగ్గా పదిగంటలకు రమ్మంది మురళిని. ఆహ్వానంకోసం యెదురుచూస్తూ వుండిన మురళి ఉత్కంఠతతో వచ్చేశాడు 9 గంటలకే. లలిత అప్పుడే వంటపని ముగించుకొని, స్నానంచేసి దుస్తులు మార్చుకుంటూ వుంది. వచ్చి పిల్చాడు, వస్తున్నాను కూర్చోమంది. కూర్చున్నాడు ప్రక్క గదిలో.. అదొక సుమారైన యిల్లు. మేడమీది భాగంలో లలిత వుంటూ

వుంది. ఆ ఆవరణంలోకి ప్రవేశించగానే ఒక విధమైన వాతావరణం కనిపించిం దతనికి. తాను కూర్చున్న గది చాలా నిరాడంబరంగా వుంది. ఒక టేబులు, రెండు కుర్చీలు, టేబుల్‌పైన ఒక టైం పీసు, కొన్ని పుస్తకాలూ, వున్నాయి. గోడప్రక్కన ఒక బీరువా వుంది. ఒక నిలువు టద్దం. అంతేః ఇంకేమీ లేవు. అసలా గదిలో అవి గూడా లేనంత శూన్యంగా శుభ్రంగా వుంది. ఇతడట్లా చూస్తూ, కూర్చొని వున్నాడు. ఇంతలో ఆమె మధుర మందహాసంతో సాక్షాత్కరించింది. ఇతని హృదయం పవిత్రమైన ప్రేమతో నిండి నిబిడీ కృతమైంది. ఆమె ప్రేమ ఆమె చూపులగుండా తన హృదయం లోకి చొరబడు తున్నట్లుగా తలమునకలై పోతున్నాడు. అట్లా ఆమె కండ్ల ల్లోకి క్షణం చూచి, చూపుల్ని సర్వాంగాలపైకీ, రహస్యంగా, మళ్లించాడు. ఆమె శిరస్నానంచేసి జారుముడి వేసుకొని వుంది. ముంగురులు, కిటికీలోంచి దూరి కొడుతున్న పిల్లగాలుల అలల అనుకరిస్తున్నాయి. విశాలనేత్రాలపై కనుసోగలు తీర్చి దిద్దినట్లుగా వున్నాయి. ముఖమూ, ముక్కూ, పెదవులూ చాలా ముచ్చటగా వున్నాయి. తెల్లటిచీర ధరించివుంది మామూలుగా, ఆమె, ఆ దుస్తుల్లో, ఆ మందహాసంతో, ఆ గదిలో నడుస్తూవుంటే రాజ మరాళం జ్ఞాపకాని కొచ్చింది మురళికి. ఆమె రెండవ కుర్చీలో కూర్చుంది. కొన్ని క్షణాల తర్వాత.

"మీరు ముందే వస్తారని అనుకున్నా" అంది కించిద్విహసనంతో.

"అవును. ఇంకా ముందే వద్దామనుకున్నాను" అన్నాడామె తెల్లని చక్కని పంటి వరుసపై చూపులు నిగిడ్చి.

"అదిగూడా నాకు తెలుసు."

"అయితే నే నేమనుకునేదిగూడా మీకు తెలుసన్న మాట."

"తెలుసు."

"అయితే యిప్పు డేమనుకుంటున్నానో చెప్పండి."

"నే నేమనుకుంటున్నానో మీరూ అదే అనుకుంటున్నారు."

"మీ రేమి భావిస్తున్నారో తెలుసుకొనేశక్తి నాలో లేదు."

"అయితే తర్వాత చెబుతాను."

ఒక క్షణంసేపు యిరువురూ నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"ఎందుకు రమ్మన్నానో తెలుసా?" అందామె మళ్ళా.

"ఇంతకు ముందే చెప్పాను. మీ మనసులో వుండేది తెలిసికో లేనని!" లలిత కాస్త గట్టిగా నవ్వుందీసారి.

"అయితే బొత్తిగా కనిపెట్టేగుణం లేదన్నమాట!" అంది.

"ఉంది! ఆ కనిపెట్టడం కరెక్టు కాకపోతే!"

"పోతే నష్టమా!"

"కష్టాలు గూడా రావచ్చు."

"అయితే నే చెబుతా వినండి, మీకిక్కడ ఈ దినం భోజనం!"

"అంతేనా?"

"చాలదా?"

"అబ్బే! అదిగాదు! భోజనానికేనా అని."

"అదేనే ననటం, భోజనానికి చాలదా అని."

"అదిగాదండీ...." అని నీళ్ళ నమిలాడు మురళి.

"పోనీలెండి....అయితే యిక్కడ భోం చెయ్యడం యిష్టమేనా?"

"అమృతంలాగా తింటాను."

"అమృతంలాంటి పదార్థాలు నా యింట్లో యేమీలేవే?"

"ఇంట్లో లేకపోతేయేం?"

"ఫరవాలేదు బాగానే మాట్లాడుతున్నారు" అంది లలిత కాస్త మొగం చిట్లించినట్లు నటిస్తూ.

"క్షమించండి" అన్నాడు మురళి కాస్త పిగ్గభినయిస్తూ.

లోపలికెళ్ళి త్వరలో తిరిగివచ్చి "మీరు కడపట మజ్జిగ వేసుకొని భోంచేస్తారా, పాలు వేసుకోడం అలవాటుందా?" అంది.

"మీకేది వాడుకయితే అదే"!

"మొహమాటమి లేకుండా చెప్పండి."

"అబ్బే! నాకు రెండూ వాడుకే" అన్నా దొకచిన్న అబద్ధం.

లోపలి కెళ్ళింది లలిత మళ్ళా. రెండు నిమిషాల్లో బయటికొచ్చి 'రావచ్చు' అంది. కాళ్లు కడుక్కొని పీటపై కూర్చొన్నాడు మురళి. ఆమె ఎదురుగా కూర్చుంది. రెండు విస్తళ్ళలోనూ వడ్డించివుంది అన్నం. తక్కిన వన్నీ ఇద్దరికీ అందుబాటులో వుండేటట్లు పెట్టింది. ఇక భోజనానికి ఉప క్రమించే ముందు "మొట్టమొదటి పురుషాతిథి మీరే నాకు" అంది.

"నేనూ అంతే అనుకున్నాను" అన్నాడు మురళి పప్పు కలుపుతూ.

"మీకు కాకరకాయ యిష్టమేనా?"

"మీకు యిష్టమా?"

"నాకు బలేయిష్టం;"

"నాకు పరమయిష్టం" అన్నాడు దానిపైన యిష్టం యే మాత్రమూ లేకున్నా వ్యక్తిపై గల యిష్టంతో.

"మావంట సహించదేమో! మీ యింట్లో చేసుకున్నన్ని నేను చేసుకోను. పప్పు, ఒక పులుసు, కడపటపాలు, అంతే."

"అసలంతే వుండాల్సింది" అన్నాడు మురళి నిర్ధారించి చెప్పినట్లుగా.

"మీ యింట్లోగూడా యింతేనా" అంది నవ్వుతూ.

"ఇంతే."

"కాదు మీ యిండ్లల్లో ఎపుడూ యిట్లా చేసుకోరు. అబద్ధాలు చెప్పకు నన్ను తృప్తి పరచడానికి."

"అయితే మీరు బాగా ఊహించి చెప్పగలరు" అన్నాడు నవ్వుతూ.

"భోజనం అంత రుచిగా లేదను కుంటాను" అంది కడపట అతనికి మజ్జిగకు బదులు పాలు వడ్డిస్తూ.

పాలు కలిపిన అన్నం రుచి చూచి కాస్త చప్పగా వున్నప్పటికీ, "అమృతోపమానంగా వుంది" అన్నాడు.

"అయితే అదంతా తినాలి. వదిలిపెట్టి వేస్తున్నట్లుందే!"

"తినలేను."

''వద్దు వద్దని కొంచెం పెట్టించుకొని, అది గూడా...''

''అబ్బా వెగటుగావుంది. తినలేను.''

భోంచేసినాక తన పడక గదిలోకి పిలుచుకొని పోయింది. అందులో ఏమీలేవు. ని రలంకారంగావున్న ఆ గదిని చూపిస్తూ,

''ఇది నా పడక గది'' అంది.

''మంచంగూడా లేదే'' అని, ''నోరు జారాను క్షమించండి'' అన్నాడు.

''నన్నేమీ అధిక్షేపించడం లేదులే''

అక్కడ ఒక చాప పరిచివుంది. దానిపై వెడల్పు జముఖానా వుంది. దానిపైన సన్నటి దుప్పటి మల్లెపూవులాగా పరిచివుంది. తెల్లని ముసుగుకల ఒక దిండుంది. ఆమె దిండు ప్రక్కగా కూర్చొని ప్రక్క మధ్యభాగములో ఎడమవైపున అతనిని కూర్చోమంది. కూర్చున్నాక,

''అయితే నీ వయసెంత?'' అంది కనురెప్పలెత్తి.

''పద్దెనిమిది.'

ఏదో పురాతన సంఘటన ఆమెకు జ్ఞాపక మొచ్చినట్లైంది. ముఖంలో మార్పుచూచి ''ఏం, ఏమిటో ఆలోచిస్తున్నారు'' అన్నాడు మురళి.

''ఏమీలేదు. నేను ఇరువది నాల్గయినా వుంటా యనుకున్నాను'' అంది.

''మీ వయసెంత? క్షమించండి'' అన్నాడు మురళి.

''ఆడవాళ్ళ వయ సడిగితే కోపమొస్తుంది తెలుసా?''

''క్షమించాలి''

''ఫరవాలేదు ముప్పైమూడు''

''ఆః ముప్పై మూడా? అబద్ధం'' ఆశ్చర్యంతో అన్నాడు.

''అంతే! సరిగ్గా అంతే''

''నేను మీకు సరిగ్గా ఇరవై వుంటాయ్ అనుకున్నా కాకపోతే మరి రెండు.''

"అందరూ అట్లాగే అనుకుంటారు."

"మామూలుగా మీ వయసు ఆడవాళ్లు ముసలి మార్గంలో పడి వుంటారుగదా, మీరెందు కిట్లా కనిపిస్తారు?" అన్నాడు.

"నీవీ ప్రశ్న వేస్తావని అనుకోలేదు. దాంట్లో ఏముంది? వివాహితలు కాస్తా నలిగినట్లు కనిపిస్తారు. నలభై లోగా ప్రౌఢ వయస్సేగా! నేను అవివాహితను."

"నేను ఈ వయసులోవున్న చాలామంది అవివాహితలను చూచి నాను."

"నేను బ్రహ్మచర్యాన్ని అవలంబిస్తున్నా."

"అదేకావచ్చు" అయితే ఆ మరణాంతమూ అవలంబిస్తారా?"

"అస లదే దీక్ష."

ఒకక్షణ మయ్యాక,

"మీ తల్లిదండ్రు లున్నారా?" అంది లలిత.

తల్లి ఇటీవల చనిపోయింది. తండ్రికి జబ్బుగా వుంది."

"ఇంకా అన్నదమ్ములు అక్క చెల్లెళ్లు వున్నారా?"

"అక్కవుంది ఆమే సరళ" అన్నాడు. అని,

"మీరేదో దాచారు. చెప్పడంలేదు" అన్నాడు మళ్ళా.

"ఏమీ దాచందే?"

"ఏదో చెప్పబోతూ ఆపేశారు పూర్తి చేయకుండా."

"ఏమీ లేదు ...."

తర్వాత ఆమె మాట్లాడలేదు. ప్రక్కకు చూపులు తిప్పి ఆలోచిస్తూ కూర్చొంది. అంతకంతకు ముఖం గంభీరమైంది. కొంత సేపయ్యాక,

"నా గుండెల్లో ఏదో భారంగా వున్నట్లుంది. క్షమించండి" అందామె.

అది ఇక వెళ్ళిపొమ్మనడానికి మారు రూపమే కాబట్టి మురళి లేచాడు.

మురళి తన ఇంటికొస్తూనే, సరళ రెండు కవరులు చేతి కందిచ్చింది. మొదటి కవరు చించి 'సత్యారావు' అనే నాటకం చూచి మళ్ళీ కవరులో

పెట్టి రెండవది చించాడు. అది సీత నుండి. ముందు దాన్ని చదవాలను కున్నాడు. మొదలుపెట్టాడు,

నా మురళీ!

నీ వా దినం అంత కోపంగా వెళ్ళిం తరువాత నే నెంతగానో చింతించాను. నిన్ను సంతోష పెట్టలేని ఆ దీక్ష మాత్రం ఎందుకని తరువా తనుకున్నాను. ఆ మరునాడు వస్తావు - నీ పాదాలపై బడి క్షమాపణ కోర్దా మనుకొన్నాను. నీవు రానేలేదు. ఎంత కోపం వచ్చిందో గదూ. తరువాత నీవు మాతో చెప్పకుండానే మద్రాసు వెళ్ళా వని తెలిసి ఎంతగా దుఃఖించానో ఆ పరమాత్మునికే తెలుసు, అంత నిరాదణ యెందుకు? నేనేం చేశాను! నాలో క్షమించరాని తప్పేమిటి? తర్వాతైనా ఒక జాబుగూడా వ్రాయలేదు. మా అక్క వ్రాసిం దానికి గూడా జవాబు వ్రాయలేదు. ఇంక-నన్నా మాపై గల కోపాన్ని వుప సంహరించుకొని వ్రాస్తావని భావిస్తున్నాను.

నేనెందుకైతే భయపడ్డానో - ఎందుకైతే నిన్ను వారిస్తూ బ్రతిమా లానో - దాని ఫలితం యిపుడు చూస్తున్నాను. ఇది మూడో నెల. యిప్పుడైనా మనము వివాహమాడకపోతే నేను నిందల పాలౌతాను, యిప్పటికే చాలా నిందల పాలయ్యాను. ఊరంతా అసహ్యంగా చూస్తుంది. చాలామందికి తెలిసింది, దేనికైతే నేను భయపడి దూరం చేశానో ఆ అవినీతి అనే పలుకులే ఎక్కడా వినిపిస్తున్నాయ్. నీవు నా భర్త అని వాళ్ళకు తెలియదు. బహిరంగంగా వివాహం చేసుకుంటేనే తెలుస్తుంది.

గుడిసెల్లో వాళ్ళంతా మమ్మల వెలివేశారు. మాకు చాకల్ని రానీ లేదు, బావిలో నీళ్లు తోడుకోనీలేదు. కొన్నాళ్ళ క్రితం మా గుడిసె గూడా తగులబెట్టారు. ఆ క్రిష్ణయ్య సాయముచేత టౌనులో ఒక యిల్లు అద్దెకు తీసుకున్నాం, ఎలాగో అవమానంతోనే కాలం గడుపు తున్నాను. నీవు తక్షణం వివాహం ఆడకావా సరి - లేకపోతే నేను

ఆత్మహత్య చేసుకోవాల్సి వస్తుంది. నన్ను మోసం చేయవని భావి స్తున్నా.

నీ సీత.

'అయ్యో!' అనుకున్నాడే గాని అంత గాఢమైన సానుభూతి రాలే దతని హృదయములోనుండి. క్రిష్ణయ్య పేరు చదవగానే సత్యారావు ఆనాడు అవహేళనగా అన్నమాటలు జ్ఞాపక మొచ్చాయి. అసలు యిండ్లుకాలడం, ఇవన్నీ జరగడంపట్టి చూస్తే తర్వాతేదో అసహ్య ప్రవర్తన జరిగి వుండాలి' అని ఆలోచిస్తూ సత్యారావు జాబు చదివాడు. అతని అనుమానాలు నిర్ధారితా లయ్యాయి. లక్ష్మి ఎవర్నీ పెండ్లాడనని చెప్పగా క్రిష్ణయ్య సీతతో చెలిమి ప్రారంభించాడనీ - సీత నైతికంగా చాలా పతన మయిందనీ - తత్ఫలితంగా యిపుడు గర్భవతి అయిందనీ - అందరూ ఆ ప్రవర్తనకు రెచ్చి వెలివేసి, ఇండ్లుగూడా కాల బెట్టారనీ - అంతా వ్రాశాడు. అందులో యింకొక ముఖ్య విషయం ఏమిటంటే 'కొంతమంది పిల్లలు గర్భము వస్తుందని భయపడి మొదట పురుష సంగమానికి యిష్టపడక పెండ్లైనతర్వాత వారిపేరిటే పోతుందికదా అని వ్యభిచారం చేస్తారు. గర్భాలు దాలుస్తారు. పెండ్లాడ్తానని మాటయిచ్చిన నిన్ను అడ్డంపెట్టుకొని ప్రస్తుతం సీత చేస్తున్నపని యిదే'' అని వ్రాశాడు. సత్యారావు పలుకులే సత్యాలుగా తోచాయి మురళికి. సీతపైన అసూయ, ద్వేషం, పుట్టుకొచ్చాయి.

మూడునెలల పరీక్షలు మొదలు పెట్టిననాడే మదనపల్లెనుండి తంతి వచ్చింది క్రిష్ణయ్య యిచ్చినట్లు. బ్రహ్మారావు చనిపోయాడనీ-తక్షణం రావల సిందనీ- వచ్చింది. సరళ, మురళి, బయలుదేరారు యేడ్చుకుంటూ. అక్క డికి పోగానే క్రిష్ణయ్య కనిపించాడు. తన నర్జంటుగా రమ్మని తంతి యిచ్చా డనీ, రాగానే కొన్ని విషయాలు చెప్పి తమ కివ్వవలసిన బాకీకిగాను యేమీ యివ్వలేక పోగా తన యింటినే వ్రాసి యిచ్చాడనీ, అంతా చెప్పాడు క్రిష్ణయ్య. దహన సంస్కారా నంతరం బెజవాడకు బయలుదేరారు నేరుగా. ఇపుడు వారి కిల్లుగూడా లేదు.

క్రిష్ణయ్య బలవంతం చేశాడు ఆ యిల్లు తమ యిల్లుగానే భావించుకొని వుండమని. మురళికి యిష్టం లేకపోయింది. సరళ కంతకంటె అయిష్టం. రాజామణి యింట్లో మకాం బెట్టారు. అందరూవచ్చి పరామర్శించి పోసాగారు.

రాజామణి చాలా కులాసాగా వుం దిపుడు. మురళి, సరళ, వచ్చి తన యింట్లోనే వుండటం ఆమె కెంతో ఆనందా న్నిచ్చింది. ఏమి ఏమిటో తెప్పించి యేమిఏమిటో పిండివంటలుచేసి పెట్టసాగింది. సరళ అంతగా తినక పోయినా మురళి బాగానే తింటున్నాడు. ఆ ముప్పై ఐదేండ్ల వయసులోనూ, తన శరీరము కా_స్త సడలి వున్నప్పటికీ, బాగా గట్టిదానివలె తయారు కావా లని పాటుపడుతూ వుంది. కొద్దిగా కళమాసిన ముఖం బాగా సోపుతో అరగ తోమి, స్నో, పౌడర్లు అతుకుతూవుంది ఆకర్షణీయంగా కనిపించాలని. చాల వరకు సిల్కు గుడ్డలే వేస్తూవుంది. మొత్తానికి, యేదేదో పాట్లు పడసాగింది, సర్వవిధాలా ఆకర్షణీయంగా వుండడానికి. తన ప్రతి చిన్నచేష్టగూడా సరళ పరీక్షింప సాగింది. తా నిదివరకే అనుమానించి వుంది. అనుమానం యింకా దిన దినానికీ బల మవుతూ వుంది. రాత్రులు కాయసాగింది. చిక్కలేదు. ప్రతిదినము సాయంకాలము లక్ష్మితోగూడా షికారు పోతూ వుండడంవల్ల సాయంసమయాల్లో వాళ్ళను పట్టుకొనడానికి ఈమెకు వీలుపడింది కాదు. నానాళ్లు జరిగినాక మురళి సాయంకాలాల్లో షికారు పోవడం లేదని తెలిసి కొంది. తరువాత తానుగూడా చాలించింది. సరళ చాలించిన తర్వాత కృష్ణా తీరానికి పోవసాగాడు మురళి.

తాను సాయంకాలం షికారు వెళ్ళడం మానివేసిన రాత్రి సరళ జాగ్ర తగా మేలుకొని వుంది. రాత్రి 9-30 కే లైటు ఆరిపేసి పడుకుంది. తరువాత కాసేపటికి మురళి రూములోను, రాజామణి రూములోను దాదా పొకేసారి లైట్లారిపోయాయి. కాసే పేమీ శబ్దము వినిపించలేదు. దాదాపు 10-30 కి మురళి గది తలుపు కా_స్త చప్పుడు చేసింది. అది మేలుకొన్న వారికిగూడా విని పించని చప్పుడు. సరళ పాము జాగ్రత వహించి వింది. తిన్నగా తన తలుపు కొద్దిగా తెరిచి తొంగి చూస్తూ, మరింత శ్రద్ధగా వింది. మురళి రాజామణి గదిలో ప్రవేశించడం గ్రహించింది. అది తన హృదయాన్ని సూదులతో

కొడిచిన ట్లైంది. అసూయ చెప్పరానట్లుగా విజృంభించింది. ఉత్కోష అంతకంటే ఎక్కువగా వచ్చింది. ఇదివరకు చూచింది యింకొకరి విషయం? నేడిది చూస్తూవుంది. తనకు తెలియకుండా యింకెన్ని చేశాడో, ఎన్ని చేస్తాడో అన్న అనుమానం అసూయతోపాటు కలిగింది. బిరబిర బయటి కొచ్చింది. రాజామణి తలుపు దగ్గరకు పోయింది. ఆగి, చెవి ఆనించి వింటూ నిల బడింది. అరుద్దా మనుకుంది. మళ్లా వెనక్కి వచ్చింది. మంచంపై కూర్చుంది తలపట్టుకొని. ఉండలేకపోయింది. లేచింది ఉన్మాదినివలె. తలుపు దగ్గిరికి పోయింది.

"అబ్బా! మురళీ" అనే ఉత్కంఠశబ్దం వినవచ్చింది. ఇంకా యేమి టేమిటో అస్పష్టంగా వినిపిస్తూవుంది. తలంతా, గిర్రున తిరుగుతూవుంది. యేమి టేమిటో ఆలోచనలు అవిరళంగా పుట్టుకొస్తున్నాయ్. మురళిని చంపి తాను చనిపోతే ఎంత హాయిగా వుంటుందీ! అనుకుంది. అట్లా ఒక అర గంట ఆలోచించింది. లోపల యేమేమో అనుకోసాగింది. తనలో తనకు స్మారకం లేకుండా బయటి కనసాగింది.

"మూర్ఖుడా; నీచుడా! తుచ్ఛురాలా! సిగ్గు లేనిదానా!" అని యిట్లాటి వంతా కాస్త గట్టిగానే అనసాగింది. ఇంతలోకే తలుపు తెరుచుకొని బయటి కొచ్చింది రాజామణి.

"స-స-సరళ? ఏమిటి? ఎందు కొచ్చా విక్కడికి?" అంది రాజామణి తడబాటుతో.

"ఊరికే వచ్చాను. లైటు వెలిగించు."

"ఎందుకు? వెళ్లి పడుకో."

"ఆ లోపల వుండేవాణ్ణి ఒకసారి చూచి వెళ్ళిపోతాను."

"నీకేమైనా మతిపోయిందా?" అంటూ తలుపు దబాలున వేసి గడియ వేసికొని లోపలికి పోయింది రాజామణి. లోపల మురళి హడలిపోతున్నాడు. వానిపై నబడి గట్టిగా కౌగిలించుకొని కదలకుండా చేసి "భయపడ్డా వెందు కోయ్" అంది చెవుల్లో. సరళ తలుపు దగ్గరే పడిపోయి వుంది, తెల్లవారు

రూమున మురళి ఎట్లాగో తప్పించుకొని దాటిపోయి తన గదిలో పడు కున్నాడు. రాజామణి వచ్చి సరళను లేపింది. చాలా మెత్తని కంఠంతో "సరళా! అప్పట్నుండీ యిక్కడే వున్నావటే" అంటూ గదిలోకి తీసికెళ్లి; లైటువేసి "ఏదైనా పీడ కలలు కంటున్నావటే" అంది. అప్పటికి మైకం కాస్తా తొలగినట్లైంది సరళకు.

"పీడ కలలు కావత్తా, పీడే పట్టుకుంది. నే చచ్చిపోయినా బాగుం డేది" అంది.

"చూడూ! యింకా యేదో ధోరణిలో ఉన్నావు! నీకేదో హిస్టీరియా పట్టుకున్నట్టుంది"

"అవును. అదిపట్టే ఈ ఆటలాడుతున్నా నిపుడు" అంది నర్మ గర్భంగా.

ఆ దినమంతా ఎవరిపాటికి వారు తిరుగుతున్నారు ఏమీ సంబంధం లేనట్టుగా. ఉదయంవెళ్ళి, వచ్చి, ఫోంచేసి మళ్లీ వెళ్లింది ఆసుపత్రికి రాజా మణి. అప్పటికి మధ్యాహ్నం 1-30 అయివుంటుంది. సరళ మురళి రూము దగ్గఱకు పోయింది. తలుపు తెరిచి వుంది. ఈమె ప్రవేశంచూచి మురళి నిద్ర నటించాడు. మురళిని చూచేటప్పటికి ఒక విధమైన ఆవేశం, ఉద్రేకం పుట్టు కొచ్చాయ్ ఆమెలో. అమాంతం వాడిపై పడింది. యథాప్రకారం ఆ నొసలి పైన ముద్దుపెట్టి కన్నీరు కార్చింది. మురళి ఆ చేష్టకు భయపడ్డాడు. అనుమా నించాడు. అనుమానించడానికి మొదలుపెట్టడం యిదే మొదటిసారి. గుండెలు గబగబా కొట్టుకొంటూండగా వూపిరి, బిగబట్టు కొన్నట్లుగా పడుకొని వున్నాడు.

"నా మురళీ!" అంటూ వెక్కి-వెక్కి యేడ్వడం మొదలుపెట్టింది.

"ఏమిటక్కా" అంటూ లేచాడు.

లేచి కూర్చుంది. గంభీర వదనం దాల్చింది. అంత కంతకూ చూపులు సూటిగాను, తీక్ష్ణంగాను అయినాయ్.

"ఏమిటిది" అంది ధృఢ స్వరంతో.

తప్పుచేసినపుడల్లా ఆమె అట్లాగే చూస్తుంది. అంత కఠినంగా మాట్లాడుతుంది. అపుడంతా పీడా చూపులకు తాళలేదు.

"అక్కా" అంటూ రెండు చేతుల్తో ముఖం కప్పుకొని "నాలో యీ బలహీనం...."

దీనంగా చూస్తూవున్న వాని చూపులతో తన చూపులు కలిపి కాసేపు నిశ్శబ్దంగా కూర్చుంది సరళ.

"నీకు నేను అక్కనుకాదు తెలుసా?" అంది.

తాను ఏమి విన్నాడో తనకే తెలియలేదు మురళికి. ఆమెకు మోహం చేత వున్మాద మెక్కిం దనుకున్నాడు. కామంచేత గ్రుడ్డిదైం దనుకున్నాడు. ఇట్లా యేదేదో ఆలోచిస్తున్నాడు. వాణ్ణి గట్టిగా కౌగలించుకొని "మన బాంధవ్యం వేరు. నిన్ను నేను ప్రేమించా" నంది. చీదరింపుతో ఆమెను విసరి, తొలగి, కాస్త దూరంగా కూర్చొని—

"నీ కేమైనా పిచ్చెత్తిందా? అక్కా" అన్నాడు.

"కాదు మురళీ! నేను బాగానే మాట్లాడుతున్నా. నీ కట్లా అనిపిస్తున్న దేమో" అన్నది.

'గతరాత్రి గూడా ఆమె బాగా భోంచేసినట్లు లేదు; రాత్రంతా నిద్ర లేదు, ఆవేశంతో, ఆలోచనలతో, ఆమె మెదడు బాగా దెబ్బతిని వుంటుంది. ఈ దినం యిప్పటి వరకు భోజనం లేదు. ఈమెకు నిజంగా మతిభ్రమ కలిగింది' అని భావిస్తున్నాడు మురళి.

"నీవేదో భావిస్తున్నావ్. నేను భ్రమ పడ్తున్నానని వూహిస్తున్నావు. నీ కసలు విషయం తెలీదు. తెలిస్తే యిట్లా గాభరా పడవు."

"నోరు మూస్తావా లేదా?" అన్నాడు మురళి రొప్పినట్లుగా. సరళ చలించలేదు.

"నేను నోరు మూసినా మూయక పోయినా యదార్థం యదార్థంగానే వుంటుంది మురళీ, నేను పొరపడుతున్నానని నీ వూహిస్తున్నావు. కాస్త శాంతంగా విను. నేను నిన్నెపుడైనా తమ్ముడూ అని పిలిచానా?"

"లేదు. మొదట్నుండే నీలో ఆ దుర్గుణం వుండేమో."

"అది దుర్గుణం యెట్లా అవుతుంది? ప్రేమించడం దుర్గుణం కాదు గదా!"

"కాక పోవచ్చు. పాత్రా పాత్రల గమనించకుండా ప్రేమిస్తే అదే దుర్గుణం"

"అది గమనించంది నీవే, నేను బాగానే గమనించాను. అందుకే చెబుతాన్నాను."

"ఊరుకో, ఎవరన్నా వింటే వుమ్మేస్తారు."

"ఇందులో అసత్యం లేదు. పోనీ యింకొకటి చెప్పు. మన సంబంధ విషయంలో నిన్ను నా తమ్ముడూ అని ఎవరితోనైనా, అన్నానా?"

"లేదు."

"నీ నొసటి గాయం విషయం నీకు తెలుసా?"

"తెలుసు. నీవు చిన్నప్పుడు తలంబ్రాలంటూ పోశావ్, అమ్మ నిన్ను కొట్టబోయింది. గాజు పగిలి నా తల తగిలింది."

"అదే! నా భావన. అంతే! నిన్ను పెండ్లాడ్డం అదే మొదలు! అదెవరికీ తెలీదు."

"అప్పట్నుండే నీచ భావం పడిందన్న మాట!"

"మళ్ళా ఆ మాటనకు. ఆత్మహత్య చేసుకోవా లనేంత నైరాశ్యం పుడుతుంది. సాంతం విని తర్వాత మాట్లాడు, నేను నిన్ను ప్రేమించడం తప్పేమో అప్పుడను."

"కథ చెప్తావా?"

"కాదు. అసలు జరిగింది చెబుతాను. నాకు తెలిసిందీ, తరువాత తెలుసుకొందీ చెబుతున్నా - నేనప్పటికి అయిదేండ్ల పిల్లను. అమ్మా, వాన్నా గుంటూరి కెళ్ళారు. అమ్మమ్మగారూరు అదే. ఆమె కేదో జబ్బు చేసింది. రాణామణి అప్పుడక్కడుంది. కొత్తగా మిడ్వైఫ్‌గా వచ్చింది. అక్కడ ఆసుపత్రిలో ఎవరో వకమ్మాయి - గంజాం జిల్లాకు సంబంధించి

నామె-ఒక మగ శిశువును ప్రసవించింది. ప్రసవించిన తర్వాత పారిపోదామని ప్రయత్నించింది. పోలేక పోయింది. ఆ శిశువు నీవే. నిన్ను విడిచి పోయేందుకు బుద్ధి పుట్టక ఒక నెల దినా లాగిందట. తర్వాత ఎట్లా నిర్ధారించుకొందోగాని వెళ్ళిపోయిం దట. అంతే. మళ్ళా ఆమె ఎక్కడా కనిపించలేదు. అంత మమత గల పడుచు నీకోసం తర్వాత ప్రయత్నించలేదు, అంటే ఆత్మహత్య చేసికుందేమో అని అనుకోవచ్చు. రాజామణి అమ్మ దగ్గరకువచ్చి ఈ విషయం చెప్పి తర్వాత నిన్ను చూపిందట. ముద్దులొలుకుతూ వుండిన నిన్ను చూచి ఆమె తీసికొందట. నీపైన అమ్మకూ నాన్నకూ బలేమోజు. నిన్ను తెచ్చారు. నిన్ను చూచినప్పటినుండీ నాకు బలే యిష్టం. ప్రాణంతో వున్న బొమ్మతో మాదిరిగా ఆడుకుంటూ వుండేదాన్ని. సరిగ్గా బడికి కూడా వెళ్ళే దాన్ని కాదు నిన్ను విడిచి. నీకు వుగ్గూ కారం పోసే టప్పుడు దగ్గర వుండే దాన్ని. పాలు నేనే పట్టేదాన్ని. నిన్ను విడిచి వుండడానికి ఒక క్షణమైనా ఓర్చుకొనే దాన్ని కాదు. బడికి మాత్రం వెళ్ళక తప్పేది కాదు. బళ్ళో నేర్చుకొన్న వన్నీ నీకు చెప్పేదాన్ని. నీకు బళ్ళో చేరేటప్పటికి ఎన్నో పద్యాలూ, పాటలూ, శ్లోకాలూ వచ్చేవి. అందువల్లనే నీవు బళ్ళో డబుల్ ప్రమోషన్‌తో వచ్చేవాడివి. తర్వాత అందరికీ బలే యిష్టుడవై చదువుకుంటూ వుండేవాడివి, నిన్ను మొదట్నుండీ ఎంతగానో ప్రేమిస్తూ వచ్చాను. నీవు హైస్కూల్లో చేరిన తర్వాత నీపైగల నా ప్రేమలో యేదో కొంచెం మార్పు కలిగినట్లు గమనించాను. నీవేదైనా తప్పు చేస్తే బాధపడేదాన్ని, నిన్నెవరైనా ఏమైనా అంటే చాలా బాధపడేదాన్ని. నిన్ను చాలా మంచివాడుగా తయారు చేసుకోవాలని నా ఆశ. నీవు విరుద్ధంగా అల్లరివాడవుగా తయారయ్యే వాడివి. నిన్నెంతెంతో దండించేదాన్ని. నీవు తప్పుచేసినపుడు యెంతో యేడ్చేదాన్ని పోను పోను నా ప్రేమ నీపై మోహంగా మారింది, అమ్మ చనిపోయే ముందు నాకు పెండ్లి చేయాలంది. ఆ కథలంతా నీకూ తెలుసు. అపుడు నేనేం చెప్పేది? ఎవర్ని చేసుకొంటానని చెప్పేది? నీవేమో నన్నక్కా అంటున్నావు. నాకు నీవేవరుడవని నే ననుకుంటున్నాను. ఈ భావభేదాన్ని గురించి ఎవర్తో చెప్పుకోడం? ఎట్లా చెప్పుకోడం? నేనుమాత్రం నిన్ను వేరుభావంతో చూస్తు

న్నాను కానీ అమ్మా నాన్నలు యిద్దర్నీ బిడ్డలమాదిరి చూచుకొంటున్నారు! అపుడు నిన్ను పెండ్లాడ్తానని యెట్లా చెప్పేది? చెప్పి యెట్లా చెల్లించుకొనేది! నీకప్పట్లో వయసులేదు. నా బాధ నీకు చెప్పుకోలేక పోయాను. చెప్పినా నీవర్థం చేసుకొనే స్థితిలో లేవు. ఎంత ఏడ్చానో నీ కిప్పటికీ జ్ఞాపకం వుండే వుంటుంది. అప్పటి నా యేడ్పంతా, అజ్ఞాతంగా నీ కోసమే. నీకు తెలియక నన్ను ఓదార్చడానికి ప్రయత్నించే వాడవు. కడపటికి వివాహం కాక తప్ప లేదు. ఏమీ చెడకుండా ఆ శనిని చాకచక్యంతో వదిలించుకొన్నాను నీకోసమై. కడపటికి నీవు నా కండ్ల ముందే చెడిపోసాగావు. నా మనోవ్యథ వర్ణనాతీతము. ఎన్ని సార్లో నా యెదలోని బాధను నీకు విశదం చేయా లనుకొనేదాన్ని. చెప్పలేక పోయేదాన్ని. ఈ దినం దానంతటదే పొల్లుకొని వచ్చింది. ఇదీ కథ.''

మురళి అంతా విన్నాడు. ఇద్దరూ ఒక తల్లి బిడ్డలు కాదని తేలి పోయింది. ఆలోచించాడు. అయితే ఒక తల్లి బిడ్డలు కానప్పుడు, తా నెవరో కన్న బిడ్డ అయినప్పుడు, సరళను ప్రేమిస్తే యేం - అనుకున్నాడు. అట్లా చూశాడు. అబ్బా ఎంత అమానుషం! చిన్నప్పటి నుండీ ఒక తల్లి బిడ్డల లాగా పెరిగాం. ఆమొక తల్లిలాగా నన్ను చూచుకొంటూ వచ్చింది. నేనెంతో మర్యా దిచ్చాను. ఆమె అందుకు తగినట్లుగా వ్యవహరించింది. ఇప్పుడు అందుకు భిన్నంగా యెట్లా నడుకొచునేది? చిన్నప్పటినుండి వుగ్గూ, పాలతో పెరిగిన భావం యెట్లా మారుతుందీ'' అని పైకే అన్నాడు.

''అది భావం కాబట్టి మార్తుంది'' అంది సరళ.

''అయితే నీ భావాన్ని మార్చుకో చూద్దాం.''

''మాటల్తో మాటలను ఖండించ కలవేమోగాని నా హృదయం లోని....''

''అదే, అదే. నే నంటున్నది గూడా అదే. హృదయంలోని భావాన్ని ఎవరూ తీసివేయలేరు.''

అట్లా చాలాసేపు కూర్చున్నారు. అసహ్యాత తాండవిస్తూవున్న ఆ వాతావరణంలో యెవరూ మాట్లాడలేదు. కాసేపట్లో పని మనిషివచ్చి, 'ఎవరో పిలుస్తున్నా రమ్మా' అనగానే మొగం తుడుచుకొని వెళ్ళిపోయింది, సరళ. ఆ వచ్చిన వ్యక్తి క్రిష్ణయ్య. గదిలో కూర్చోమని, వెళ్ళి మొగం బాగా కడుక్కొని వచ్చి కూర్చొంది' కూర్చున్నాక,

''కులాసాగా వుంటున్నారా?'' అన్నాడు క్రిష్ణయ్య.

''అవును. దానికేమీ లోటు లేదు'' అంది సరళ అయిష్టంగా.

''మీరు మన యింట్లో ఎందు కుండ కూడదూ?''

''మన, అంటే.''

''ఒకప్పుడు మీది, ఇప్పుడు మాది, అని భావం.''

''ఇప్పటి విషయమే చెప్పు.''

''ఇపుడు మాదేలే! అయినా....''

''మా కెందుకూ.''

అది మీ యిల్లే అనుకోండీ, నాదైనా, మీదైనా, భేదమేముంది'' అన్నాడు క్రిష్ణయ్య యే మంటుందో చూద్దామని.

''అంటే'' అంది సరళ చిరునవ్వుతో.

''వలలో తగుల్కొనేటట్లుందను కొన్నాడు క్రిష్ణయ్య.''

''చూడూ! ఒక విషయం చెబుతున్నాను. కోపం రాదు కదా?''

''చెప్పిచూడూ'' అందామె చిరునవ్వు నవ్వుతూనే.

''నీవు వివాహాని కొప్పుకుంటావా?''

''నీవా మాటంటావని నాకు తెలుసు. యిన్నాళ్ళూ అడగడానికి నీకు చాల్లేదు. ఈనా డడగడానికి నీకు ధైర్యమొచ్చింది.'' అంది వికటహాసంతో.

''దాంట్లో ధైర్యా ధైర్యాలేమున్నాయ్.''

''సరే నేను వివాహమాడనేమో.''

''అదేమిటి సరళా! యెందుకు చేసుకోకూడదూ?''

''ఏమిటో పెద్ద బాధ్యతకల వ్యక్తివిలాగా సానుభూతితో అన్నట్లు అంటున్నావేమిటి?''

"అవును: వుండబట్టే."

"నిన్ను వివాహమాడలేనంటే పూరికే వెళ్ళిపోతావా?"

"నేను నీ పరిస్థితిచూచి నిన్ను కనికరించి వచ్చాను సరళా, లేకపోతే మొగుడు విడిచినదాన్ని చేసుకోవాలని యెందు కొస్తాను. ఏదో దాక్షిణ్యంవల్ల అడిగితే నీవు పైన కూర్చుని మాట్లాడుతున్నావ్."

సరళ హృరయం దెబ్బతిన్నది. అటువంటి స్థితిలోవున్న స్త్రీలను పురుషు లట్లాగే అంటారు. సమయ మొచ్చినపుడు తేలిగ్గా మాట్లాడేస్తారు. స్వార్థము దెబ్బతిన్నవారికి యెదుటి హృదయంయొక్క క్షోభ యేమీ కనుపించదు. వారి మానాభి మానాలు గూడా వారికి లెక్కలేదు. క్రిష్ణయ్య ధోరణికి సరళ మండిపోయింది. కష్టంపైన తనను తాను సమాళించుకొని.

"నాకు తెలుసు క్రిష్ణయ్యా నీవిట్లా అంటావని నాకు తెలుసు. మొదట నీవేదో కాస్త బుద్ధిమంతుడవని అనుకునేదాన్ని. యిపుడు తేలిపోయిందదిగూడా."

క్రిష్ణయ్య యేమీ మాట్లాడలేదు. ఆ నిశ్శబ్ద వాతావరణంలోకి మురళీ వచ్చాడు. వచ్చేదేగాని క్రిష్ణయ్యతో మాట్లాడలేదు. చూచీ చూడనట్లుగా వెళ్ళిపోయాడు బయటికి.

ఆ సాయంకాలం కృష్ణాతీరంలో సత్యారావు యెన్నెన్ని విషయాలో చెప్పాడు. లక్ష్మి సీతల గురించి మురళికి. మురళి చాలా నిదర్శనా లున్నట్టుగా బాగా నమ్మేశాడు. సీత అనే పదాన్ని మనసులో నుంచి తుడిచి పారేశాడు.

సీత దుఃఖాన్ని అర్థం చేసుకొన్నవాళ్ళు యిద్దరే. ఒకరు లక్ష్మి. రెండో వ్యక్తి. ఆనాడు వీరికి బుద్ధులు చెప్పడానికి వచ్చిన ముసలాయన. తర్వాత ఆ ముసలాయన అపుడపుడూ వచ్చేవాడు వీళ్ళింటికి. అసలు విషయమంతా బాగా తెలుసుకున్నాడు. అనుమానం నిరాధారమైన తర్వాత సానుభూతితో మాట్లాడేవాడు. సీతకు జరిగిన అవమానానికి, కష్టానికి చాలా చింతించేవాడు. గుడిసె తగలబెట్టి అవమాన పరిచాక. టౌనులో చేరిన తర్వాత గూడా ముస

లాయన వచ్చేవాడు లక్ష్మియింటికి. అతడు పోనుపోనూ వారికొక తండ్రి వంటివా డయ్యాడు.

మురళి విముఖత్వం చూచి, ఓర్వలేని ఆ ముసలాయన, ఒకనాటి సాయంకాలం వచ్చాడు మురళి దగ్గరికి. తన్ను తాను పరిచయం చేసుకొని అన్నాడు:-

"నాయనా! నాగరికులమని గర్వించే మీ యువక బృందానికి అనుమానించడం అంటే బాగా తెలుసుగాని, అర్థం చేసుకోడం తెలీదు నాయనా."

"అందులో అర్థం చేసుకోడానికి యేమీలేదు తాతా! సుస్పష్టంగానే కనిపిస్తున్నది" అన్నాడు మురళి.

"ఏమిటి?"

"తెలిసిగూడా మాట్లాడతా వెందుకు?"

"నిజంగా తెలీదు నాయనా! చెప్పు అదేదో తెలుసుకొంటాను."

"సీతకు యితర్లతోటి సంబంధమున్నది. దానికి తార్కాణం ఆమె గర్భమే. యింకొకటేమిటంటే యిదివరకు లాగా నాకోసం ప్రాకులాడడం లేదు."

ముసలాయన చెవులు మూసుకొని,

"రామరామ! యెంత దుర్మార్గము! కారకుడవు నీవే యితర్లపై దోషాన్ని మోపుతావా? నాకవన్నీ తెలుసు. ఆమె నీపైన యెంత వ్యామోహంతో దుఃఖిస్తూ వుంటుందో నీకేం తెలుసు? యిపుడామె రెన్నాళ్ళుగా అన్నం మానబట్టే నేను నీకోసం వచ్చాను" అన్నాడు.

"అట్లాగే యింకా నాన్నాళ్ళు మానమను' చస్తే తంటా లేకుండా పోతుంది. అట్లాంటి కులటలు బ్రతకడం భూమికి బరువుచేటు" అంటూ తటాలున లేచి గబగబా వెళ్ళిపోయాడు మురళి.

"హరహరా! యెంతమాటా" అంటూ నిర్విణ్ణుడై, ఆ నిర్గమిస్తున్న మూర్తిని చూస్తూ కూర్చున్నాడు ముసలాయన నోరు తెరుచుకొని.

# 15

చంపకవచ్చి రెణ్ణాళ్ళయింది. వచ్చింది మొదలు బలవంతపెట్టింది మద్రాసుకువచ్చి తనింట్లో వుండమని. సరళ కది బొత్తిగా నచ్చలేదు. ఇదివరకు యేదో వున్నవాళ్లు కాబట్టి యెవరింట్లోవున్నా గౌరవంగానే వుండేది. లేనివాళ్లు యితర్ల యిండ్లలో వుంటే యెంత మర్యాద లభిస్తుందో సరళకు బాగా తెలుసు. అందుచేత ఆమెకు సుతరామూ యిష్టంలేదు. అయితే యిపుడు చదువు చాలించాలి. తాను చాలిస్తే ఫరవాలేదు. ఎక్కడైనా, ఒక వుద్యోగం చేసి బ్రతకగలదు. మురళి విద్య విషయం గురించి బాగా ఆలోచించింది. మద్రాసువెళ్లి యేదో వుద్యోగంలోచేరి మురళి చదువుకు సాయ పడాలనుకుంది, అందుచేత మద్రాసుకు పోవడానికి వొప్పుకొంది.

ఆ దినం మద్రాసు పయనం నిశ్చయమైంది. అన్నీ సర్దుతూ వున్నారు చంపక, సరళా, యింతలో వచ్చారు క్రిష్ణయ్యా, మురళీ, సర్దడం అవగానే, సరళను ప్రక్కకు పిలిచి ఒక రెండువేల రూపాయలకు బాండును చూపిస్తూ, ''మనం క్రిష్ణయ్యకు యెప్పుడిచ్చినా ఫరవాలేదు'' అన్నాడు మురళి. తటాలున ఆ బాండు లాక్కొని "ఎందుకు రాసిచ్చావు యిది'' అంది కోపంగా సరళ.

''ఎందుకంటే, అవసరం వుంది కాబట్టి.''

''న న్నడిగావా?''

''అనవసరం" అన్నాడు విరసనగా మురళి.

చకిత అయింది సరళ ఆఘోరణిచూచి.

''అయితే....'' అని యేమో అనబోతూవుంటే,

''అయితే లేదూ గియితేలేదు, నీ పెత్తనం అనవసరం. పెద్ద వాణ్ణయ్యాకకూడా నీబెదిరింపులకు లొంగుతాననుకోవద్దు.''

"పెద్దవాడవైతే మాత్రం...." అని అనబోతూవుంటే.

"ఔనౌను! ఆడదాని పెత్తనం క్రింద పెరిగితే, వా డెప్పటికీ దద్దమ్మ గానే చూడబడతాడు."

"ఏమి టిదంతా మురళీ!" అంది కాస్త తగ్గినట్లుగా. మళ్లా అంది.

"ఇకమీదట అంతా నీదేగా పెత్తనం! నాన్న తర్వాత నీవేగా అంతా చూచుకోవాల్సింది! నా కేమీ అవసరంలేదు. ఏ విషయంలో కూడా జోక్యం కల్గించుకోను. అయినా, మన కేముందని పెత్తనం వహించాలి?"

మురళి యేమీ మాట్లాడలేదు, తానేదో అస్తవ్యస్తంగా మాట్లాడి నందుకు లోలోపల చిన్నబుచ్చు కుంటూ క్రిష్ణయ్యవైపు చూచాడు.

"అయితే ఆ రెండువేల రూపాయలు మనకెందుకు?" అంది సరళ మురళివైపు మాత్రం చూస్తూ.

"చదువుకు కావద్దూ?"

"అయితే యెప్పుడు తీర్చేటట్టూ? యెట్లా తీర్చేటట్టూ?"

"మనకు వీలున్నపుడు. ఉద్యోగం చేసేటప్పుడు"

"ఉద్యోగం చేసేవా డెవడన్నా కూడపెట్టంగా చూశావా? రెండవ తారీఖు దాటితే అప్పులు చేస్తూ వుంటారని తెలీదూ? మనం అసలు ప్రతి సంవత్సరం దాని వడ్డీ అయినా యిచ్చుకో గలమా?"

"వడ్డీ అక్కర లేకుండానే మాట్లాడినాను."

"నాకు తెలుసది. క్రిష్ణయ్య నీ కంతమాత్రం చేయగలడని నాకు తెలుసు"

"అదేగాదు అసలుగూడా యివ్వగలిగినట్లయితేనే ...."

"అంటే!"

".... .... .... ...."

"అయితే ఈ బాండెందుకు?" అంటూ బర బర చించి పారేసి,

"మురళీ! ఆ డబ్బు నా వెంట ఒక దమ్మిడీగూడా రాకూడదు. అది నాకోసంగూడా అయితే నా కక్కుర లేదు. నా నగలున్నంతవరకు నేను నీకేమి లోపం రానీయను. నాన్న, అంత మాత్రం దయబెట్టి ఆ సొత్తులు వదిలిపెట్టి వెళ్ళాడు" అంది.

అంతవరకూ ఆ ప్రక్కనే చంపకతో మాట్లాడుతూ వున్న క్రిష్ణయ్య వీళ్ళ సంభాషణ తీవ్రతను విని యిట్టువైపు తిరిగాడు. బాండు, ముక్కల క్రింద మారడం చూచాడు. ఆమె నిరసన పలుకులు విన్నాడు. అట్లాచూశాడు సరళవైపు. ఇంతలో మురళి అన్నాడు:-

"నీవు యింతగా యితర్లను అవమాన పరుస్తావని నేనను కొనలేదు. నీ కక్కుర లేకపోతే నేనే తీసుకుంటా నా డబ్బును. అసలు ఆ బాండు నా పేరిటే వుంది. అంతగా అయితే మళ్ళా యింకొకటి వ్రాసిస్తా" అంటూ గబ గబా బయటికి నడిచాడు. క్రిష్ణయ్యగూడా తలవంచుకొని అతన్ననుసరించాడు, చంపక పరుగెత్తుకొంటూ వచ్చి,

"ఏమిటక్కా యిదంతా?" అంది.

"నా కర్మ!" అంటూ కన్నీరు కార్చింది సరళ!

"ఈ డబ్బు ఒక దమ్మిడీ గూడా నా వెంట రాగూడదు" అన్న సరళ నిర్ధారణవాక్యం దారి నడుస్తూ వున్న క్రిష్ణయ్య చెవుల్లో మారుమ్రోగుతూనే వున్నది. యంత్రాల్లాగా నడుస్తున్నా రిద్దరూ.

"ఆమె గూడా యెందుకో తొందర పడిందీనాడు" అన్నాడు మురళి.

" .... .... .... ...."

"మళ్ళా పనిపెట్టింది పాడు?"

"ఎందుకు?"

"మళ్ళా బాండు వ్రాయవద్దూ?"

"అనవసరం?"

"వద్దు వద్దు గుర్తుకైనా వుండాలి."

"ప్రస్తుతం అంత డబ్బులేద్దు మురళీ" అంటూ యింట్లో జొర బడ్డాడు క్రిష్ణయ్య మురళీ ప్రసక్తే అనుకోకుండా.

రైలెక్కేటప్పుడు చంపక తప్ప యెవరూ కులాసాగా లేరు. మురళీ మాత్రం చోటు చేసికొని పడుకున్నాడు. అలిసినట్లు కనిపిస్తున్నాడు కాబట్టి అతని తలను తన తొడపైకి తీసికొని తృప్తిగా యేదో వూహిస్తూ కూర్చుంది చంపక. కాసేపుండి "అన్నా! క్రిష్ణయ్య బాగా మాట్లాడుతాడుకదూ" అంది.

"నన్నేమీ పలకరించక చంపా" అన్నాడు కండ్లు మూసుకొనే.

అక్కవైపు చూచింది చంపక.

"మరి, క్రొత్తవాళ్లు యెట్లా మాట్లాడ్తారేమిటే" అంది సరళ.

"అదేగాదక్కా! మనం బాగా కనుక్కోవచ్చు. ఏదో భావాన్ని లోపలపెట్టుకొని మాట్లాడేవాళ్ళను ఒక దెబ్బలో కనుక్కోవచ్చు." అంది తను గొప్ప అనుభవశాలి అయినట్టు,

"అంత తొందర్లో మనుషుల తత్వాలు కనిపెట్టలేవు చంపా. అది సులభమైన పనిగాదు. అనుదినమూ పరిచయంలో వున్న వ్యక్తుల్ని గూడా అర్థం చేసుకోడం కష్టం. అందులో పెండ్లిగాని పిల్లలతో వ్యవహరించే యువకులను పూర్తిగా అర్థం చేసుకోలేం."

"నీవేదో పొరబడుతున్నా వక్కా!"

"నీ కనుభవం తక్కువ చెల్లీ! నాకుగూడా పెద్ద అనుభవ జ్ఞానం వుందనికాదు; అయితే నీకంటే ఎక్కువ మందిని చూచే వుంటాను. కొన్ని సమస్యల్లో కూడా చిక్కుకొన్నాను"

"ఏదో చాలా వున్నట్లుందే?" అంటూ ప్రశ్నార్థకంగా చూచింది చంపక.

"ప్రస్తుతం ఆ విషయాలు వదిలేద్దాం, ఏదో ఒక మోస్తరుగా వుంది" అంటూ యెదుటివైపు బల్లమీద మేను వాల్చింది సరళ.

బండ్లో వాళ్ళిద్దరు బాగ నిద్రపోయారు. చంపకమాత్రం అన్న నిద్రకు

భంగం రాకూడదని జాగ్రత్తగా వుండింది చాలా సేపు. తర్వాత బల్లకాను కుని కూర్చునే ఒక మోస్తరుగా నిద్రపోయింది, తెల్లవారేటప్పటికి గూడూరు స్టేషనులో అందరూ దిగి మొగం కడుక్కొని కాఫీతాగి మళ్ళా బండెక్కారు. బండి కదిలింది. కాసేపందరూ మౌనంలో వుండినాక,

"చూశావా మురళీ! క్రిష్ణయ్య యేం చేశాడో?" అంది సరళ.

".... .... .... ...."

"పాపం? ఆడవాళ్లు తీసుకొనే టట్టయితేనే ధారాళత్వం ప్రదర్శిస్తారు పురుషులు!"

చంపక చురుకు మెదడు తటాలున గ్రహించింది అందులోని అర్థం. మళ్ళా కాసేపు మౌనం వహించారు. అట్లా బల్ల క్రిందికి చూచి భయపడి నట్లుగా "మురళీ! ట్రంకేదీ?" అంది సరళ.

"ఏదీ? యేం ట్రంకు?"

"నాది. నా నగలు, బట్టలు అన్నీ దాంట్లోనే వున్నాయి"

"నిదానంగా చూడక్కా" అన్నది చంపక.

"ఇంకేం నిదానమే, కొంప కూలిపోతేనూ!" అంటూ నిర్విణ్ణయై కూర్చుంది సరళ.

ఇంతలో ఆ ప్రక్కన కూర్చున్న ఒక నలభై యేండ్ల వ్యక్తి వీళ్ళ దగ్గరకు వచ్చి కూర్చుని, "మీ ట్రంకు పైన ఎ. యస్. అని వ్రాసి వుందాండి?" అన్నాడు.

"అవును!" అంటూ గంపంత కండ్లుచేసి చూచిం దతనివైపు సరళ.

"నెల్లూరి స్టేషన్‌లో యెవడో పట్టుకొని దిగి పోయాడండీ. ప్లాట్ ఫారం ఆ వైపు దిగిపోయాడు. నేను అతనిదే అనుకున్నాను సుమండీ!"

నిశ్చేష్టయై కూర్చుంది సరళ, ఎవరూ, యేమీ మాట్లాడలేదు కాసేపు.

"ఏమాత్రం సొమ్ము పోయినట్లు" అన్నాడు ఆ వ్యక్తి.

"అయిదు వేల కిమ్మత్తుంటుంది" అంది సరళ కన్నీరు కారుస్తూ.

"ఏడవకమ్మా! యేడిస్తే వచ్చేదేమిటి? సూళూరిపేట స్టేషనులో పోలీస్ రిపోర్టు యిద్దాం."

"ఇచ్చినా దక్కవు. తీసుక పోయినవాడు మళ్ళా యివ్వాలనిగాదు- పొరపాటుతో చేసిన పనిగూడాగాదు."

"పొరపాటే అయితే బదులు ట్రంకు వానిదైనా వుండాలి. పైగా వాడటువైపు దిగిపోయాడు" అంది చంపక.

"మనకు ప్రాప్తం లేదు." అంటూ మురళి వైపు చూచి "మంచి స్పురద్రూపి!" అనుకున్నాడా వ్యక్తి.

సూళూరిపేటలో రిపోర్టు యిచ్చారు. తర్వాత యెవరి సీట్లో వాళ్ల కూర్చున్నారు. ఆ నూతన వ్యక్తి మురళి నుద్దేశించి,

"మీరేం చేస్తున్నారు మద్రాసులో?" అన్నాడు.

"మెడిసన్ చదువుతున్నా"

"ఆ అమ్మాయి అంతా మీ మాదిరే వుంది. మీ చెల్లెలు అనుకుం టాను."

"అవును. ఈమె మా చెల్లే. ఆమె మా అక్క."

"ఎక్కడి నుంచి వస్తున్నారు?"

"బెజవాడ"

"తమ పేరు?"

మురళికి యీ ప్రశ్నతో కాస్త చీకాకు వేసింది. తర్వాత ప్రశ్నేమిటో తనకు తెలుసు. అయిష్టంగా "నా పేరు మురళీధరరావు" అన్నాడు.

"తమ యింటిపేరూ?" అన్నాడా వ్యక్తి.

ఈ ప్రశ్నతో మురళికి మరీ చీకాకువేసింది. ఇదంతా తన కులంకోసం వేసే ప్రశ్నఅని అతనికి తెలుసు. ప్లాట్‌ఫారంపైనా - రైళ్ళలోనూ - బళ్ళ లోనూ - రోడ్లమీదా - హోటళ్ళలో ఎక్కడబడితే అక్కడ అనవసరంగా అందరూ వేసే ప్రశ్నే యిది. ఈ ప్రశ్న అంటే మురళికి చాలా వెగటు. అత నికి బుద్ధి చెప్పాలనుకొని, తన యింటిపేరూ-తండ్రిపేరూ-తల్లిపేరూ-అన్న దమ్ముల విషయమూ అక్కచెల్లెళ్ళ విషయమూ - బంధువుల విషయమూ చదువు విషయమూ వర్సగా గడగడజెప్పి, "యిక చాలా అండీ! ఇంకేమన్నా వివరాలు కావాలా?" అన్నాడు.

''చాల్లేండి తెలిసింది'' అని ఏమీ జరగనట్లుగానే మామూలుగా కూర్చు న్నాడా వ్యక్తి.

''ఏమండీ! ప్రతివాడుకూడా కులం తెలుసుకోందే పోనీయరేంటండీ మన తెలుగువాళ్ళు! ఇదేం తెగులండీ?'' అంది చంపక.

''అబ్బే! కులంతో నాకేం పనండీ. ఊరికే అడిగాను''

''ఔనౌను. ఊరికేనే అంటూ వున్న వుదంతా న్నంతా లాగజూస్తారు''

''అనవసరమైన వాటిల్లోనే మన ఆంధ్రులు అతి తెలివి చూపిస్తారు చంపా'' అంది సరళ విరక్తిగానే.

''అందుకేగా ఐకమత్యంతో అలరారి పోతున్నాం మనం!''

''ఐకమత్యం యెల్లా వస్తుందే? లక్షఒకటి కులాలుంటే! ఒక కులం ఒక కులానికి నీచమైపోయె! ఒక ర్నొకరు నీచంగా చూచుకోడం బాగా నేర్చుకొన్నారాయె. సమ మర్యాద చూపందే సమైక్యత యెట్లావస్తుందీ?''

''అది నిజం! అయినా, అదొక భూతంలాగా పట్టుకొని మనల్ను వదలటం లేదమ్మా!'' అన్నా డాయన.

''వదలి పోవాలి అంటే పోతుంది. వదలటంలేదూ అని స్వప్రయత్నం లేకుండా నిరాశా వాదాన్ని ప్రకటిస్తే పోతుందా?'' అన్నాడు మురళి.

''ఔను. ఇపుడు అందరూ అట్లాగే అంటున్నారు. వాళ్ళ పెండ్లిండ్ల విషయాలు వస్తేనూ, వాళ్ళ పిల్లల పెండ్లిండ్ల విషయాలు వస్తేనూ నా మాదిరే ప్రశ్నలు వేస్తారు.'' అని నవ్వా డాయన తృప్తిగా.

సరళ యేమీ పలకలేదు. పోయిన నగలపైన చింతను కేంద్రీకరించి నట్లుగా గ్రహించారు తదితరులు. ఆమెను అనుసరించారు. కానే పయ్యాక ఆ క్రొత్తాయన చంపక నుద్దేశించి, ''ఈ మేమి చదువుతూ వుంది?'' అన్నాడు.

''అతని తరగతే!''

''అయితే మా అమ్మాయి తెలుసా?''

''ఎవరు?''

''వి. రుక్మిణి.

"ఓహో! ఆమె నా స్నేహితురాలూ!" అంటది చంపక కండ్లు పెద్దవిచేసి వాటిలో సంతోషాన్ని కనబరుస్తూ. మళ్ళా అంది:—

"అట్లాగా అండీ; ఇదివరకు తెలీక యేదో అన్నాం. ఏమీ అనుకోకండేం!"

"పరవా లేదమ్మా. మీ రన్నదే సత్యం!"

"నేను చాలాసార్లు మీ రుక్మిణితో గూడా మీ యింటి కొచ్చానే! మీరు కనబడలేదు వొకసారి గూడ."

"ఔను. నేను షాపుకు వెళ్ళివుంటాను."

"ఏమిషాపు?"

"బట్టలషాపు."

"మా నాన్నగారు తెలుసను కుంటాను."

"ఎవరు? ఇంతకుముందు యీాయన చెప్పినపేరా? తెలీదే!"

"కాదండీ! సన్యాసిరావుగారు."

"అరే! ఏమి టిదంతా! అతను మీ యన్న య్యంటున్నావే! నీ కెవరూ తోబుట్టువులు లేరుగా!"

"నిజం! ఆకొరత యీాయన-ఆమె తీర్చారు." అని సంబంధమంతా చెప్పింది. ఇట్లా మాట్లాడుకొంటూ వుండగా, సెంట్రల్‌స్టేషన్ వచ్చింది. అతడు తటాలున ఒక విజిటింగ్ కార్డుయిచ్చి "మీరంతా ఒకసారి మా యింటికి దయచెయ్యాలి." అన్నాడు. 'వి. కె. రావు' అన్న పేరుచూచి. "ఈ పేరు నాకు చాలా పరిచయమండీ" అంది చంపక. బండి ఆగగానే మహేంద్ర కనిపించాడు. అందరూ, మహేంద్ర తెచ్చిన కార్లోయెక్కి వెళ్ళారు.

ఆ మరునాడే సరళ బలవంతంమీద మైలాపూర్లో ఒక చిన్నయిల్లు బాడుగకు తీసుకొని తక్షణం అందులోకి వెళ్ళడమైంది. ఈ చర్య చంపకకు సుతరామూ యిష్టంలేదు. ఎంతో అడ్డిందిగాని, గెలువలేక పోయింది, ప్రస్తుతం తన గాజు లమ్మిన డబ్బులో యింకా యిరవై రూపాయలు మాత్రమే వుంది.

ఉద్యోగప్రయత్నం చేస్తూవుంది. మురళిగూడా వుద్యోగం చేస్తానని పట్టు పట్టాడుకాని, సరళ బలవంతంవల్లా - చంపక పట్టుదలవల్లా - చదువు సాగించడం మొదలు పెట్టాడు. కాలేజీలో అడుగు పెట్టగానే మిత్రులైన చాలా మంది బాలబాలికలు విచారించ మొదలు బెట్టారు. అదివరకు మాట్లాడనివారు గూడా అపుడు మాట్లాడారు బాలికలు. రుక్మిణి మాత్రం నలుగురి పిల్లలకూ కనబడకుండా కన్నీళ్ళు తుడుచుకోవాలని ప్రయత్నించిందిగాని పట్టువడక తప్పలేదు.

కాలేజీలో లలిత కనిపించింది. నమస్కార ప్రతినమస్కారాలు తప్ప వేరే మాట్లాడుకోడానికి వీలులేకపోయింది. సాయంకాలం యింటికొస్తే బాగుండు ననుకొంది. ఏ ప్రేరేపణవల్లనోగాని యితనుగూడా వెళ్ళాడు సాయంకాలమే. ఇతన్ని చూడగానే ఆనందాన్ని-ఆశ్చర్యాన్ని ప్రకటించి,

"నేను మీరు వస్తారను కున్నాను." అంది మధురమైన మంద హాసంతో.

"నా ఆగమనాన్ని మీరు కాంక్షించి వుంటారు హృదయంలో."

"అవును. సంకల్పాన్ని పసిపట్టే మేధావితనం వుందన్నమాట"

"అది యీ అంతరాత్మకే తెలియాలి."

"కావచ్చు" అంటూ లోపలి కెళ్ళిపోయి మరుక్షణం ఒక గ్లాసుతో పాలుతెచ్చి, "పాలు కొంచెం తాగవూ!" అంది. అట్లా ఒకసారి ఆమె కండ్లల్లోకి చూచి, చేత్తో గ్లా సందుకున్నాడు. ఆమె ఒక కుర్చీని ప్రక్కగా లాగి కూర్చొని,

"మీకు కలిగిన మనోవ్యధ అపారము. ఆ వ్యధాభారాన్ని మోయ డానికి భాగస్తులయిన ఆత్మీయులున్నారని విశ్వసించండి" అంది.

"కృతజ్ఞుణ్ణి!" అంటూ ఒకగుక్కెడు పాలుత్రాగి, తటాలున పెదవుల నుండి తీసి, "అరే! ఎంత తెలివైనవాణ్ణి! అమాంతంగా తాగేస్తున్నాను"

"తాగడానికే యిచ్చింది."

"మరిమీకో"

"నాకక్కరలేదు"
"మీకు వేరే వున్నాయనుకొని నేను త్రాగేస్తున్నాను"
"మరి, లేవనుకున్నావా?"
"ఉంటే తీసుకరండీ"
"నాకక్కరవుంటేగా"
"నాకే కావాలి"
"అవిత్రాగు తెస్తా"

"అట్లాకాదు. ఇప్పుడే కావాలి" అంటూ లేచి లోపలికెళ్ళి కాళీగా వున్న వేడి పాలగిన్నె చూచి,

"చూచారా? నేను వూహించని ఒక క్రొత్తవిషయాన్ని కనిఅట్టాను" అన్నాడు.

"ఏమిటది"
"మీరు అబద్ధాలాడడమే"
"ఎపుడాడాను?"
"ఇపుడే"
"ఏమని"
"మీకు పాలున్నాయని"

"అది అబద్ధ మంటావా?" అని నవ్వింది. ఇద్దరూ నవ్వుకున్నారు.

"అయితే యీ పాలు నేను తాగ" నన్నాడు మురళి.

"త్రాగాలి" అంటూ మధురంగా పెదవులు బిగించి, కనురెప్పలు కొద్దిగా మూసి చూచింది.

"మీరు త్రాగడంలేదుగా?" అన్నాడు మురళి అదే ధోరణిలో.

"పరవాలేదు త్రాగు, నాకు త్రాగినట్లే వుందిపుడు."

"నాకూ అట్లాగేవుంది" అంటూ టేబులుపై గ్లాసు పెట్టాడు మురళి.

"ఆమెలేచి దగ్గరకు వచ్చింది. కుర్చీవెనుకగా నిలబడి, పాలగ్లాసు తనచేత్తో పట్టుకొని, ఎడమచేయి అతని నెత్తిపైకి పెట్టి గ్లాసతని నోటిదగ్గర పెట్టి "మంచివాడవు గదూ, త్రాగు" అంది.

తన తలపై వున్న ఆమెచేతిని తన ఎడమచేత్తో పట్టుకొని, గ్లాసు పట్టుకొనివున్న ఆమె కుడిచేతిక్రింద తన కుడిచేయి ఆధారంగాపెట్టి, తన శిరోపరిభాగంపై అధోముఖమై వున్న ఆమె వదనచంద్రుణ్ణి గుడ్లేత్తిచూస్తూ, పాలు గుటగుట త్రాగాడు పసిబిడ్డలాగా.

ఎదురుగావున్న పెద్ద అద్దంలో యిద్దరూ ప్రతిబింబిస్తున్నారు. వారు చేసే ప్రతి క్రియా ప్రతిబింబిత మౌతూన్నది. ప్రక్కన నిలబడి తమను అద్దంలో చూచుకుంటూ మురిసిపోతూవున్న మురళిని "కూర్చో" అంది కుర్చీచూపిస్తూ. పసిపిల్లవాడులాగా కూర్చున్నాడు. ఇంతలో 'లలితగారూ' అన్న శబ్దం వినిపించింది క్రిందినుంచి. నిశ్చేష్టయై నిలబడింది లలిత. గాభరా పడ్డాడు మురళి. అప్పటికే మెట్లు బరబరా యెక్కి వస్తూవుంది చంపక. లలిత సమాళించుకొని గుమ్మంలో అడుగు పెట్టేటప్పటికి చంపక రానే వచ్చింది. రావటంతోటే, "అదో! నే ననుకున్నా యిక్కడ వుంటాడని! నీ కోసం మీ యింటి గ్గూడా వెళ్ళొచ్చా నన్నయ్యా" అంది గుడ్లు పెద్దవి చేసి చూస్తూ.

"ముందు కూర్చో చంపా" అంది లలిత కుర్చీ చూపించి.

"దాంట్లో నేను కూర్చుంటే మీరో?"

"మీరు నా కతిథులు"

"మీరు మాకు గురువులు" అంటూ మురళి ముందువైపు వున్న టేబుల్‌పై ఎగిరెక్కి కూర్చొంది. లలిత ఆ కుర్చీని యింకా కాస్త దూరం లాగి కూర్చొని,

"ఏంటి చంపకా! ఏమైనా అర్జంటు పనుందా?" అంది.

"ఏమీ లేదండీ - అదేమో యెపుడూ అన్నయ్య దగ్గరే వుండాలనిపిస్తుంది. ఈ దినం మరీ ఆ భావం పట్టకుండా అయింది నా హృదయంలో"

"మరి మీ యింట్లోనే వుండమన కూడదూ?"

"నేనేడ్చేదీ అందుకేగా. వుంటేగదూ"

మురళి కిప్పటికీ గుండెదడ తగ్గలేదు. ఏమీ మాట్లాడకుండా కళ్లప్పగించి కూర్చున్నాడు.

''మాట్లాడానికేమీ కనిపించలేదా?''అంటూ చంపక ఎగిరిదూకి, ''అరె! ఎంత పొరపాటూ! రుక్మిణి క్రింద వుంది! ఎంత తెలివినాది! అన్నా! పిల్చుక రానా? దాని కిటీవల మురళి పిచ్చిపట్టింది''అని లలిత అక్కడున్న విషయం గమనించి నాలుక కొరుక్కొంటూ కిందికి వెళ్ళింది.

రుక్మిణి పైకి వచ్చేటప్పటికి గదిలో చాప పరిచి వుంది! నమస్తే అంటూ లోపలికి వచ్చింది. మురళివైపు చూచి 'నమస్తే' అన్నది. 'నమస్తే' అని మళ్ళా అటువైపే ముఖం పెట్టాడు మురళి. ఆమె ముందుకు పోతూ, వెనక్కి చూచింది. అద్దంలో మురళి ముఖం, తన ముఖం ప్రక్కన ప్రక్కన రచింపబడినట్లున్నాయి. ఎంతాకర్షణీయంగా వున్నాయి పరస్పరం! ఇంతలో రుక్మిణి పక్కకి వచ్చి నిలబడింది చంపక. తన కిరువైపులా ఏకరూపముతో స్త్రీ, పు లింగ భేదాలతో వున్న ముఖబింబాలను చూచి, ఆశ్చర్యపడింది రుక్మిణి. ఆనందపడింది, అమాంతంగా చంపకను కౌగలించుకొని తృప్తితో ''అబ్బా! అంటూ'' చంపా! యింత రూపాన్ని గలిగిన నీవు పురుషుడివే అయి వుంటే ఈ క్షణమే కరగ్రహణం చేసి విమానంలో యెత్తుకొని విహాయాసంలోకి ఎగిరి పోదును కదే!'' అని అంటూ, ప్రసన్న దృక్కులతో మురళివైపు చూచింది. చంపక తటాలున అన్న ప్రక్కన జేరి, ''జాగ్రత్త! మా అన్నను యెత్తుక పోదామని చూస్తూ వున్నట్టుంది ఆపాళంగా'' అంటూ అతని చేయి పట్టుకొంది. ఇంతలో నవ్వుకొంటూ లలిత వచ్చి, రుక్మిణి ప్రక్క నిలబడింది. కొద్ది సైజు భేదంతో, కనుగొనలేని వయోభేదంతో, తన లాగేవున్న రుక్మిణిని ప్రక్కకుజేర్చి. గట్టిగా అదుముకుంటూ,''నా చెల్లెలులాగా వున్నావే అంతా'' అని అట్లా మురళి ప్రతిబింబము వైపు చూచి, హృదయము నిండినట్లుకాగా, యేదో, యెపుడో కొన్ని యేండ్ల క్రితం చూచిన ముఖంలాగా వుందే అనుకుంటూ, లోపలి కెళ్ళి పోయింది.

రెండవ కుర్చీలో చంపక కూర్చుంది, ఆ కుర్చీ చేతిపై కూర్చొని, చంపక భుజాలపై చేతులువేసి,

''మీకు మంచి కష్టాలే వచ్చాయి.'' అంది రుక్మిణి మురళి నుద్దేశించి.

మురళీ పెద్ద వేదాంతిలాగా. "అవి ఎవరికైనా, ఎపుడో ఒకసారి తప్పవు." అన్నాడు.

"ఎవరికీ తప్పవంటారా? ఆ గర్వ శ్రీమంతులకు గూడానా?"

"ఆర్థికవిషయం ఎందుకు వచ్చింది?"

"నా కన్నీ తెలుసు. చంపక నా ప్రాణముతో సమానము."

మురళీ యేమీ మాట్లాడలేదు. చెంపక అంతా చెప్పిందని బాగా తెలిసిపోయింది. ఆ విషయం అతనికి కించగా తోచింది. ఇంతలో రుక్మిణి "మా యింటి కొకసారిగూడా రాలేదు. ఈరోజు వస్తారా?" అంది.

"ఎందుకు? మీ యింట్లో వుండమంటావా భోజనానికి?"

దానికైతే మాత్రం యెందు కుండకూడదూ?"

వంచిన తల యెగరేసి. అట్లా ఆమె వైపు చూశాడు. ఆ గుండ్రని కండ్లల్లో, యే భావం చూచిందో రుక్మిణి, విచలత అయింది.

"తాత్కాలిక భావావేశాన్ని పొంది. యేదో కరుణా సంబంధమైన పనులు చెయ్యాలనే వుబలాటగల్గి, యేదో అంటారుగాని. దాని అర్థం, ఇతర్లలో అది కలిగించే పరిణామం మీకు తెలుసుకొనే అక్కర వుండదు గాబోలు. ప్రస్తుతం మాకు లేకపోయినా. మీ అందరి యిండ్లకు అడుక్కోతినడానికి వస్తామని మీ రెట్లా అనుకుంటారు? ఎదుటి వ్యక్తుల అభిమానాన్ని లెక్కించకుండా మాట్లాడ్తా రెందుకు? చంపక గూడా యిట్లాగే అంది!" అంటూ తటాలున లేచి, గిరుక్కున తిరిగి, బిరబిరా మెట్లుదిగి వెళ్ళిపోయాడు. చేపిపెట్టిన అనిమిష బొమ్మల్లాగా, నిశ్చలంగా నిలబడి పోయారు చంపా రుక్మిణులు. ఆదరా బాదరా వంటింట్లోంచి వచ్చిన లలిత, వాళ్ళ ఆకారాలు చూచి, తన చూపుల ద్వారా, వాళ్ళ చూపుల్లోకి, ప్రశ్నభావం పంపింది. జవాబుగా నాలుగు కండ్లనుండీ, పెద్ద పెద్ద ముత్యాలు రాలాయి. ఎవరూ-ఏమీ-మాట్లాడ లేదు, ఒక క్షణం. మరుక్షణమే. 'సెలవు' అంటూ రుక్మిణీ చంపకలు బయలుదేరారు. వాళ్లు వచ్చిన కారులోనే యెక్కి ఒక ఫర్లాంగు వెళ్ళారు. నడుస్తూ వున్న మురళిని చూచి. కారు ముందుగా పోనిచ్చి ఆపి. దిగి,

అతనికి అభిముఖంగా నిలబడింది చంపక, అతని ముఖం యింకా గంభీరం గానే వుంది. ఆ గంభీరతను చీల్చుకొని ఒక బలవంతపు మందహాసం బయటి కొచ్చింది. దాన్ని పూతగాకొని, "ఇంటివరకూ వచ్చి విడిచి వస్తాను. కారెక్కవూ?" అంది అర్థిస్తూ చంపక.

చింతా మేఘా వృతమైన ఆమె మొగాన్ని చూస్తూ గూడా అతను గాంభీర్యాన్ని వదలలేదు. పట్టు విడవకుండా, "లేదు చంపా. అక్కర్లేదు వెళ్ళిపో" అంటూ పోతూనే వున్నాడు. "అన్నా! యిటుచూడూ" అంటూ అటు తిరిగింది కానీ, నిర్లక్ష్యంతో నిర్గమిస్తున్న అతని వాలకం చూచి మళ్లా కారెక్కింది. యింటికి పోగానే, పుస్తకాలు విసిరి పారవేసి, యిద్దరూ కాళ్లు. ముఖం కడుక్కున్నారు. తక్షణమే బయల్దేరి "నాన్నా! అక్కయ్య యింటికి వెళ్ళొస్తాము."ఏం అంది చంపక. ఇద్దరూ బయల్దేరి రుక్మిణి యింటి కెళ్ళారు. రుక్మిణి పుస్తకాలు యింట్లో విసిరిపారేసి, "అట్లా షికారు కెళ్తున్నాం నేనూ చంపకా" అనేసి, కార్లో ఎగిరి కూర్చుంది.

"అదేమిటే! ముఖం అంతగా వాడి నట్లున్నది?" అంటూ రుక్మిణి తల్లి యెదురుగా వచ్చింది ఆశ్చర్యంతో. ఆమె మొగాన్ని చూడగానే, యీనా డెందుకో, తటాలున లలిత జ్ఞాపక మొచ్చింది చంపకకు. ఇదివర కెన్నో సార్లు చూచినా, ఈ భావం తట్టలేదు. ఈ దినం వీళ్ళందరూ రూప సాదృశ్యాన్ని చూచుకొన్నారు, కాబట్టి, ఇపుడా విషయం తటాలున తట్టింది! కుర్చీ లోంచి లేవబోయిన చంపక, మళ్ళా కుర్చీలో కూర్చుని "ఏం పిన్నీ! నీ కక్కా చెల్లెళ్లున్నారా? వాళ్లు నీ మాదిరే వుంటారా?" అంది ఆతృతతో. ఆశ్చర్యంగా వాళ్ళవైపు చూచి కన్నీళ్లు కార్చింది ఆమె.

"ఎందుకు పిన్నీ ఏడుస్తున్నావ్?" అంది చంపక ఆశ్చర్యంతోడి జిజ్ఞాసతో.

"ఒకప్పుడొక అక్క ఉండింది"

"ఊఁ. ఆమె!"

"...................."

"చదివోయిందా?"
"అందులోనే జమ"
"అంటే!"

"అదొక పెద్ద కథ చంపా. మరొకసారి చెబుతా. ఇపుడు చెప్పే వ్యవధిగానీ, ఆ మనః పరిస్థితిగానీ లేదు" అంటూ శూన్య దృక్కులతో నిల బడింది. వీళ్లిద్దరూ బయల్దేరారు.

సరళ యింటి కొచ్చే టప్పటికి యింటికి తాళం వేసివుంది. హతాశు లయ్యారు యిద్దరూ.

"ఇదేంటి చంపా, అన్నీ యిట్లా సమకూడు తున్నాయి మనకీ సాదు!" అంది రుక్మిణి.

"అది అంతే రుక్కూ! యెపుడు గూడా అట్లాగే జరుగుతుంది. ఇట్లా జరగడం మామూలైనా, ఒక్కొక్కసారే, మనం అట్లా అనుకుంటాం. ఏదైనా దెబ్బ తగిల్నపుడు, మనం దానిపైనే కేంద్రీకరించి చింతిస్తూ వుంటాం కాబట్టి, మళ్ళా ఏదైనా జరిగితే. అన్నీ మనకే తగుల్తున్నాయ్ అను కుంటాము.

"కావచ్చు"
కాసేపు మౌనంగా కూర్చున్నారు.
"కాస్త కోపగాడుగా గూడా కనిపిస్తాడే మీ అన్న" అంది.

"కాదు. దాన్ని కోపం అనను, అభిమానం అంటాను. అతనిలో అది మూర్తీభవించి వుంది."

మురళి నేరుగా సన్యాసిరా వింటికి వెళ్ళాడు. సన్యాసిరావు మురళిని ఎంతగా ప్రేమిస్తున్నాదో అది మురళికి ఒక్కడికే తెలుసు. ప్రతి శని, ఆది వారాలూ యిద్దరూ కలిసి రామకృష్ణా మిషన్‌కు వెళ్తూ వుంటారు. అక్కడ వున్న సర్వజితానందస్వామి అంటే వీరికి బలేయిష్టం. వీళ్లు ముగ్గురూ కూర్చుంటే తాత్త్వక విషయాలేగాక, యింకా యెన్నెన్నో విషయాల గురించి ముచ్చటించుకుంటూ వుంటారు. సన్యాసిరావు, మురళీధర్‌లలో వుండే

సాధూహ్యాన్ని చూచి, తప్పకుండా వారు తండ్రీ బిడ్డలే అని వూహించాడు సర్వజితానంద. ఒకనాడు సన్యాసిరావుతో అన్నాడు.

"సన్యాసిరావుగారూ, మురళి మీ కొడుకే అని నా అంతరాత్మ చెబుతున్నది. లోకంలో మనిషిని బోలిన మనిషి వుండడం సహజమే అయినప్పటికీ, మీకు జన్య జనకభావం వుందని నా అంతరాత్మ ప్రబోధిస్తున్నది."

సర్వజితానంద చాలామంది మత సన్యాసులవంటి వాడు కాడు. నిజమైన ప్రేమ గలవాడు. ఆత్మజ్ఞాని. అంచేత, సన్యాసిరావుకు అతనంటే గౌరవం. ఒకనాడు మురళి లేని సమయంలో సర్వజితానంద నుద్దేశించి - "స్వామీజీ! మునుపటికంటే నా హృదయం మురళి వైపు యెక్కువగా లాగుతున్నది. మీరన్న తర్వాత నా కొడుకనే భావం బాగా నాటుకొన్నది, పూర్వం కంటే మమత హెచ్చింది. చనువూ ఎక్కువయ్యింది" అన్నాడు.

"అదే భావమంటే, భావం మార్పుపైన చాలా ఆధారపడి వుంటుంది. అతడు నీ కొడుకనే భావం స్థిరపడబట్టే నీ ప్రేమ అతిశయించింది."

"అవును-అది భావంలోని మార్పేగావచ్చు, అతని యెడ నా ప్రవర్తన పూర్వం కంటే భిన్నమే"

"అదే భావం అంటే! దేనికైనా భావం ప్రధానం. అతడు మీ కొడుకని భావిస్తేనే మీకా ప్రేమ కలుగుతుంది. ఆ భావం కలుగకపోతే మీకు పుట్టినా గూడా ఆ ప్రేమ వుండదు. ఎంతో మంది వ్యభిచరిస్తారు. వాళ్ళవల్ల కొంత సంతానం కలుగుతుంది, తన భార్యకు బుట్టిన బిడ్డలను యే విధంగా తన బిడ్డలనే భావం వహిస్తాడో. పర స్త్రీకి పుట్టిన బిడ్డల పైన అట్టి భావం వహించడు. ఒకవేళ వహిస్తే, అదే ప్రేమా, అదే వాత్సల్యమూ, అందులో కనిపించక పోవు."

"నిజమే."

"భావం రెండు విధాలు. ఒకటి స్వతహాగా హృదయంలో పుట్టుకొచ్చేది. రెండవది హృదయంలో మనం ప్రవేశ పెట్టుకొన్నేది. మొదటి దానిలో వున్నంత పద్ధతం రెండవ దానిలో వుండదు. అయితే క్రొత్త

క్రొత్త సంస్కార ప్రాబల్యంవల్ల మొదటిది సంపూర్ణంగా మారి పోవచ్చు గూడా.''

''అయితే స్వామీజీ! స్వస్త్రీకి పుట్టినా, పర స్త్రీకి పుట్టినా, సత్యరీత్యా. తన బిడ్డలే గదా! అందులో భావ భేదం యెందుకుండాలి?''

''సత్యరీత్యా అంతే. లౌకిక సంబంధాన్ననుసరించి కొంత భేదం కని పిస్తుంది. ఇందులో బాధ్యతకు గూడా తావుంది. పరస్త్రీతోడి సంబంధం సంఘం హర్షించదు. తత్ఫలితమైన బిడ్డలను సంఘం ఆమోదించదు. అంచేత ఆ బిడ్డలను తన బిడ్డలంటే మార్యాద వుండదనే భావం పురషుడిలో కలుగుతుంది. అంచేత వారిపై ప్రత్యక్ష బాధ్యత వహించడు. పరోక్షంగా బాధ్యత వహించి నప్పటికీ యితనికి కలిగే చిక్కులూ లేవు. అంచేత చాలా మంది నిర్బాధ్యులుగా ప్రవర్తిస్తూ వుంటారు.''

ఈ వాక్యం సన్యాసిరావును ఒక సన్న సూదితో పొడిచినట్లయింది. ఏనాటిదో తన నడతను యీనాడు బయటికి లాగినట్లనిపించింది. ఏమీ బదులు పలక్కుండా కూర్చున్నాడు.

మళ్ళా స్వామీజీ అన్నాడు: ''అన్ని విషయాలు యిల్లాగే భావంపైన ఆధారపడి వున్నాయి. దేవుడి విషయమూ అంతే. ఉందనే భావం వుంటే వున్నాడు. లేడనే భావమే వుంటే లేడు.''

సన్యాసిరావుకేమో మురళి తన కొడుకే అను మనోధైర్యం కలిగింది. అయితే తన కొడుకు తన యింట్లో యెందు కుండలేదు! తనకైతే ఆ భావం వుంది కానీ, మురళికో! మురళి యింత వరకూ సన్యాసిరావును పితృ సమా నుడుగా భావిస్తున్నాడేగాని, పితగా గాదు. తాను పరాయి బిడ్డ అనే భావం తనలో వుంది. అందుకే సన్యాసిరా వింట్లో వుండడానికి యిష్టపడడంలేదు. ఆ భావమూ, అభిమానమూ మురళిని దూరంగా జేస్తున్నవి.

ఆనాడు మురళి వెళ్ళేటప్పటికి సన్యాసిరావు గోడపై వున్న తన యౌవనం నాటి ఫోటోను చూస్తున్నాడు. మురళి నడిచివస్తూ వుంటే, ఆ ఫోటోలోని బొమ్మ సజీవమై తన కభిముఖంగా వస్తున్నట్లనిపించింది. చివు

క్కున లేచి బిరబిరా అభిముఖంగా వెళ్ళి గట్టిగా కౌగలించుకొని, "ఏం నాయనా! హృదయంలో యేదో గందరగోళం జరుగుతూ వున్నట్లుందే?" అన్నాడు ముఖంలోకి చూస్తూ.

"ఏమీ లేదు నాన్నా!" అన్నాడు మురళి. ఆ మాట యీనాడే అప్రయత్నంగా వెలువడిం దతని నోట్లోంచి. ఇది వరకంతా సన్యాసిరావును యేమనీ సంబోధించే వాడుకాడు, నాన్నా అనా లనిపించేది. అనలేకపోయేవాడు. 'నాన్నా' అనే శబ్దం యెప్పుడైతే సన్యాసిరావు చెవుల్లోకి సోకిందో - అది కర్ణపుటాల భేదించుకొని వెళ్ళి హృదయ కుహరంలో చొరబడి, అమృత బిందువుల చిందించింది. హృదయం ఆనంద ఝంఝూ మారుతంలో వురవళ్లు పరవళ్లు తొక్కింది. ఉబ్బిపోతూన్నహృదయానికివుపశమనంగాకొడుకును గట్టిగాకౌగలించుకొని, "నాన్నా నాన్నా" అనే శబ్దాన్ని తాను పునరుచ్చరిస్తూ, సోలిపోతున్నాడు. ఆనందాశ్రువులు మురళి శిరంపై వర్షిస్తున్నాడు. ఏదో పాత సంఘటన యుగయుగాల పూర్వం జరిగిన దొకటి తన హృదయంలో చొరబడి తీయటి బాధను కలిగించింది. మురళి కిది వరకటి లాంటి పుత్రతుల్య భావం పారిపోగా, అసలు పుత్ర భావం ప్రవేశించింది. అనిర్వచనీయమైన పితృ వాత్సల్యాన్ని ఆ పరిష్వంగంలో ప్రథమ పర్యాయంవలె అనుభవిస్తు న్నాడు.

కుషన్ కుర్చీలో కూర్చున్నాక, మురళి శిరాన్ని మూర్కొంటూ. సన్యాసిరా వన్నాడు: "నాన్నా! నీవు బ్రహ్మారావ్ కొడుకువుగా పెరిగావేకాని అతని సంతతి గాదని తెలుసు. ఆయన సంతతి ఒక సరళ మాత్రం. అయితే నీ విషయం తెలుసా?"

"నాకు తెలీదు. ఒకనాడు సరళే అది ఒక సందర్భంలో - "నీవు నా తండ్రికి పుట్టిన నా తమ్ముడివి కాదు. నా తమ్ముడివనే భావం నాలో యేనాడూ లేదు. ఒక పదునాలుగేండ్ల చక్కని పడుచట - గంజాంజిల్లా అట - నిన్ను గుంటూరు ఆసుపత్రిలో కన్నది. నిన్ను చూచి ఆమె విడిచిపోలేక, యిక దారిలేక, అపుడే క్రొత్తగా మిడ్‌వైఫ్ పనిలో ప్రవేశించి, ఆమెకు పురుడు పోసిన రాజామణి స్వాధీనం చేసిపోయింది. ఆ రాజామణి మన తలిదండ్రు

లకు గుంటూరులో విన్నిచ్చింది. ఆ విషయం రహస్యం. వారు నా కంటే విన్ను అనురాగంలో పెంచారు. నేను గూడా అతి అనురాగంతో విన్ను చూస్తూ వచ్చా అని అన్నది,'' అన్నాడు.

''అయితే, ఆమెలో నీవు తమ్ముడివనే భావం లేదందా?''

''అవును.''

''నీలో?''

''సోదరిభావం పరిపూర్ణంగా వుంది. నాలో ఆ భావం వుగ్గూ పాలతో ప్రవేశించింది.''

''అవును. చిన్నప్పటినుండీ ఏ భావం హృదయంలో పుట్టి పెరుగుతుందో ఆ భావమే చచ్చినంత వరకూ సాధారణంగా వుంటుంది. సరేగానీ ఆమె పేరేమిటో తెలీదా?''

''ఎవరు, నా తల్లా?''

''అవును.''

''నాకు తెలీదు.''

''ఆమె చెప్పలేదా?''

''చెప్పలేదు.''

''అయితే సరళకు తెలీదా?''

''తెలీదు. రాజామణికి తెలు సనుకుంటాను.''

''పోనీగానీ తర్వాత నీ తల్లి విషయం తెలిసిందా?''

''ఎవరికీ తెలీదు.''

ఇంతలో సరళ వచ్చింది. సన్యాసిరావుకు నమస్కారం చేసింది.

ఆమెను చూడగానే,''యేమక్కా! కాయా. పండా.'' అన్నాడు మురళి.

''ఏమీ లేదు మురళీ, సరైన వుద్యోగం దొరికే దారే కనిపించటం లేదు.''

''చూడూ సరళా! మీ ఇద్దరూ నా బిడ్డలు, చంపక వేరూ మీరు వేరూ కాదు నాకు. ఈ యింట్లో వుంటే నాకు సంతోషంగా వుంటుంది''

అన్నాడు సన్యాసిరావు. ఈ మాట వినేటప్పటికి ఇదివరకటి అభిమానం మురళి హృదయంలో చొరబడలేదు. తాను వేరనే భావం పోయింది.

సరళ మాత్రం అభిమానాన్ని పురస్కరించుకొని, "వద్దు బాబాయ్! మీ కా శ్రమక్కరలేదు. మేము మీ బిడ్డలమే అని మళ్ళా నేనుగూడా చెబుతున్నాను. మా పైన ఆ మాత్రం వాత్సల్య భావం వుంటే చాలు" అంటూ లేచి. "వస్తాం బాబాయ్, యీదారివ పోతూ, మురళి వుంటాడేమో - వుంటే పిలుచుకుపోదామూ-అని వచ్చాను. కాస్త పనివుంది. చూచుకోవాలి - "అని, "రా మురళీ!" అంటూ తని కండ్లల్లోకి చూచింది.

మంత్రముగ్ధుడుగాలేచి ఆమె ననుసరించాడతడు. ఉండుమని ఆదేశించడానికి అధికారంలేని తన మూర్తిని, అధికారంగల యెవరో లాక్కొని పోతున్నట్లుగా చూస్తూ అట్లాగే నిలబడ్డాడు సన్యాసిరావు.

సరళా మురళులు తమ బసచేరి, తాళం తీస్తూండగా, కారు ఆగిన శబ్ద వినిపించింది. ఇట్లా చూచేటప్పటికి చంపకా రుక్మిణులు కారు దిగి సంతో సంతో పరుగెత్తుతూ కనిపించారు. పరుగెత్తి సరళ చేతులు యిరువురూ పుచ్చుకొని, ఆమె కిరువైపులా నడుస్తూ, "అబ్బా! ఎంతసేపైంది మేము వచ్చి? యిక్కడికి వచ్చి చూచి, మీరు లేకపోగా బీచ్ రోడ్డున ఒక షికారు కొట్టి మళ్ళా వస్తున్నాం" అంటూ సరళతోపాటు స్నానాల గదిలోకి. నడిచారు. అందరూ ముఖాలు కడుక్కొని వచ్చారు ముందు గదిలోకి. మురళి కూర్చొనున్నాడుగానీ, ఏలాటి ముఖచిహ్నాలూ లేకుండా ప్రశాంతంగా వున్నాడు. అక్కడ రెండేరెండు కుర్చీలున్నాయ్, ఒక దాంట్లో మురళి కూర్చున్నాడు. ఇంకొక దాంట్లో ఆ యిరువురూ కలిపి సరళను కూర్చోబెట్టి యిరువైపులా కుర్చీచేతులపై కూర్చొని సరళ పైన పడిపోయారు.

"చంపక అంది: "అక్కా! ఉద్యోగం కత యేమైందే?"

"అబ్బా! దాంతో ప్రాణంపోతూ వుందే. వెధవ వుద్యోగాలు యేమీ దొరికేట్టుగా కవిపించడం లేదు. అందరూ ట్రెయినింగ్ చదవమంటారు. నేనూ చదవటానికి బయలుదేరే, చదవడు."

ఆ మాట అనేటప్పటికి మన యింట్లో వుండండి!అనే మాట చంపకా రుక్మిణుల హృదయాల్లో అహమహమికతో వుప్పతిల్లాయిగాని గొంతువరకూ వచ్చి నిల్చిపోయింది వుభయుల్లోనూ. ఇద్దరూ ఒకేసారి మురళివైపు చూశారు. అదే సమయంలో అతను యిద్దరివైపూ చూశాడు ప్రసన్నంగా. చంపకకు మురిపెం వచ్చింది. కూర్చున్న చోటునుండి లేచి, ప్రక్కనే మోకాటి తుండేసి కూర్చుని సరళ తొడపై యెడమ చేయివూని. చూడక్కా! అన్న బలే యేడ్పించా డీ దినం!'' అంటూ ఒక చింతానందమిశ్రితాశ్రువును దొర్లించింది. అదే ముఖభంగిమం రుక్మిణి గూడా పూనింది.

''ఏమిటే కతా?'' అంటూ చంపక నొసటను ముద్దాడి, సరిగ్గా కూర్చుని రుక్మిణి ప్రక్కకు అదుంకుంటూ, ''ఏమిటి మురళీ! నీవు ఆడవాళ్ళ యేడిపించే పని విరమించు కోవా యేంటి?'' అంది.

''చూడక్కా!అన్నకూ, అక్కకూ, చెల్లి యింట్లో వుండే అధికారం లేదూ? ఈ దినం రుక్మిణి పాపం! జారి మా యింట్లో వుండండి అంది ఎంతో వుత్సాహంతో, ప్రేమతో. దానికి మండిపడి, దాన్ని రెండు అని. ''చంపక గూడా యిట్లాగే అంటుంది,'' అంటూ బయలుదేరాడు లలిత గారింట్లోంచి. పిలిస్తే పలకలేదు! దారిలో కారు నిలిపి, 'కూర్చో అన్నయ్యా యింటికి వెళ దాం' అంటే గుడ్లురుమి చూచి, 'నేను రానుపో' అన్నాడు. 'చూడక్కా' అంది మురిపంగా.

''అదేమిటి మురళీ! చెల్లెని యేడ్పించవచ్చా?'' అంది సరళ.

''అవును. చెల్లెలి విషయమే చూచుకుంటున్నావు. పాపం! ఇవతలి వాళ్ళ యేడ్పించ వచ్చనేనా దాని కర్థం!'' అంది రుక్మిణి,

''కాదేబంగారూ'' అంటూ ఆమెను మళ్ళా ప్రక్కకు అదిమి' ''రుక్మిణి మంచిపిల్ల మురళీ. అట్లా కోప్పడితే మనస్సు బాధపడదూ?'. అంది మెత్తగా నవ్వుతూ.

''వీళ్ళందరికీ యిదొక పిచ్చిపట్టింది అక్కా! మనమేదో బిక్ష మెత్తుతూ వున్నట్లుగా, మా యింట్లో వుండగూడదా, మా యింట్లో వుండగూడదా

ముష్టికి - అంటారు. ఎంతోమంది అన్నం లేకా దిక్కులేకా చస్తూ వుంటే వాళ్ళ ముఖంగూడా చూడరు. ఉన్నవాళ్ళకు పెట్టేరకం వీరంతా. ఈ చంప మరీ బిచ్చగాళ్ళకు బిచ్చమెయ్యదు'' అన్నాడు మురళి నవ్వుతూ.

''చూడక్కా! నేనూ, రుక్మిణి, రోజా కుష్టురోగులగూ, కుంటి, గుడ్డి యిట్లాంటి సంపాయించుకోలేని వాళ్ళకూ వేస్తూవుంటాం. ఆయన మాదిరిగా దొంగవెధవల కంతా యివ్వమని నేరం మోపుతున్నాడు.''

''ఔనౌను! శిబిచక్రవర్తి - జీమూతవాహనుడూ - ఆడజన్మ యెత్తారిపుడు'' అని నవ్వాడు యేడ్పిందే ధోరణిలో.

''చూడక్కా!'' అంటూ మురిపెంగా అని సరళ తొడపై వాలింది చంపక,

రుక్మిణి వైపు సరిగ్గా చూడనే లేదతడు. రుక్మిణిపై నిజంగా కోపం వున్నది, చంపక ఆ విధంగా పిలవవచ్చు. ఆమె యింట్లో వుండడానికి తనకు అధికారంగూడా వుంది. అయితే రుక్మిణి అట్లా యెందుకనాలి అనే అభిమానం యింకావుం దతనిలో. ఆ విషయం రుక్మిణి గ్రహించి, ''నాపైన కోపం పోయినట్లుంది'' అంది చిరునవ్వుతో.

అతనిటు చూడకుండానే, ''అవును. అట్లా అడగడానికి నీకేమీ అధికారము లేదు'' అన్నాడు.

'ప్రేమించడానికి అధికారం యిచ్చినవాళ్లే అట్లా ఆహ్వానించడానికి గూడా యిచ్చారు' అనే భావం గొంతువరకూ వచ్చింది గానీ, అది భావంగానే వుండిపోయింది.

తటాలున లేచింది సరళ వాళ్ళపట్టుకొనే. ''ఇక అన్నం చేసుకోవాలి రుక్మిణీ!'' అని క్షణంసేపుండి, ''చంపా? నీవూ, రుక్మిణీ ఈపూట యిక్కడుండ కూడదూ!'' అంది.

''నాన్న చూస్తూ వుంటా డక్కా నా కోసం.''

''అక్క వుండమందని ఫోనుచేస్తే?''

''నాన్న ఒప్పుకుంటా డనడానికి సందేహం లేదుగాని, రుక్మిణి విషయమో!''

"నాతోగూడా వుంటుం దీదినం అని నీవు ఫోను చెయ్య చంపా" అంది

రాత్రి లోకాభిరామాయణం చాలాసేపు మాట్లాడుకున్నాక మురళి తన గదిలో పడుకొన్నాడు. వీళ్లు ముగ్గురూ యింకొక గదిలో పడుకొన్నారు. గడియారం వరసగా 11, 12, 1 కొడ్తూపోతూవుంది. అవన్నీ లెక్క పెట్టుకుంటూ పడుకొంది రుక్మిణి. ఏవేవో భావాలూ, వాటివలన భయమూ, హృదయాన్ని ఆక్రమిస్తున్నాయి. గుండెల్లో దడ, దాని వలన చిరుచెమటలూ, ఎడ తెగకుండా పుడ్తున్నాయి. ఏదేదో ఆలోచించి, యేదో ఒక నిర్ధారణకు వచ్చినట్లుగా లేచింది. శరీరమంతా నీరసంగా వుంది. కాళ్లు పదుర్తున్నాయి. రెండడుగులు ముందుకేసి, మురళి గది గుమ్మం దగ్గర నిలబడింది. 'నేను చేస్తున్న యీపని మంచిదేనా? అతను యేమంటాడో! వీళ్లు కనుక్కొంటే నా గతేమిటి?' అనుకొని వెనక్కు తిరిగింది. మళ్ళా లోపల యేదో ఒక ఆశాశక్తి తనని ఆపింది. అతన్ని క్షమాపణ వేడుకొని సుముఖుణ్ణి చేసికొని, పైన పరిణయ మాడడానికి ఒక గడువును నిర్ణయించుకోడానికి యిదే అదననుకొంది. పెండ్లాడ్తానని చెప్పిన వ్యక్తి దగ్గిరికి వెళ్ళడానికి యింత భయమెందుకూ? ఇతరులు రేపు పెండ్లి అయ్యేనాడు మాత్రం చూడరూ' అనుకొంది. ఆలసిస్తే దక్కదేమో అన్న భయంచేతా - తక్షణం వివాహం కాకపోతే ఈ వ్యక్తికి దూరంగా వుండలేననే భావలౌల్యంచేతా - యీ కోపాన్ని అట్లాగే వుంచితే తాను ఉపేక్షించి అతనికోసం ప్రాకులాడ్తూవున్న వాళ్ళను చేసుకుంటాడేమో అన్న భయం చేతా - ఆవరించిన ఆమె మనసు అతని గదిలో ప్రవేశించేందుకు ప్రోత్సహించింది. మురళి బాగా నిద్రపోతున్నాడు. మంచం ప్రక్క నిలబడింది. ఏమి చేయటానికీ తోచలేదు. గుండెలు చాలా తీవ్రంగా కొట్టుకొంటున్నాయి. గొంతూ - నాలుకా ఆరిపోయినట్లుగా వున్నది. ఊపిరిగూడా ధారాళంగా రావటంలేదు. స్త్రీ సహజత్వానికి విరుద్ధమైన పని చేయడానికి సాహసించిన ఆమె, మళ్ళా వెనక్కి తిరిగింది. ముందూ పోవడానికి కాళ్లాడలేదు. అతన్ని లేపే సాహసం కనిపించడం లేదు. ఎట్లాగో ప్రక్కన కూర్చొంది, భయపడుతూ, పదురుతూ వున్న చేతులను అతని

భుజంపై; వేసి కదిలించింది. అవి శాకడంతోనే తృళ్ళిపడి లేచినట్లుగా, "ఎవరు?" అన్నాడు మురళి. ఆ హుంషారు ఎక్కణ్ణుంచొచ్చిందోగాని, ఆ శబ్దాన్ని అతని నోట్లోనే నొక్కేసి, "నేను; రుక్మిణిని;" అంది చెవిలో. లేచి బాగా కూర్చున్నాడు. ఆమె ప్రక్కన కూర్చుంది.

# 16

సీత కిపుడు ఆరోనెల గర్భం. అందరూ యెరిగిన వూళ్లో అవమాన భారంతో బ్రతకడం ఆమెకు చాలా కష్టమైంది. బెజవాడ వదలి అక్కా చెల్లెళ్ళిద్దరూ గూడూరు బాలికల హైస్కూల్లో టీచర్లుగా చేరారు. వాళ్ళు బెజవాడ వదలడానికి సత్యారావు చాలవరకూ, క్రిష్ణయ్య కొంతవరకు కారకులు.

బెజవాడలో ఒకనాడు:

క్రిష్ణయ్య వచ్చాడు. సీత కప్పటికి నిండుగా మూడునెలలు. అయితే గర్భం ధరించి వుందని యెవరూ అనుకోలేరు. లక్ష్మి వివాహ విషయంలో వాదించి కడకు చేసుకోబోవడం లేదని గట్టిగా చెప్పగా - మురళి సీతను వది లేశాడనే భావంతో - క్రిష్ణయ్య సీతపైకి దృష్టి పోనిచ్చాడు. ప్రస్తుతం సీత విషయంలో సంపూర్ణ వైముఖ్యాన్ని వహించిన మురళికీ - సీతకూ - పూర్వం సంబంధం కలిగిందనే విషయం క్రిష్ణయ్య వూహించనుగూడా లేదు. సీత యిపుడు మరింత అందంగా కనబడ్తూ వుంది. వివాహమాడదా మనే అభి ప్రాయం అంతగా లేకున్నా-అనుభవించాలనే ఆశ కలిగిం దతనిలో. అంచేత ఒకనాడు మట్లాడ్తూ, సీతతో ఆ విషయం చూచాయగా అన్నాడు.

"అది చాలా అధర్మం క్రిష్ణయ్యా?" అంది సీత.

"అధర్మం ఎట్లా అవుతుందీ? వివాహమే అధర్మ మంటావా ఏమిటీ?"

"మురళి నీ స్నేహితుడు. నీ స్నేహితుని భార్య నీకు తోబుట్టుతోవు తమ్మానం."

"అదొక ఆదర్శపు వలుకు సీతా! సోదరి అనే భావం హృదయంలో కలగాలిగా."

"అదొక ధర్మంగానన్నా ప్రవేశపెట్టుకోవాలి."

"ప్రవేశపెట్టుకొన్న భావం యెంత భద్రంగా వుంటుందో నీకు తెల్సుగా."

"దానిపైన గౌరవమూ - వుండాలనే పట్టుదలా - వుంటే వుంటుంది."

"అంత అవసరమూ - అంత కష్టమూ ఎందుకూ?"

సీతకు కాస్త వెగటు వేసింది. విసుగును ప్రదర్శిస్తూ, "తర్క మెందు కిపుడూ? ఇంతగా తర్కించ వలసిన విషయం కాదిది." అంటూ లోపలి గదిలోకి పోయింది. లక్ష్మి అంతవరకూ యేమీ మాట్లాడలేదు.

సీత లోపలి కెళ్ళిం తర్వాత అంది:

"మీ మగవాళ్లు అంత తేలిగ్గా వూహిస్తా రెందుకు క్రిష్ణయ్యా! కామా నికి గూడా హద్దు వుండాలి. వివాహ మన్నది ఎంత పవిత్ర విషయమో - నీ ప్రయత్నంలో అది అంత అపవిత్రంగా కనబడుతూ వుంది. చేసుకోబోయే వ్యక్తిని ఆ మరణాంతం ప్రేమించే స్థితిలో వున్నపుడే పెండ్లాడాలి. నీవు సీతను ఆ విధంగా ప్రేమించలేవని నాకేగాదు - నీ అంతరాత్మకుగూడా తెలుసు. దాని అందాన్ని తనివిదీరా అనుభవించే నూత్నదినాల్లో గాక పోయినా - అది తగ్గిన కొన్నాళ్ళకైనా - ఒకప్పుడు మురళిని ప్రేమించిన సీత అని నీవు జ్ఞప్తికి తెచ్చుకోక పోవు. అపుడు యేవగించుకొని విడిచిపెట్టక మానవు."

"అది అసంభవం. అట్లా ఎందరు, ఎందర్ని అంతరంగికంగానూ - బహిరంగంగానూ ప్రేమించి వుంటారో అట్టి వాళ్ళను వివాహమాడి ప్రేమిం చడం లేదా - అని అంటావేమో! అది వేరు. అది - పరస్పరం, లోపాలు తెలిసిగూడా వాటిని ఉపేక్షించి ప్రేమించుకొనే వాళ్ళకే చెల్లుతుంది. ఆ మర ణాంతమూ సుఖపడ గలమనే ధైర్య మున్నపుడే అట్టి వివాహాలు జరుగు తాయి. నీలో అట్టి భావం లేదు. అంత ఔదార్యం నీకు లేదు. మన స్థిమితమూ

లేదు. అది నాకు బాగా తెలుసు. నన్ను ప్రేమించా నన్నావు. సరళను ప్రేమించా నన్నావు. సీతను ప్రేమించా నంటున్నావు. మరెవర్నో యిక ప్రేమిస్తావు! ఏదీ? నీ ప్రేమకు స్థైమిత్యం ఏదీ? - చాలు క్రిష్ణయ్యా! మీ మగ వారికి అవకాశాలు ఎక్కువ. సంఘం మీకు చాలా చట్టాలను సుముఖంగా వుండేటట్లు చేసింది. మీ రేది చేసినా చెల్లుతుంది. అన్ని అవకాశాలు వున్నాయి గదా అని మీరు విచ్చలవిడిగా యిల్లా చేస్తారు. పైగా, స్త్రీ జాతినిగూడా అధఃపతనంలోకి యీడుస్తారు.''

క్రిష్ణయ్య యేమీ మాట్లాడలేదు, కాసేపుండి వెళ్లిపోయాడు.

మరునాడే, వాళ్లు పనిచేస్తున్న బడి గోడలకే, కొన్ని కాగితాలు అంటించి వున్నారు. సీత - మూడు నెలలు అని పెద్ద అక్షరాలతో వ్రాసివుంది. కొన్ని వ్యంగ్య చిత్రాలు గూడా వేసి వున్నాయ్. అవి చూచిన తర్వాత సీతకు ఆత్మహత్య చేసుకొనే పర్యంతం అయింది. ఆ మరునాడు స్కూలుకుపోలేదు. భోజనం చేయలేదు. సాయంకాలం లక్ష్మి బలవంతాన కాస్త తినిపించి పడుకో బెట్టి, ప్రక్కన కూర్చొని చేతిని నిమురుతూ, యేదో ఆలోచిస్తూ వుంది.

సీత కన్నీరు కారుస్తూ ''ఎంత పవిత్రంగా బ్రదుకుదా మనుకున్నా వీలుపడకుండా వుంది గదక్కా యీ సంఘంలో!'' అంది.

''ఔను తల్లీ! ఈ సంఘం యింత దౌర్భాగ్య స్థితిలో వుంది, అసలు సంబంధం - అందులో భావం - ఎవరికీ అక్కర్లేదు. ఏదో వాగేస్తారు.''

''సత్యారావుగాడే దీనికంతా కారకుడు. క్రిష్ణయ్యకూ నాకూ అంట గట్టాడు.

''తమ కపి తీర్చుకోడానికి యెంత నీచత్వానికైనా పాల్పడతారు ప్రస్తుత మన యువకులు.''

''అసలు సత్యాన్ని ప్రకటిస్తే నాకూ అంత బాధ లేదక్కా. అసత్య ప్రకటన వల్లనే నా హృదయం మరీ దుఃఖిస్తుంది.''

''సత్యం యెవరికీ రుచించదు తల్లీ! అసత్య ప్రచారమే చాలా సొంపుగా. స్వీకార్యమాణంగా వుంటుంది. ప్రజలు దాన్నే విశ్వసిస్తారు. అది

అబద్ధమేమోనన్న ధ్యాసగూడా వుండ దెవరికీ - వాళ్ళకే. బాగానే చేసి వుంటారు. కులమా సీతా! అందులో సంతులమ్మ పని చేసేవాళ్ళకూ - వర్కు పనిచేసేవాళ్ళకూ ఒక దేమిటి? అని యింకా అసహ్యంగా భావించడమేగాదు- పబ్లిగ్గా అంటూ వుంటే విన్నాం గూడా.''

''ఛీ! ఛీ! సంఘానికి వుపయుక్తులైన వారిపైన్నే యింత కృతఘ్నత చూపుతుందీ లోకం! ఇన్ని కుటుంబాలు చూస్తున్నాం గదా, ఆ స్త్రీలు యెట్లా చేస్తున్నది మనకు తెలీదూ?''

''అది లెక్కలేదు. వాళ్లు వివాహితలూ-సంసారులూ - కాబట్టి వాళ్ళకట్లాంటి చేష్టలు అవసరం లేదని వీళ్ళ భావం. ఒకవేళ బయటబడినా, గుట్టుగా వుంచేస్తారు. మనబోటి వారంతా అవసరంకొద్దీ తప్పనిసరిగా చేస్తామని వాళ్లు భావిస్తారు. మనబోటివారి విషయమై యేదైనా విన్నపుడు. 'అదేం మాటరా?' అని యెవడూ అనడు, యితర్ల విషయంలోవలె. 'ఓ! సందేహమేం! తప్పక చేసే వుంటుంది,' అనే అంటారు. కొంతమంది 'పాపం! వాళ్ళకు భర్తలా పాడా' అని జాలి జూపుతారు.''

''కావచ్చు. ఆ భావంతోనే వాళ్లు నెట్టుక పోతున్నారు సంఘాన్ని ముందుకు.''

''అవును, ఆ భావమే వారికి తృప్తి నిస్తున్నది.''

కాసేపు సీత యేమీ మాట్లాడలేదు. లక్ష్మి తీవ్రంగా యేదో ఆలోచిస్తూన్నట్లుంది.

సీత జరిగి లక్ష్మి తొడలపై తలపెట్టి, ''అక్కా! యీ సంఘంలో నిజంగా నాకుండాలని లేదే. ఒకరూ విషయాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేరూ'' అంది.

''అంతే?''

''…. …. …. ….''

''పిరికిదానా! యీ పరిస్థితి పురుషుడికే కల్గిందనుకో. వాడు తలెత్తుకొని తిరగడం లేదూ? ఇపుడు మురళి దర్జాగా వుండటంలేదూ? మానావమానాలూ -

నీచ గౌరవాలా - స్త్రీ పురుషులకు సమానం అని విశ్వసించే మనం పురుష అత్యాచారానికి జంకడ మెందుకూ?''

''జంకకపోతే?''

''అవును. అవమానం అనిగదా అంటావు! అది స్త్రీకే ఎందు కుండాలి? అందుకు సగమైనా కారణభూతుడైన పురుషుడికి యెందు కుండ కూడదూ?''

''ఉండాలి - ఉండగూడదు - అన్న విషయం యిప్ప దెందుకూ? ప్రస్తుత సంఘంలో లేదు. ప్రస్తుత సంఘంలో స్త్రీనే నీచంగా చూస్తారు.''

''పురుషుణ్ణిగూడా చూచేటట్లు చెయ్యాలి.''

''ఆ భావం మారాలంటే మన ఒక్కరివల్ల అవుతుందా, కేవలం బలి కావడం తప్ప?''

''అవును స్త్రీ కొక న్యాయం, పురుషుని కొక న్యాయం వున్న యీ సంఘంలో అంతే. ఒకే తప్పు చేసినపుడు స్త్రీనీ - పురుషుణ్ణీ - ఒకే న్యాయంతో పరిశీలించడం - శిక్షించడం - అలవర్చుకున్నపుడే సంఘం బాగుపడుతుంది. బలి విషయం అంటావా - మార్పుకు అది అవసరం.''

సీత ఆలోచిస్తూ పడుకొంది. లక్ష్మి యీ విధంగా మాట్లాడుకుంటూ పోగలదు. ఆదర్శాల చర్చిస్తూ - సంఘంలోని కుళ్లును తూర్పారపట్టగలదు. సీతకు మాత్రం బాధగా వుంది. పురుషుడు వ్యభిచరిస్తాడుగాని బయటికి దాని చిన్నెలు కనబడవు. స్త్రీకి అట్లాగాదు. తప్పు ఒకనాటిదే అయినా, దిన దిన ప్రవర్థమానమై, ప్రజాబాహుళ్యానికి దాని చిన్నెలు ప్రదర్శిస్తుంది. ఇక ఆ చిన్నెలు కనబడకుండా చెయ్యాలంటే, భ్రూణహత్యచేసి, సత్యాన్ని మరుగు పరచడానికి వృధాగా ప్రయత్నించాల్సిందే. భ్రూణహత్య విషయం అనుకు న్నపుడల్లా, సీతకు సర్వాంగాలు కంపించేవి. అంతరాత్మ యెదురు తిరిగేది.

రోజులు జరిగేకొద్దీ సత్యారావు దౌష్ట్యాలు ఎక్కువయ్యాయి. వాళ్ళ యింటిపైన రాళ్లు రువ్వించాడు. ఇంటిముందు కుండలేయించాడు వాళ్ళ. నెంత అవమానపరచాలో అన్నివిధాలా అవమానపరిచాడు. కడకు వారి కక్క

దుండటం అవమానకరమే గాకుండా - అసహనంగూడా అయ్యింది. కడకు గూడూరికి వెళ్ళారు.

గూడూరిలో అందరూ సీతకు వివాహమైనదనే అనుకోసాగారు. ఇప్పడామెకు ఏడోనెల. నెలలు జరిగేకొద్దీ, ఆమె మనోవ్యధ పెరుగజొచ్చింది.

# 17

సరళ వుద్యోగ ప్రయత్నం మానివేసి నాలుగు నెలలకు మించింది. మళ్ళా యం. యె. చదవడం మొదలుపెట్టింది. దానికి కారణం మురళీ చంపక. ఆమెకు ఉద్యోగం దొరకక పోవడం అట్లా వుండగా, మురళి M. A. పూర్తికానిమ్మని కూర్చున్నాడు. ధనాభావం కనిపిస్తూ వున్నా, ఉద్యోగంపై నిరసనవల్ల అతనట్లా అంటున్నాడు. చంపకకు, మురళీ సరళలు తన యింటి నుండి ఒకదమ్మిడీ అయినా తాకుతారనే నమ్మకం లేకున్నా యెట్లాగో వాళ్ళ చదువులు సాగి తీరాలనే సంకల్పం వుంది. అందుచేత అనుదినమూ సరళను చదువుకు ప్రోత్సహించేది. రుక్మిణి యేమనడానికీ అధికారం లేనిదాని మాదిరిగా లోలోపల, వాళ్ళకు, ప్రాణమైనా ధారబోయాలనే త్యాగాన్ని పెంపొందించుకొంటూ, చంపక పలికిన ప్రోత్సాహపు పలుకులకల్లా తాళంవేస్తూ కూర్చుంది. మొత్తానికి యేమీ తోచక చదువు సాగించడానికి మొదలుపెట్టింది సరళ. సరళ మళ్ళా క్లాసుకు పోవడం మొదలుపెట్టేనాడంది, చంపకా రుక్మిణులతో:

"అమ్మాయ్! చూడండి! యేనాడుకూడా, మేం తిండిలేక చస్తున్నాం అని తెలిసినాకూడా, 'అక్కా ఇది తీసికో, అది తీసికో' అనగూడదు. అట్లా అయితేనే - మా కష్టాల మమ్ముల పడనిస్తాం అని మీరు అంటేనే - చదువు సాగిస్తా," అంది.

దానికి కట్టుబడా ల్సొచ్చింది వాళ్లు. కాబట్టే, సరళ మెడలోని గొలుసూ, గడియారం, మురళి బంగారు గొలుసుతోడి గడియారం, వ్రేళ్ళ

లోని రెండుంగరాలూ, అమ్మగా లభించిన డబ్బంతా అయిపోగా, అవస్థపడ్తూ వుంటే చూస్తూగూడా, ఏమీ అనడానికి సాహసించ లేకపోయారు వీళ్ళు.

ఒకనాడు మురళి చాలా డస్సి, లలిత యింటి కొచ్చాడు. అంతకు ముందు చాలా నాళ్ళుగా మురళి లలిత యింటికి రాలేదు. అంతకు ముందునాడు లలిత చెప్పింది తప్పక రమ్మని. వెళ్ళాడు. అప్పటికి లలిత గదిలో వంటరిగా కూర్చుని మురళిని గురించి యోజిస్తూ వుంది. 'ఈ పిల్లవాడి విషయమే నాకు అయోమయంగా వుంది. ముఖధోరణి చూ స్తే సన్యాసిరావు మాదిరే వున్నాడు- ఛీ? ఏంటీ ఆలోచన, నా కొడు కెక్కడ! ఇత నెక్కడ! ఇట్లాంటి ఆలోచన లెందుకు?' - ఇట్లా అనుకుంటూ వుండగా మురళి వచ్చాడు. చూడగానే నెమ్మదిగా. ప్రక్క కుర్చీ చూపి కూర్చోమంది. అతను కూర్చున్నాడు. ఇద్దరూ కాసేపు మౌనం వహించారు. కొంతసేపయ్యాక—

"ఇటీవల కనబడలేదే: మురళీ!" అంది లలిత,

"తీరికలేకుండా చదువుతున్నావా?"

"ఎందుకు పిలిపించానో తెలుసా?"

"ఏదో పని వుంటుంది."

"ఔను! పనివుండే రమ్మన్నాను. నీతో మాట్లాడవల్సి వుంది. నీవు కొన్నాళ్ళుగా యిక్కడికి రావడంలేదు. కారణం నేను కనిపెట్టక పోలేదు. నీకు చిన్న హెచ్చరి కివ్వడానికే నే నీ దినం నిన్ను రమ్మంది. ప్రస్తుతం నీవు చేస్తున్న సావాసం మంచిది కాదు, అంత విచ్చలవిడిగా తిరగగూడదు. వైద్యకళాశాల్లో స్త్రీ పురుషుల కలయికకు యెక్కువ అవకాశం వుంటుంది. అంతమాత్రాన అవకాశాన్ని దుర్వినియోగం చేసికొని నైతికానికి పాతాన్ని ఆపాదించుకోగూడదు. నీ హృదయం కంటే, నీ శారీరక సౌందర్యం నీకు శత్రువై పోతున్నది. ఆ పిల్లలు నిన్ను ప్రేమించి వెంటబడకపోతే - వాళ్ళను ప్రేమించాలనుకున్న పిల్లవాళ్ళకు నీవు విరోధివి కాకుండా పోయేవాడవు,

సరేగానీ - విజయసింహా, నిరంజన, నిన్ను కొట్టాలని ఆనాడు చాలాదూరం నిన్ను కాచి తిరిగారట. ఎందుకో చెప్పు?''

ఈ మాటలు వినేటప్పటికి మురళికి చాలా ఆశ్చర్యం వేసింది. అది చాలా రహస్యంగా జరిగిపోయిన విషయం. ఎవరికీ తెలియదనుకున్నా డితను. తన విషయంలో యెంతో జాగ్రత్త వహించి ప్రతి నిముషమూ కంటికి రెప్ప వలె కాచే వ్యక్తిలాగా కనిపించిం దామె అతని కిపుడు.

''అది మీకెట్టా తెలుసూ?'' అన్నాడు నోరు తెరచి.

''తెలియకనే నిన్నడగడం. ఆశ్చర్యపడాల్సిన పనేమీ లేదు. చెప్పు.''

"జానకి, కృష్ణవేణి, నాతో పరిచయం కలగజేసికొని మాట్లాడడం ఎక్కువైంది! విజయసింహా నిరంజన్లుగూడా నా కెక్కువ స్నేహితులుగా వుండేవారు. వారి రహస్యాలు అడగకున్నా నాకు చెబుతూ వుండేవారు. చాలా సర్దాగా వుండేవారం. వాళ్ళు జానకినీ, క్రిష్ణవేణినీ ప్రేమించినట్లుగా నాకు చెబుతూ వుండేవారు. ఆ పిల్లలు మాత్రం నాతో పరిహాసాలు సాగించడం మొదలు పెట్టారు రానురానూ. తర్వాత జాబులు వ్రాసేవారు నన్ను ప్రేమించినట్లుగా, నాకు నిజంగా కామ విషయంలో బలహీనత వుంది. అయినా వాళ్ళను మాత్రం కామించలేదు, వాళ్లు నిజంగా నా ప్రాణం తీసేశారు ఒకరికి తెలీకుండా ఒకరు. నేను మామూలుగా వంటరిగా బయల్దేరి పోతూ వుండేవాణ్ణి నడిచి. వాళ్ళు యెట్లా కనిపెట్టేవారో నా వెంట తగిలేవారు. అయితే ఒకరు వస్తూ వుంటే మరొకరు రారు. నా విషయమై వాళ్ళకు తగాదా గూడా వచ్చిందట యిటీవల. నన్ను పెండ్లి చేసికొమ్మని కూర్చుంటే నేనేమి చేసేది? కాదన్నాను. కడపటికి వారి కడసారి కోరికైనా తీర్చమన్నారు.'' అంటూ కొంచెం సిగ్గుతో తల వంచుకున్నాడు.

''ఆఁ!'' అంది లలిత.

''ఔను. అది స్త్రీ పురుషుల్లో సాధారణమే. వివాహం చేసుకోలేమని అనుకున్నపుడు ఆ విధంగానైనా చేద్దామనుకుంటారు.''

''అందర్లోనూ కాదనుకుంటా.''

"అందర్లోనూ కొతవోవచ్చు. నైతికశక్తి ప్రాబల్యం చాలామందిలో వుండదు. ఒక్కొక్క సమయంలో స్త్రీలు పురుషుల్ని యిటువంటి నైచ్యానికి పురికొల్పిన ఉదాహరణ లున్నాయి."

"అసలు నీవే ఉదాహరణంగా కనిపిస్తున్నావుగా - అయినా ఇది చాలా నీచం."

"నీచమేః అయితే వయో ప్రాబల్యం వల్ల అట్లాంటి పనికి ప్రబోధితు లౌతారు."

"అయితే యేమైంది తర్వాతః" అంది లలిత నిరుత్సాహంగా.

"ఏమైందీ," అని కాస్త అనుమానించాడు మురళి.

"తప్పు చేస్తారు చాలామంది. పొరపాటువల్ల చాలా జరుగుతాయి. అయితే ఆ తప్పును కప్పి పుచ్చడానికి అబద్ధమాడి ఆ తప్పును ద్విగుణీ కృతం చేయగూడదు."

బాగా తగిలిందది దెబ్బలాగా మురళికి. ఆమె చూపులు సూదుల్లాగా వాని కండ్లల్లోకి జొరబడి హృదయంలోకి దూరి, కొక్కెములై, వాని హృదయ మర్మాన్ని బయటికి చేపల లాగినట్లు లాగుతున్నాయి. మురళి చప్పున తలవంచుకున్నాడు.

"అయితే అంత స్థితికి పాల్పడ్డావన్నమాటః" అంది తల వూస్తూ నిరుత్సాహంగా.

అస్పష్టంగా గొణిగాడు మురళి తలవంచుకొనే.

".... .... .... ...."

లలితకు కోపమూ, దుఃఖమూ పెనవేసికొని వచ్చాయి. కన్నీరుగూడా తోసుకవస్తున్నది. ఇక అక్కడ వుండలేక లోపలి కెళ్ళిపోయింది. కాసే పటికి అంతా దిగమింగి కాస్త పొలువట్టుకొని వచ్చింది చిరునవ్వుతో.

"మీ కోపం తగ్గిందాః" అన్నాడు మురళి.

"తగ్గింది. ఇది తాగితే యింకా తగ్గిపోతుంది."

"నేను కాళ్ళూ ముఖమూ కడుక్కోవాలి" అంటూ లోపలి కెళ్ళాడు.

తరుక్కొని మళ్ళా గదిలోకి వచ్చి పంట్లాం జేబులో చెయ్యిపెట్టాడు జేబు రుమాలు కోసం. అసలుంటేగా! అక్కడ టవలుగూడా లేదు. తర్వాత అటు మళ్ళీ తటాలున పంట్లాం లోపలికి చెక్కివున్న చొక్కాను లాగి ముఖం తుడుచుకోబోయాడు. సబ్బుపెట్టెను సద్ది వచ్చిన లలిత "ఆగు." అంటూ తనకోసం భుజంపై వేసుకొచ్చిన టవలందించింది. ఒక చేత్తో అది అందు కొంటూ, మరొక చేత్తో చొక్కా లోపలికి దోపుకుంటున్నాడు. చొక్కా వెనుక భాగంలో చాలా పొడుగున చినిగిపోయి వుంది. తొందరలో జ్ఞాపకం లేక భద్రంగా చెక్కడం మరచిపోయాడు. లోపలికి చెక్కినా, యింకా కాస్త చినుగు బాగా కనిపిస్తూ వుంది. లలిత అటువైపే చూస్తూంది. అది గ్రహించి సిగ్గుపడుతూ, ఆదరా బాదరా సర్దాడు. బట్టలుగూడా కాస్త మాపి నలిగి వున్నాయి. మనిషిగూడా డస్సి ఒక విధంగా కనిపిస్తున్నాడు. లలిత అతని వైపూ అతని గుడ్డల వైపూ శూన్యంగా చూస్తూనే వుంది. ఆమెకంతా తెలుసు యిటీవలి పరిస్థితులు. అయితే యిన్నాళ్లుగా యితను కనిపించలేదు. ఇతని వైపున్న కోపం వుపేక్ష వహించేటట్లు గూడా చేసింది.

"మురళీ! నీవు యిక్కడే యెందు కుండకూడదూ?" అంది ముఖం లోనూ. చూపుల్లోనూ మమత వుట్టిపడుతూ వుండగా.

"ఎందు కుండకూడదు?" అన్నాడు అదే భావాన్ని ప్రకటిస్తూ.

"వుంటావా?" అంటూ కుర్చీ దగ్గిరగా లాక్కొంది.

"వుంటాను. అయితే యే బాంధవ్యంతో?"

"ఈ బాంధవ్యంతోనే" అని చిరునవ్వు నవ్వింది లలిత.

"ఫలానా అని తేలని బాంధ్యంతోనా?"

ఇంతలోనే క్రింద లలితను పిలిచిన శబ్దం వినిపించింది. "నే వస్తా" నంటూ లేచాడు మురళి. "వుండు" అంది లలిత.

"నో! నో? వెళ్తా" అంటూ లేచాడు.

"రేపు వస్తావా?"

"చూస్తా."

"చూస్తాకాదు. తప్పక రావాలి. నీ కోసం ఫోంచేయకుండా కనిపెట్టు కొని వుంటాను. రేపు ఆదివారంగా."

మురళి మెట్లు దిగుతూ వుండగా రుక్మిణి యెక్కి వస్తూ వుంది-వాళ్ళ తల్లితో. మురళిని చూడగానే అప్రయత్నంగానే సిగ్గు ఆవరించింది.

"ఏం నాయనా!తర్వాత ఒక మాటన్నా రాలేదు మా యింటికి!"అంది రుక్మిణి తల్లి.

"తీరిక లేదండీ-వస్తా" అంటూ నమస్కారం చేసి గబగబా దిగి పోయాడు బరువుగా అడుగులేస్తూ.

రుక్మిణి పైకెక్కింది తల్లికంటే ముందే గదిలో ప్రవేశించి, కుర్చీ సర్దుతూవున్న లలిత నుద్దేశించి: - "మీకు చెప్పానుగా మా అమ్మను తీసు కొస్తానని, ఆమె వచ్చింది," అంది.

"ఏదీ రమ్మను లోపలికి" అని "రండీ" అంటూ కుర్చీవైపు చేయి చాపింది. రుక్మిణి తల్లి గదిలో అడుగు పెట్టేటప్పటికి తలెత్తి చూచిన లలిత నిశ్చేష్టురాలై నిలబడింది. కనుగ్రుడ్లు గానీ, రెప్పలుగానీ, కాళ్ళుగానీ కదలనే లేదు. రుక్మిణి తల్లి గూడా ఒక రాతి బొమ్మలాగా నిలబడింది. ఉచ్ఛ్వాస నిశ్వాసలు గూడా మందంగా, ధ్వని రహితాలుగా సాగుతున్నాయి, యిరువురి లోనూ. వీళ్ళిద్దరి ధ్రమానుపాటు చూస్తూ రుక్మిణి ఒక అచేతనపు రబ్బరు బొమ్మలాగా నిలబడింది నోరు తెరచుకొని. లలితా కాస్త సమాళించుకొని "కూర్చో" అని మళ్ళా నాలుక కరచుకొని "కూర్చోండీ" అని అటువైపు కాస్త ప్రక్కగా తిరిగి గోడవైపు తీక్ష్ణ దృక్కులు బరిపింది. ఆ చూపులు భావకిరణములుగా బయల్దేరి ఆకస్మికంగా ఒక్కొక్క సంవత్సరాన్నే అధిగ మిస్తూ, గత స్మృతిని అన్వేషిస్తూ పోతూవున్నాయి.

"ఈమె నా చెల్లి సుందరేనా?" అనుకొంది హీనస్వరంతో తనలో తాననుకొన్నట్లు. సుందరమ్మ లేచి "అవును నీవు వకుళవు గాదూ?" అంది భావావేశంతో.

"అక్కా! సుందరీ!" అంటూ గట్టిగా కౌగలించుకొంది లలిత.

ఆ కౌగిలిలో కాలం ఒకమారు వెనక్కి గిర్రున తిరిగింది. ఎన్నెన్నో విషయాలు యిరువురికీ జ్ఞాపకం వచ్చాయి. అంత చ్ఛతువుతో అవన్నీ తల కిస్తూ వున్నారు. హృద్వేగం వదలేటప్పటికి కౌగిలి వదిలింది. కౌగిలి వదలుతూ, "అక్కా! నీవు పారిపోయిన నాడెట్లా వున్నావో ఈనాడూ అట్లాగే వున్నావు" అంది సుందరమ్మ ఆనందబాష్ప బింకా రాలుస్తూనే.

"ఔను. వయ స్తంభన విద్య తెలుసు నాకు," అంది చిరునవ్వుతో. ఇదంతా చూస్తూవున్న రుక్మిణికి యెంతో ఆశ్చర్యంగా వుంది. అయోమయం గానూ, అనవగాహనంగానూ వుంది. అంత హఠాత్సంఘటన, అంత ఆకస్మి కంగా యెట్లా అర్థమౌతుందీ! ఆ యిరువురి స్త్రీలకూ ఏనాడూ - ఎటువంటి బాంధవ్యాన్ని గూడా వూహించని రుక్మిణికి వారి ఆకస్మిక బాంధవ్య ప్రకటన యెట్లా మనసుకు హత్తుకుంటుంది.

రెప్పలారుస్తూ-

"అయితే....మీరు....మా అమ్మకు అక్కగారా?" అంది.

"ఔను రుక్మిణీ" అంటూ గట్టిగా కౌగలించుకొని శిరస్సు నాఘ్రాణిం చింది లలిత.

సుందరమ్మ ఆనందంగా అట్లా చూస్తూ అంది: "అక్కా? ఎంత అదృష్టమే! ఎన్నాళ్ళకు చూశాను నిన్ను! ఆనాటినుంచీ నీ జాడగానక నీవు చనిపోయా వనుకున్నా మందరమూ. నిన్ను గురించి అంతగా ఆనాడు దూషించి యెన్నెన్నో అన్న తలిదండ్రులు యెంత చింతించారో తెలుసా? యెంత వెదికించారో తెలుసా?"

"అవన్నీ యెందుకుగాని అమ్మా నాన్నా బాగున్నారా?"

"ఇప్పు డెవరూ లేరు. మన ఆస్తి అంతా నాకే సంక్రమించింది, వారి అనంతరం. అదంతా అక్కడే వుంది. అప్పుడప్పుడూ వీళ్ళ నాన్న వెళ్ళి అన్ని విషయాలు చూచుకొని వస్తూ వుంటాడు. యీ పట్నంలో జవుళీ వ్యాపారం పెట్టాం మేము. చాలా అభివృద్ధికరంగా సాగుతున్నది."

"అయితే నీకు బిడ్డ లెంతమంది?"

"ఇది పెద్దపిల్ల. తరువాతి వాడు (ఆరవ ఫారం) **S. S. L. C.** చదువుతున్నాడు. తర్వాతి వాడు మూడవఫారం చదువుతున్నాడు. తర్వాత ఒక పిల్ల ఐదవ తరగతి అంతే."

"ఓ! బలే కన్నావే! కొడుక్కి కొడుకు తోడూ, కూతురికి కూతురు తోడూ."

"అసలు ప్రతివాళ్ళకూ ఆ విధంగానే నలుగురు కలిగితే చాలు."

"అయితే మిగతా వాళ్ళను యెపుడు చూపిస్తావూ?"

"చూపించడ మేమిటి. నీ విపుడే బయల్దేరు."

"వద్దులే. రాకుంటేనే మంచిది."

"నీవు తప్పక రావాలి పెద్దమ్మా!" అంది రుక్మిణి.

ఎపుడూ పలకని ఆ పదాలు ఉచ్చరిస్తూ వుంటే పెదవులు జంకుతూ వణికాయి.

లలిత అట్లా ప్రశాంతంగా చూచింది యిద్దరివైపూ. సుందరమ్మ కండ్లల్లో నీళ్లు కదుల్తూ వున్నాయి. "ఈ దుష్టపురుషుల చేతుల్లో యెంత మంది స్త్రీలు...." పూర్తికాకముందే 'శ్ శ్' అంది లలిత కనురెప్పలు పైకి యెత్తి, చాలించు అన్నట్లుగా సంజ్ఞ చేసింది.

మళ్ళా "అది పొరబాటు సుందరీ, ఏదైనా ఒక అన్యాయం జరిగితే ఒక పురుషుడిదే తప్పని ఎందుకనాలి? స్త్రీ అనుమతించందే తా నొక్కడే యేం చేయగల్గుతాడూ?"

"అది నిజమేక్కా, కలిసిన తర్వాత ద్రోహం చెయ్యడంలో వారే నిపుణులు."

"వారేకాదు. స్త్రీలుకూడా," అందా మనుకుంది గాని అవి గొంతు వరకే వచ్చి నిల్చిపోయాయి. కొంచెం సేపు మౌనం వహించి." ఆ ప్రస్తావన వదిలేద్దాం సుందరీ" అంటూ లేచింది లలిత.

వాళ్ళూ లేచారు. అందరూ లోపలి గదిలోకి వెళ్ళి వంటింట్లోకి వెళ్ళారు.

# 18

అక్కణ్ణుంచి బయలుదేరిన మురళి ఆలోచించుకుంటూ నడవసాగాడు. ఒక విధమైన విరక్తి భావం వుదయించిం దతని హృదయంలో. 'నేనెవరు? నా తలిదండ్రు లెవరు?' అన్న ప్రశ్నలే ఆక్రమించసాగాయ్ అతని మెదడున. ఎంత ఆలోచించినా జవాబు దొరకలేదు. తనకు వూహ తెలిసినప్పటినుండీ, యింత వరకూ నడిచిన తన జీవితాన్ని ఒకసారి సింహావలోకనం జేసుకొన్నాడు. ఇపుడు తన జీవితం తనకే వుత్సాహకరమైనదిగా కనుపించలేదు. నేరుగా సన్యాసిరా వింటి కెళ్ళాడు. అప్పటికి సాయంకాలం 4-30 అయి వుంటుంది. అప్పుడే టిఫిన్ ముగించి సన్యాసిరావూ, చంపకా హాల్లో కూర్చున్నారు. వివేకానందుని జీవిత గ్రంథమునుండి 'ఉత్తరహిందూదేశ పర్యటనము' అన్న భాగాన్ని చదువుతూ వుంది చంపక. 'అన్న పానాదులకును, కట్టుబట్టకును కటకటంబడుచునైన నహింతురేగాని దీనభావమును ప్రకటింపరుగదా! మహాత్ములు' అన్న వాక్యాన్ని చదువుతూవుండగా మురళి లోపలికి అడుగుబెట్టాడు. ఆ వాక్యానికి అప్పటి మురళి వేషం అనుగుణంగా వుందని ఆ యిద్దరూ గ్రహించారు తక్షణమే. చంపక తటాలున పుస్తకాన్ని మూసేసి లేచి "అడుగో! అడుగో! అన్నయ్య" అంటూ పరుగెత్తుకుంటూ ఎదురుగాబోయి చేయి పట్టుకొని వూపుకుంటూ లాక్కొచ్చింది. ఈలోగా ఒక కుర్చీని తన కుర్చీ ప్రక్కకు లాగి "రా నాయనా! కూర్చో" అని ఆప్యాయంగా సంబోధించాడు సన్యాసిరావు.

కొన్ని క్షణాలు గడిచాక "మురళీ! ఏమిటా విధంగా దప్పినట్లు కనిపిస్తున్నావ్? మధ్యాహ్నం భోం చేసినట్లు లేదే," అన్నాడు సన్యాసిరావు.

"ఎందుకు లేదూ?" అన్నాడు మురళి. అతనివైపు కనులెత్తి పూర్తిగా ఆయన కండ్లల్లోకి చూళ్లేక పోయాడు. చూపులు వాటంతటవే క్రిందికి వ్రాలాయి.

"పచ్చి అబద్ధం" అంది చంపక.

ఆమె వైపు గ్రుడ్లురిమి చూశాడు మురళి.

"చూడు నాన్నా! నిజం మాట్లాడినందుకు యెట్లా చూస్తున్నాడో నా వైపూ - ఏఁ తింటావా యేం నన్ను. అం తాకలిగా వుందా?" అంది. గట్టిగా నవ్వాడు మురళి. అందరూ నవ్వారు.

"ఐతే అబద్ధాలుగూడా మొదలు బెట్టావా మురళీ" అన్నాడు సన్యాసి రావ్.

"నాన్నా! పోనీగానీ ఫలహారం తీసికొమ్మని నీవు చెప్పు. నే చెప్పితే నా పైనబడి కరుస్తాడు."

"ఔనౌను పాపం! ఆ కాట్లన్నీ నే కరిచినవే కాబోలు!"

"ఎందుక్కాదూ?" అంటూ ఎగుర్తూ పోయి లోపల పీటవేసి, "అన్నయ్యా? రా!" అంది చంపక.

"పో నాయనా!" అన్నాడు సన్యాసిరావు.

లేచాడు. లోపలకెళ్ళి కూర్చున్నాడు పీటపై. ఫలహారం పెట్టి, ప్రక్కగా కాస్త యెదురుగా కూర్చుంది చంపక. మురళికి ఆ ఫలహారాన్ని చూచి కన్నీళ్ళు కారాయి. తటాలున కుడిచెయ్యి పట్టుకొంది చంపక.

"అన్నా! ఏమిటిది? ఎపుడూ నీలో చూడని మార్పు యీ నాడు చూస్తున్నాను" అంది చంపక ఆదుర్దాతో అర్థిస్తూ.

"ఏమీ లేదమ్మా. ఊరికేనే. అట్లా వుంది యీ దినం."

"అన్నా! చెప్పవూ" అంది బొంగురు గొంతుకతో.

"చంపా! నీకు చెప్పానుగా. ఇటువంటి విషయాల్లో యెక్కువ ప్రశ్నించవద్దని."

చంపకకు కన్నీళ్ళు రాలాయి. తటాలున వంగి రెండుచేతులూ పట్టుకొని తన కండ్లకేసి ఒత్తుకుంటూ "అన్నా చెప్పవూ? అంత కఠినత్వాన్ని నాపైన యికెప్పుడూ ప్రయోగింపకు. ఇన్నాళ్ళూ, యెట్లాగో ఓర్చుకున్నాను. ఇక ఓర్చుకోలేను. ఇక నీవు యీ యింట్లోనుండి బయటికి పోవడానికి వీల్లేదు." అంది కన్నీళ్ళు కారుస్తూ?

"నిజమే తల్లీ! నాకు పర్వాలేదు. ఈ యిల్లు నా యిల్లేనని యేదో ఒక అదృశ్య శక్తి చెబుతూ వుంది. నా శాపంగూడా పూరింది. అయితే అక్కయ్య యిష్టపడదు. ఆమె నాకోసం యెంత త్యాగం చేసిందో తెలుసుగా. తన సర్వస్వాన్నీ పోగొట్టుకొంది! నా కొరకు చదువుమాని. ఉద్యోగంలోచేరి నన్ను చదివించాలని ప్రయత్నించింది. ఉన్నదంతా అమ్మింది. నాకు ఏనాడూ కొదువ కలుగజేయ కూడదని శాయశక్తులా ప్రయత్నించింది. ఉన్న కాస్తా అయిపోయాక తిండికే కరువురాగా, నాకు మాత్రమే వండిబెట్టి తాను కొన్ని రాత్రులు పస్తు వుండింది. తన బట్టలూ, నా బట్టలూ తానే ఉతికింది. అంట్లు తానే తోముకొంది. ఇల్లు తానే వూడ్చుకొంది. ఎంత చేసినా, ఉన్నది అయి పోవడమేగాని, వచ్చే విధాయకం వుంటేగా! ఆమె రాత్రులు భోజనం చాలించడం, మొదట నేను గ్రహించలేదు. ఒకనాడు చూశాను, నేనేమో. భోంచేస్తున్నది, అని అనుకొనేవాణ్ణి. కనిపెట్టిననాడు మాత్రం. 'నేను యీ దినం తినకూడదనే చేసుకోలేదు' అంది. తర్వాత నేను కనిపెట్టాను. ఆమె రాత్రులు భోంచేయడం పూర్తిగా చాలించింది. ఈ దినం పగలుగూడా లేదు. ఆమెకూ లేదు. నాకూలేదు." నాలుక కొరుక్కున్నాడు మురళీ.

అసలివన్నీ చెప్పకూడ దనుకున్నాడు. మధ్యాహ్నం సరళా, తానూ. యింట్లో కూర్చొని చాలాసేపు యోచించుకున్నారు ఎవరి పాటికి వారు. మురళి సద్దుగాకుండా లేచి వచ్చాడు లలిత యింటికి. ఏ అభిప్రాయాలతో వచ్చాడో తనకే తెలీదు. ఆమెను పరిపూర్ణంగా ప్రేమించాడు కాన, ఆమెకు కష్టాలు చెప్పుకొని యేదో విధంగా ఒక దారిలో పడదాం అనుకొని వచ్చాడా! ఏమో! ఎటువంటి భావం వుందో! యే భావమున్నా ఒక నిర్దిష్ట రూపంలో లేదు. అట్లా వచ్చాడు. అక్కడనుండి యిక్కడికి వచ్చాడు, అంతా చంపకకు చెప్పాడు. అప్రయత్నంగా, పొరపాటు చేశానని గ్రహించి మౌనం వహించాడు.

"అన్నా! నాకు చెప్పి పొరపాటు చేశానని అనుకుంటున్నావా? చూడూ! నీవు చెప్పకపోతే నా హృదయం బాధతో మండుతూ వుంటుందని తెలుసుకో.

అన్న బాధలు చెల్లికి తెలియకుండా ఎందు కుండాలి? అసలు నీలో ఆ భావం యెందుకు కలగాలి? యింకా నన్ను సంపూర్ణంగా నీ చెల్లిగా స్వీకరించ లేదన్న మాట! పరాయి పిల్లగా భావిస్తున్నా వన్నమాట! ఏక గర్భవాసులమై వుంటే నీ విట్లా భావించి వుంటావా?''

''లేదమ్మా! నా చెల్లి అనే భావం పరిపూర్ణంగా కలగబట్టే అంతా హృదయంలో నుంచి కట్టలు తెంచుకొని ప్రవహించింది. మనం భావరీత్యా - పుట్టుకరీత్యా-గూడా అన్నా చెల్లెళ్ళమే అని నాకు అంతర్వాణి చెబుతున్నది.''

ఇంతలో సన్యాసిరావు యేదో తమకం పట్టలేని వాడివలె వచ్చా డక్కడికి. ఆ దృశ్యాన్ని చూస్తూ, ''అదేమిటే చంపా! అన్నను తిన్నీవా యేంటీ? ఇక్కడి కొచ్చి మాటలు పెట్టుకున్నావా?'' అన్నాడు.

''అదేంటీ! తింటూ వుంటేనే!'' అంటూ అదరా బదరా తింటూ వుండే మురళిని చూపించింది నవ్వుతూ.

కడుపునిండా తిన్న తర్వాత సన్యాసిరావు కార్లో యెక్కమన్నాడు. మురళిని.

''లేదు నాన్నా! కార్లో నేను కాస్త దూరం వెళ్ళిరావాలి అర్జంటుగా'' అంది చంపక.

''లేదమ్మా! అన్నా, నేమా కాస్త పనిగా పోతున్నాం, నీవు రుక్మిణికి ఫోన్ చేసి ఆ కార్లో వెళ్లిరా. లేకపోతే బస్సులో వెళ్లిరా.''

సన్యాసిరావూ, మురళీ కారెక్కారు. ఇంతలో మరొక కారు బుఱ్ఱున హారన్ వూదుకుంటూ వచ్చింది. దాంట్లో వున్న రుక్మిణి తల్లి సన్యాసిరావు వైపు ఏదో వేషం వేసుకొన్న పాతవ్యక్తివిలాగా చూస్తూ వుంది ఆశ్చర్యంగా. సన్యాసిరావు గూడా యేదో పద్దెనిమిది యేండ్లనాడు చూచిన ముఖంలాగా కనుపించగా క్షణంపేపు ఆలోచించి 'ఎవరోలే' అనే వుపేక్షా భావంతో కార్లో వెళ్లిపోయాడు.

వచ్చిన కార్లోనుంచి రుక్మిణి అదరాబదరా దిగి ''చంపా! ఒక గొప్ప విశేషం మీవాడు'' అంది వుబ్బిపోతున్న వక్షం ఎగుస్తూ వుండగా.

చంపక చేతులు పట్టుకొని పండ్లి గిలించి నవ్వుతూ "ఏమిటే" అంది.

"చూశావా! లలిత వుందే-ఎవరనుకున్నావ్? మా పెద్దమ్మ! ఈనాడు మా అమ్మవల్ల బయటపడింది."

"అరె! అట్లాగా! బలే బాంధవ్యమే! - సరేగానీ సమయానికి బాగా వచ్చావు. నీ కారు తెమ్మని యిప్పుడే ఫోన్ చేద్దామనుకుంటున్నా. మనం తక్షణం అక్కయ్య యింటికి వెళ్ళిరావాలి అర్జంటు."

"ఏమిటా అర్జంటు! ఎందుకూ?"

"చెబుతాలే. పదా. సైంగూడా 5-30 అయింది త్వరగా రావాలి."

"అయితే నన్ను యింటి దగ్గర వదిలి పెట్టి తర్వాత వెళ్ళండమ్మా" అంది సుందరమ్మ.

"సరే పదండం"టూ బయల్దేరారు.

వీళ్ళిద్దరూ సరళకోసం వెళ్ళేటప్పటికి సరళ యింట్లో లేదు. బయట తాళం వేసివుంది. ఎక్కడి కెళ్ళిందా,' అనుకుంటూ కాసేపు కార్లో కూర్చు న్నారు. అప్పటికి 6-30 అయింది. సరళ అప్పటికీ రాలేదు. ఇంటికి తిరిగి వచ్చేశారు.

సన్యాసిరావు డ్రైవరుతో కారును చైనాబజారుకు పోనిమ్మన్నాడు. ఒక షాపులోకి వెళ్ళి బట్టలు ఖరీదు చేయడం మొదలు పెట్టాడు. మురళీ! నీకు సూటు కిది బాగుంటుందా అది బాగుంటుందా? అని అడిగినంతవకూ యెందు కొచ్చారో తెలీదు మురళికి. 'నా కెందుకండీ? వున్నాయి,' అన్నాడు మురళి. 'నాకది తెలుసు నాయనా! అయినా కొన్ని కొందాం. వేరే మాట్లాడకుండా ఒక డజన్ సూట్లకు ముందు సెలెక్టు చేసుకో' అన్నాడు. మురళి యిష్ట ప్రకారం చౌక బట్టలేకొన్నా 200 రూపాయలు అయింది, ఇంకా మరికొన్ని కొన్న తర్వాత నేరుగా రామకృష్ణామఠం వెళ్ళారు'

సర్వజితానందజీ యెవర్తోనో మాట్లాడుతున్నాడు. వీళ్ళను చూడగానే అతడు లేచిపోగా, 'సంతోషంగా కూర్చోమని ఆదేశిస్తూ, "మురళి చాలా దినాలుగా రాలేదు," అన్నాడు చిరునవ్వుతో. అంటూ అట్లా మురళివైపు పరి

శీలిస్తున్నట్లు చూశాడు. మురళి తానీ లోపల చేసిన తప్పులనంతా బయటికి లాగుతున్నాడా అన్నట్లు భావించాడు. నేరస్థుడులాగా కాస్త తలవంచి కూర్చున్నాడు.

పరామర్శానంతరం సన్యాసిరా వన్నాడు. "స్వామీజీ! నా హృదయంలో యెన్నో భావాలున్నాయ్. భావయుద్ధం జరుగుతూ వుంటుంది. అదంతా యేమిటో యిదమిద్ధంగా తెలీదు. మీ బోటి వారి దగ్గరకు వచ్చినపుడు ప్రశ్న యెట్లా వేసి జవాబెట్లా పొందాలోగూడా చేత కావడం లేదు."

"అదీ జరుగుతుంది. అట్టి జిజ్ఞాసే మనస్సులో బయలుదేరితే, దాని అంతాన్ని అదే కనుక్కుంటుంది."

"మనం యెందరో వ్యక్తుల్ని చూస్తూ వుంటాం. అందులో కొందర్తో పరిచయ మేర్పరచుకుంటాం. అందులో కొందర్తోనే స్నేహం చేస్తాం. అందులోగూడా కొద్దిమందినే ఆత్మీయులుగా తీసుకుంటాం. ఆ ఆత్మీయుల్లో గూడా ఏ ఒకరిద్దర్నో ఆత్మసములుగా భావిస్తాం. ఎందు వల్లంటారు?"

"ఎందువల్లంటే - అక్కడ వస్తుసమత్వం వుందన్నమాట!"

"అంటే?"

"అది రెండు విధాలు. ఒకటి, శరీర సంబంధం బాంధవ్యమూ, రెండు మానసిక సంబంధ బాంధవ్యమూను. శారీరకంగా అంటే మా బిడ్డలు, భార్యా, సోదరులూ. ఇట్లాంటి రక్తసంబంధంతో కూడినది. మానసికంగా అంటే - చాలా విషయాల్లో యేకీభావం వుండటం. వ్యక్తి భిన్నమైనా సమాదర్శాలూ, సమభావాలూ. కలిగి వున్నపుడు ఆ సమత్వం వస్తుంది .ఈవిధంగా పై చెప్పిన శారీరక మానసిక సంబంధ బాంధవ్యముల వల్ల ఆత్మ సమభావం వస్తుంది. ఫలానా అవి తెలియకపోయినా, ఈ రెంటిలో యేదో ఒక సంబంధం కలిగి తీరాలి."

"ఆ విధంగా రెంటికీ సంబంధించక పోతేనో?"

"సంబంధించక యెక్కడ పోతుందీ? వున్నదే అది!"

"అయితే మా యెడ మీకు గల బాంధవ్య భావం వాటిల్లో రాదుగా" అన్నాడు మురళి.

"కాను అది శాస్త్ర వేరు. అది గౌరవ సమన్వితము. అట్టి కారణాలు లేకున్నా, ప్రేమభావం కలుగవచ్చు. ఇది వేరు. నేను చెప్పింది చాలవరకు లౌకికపరంగానే."

"మురళి వున్నాడందాం. అతనిని నా కన్న బిడ్డకంటే యెక్కువగా ప్రేమిస్తున్నాను. అతను నీ కొడుకే అని అంతరాత్మ ప్రబోధిస్తూ వుంది. అయితే యే విధాన చూచినా, నాకు తాను కొడుకవడానికి యేలాటి నిదర్శనాలూ కనిపించవు. ఆ విధంగా రక్త సంబంధ భావం దూరమైంది. ఇక మానసికంగా మాకు ఆదర్శ ఆశయాల విషయంలో యేకాభిప్రాయం వుండటంవల్ల ఈ బాంధవ్యంలో వున్నామని అనుకోను" అన్నాడు సన్యాసిరావు.

"మీ విషయం నాకు తెలుసు, మీ అంతరాత్మ ఆ విధంగా ప్రబోధిస్తే, అతను నీ కొడుకే అవుతాడు. కొడుకే అనే భావం ఒకటి కలిగిందిగా అసలు సత్యానికీ, భావానికీ అవినాభావ సంబంధం వుంది. ఏదన్నా ఒక వస్తువు లేందే దాన్ని గురించి భావించం. దేన్ని గురించైనా భావించామంటే అది యెక్కడో - యేదో ఒక తీరులో వుండి తీరాలి. ఆ ఉనికే సత్యం. ఐతే ఒక్కొక్కపుడు సత్యానికి అంత సంబంధించకుండా భావం కనిపిస్తుంది. ఇది కేవలం లౌకికం. ఇది మనసు యొక్క ఒకానొక స్థితి. ఇది యెట్లాంటిదంటే - ఫలానా బాంధవ్యం గల వానికి పుత్రే ఫలానాగా భావించాలి - గురుభార్యను ఫలానాగా భావించాలి. సహాధ్యాయులను ఫలానాగా భావించాలి. ఇటువంటి దన్నమాట. ఇక వస్తు బాంధవ్యం - తరతమ బాంధవ్యాలతో సంబంధించినది."

"అంతగా అర్థం కాలేదు స్వామీజీ."

"నిజమే దీని గురించి ఆలోచించి మరొకనాడు చదగండి. ప్రస్తుతం దీన్ని ఆపేద్దాం."

"అయితే స్వామీజీ! భావం ప్రధానమా? యదార్థం ప్రధానమా?" అన్నాడు మురళి.

"యదార్థం అంటే నీ అభిప్రాయం సత్యస్వరూపం అనేనా?"

"ఔను. అదే."

"యదార్థ పరరూపమే భావం" అని ఇదివర కన్నాను. భావం యదార్థ మౌతుందా? అన్నది సందేహమే. అది నమ్మకంపైన ఆధారపడి వుంటుంది. యదార్థంపైన ప్రపంచం యెట్లాగైతే ఆధారపడి వున్నదో, అట్లాగే భావంపైన గూడా ఆధారపడి ఉన్నది. దేవుడున్నాడా? లేడా? అనేది గూడా భావమే. ఉన్నాడని భావించేవారు ఒక విధమైన భయంతో దాస్య భావంతో ప్రవర్తిస్తారు. లేడని భావించేవారు తద్విరుద్ధంగా ప్రవర్తిస్తారు. ఆ ద్వివిధ ప్రవర్తనలు గూడా భావంపైన్నే ఆధారపడి వున్నాయ్. సర్వదేశ సాంఘికాచారాలూ - మతనమ్మకాలూ తదితర సిద్ధాంతాలూ - మానవ బాంధవ్యాలూ - అన్నీ భావంపైన్నే ఆధారపడి వున్నాయి."

"అయితే భావం మార్చుకుంటేనో?"

"మార్చుకుంటే - దేని విషయమై మార్చుకుంటావో. అది సిద్ధిస్తుంది. అంతే. అయితే, పుట్టినప్పటినుండీ హృదయస్థమై పెరిగిన భావం మారడం కష్టం. సాధారణ పరిస్థితుల్లో మారదు; సంస్కార ప్రాబల్యంవల్ల సాంఘికాచారాదు లందలి భావం మారవచ్చు. కాని, వ్యక్తి బాంధవ్యంలో మారడం కష్టం."

"అయితే వ్యక్తి స్థానాన్నిబట్టి భావం మార్తుందా?"

"ఔను. భావించే వ్యక్తి స్థానమునుబట్టి - వయోభేధమునుబట్టి దృష్టిభేదమునుబట్టి వ్యక్తుల కొకే వస్తువు భిన్న భిన్న రుచుల ప్రసాదిస్తుంది. ప్రౌఢాంగనా స్తనములు పసిపాపడికి స్తన్యప్రదానములు. యౌవనునకు భోగోకరణములు. వృద్ధునకు కేవలము మాంసపు ముద్దలు. నిష్కామున కవి నిష్ప్రయోజనములు, ఇట్లాగా వ్యక్తి స్థానమునుబట్టి భావమునకు మార్పున్నది."

"అట్టి భావం మార్పుతో కూడినదని అన్నారు. పొరపాటు వలని భావమైతే గూడా మారుతుం దనుకుంటాను."

"ఓ అది మారవచ్చు. భావం గూడ వీడు స్వయంగా కల్పించుకున్న

దైతే త్వరగా మారుతుంది. వీడికి తెలియని వయస్సులో యితర్లవల్ల చొప్పింపబడిన భావమైనా దాని నిజరూపు తెలిపిన తర్వాత తప్పక మారడానికి ఆస్కారముంది. అయితే తరతరాలుగా వస్తూ మానవ మస్తిష్కానికి రక్త వారసత్వం ద్వారా లభించే వ్యక్తియొక్క బాంధవ్య భావం మారడం చాలా కష్టం. అంటే యెన్నో యేండ్లుగా ఒక సంఘంలో తన తలిదండ్రుల కూతుర్ని వివాహ మాటగూడదని వస్తూవున్న దనుకో. అది అంతే. ఎట్టి పరిస్థితిలో గూడా అది తన తోబుట్టు అని తెలిస్తే వివాహ మాడడు. అక్క కూతుర్ని చేసికో కూడదని ఉత్తర హిందూస్థానంలో వుంది. ఆ భావం, ఉత్తర హిందూస్థానం వాడికి-ఆ ఆచారాన్ని పాటించే దక్షిణ హిందూస్థానం వాడు యెంత చెప్పినా మార్చుకోలేదు. బిడ్డగానే భావిస్తాడు, మనవాళ్ళో! భార్యగా స్వీకరించడానికి వెనుదీయరు. తరతరాలుగా మనలోగూడా అక్క కూతురు అన్నకూతురు వంటిదే అనే భావం వుంటే అన్యధా ప్రవర్తించము. ఇన్నెందుకూ? మనం దైనందిన జీవితంలో సాంఘికాచారాల పేరిట అనుస రిస్తున్న అత్యాచారకాండ అంతా భావంపైన్నే ఆధారపడి వుంది. ఇట్లాగా మనం చేస్తున్న-చూస్తున్న-అన్నిటినీ ఉదాహరణంగా తీసికోవచ్చు.''

''అయితే ప్రపంచంలో సకలమూ భావంపైన్నే ఆధారపడి వుందన్న మాట.''

''ఆహా!''

''సర్వంఖల్విదం బ్రహ్మం అనడానికి బదులు సర్వంఖల్విదం భావం, అన వచ్చున్నమాట.''

నవ్వుకున్నాడు స్వామీజీ. అప్పటికి దాదాపు 7-30 అయింది.

కారు యింటిముందు ఆగగానే చంపక పరుగెత్తుకొంటూ వచ్చి ''అన్నయ్యా! అక్కయ్య కనబడలేదు! ఇపుడే అక్కణ్ణుంచి వస్తున్నాం'' అంది భయపడుతూ.

''ఆఁ!'' అంటూ స్తబ్ధుడులాగా నిలబడిపోయాడు మురళి. మరు క్షణం, ''ఎక్కడికి వెళ్ళివుంటుందీ? నీవెపుడు చూశావూ?'' అన్నాడు.

"మీరు వెళ్ళగానే నేనూ, రుక్మిణీ వెళ్ళాము. లేదు. చాలాసేపు అక్కడే కూర్చున్నాము. రాలేదు. మళ్ళా యింతకు ముందే వెళ్ళి చూశాం. వేసిన తాళం వేసినట్లే వుంది. ఇపుడే వస్తున్నాం అక్కణ్ణుంచి."

ఆ కార్లోనే మళ్ళా వెళ్ళారు. తాళంచెవి ఉంచే రహస్య ప్రదేశం మురళికి తెలుసు! తాళంతీసి లోపలికెళ్ళారు. టేబుల్‌పైన ఒక జాబు వుంది. తటాలున చూచింది చంపక. దాంట్లో ఒకే ఒక వాక్యం వుంది—"నేను ఎన్నాళ్ళైనా ఆకలితో వుండగలను. నీకు అన్నం పెడుతూ, నీవు తింటూ వుంటే చూస్తూ. నేను తృప్తిపడి జీవించగలను. అయితే నా చేతులనుండి యీ నాటికి ఆ పుణ్యంగూడా జారిపోయింది. నే నెక్కడికి వెళుతున్నానో - నే నిక్కడ వ్రాయను. నా బాధ్యతను ప్రస్తుతం చెల్లిపై పెట్టి పోతున్నా"-అని చదివింది చంప. ఆమె దుఃఖంతో ఏడుస్తూనే ఆనందంతో యెగిరింది. ఎందు కంటే, సరళే మురళిని చంపక యింట్లో వుండమని ఆదేశించి పోయింది గనుక. మురళి యిక దాన్ని తోసెయ్యలేడు. ఆ దుఃఖానంద భావంతో మురళి వైపు చూచింది. మురళి స్తంభీభూతుడై నిలబడి వున్నాడు. కన్నీరు రాలుతూ వుంది. తాను యెరిగినప్పటినుండీ. సరళ తన విషయంలో వహిస్తూ వచ్చిన జాగ్రత లన్నీ కండ్లయెదుట ఒకటొకటే కనబడుతూ, పరిహారంగా ఒక్కొక్క కన్నీటి బొట్టును స్వీకరిస్తున్నాయి. స్త్రీకి కష్టం కలగకుండగా పురుషుడు చూడాలి. అయితే తనకు కష్టం రాకుండా స్త్రీ ప్రయత్నిస్తున్నది! ఆమె యెంత విలకడ ప్రేమతో యింత పని చేస్తున్నదీ! తన కోసం యెంత బాధపడ్డది? ఎంత కుమిలి కుమిలి యేడ్చిందీ! ఎన్ని పరిస్థితులలోనో యెగ తోసుకొస్తున్న అసూయా భావాన్ని దిగమింగి యెప్పటివలెనే యెంతగా ప్రేమించిందీ! ఆ నాడు యెంత కష్టంతో - యెంత వ్యధతో - తన మనోభి ప్రాయాన్ని వెల్లడించిందీ! దానికి ప్రతిఫలంగా యెంత తీరని మనోవ్యధ అనుభవించిందీ! తాను తన తలిదండ్రులకు పుట్టింది కాదుకదా! తన అభి ప్రాయ ప్రకారం తనెందుకు చేసుకోరాదు. నన్ను విడువని భావం నాలో యెందుకింత తీవ్రంగా వుంది! ఆమె నా విముఖత్వాన్ని తెలుసుకొని గూడా,

తనకు యేమీకాని నన్ను విడువలేడే! పైగా సర్వవిధాలా - అనాథా - అభాగ్యా కూడా, నా కోపం యిట్లా బాధపడుతూ వుందే! కూర్య వృక్కుల్లోంచి నిరంతర ప్రవాహంగా కన్నీరు కార్తూ వుంది.

"ఏమి టన్నయ్యా! ఈ ధోరణి?" అని చంపక అన్నంత వరకూ, ఈ ప్రపంచంలో లేదు మురళి. తటాలున, "ఏమీ లేదమ్మా! పద పోదాం" అంటూ బల్దేరాడు.

## 19

సరళ బెజవాడ వెళ్ళింది. ఆకస్మికంగా తన యింట్లో దిగిన సరళను చూచి రాజామణి ఆశ్చర్యపడింది. మర్యాదగానే స్వీకరించింది. ఆ రాత్రి భోజనా లయ్యాక,

"ఏం సరళా! యింతగా చిక్కిపోయావేం? నీ మనసులో యేదో గొప్ప వ్యధ వున్నట్లు కనిపిస్తుందే?" అంది రాజామణి.

"ఏమీ లేదత్తా! పరిస్థితులు చాలా విషమించాయి. రైల్లో నా సొమ్ము లన్నీ ఎవరో దొంగిలించారని వ్రాశానుగా! వుత్త చేతులతో మద్రాసు వెళ్ళ వలసి వచ్చింది. వెనక్కి వస్తే మాత్రం ఎక్కడికి పోవాలి అని ముందుకే వెళ్ళాం. అక్కడ దౌర్భాగ్యం ఒక వైపూ అభిమానం మరొక వైపూ వేధిం చాయి. ద్యోగం చేద్దామనుకుంటే సరైన వుద్యోగం దొరకలేదు. మళ్ళా వున్నవి అమ్మి చదువు సాగించాం. అది కాస్తా అయిపోయింది. భుక్తికే కష్టమైంది. నిన్నటికే మాకు భోజనమే లేదు. మురళిని ఆ స్థితిలో వదలి నే నిట్లా వచ్చాను."

"అంతా విని రాజామణి అయ్యో! అని విచారం చూపిందే కాని అంతగా బాధపడలేదు. ఆ మాటా, ఈ మాటా, మాట్లాడినాక సందేహిస్తూ,

"చూడు సరళా! మా చంద్ర మంచి అంతవాతే గదూ! బాగా సంపాదిస్తూ వుందిగూడ. దాన్ని మురళి చేసికొని వుంటే యిన్ని చిక్కు లొచ్చేవి గావు." అంది.

"వయస్సు చాలా భేదం గదత్తా!"

"వయసును గురించి మనం చింతిండం యెందుకు సరళా! మనం ప్రతిదినం చూస్తూన్నాంగా! వ్యభిచార విషయంలో పాటించని వయసు, వివాహ విషయం వస్తే కావాలాయేం"

"వ్యభిచారమూ, వివాహమూ ఒకటే అవుతాయంటావా?"

"కావు, అయితే కార్యం ఒకటేగా?"

"నిజమే, యిష్టపడితే చేసుకోవచ్చు."

"యిష్టపడితే-గాదు—నీవు చెబితే తక్షణం చేసుకొని తీర్తాడు."

'నేను బాధించలేనత్తా. వాడి కిష్టమైతే నే నభ్యంతరపెట్టను.'

"నిజంగా! ఇంకేం! చూడు సరళా! చంద్ర చాలా యిదిగా వ్రాసింది నాకు కొన్నాళ్ళ క్రిందట. నేను కూడా సెలవుబెట్టి వద్దామనుకుంటున్నా. ఇది కొత్త అయితే మీ కష్టాలు తొలిగినట్టే. చంద్ర సంపాదన చాలా బాగుంది. మురళి కాలిమీద కాలేసుకు కూర్చొని తినవచ్చు. నీ యీ దుఃఖం అంతమౌతుంది. మరెప్పుడు బయల్దేర్దాం?"

"పోదాంలే అత్తా!" అంటూ ఆలోచనలో పడింది సరళ.

మరునాడు ఉదయం టిఫిన్ దగ్గర కూర్చొని యివే మాట్లాడుకుంటున్నారు రాజామణి సరళలు. "లక్ష్మి, సీతల్ను చూచి ఎపుడు వెళ్ళేదీ చెబుతానత్తా" అంటూ ఉన్నది సరళ.

ఇంతలోకే వచ్చారు క్రిష్ణయ్య. రాజామణి ఆహ్వానించి, కూర్చోమని టిఫిన్‌కు ఆజ్ఞ యిచ్చింది! కూర్చొని "ఎప్పుడు సరళా రావటం?" అన్నారు.

"నిన్న" అంది సరళ ముక్తసరిగా.

"అవును. సీతాకి తెలుపాల్సిన అగత్యం ఏమీ లేదు. అయితే ఎట్లాగో ఏ దారి తెలుసుకొని వచ్చి చూడడమనే అగత్యం మాకు ఉంది" అన్నారు చిరునవ్వుతో.

"తలవని తలంపుగా అనుకొని బయలుదేరవలసి వచ్చింది. అంచేత అత్తయ్యకు గూడా తెలీదు నా ప్రయాణ విషయం."

"సరే! యేమైతే నేం! నిన్ను మళ్ళా యీ పట్నంలో చూడటం తటస్థించింది. అందుకు చాలా సంతోషం."

సంభాషణ మరికొంత నడిచింది. సరళ బాగానే మాట్లాడ్తూవుంది. అది క్రిష్టయ్యకు కాస్త ప్రోత్సాహనీయంగా వుంది, తాను గూడా నేర్పుగా మళ్ళా వివాహ విషయం తీసుకొచ్చాడు. పైగా అన్నాడు:- "రాజామణిగారున్నారని నీవేమీ అనుకో నక్కర్లేదు సరళా. ఆమెతో చాలాసార్లిదివరకే అన్నాను. ఈ విషయంలో సాయం చేయమన్నాను కూడా. యిందులో జంకవలసిన పనిలేదు.

"అవును సరళా! నేనే నీతో యీ విషయంలో మాట్లాడుదా మనుకుంటున్నా. ఇంతకు ముందు మన మనుకొన్నదీ-ఇదీ - జరిగితే అన్నివిధాలా మీరు కుదుటపడగలరు" అంది రాజామణి. క్రిష్ణయ్య మళ్ళా వుత్సాహంతో నోరు జారి పొరపాటుగా ఒక మాటన్నాడు. అది అనకుండా వుంటే కాస్త బాగుండేదేమో! ఏమన్నాడంటే!-"చూడు సరళా! ప్రస్తుతం మన సంఘంలో యెంత విద్యాధికుడైనా, ఒక భర్తను వదలిన పిల్లను చేసుకోడానికి పూనుకోడమంటే చాలా గొప్ప విషయం. అందులో కట్నం లేకుండా ఏమీ లేని పిల్లను చేసుకోవడం యింకా గొప్ప విషయం." ఒక మోస్తరుగా తెచ్చి పెట్టుకొన్న సరళ సుముఖత్వం యీ వాక్యంతో పూర్తిగా చచ్చింది. క్రిష్ణయ్యలోవున్న ఆ ఆధిక్యభావాన్ని మళ్ళా కనిపెట్టింది. మనసులో కాస్త చిన్న పుచ్చుకొని, "ఆపు క్రిష్ణయ్యా! నీ ధోరణి చూస్తే నీవు నన్నేదో దయదలచి చేసుకుంటున్నట్లుంది. చాలా త్యాగం కూడా చేస్తున్నట్లుంది. అంటే నాలో ఏమీ ఆధిక్యతగానీ, సమత్వానికి పనికివచ్చే మరే గుణంగానీ లేదన్న మాట, కేవలం నీ దయా-త్యాగం - ఉదార స్వభావాలే నన్ను నీవు చేసుకోడానికి పురికొల్పుతున్నాయన్న మాట! ఈ అనవసర ఆధిక్యభావం యింకా చావలేదు. అది మీ రక్తంలో యింకిపోయి, మీ నరాలకు పట్టిపోయింది. ఈ

చదువూ. యీ వాతావరణమూ - కూడా దాన్ని పెకలించే సంస్కృతిని మీకు ప్రసాదించలేదు''

''కాదు సరళా పొరబాటు. అనాలని అనలేదు. ఊరికే.''

''ఊరికే అది అంత నిర్లక్ష్యంగా వస్తున్నది.''

క్రిష్ణయ్య ఏమీ మాట్లాడలేదు ఆనక. రాజామణి గూడా యేమీ మాట్లాడలేదు. ఇదివర కన్నట్టుగా.

''నన్ను వేధించకలా, నిన్ను చేపికోను.'' అది సరళ అనలేదు, ఆ అనకపోవడం గుర్తించాడు క్రిష్ణయ్య. ఆమె ముఖంలో యిదివరకు కనిపించిన బీదరింపు భావం కూడా కనబడలేదు.

''అత్తా! నేను లక్ష్మి, సీతల చూడాలి. వెళ్ళి వస్తా!'' అంటూ లేవబోయింది.

''వాళ్ళిక్కడ లేరు సరళా!'' అన్నాడు క్రిష్ణయ్య.

''ఆ! ఎక్కడున్నారూ!'' అంది ఆశ్చర్యంతో.

''ఈ వూరు వదలి గూడూరు చేరారు. క్రైస్తవ బాలికా పాఠశాల్లో పనిచేస్తున్నారు.''

''ఈ వూరు యెందుకొదిలారు?''

''సత్యారావుగాడి దెబ్బకు.''

ఆ శబ్దం వినగానే మనస్సులో చివుక్కుమంది సరళకు. కాస్త వులిక్కిపడ్డది. ''ఏం జరిగింది!'' అది ఆదుర్దాతో.

''అయితే నేను రహస్యం బయట పెడ్తున్నానో - లేక, నీకిదివరకే తెలిసిన విషయాన్ని వుపోద్ఘాతంగా వుపయోగిస్తున్నానో - నాకు తెలీదు. మురళి సీతను ప్రేమించాడు తెలుసా? అన్నాడు క్రిష్ణయ్య సాఫీగానే.

''ప్రేమించాడా!'' అంది సరళ.

''ఔను. పెండ్లి చేసుకుంటానని మాటకూడా యిచ్చాడు.''

''అట్లాగా!''

''ఔను. అసలు విషయం వినాలి. సీత మురళి కోసం. ఒకే తీరున

యేడుస్తూ వుండేదట. చిన్నప్పటినుండీ ఆమె వీణ్ణి ప్రేమించిందట. సత్యారావుగాడు లక్ష్మి వెంట తిరిగేవాడు. లక్ష్మి చాకచక్యమూ, సమయస్ఫూర్తీ, మరొకరికి వుండవు.

అట్లాంటి చవటలను సమయానికి ఎట్లా వుపయోగించుకోవాలో ఆమెకు బాగా తెలుసు. మురళిని రప్పించుకొనేందుకు వాణ్ణొక పనిముట్టుగా వినియోగించుకొంది. వా డామెతో వ్యభిచరిద్దామని ఆశపడ్డాడు. ఆమె అంద లేదు. పెండ్లి చేసుకుంటానని గూడా అన్నాడు. ఆమె వినలేదు. వాడు చాలా ప్రయత్నించాడు పట్టుదలగా. ఆమె అసలు పెండ్లే చేసుకోనంది. వాడికి ఆమెపైన బాగా కోపం వచ్చింది. ఆమె శీలంపై వాడికి అవహేళనభావం కూడా కలిగింది. ఉదాసీనత కూడా కలిగింది. వాళ్ళను యేడిపించడం మొదలుపెట్టాడు. గుడిసెల్లో వాళ్ళచేతనే వాళ్ళను అసహ్యించుకొనేటట్టు చేశాడు. అప్పటికీ వాళ్లు లొంగకపోయేటప్పటికి మరీ రెచ్చిపోయాడు. వాళ్ళపై నిందలు మోపడం మొదలు పెట్టాడు. వాళ్ళు చదువుచెప్పే స్కూల్లో సీత గర్భవతనీ, వ్యభిచారిణి అనీ, లక్ష్మి ఒక పెద్ద వ్యభిచారిణి అనీ ఈ విధంగా కరప్రతాలు పంచాడు.

"అయితే సీత గర్భవతా!" అంది సరళ మధ్యలో.

"ఔను. అస లిపుడు మురళికీ, సీతకూ సంబంధం విడిపోయింది కాబట్టి చెబుతున్నా. అదంతా మురళి చేసినపనే. అమాయకురాలైన సీతను మోసగించాడు. అదిపోనీ - అసలు విషయం విను. తర్వాత వాళ్ళ పేళ్ళు అనవసరంగా క్లాసుబోర్డ్లూ, గోడలూ, కిటికీలూ యెక్కాయి. అంతటితో వద ల్లేదు వాడు. వాళ్ళనూ, వీళ్ళనూ పురికొల్పి రౌడీలను వాళ్ళ యింటికి పంపే వాడు. వాళ్లు వచ్చి వేశ్యావృత్తిలో వున్నవాళ్ళ యింటిదగ్గరికి యెంత చను వుగా పోయి అడుగుతారో ఆ విధంగా అడిగేవారు నిర్భయంగా. వాళ్ళు యేడుస్తూ, మా మానం తీకండీ. మేము అట్లాంటివాళ్ళం కాదు - అంటే - "ఓహో! ఎవరికో గర్భాలు దాల్చేవారంతా పతివ్రతలు గాబోలు అంటూ హేళనచేసి గోలచేసి పోతూ వుండేవారు. నేను కలుగజేసుకొందామని అను

కునేవాణ్ణిగాని, కలుగజేసికోలేదు. ఎందుకంటే ఆ దుర్మార్గుడు మొదట నాకూ లక్ష్మికీ అంటగట్టి అడుగు చేశాడు. తర్వాత సీతకూ నాకూ గట్టాడు. అబ్బా! అపుడు నేనెంత యేవగించుకున్నానో! ఆ అమాయకపు పిల్లపైన యెంత జాలి వేసిందీ! తర్వాత ఒకనాడు వాళ్ళింటికెళ్ళాడు. వాళ్ళు కాస్త తగ్గి మాట్లాడారు. విజయసూచకంగా వీడు ప్రగల్భాలు కొట్టాడు! లక్ష్మి ధైర్యంగా మళ్ళా ఛీకొట్టింది. వీడికి కోపం హెచ్చింది. ఒకనాటి రాత్రి వాళ్ళింటిముందు మలమూత్రాలతో నిండిన కుండ వేయించాడు. మరునాడు వీళ్లు నిద్రలేచి చూడకముందే యితర్లంతా చూచారు. అంతా గోలగో లయింది. చుట్టుపట్ల వాళ్ళంతా, "ఏమిటమ్మా యీ పబ్లిక్ అంకూ! వచ్చేపోయే వాళ్ళకు సందు లేదు! ఫలితంగా లభించిన ఈ కుండలకంపు మేం గూడా భరించాలి గాబోలు." అన్నారు. అంతే ఆనాడే బయలుదేరారు గూడూరు. అంతకు ముందే అప్లయి చేసివున్నారు. రమ్మనిగూడా వచ్చింది. "పోదామా వద్దా" అనుకుంటూవున్నవారు తప్పనిసరిగా బయల్దేరారు.

క్రిష్ణయ్య ఆగాడు. సరళ సత్యారావును గురించి ఆలోచిస్తూ వుంది.

సత్యారావెంత దుర్మార్గుడూ! మత్సరం యెంత పని చేస్తూ వుందీ! ఇష్టపడని స్త్రీని యెంతగా వేధిస్తారు బుద్ధిహీనులూ! పశుబల వుంటే మాత్రం అట్లా చెయ్యాలా! అంతకంటే పశుబలంవల్ల వాడేం సాధించగిలిగాడు. వారి హృదయాల పొందగల్గాడా! - అట్లా ఆలోచిస్తూ కూర్చొని హఠాత్తుగ లేచి,

"అత్తా! నేను గూడూరుకి వెళ్ళాలి" అంది సరళ నిర్ధారించు కొన్న ట్లుగా. ఆమె పయనానికి యెవరూ అడ్డు చెప్పలేదు. "రాత్రి మెయిల్లో వెళ్ళి తెల్లవారి గూడూరు జేర్తావు" అని అంటూ రాజామణి ఆసుపత్రికి పయన మైంది. సెలవు తీసికొని సరళ గదిలోకి పోగా, రాజామణి వెంటే బయలు దేరాడు క్రిష్ణయ్య యేదో మాట్లాడాలనే అభిప్రాయంతో,

మెయిలు వేళకు క్రిష్ణయ్య గూడా వచ్చాడు, ఏదో సానుభూతి అతని ముఖంలో కనబడుతూ వుంది. రాజామణి గూడా స్టేషనుకు వచ్చింది. క్రిష్ణయ్య 500 రూపాయలు చేతిలో పట్టుకొని, "నీవేమీ అనుకోకు సరళా!

[illegible] నా కోసం త్రోసి పుచ్చుకో" అంటూ ఆమె చేతిలో పెట్టాడు. చెయ్యి ఆపేసి నా కష్టార్జితం [illegible] ముక్తసరిగా.

"నీవా మాటంటావని నాకు తెలుసు" అంటూ యిటువైపు చూశాడు.

"తీసికో సరళా. వుండనీ. ఇది అప్పుగానే అనుకో. మళ్ళా తీర్చుకోవచ్చు" అంది రాజామణి సిఫార్సు చేస్తూ. అక్కడ అట్టే గందరగోళం యెందుకని తీసుకొంటూ ఒక అయిష్టమైన భారాన్ని పైన వేసుకుంటున్నానని అనుకొందామె. యేదో ఘనవిజయం పొందినవానిలాగా తృప్తిపడ్డాడు క్రిష్ణయ్య. మధ్యలో రాజామణి గూడా సంతోషించకపోలేదు. రైలు కదిలింది భారంగా. దాంట్లో సరళ గూడా భారంగా కదిలింది, ఆనాడు క్రిష్ణయ్య దగ్గర అప్పుగా తెస్తానన్నందుకు మురళిని తిట్టిందామె! ఈ దినం తానే అతని డబ్బు తెస్తున్నది! పదేపదే అదే అనుకుంటూ బాధతో పయనించింది.

గూడూరులో ఉదయం 6 గంటలకు మిషన్ బాలికా పాఠశాల ఆవరణంలో జట్కా ప్రవేశించింది. సరళను ప్రధానోపాధ్యాయ యింటికి తీసుకెళ్ళారు. ఆమెకు నమస్కరించి లక్ష్మి సీతల కొఱకు వచ్చానన్నది.

"ఎందుకూ! వాళ్ళు బంధువులా?" అని నవ్విందామె.

"ఔను అంతకంటే యెక్కువ."

"చాల ఉత్తములాంద్రు! అంత వుత్తములాంధ్రకు ఈ స్కూల్లో తావులేదు. అంచేత పంపించేశాను" అంది కాస్త విరసనగా.

అంతా గ్రహించింది సరళ.

"ఎక్కడికి కెళ్ళారో తెలుసా?" అంది సరళ.

"అవన్నీ మాకేం అవసరమండీ! ఏదో కడపలో చేరినట్లుగా లక్ష్మి వ్రాసింది."

"ఏ స్కూలులో చెబుతారా?"

"నన్ను క్షమించండి, మా క్లర్కు నడిగి తెలుసుకొండి" అంటూ ఖుణ్ణున లేచిపోయిందామె,

కడపలో యెట్లాగో యిల్లు కనుక్కొని సరళ వచ్చే టప్పటికి లక్ష్మి

ఒకతే కూర్చొని ఆలోచిస్తూ వుంది. మొగమంతా అలసటతో కృశించి వుంది. శూన్యదృష్టితో చూస్తూ కూర్చొని వుంది. సూట్‌కేసు మాత్రం పట్టుకొని, వట్టి కాళ్ళతో సద్దుగాకుండా నడిచి ప్రక్కన నిలబడిన కాసేపటి వఱకూ లక్ష్మి యిటు చూడలేదు. హఠాత్తుగా చూచింది. సరళ యొక్క ఆకస్మికాగమనానికి ఆశ్చర్యపడుతూ, లేచి గట్టిగా కౌగిలించుకొని "సరళా!" అంటూ ఆమెపైన పడిపోయింది యేడుస్తూ. ఆమె కాస్త వూరడిల్లిన తర్వాత "సీతేదీ? కనబడలేదే!" అంది సరళ అనుమానంతో.

"ఆసుపత్రిలో వుంది."

"ఏం జబ్బా?"

"ఔను. అది జబ్బే. చాలామంది యువతుల్లో కనబడే జబ్బు. జాలి గుండెగల అమాయకపు యువతులకు పట్టే జబ్బు."

"అర్థం కాకుండా మాట్లాడుతున్నావు."

"ఆగానే చెప్తా విను. దానికి తొమ్మిది నెలలూ నిండాయి."

సరళ ఆశ్చర్యాన్ని చూపలేదు, "సరే వెళ్ళి చూచివద్దాం పద" అంది.

సరళను చూడగానే సీత యెంతగా యేడ్చిందో చెప్పడం కష్టం. ఆమె ఆ శోకం గర్భస్థ శిశువుకు దెబ్బేమో అని సరళ గట్టిగా మందలించి ఓదార్చింది. "నాకన్నీ తెలిశాయి సీతా! అన్నీ నేను చూస్తాగా" అని ధైర్యం చెప్పింది. రాత్రి భోంచేశాక,

"గూడూరునించి రావటం యెందుకు తటస్థించింది లక్ష్మీ?" అంది సరళ.

"బెజవాడ నుంచి యెందు కొచ్చామో అడిగలేదేం?"

"అది తెలిసింది. తెలిసే బయలుదేరాను చూడ్డానికి. ఎంతో తమ కంతో గూడూరె కొచ్చాను. ఆ హెడ్‌మిస్ట్రెస్ అట్లా మాట్లాడ్డం దెందుకూ?"

"మన సంఘంలో పురుషజాతి యెంత దుర్మార్గంగా వుందో స్త్రీ జాతి అంత [illegible] వుంది. తప్పులున్నవాళ్లే యితర్ల తప్పుల బయట పెడ్తూ వుంటారు. తమలో తప్పులున్నా - యితర్ల తప్పులతో తమ తప్పులను

ఖోల్చుకొని తృప్తిపడ్తూ వుంటారు; ఇతర్లలో తప్పులు లేకున్నా ఆరోపించి, తమ తప్పులను ఆ విధంగానైనా విస్మరింప బడేటట్లు చేయాలని చూస్తారు కొంతమంది. ఇతర్లలో తప్పులు బయటికిలాగి, మనమే కాదులే అని తృప్తి పడ్తూవుంటారు మరి కొంతమంది. పంతులమ్మలయెడ లోకానికుండే అసహ్యభావం - అసభ్య భావం నీకు తెల్సిందే. అదెందుకంటే వాళ్ళలో అవివాహితలు యెక్కువగా వుంటారు గనుక. అవివాహితలుగా వున్నవారు, కొంతమంది, ఏదో, అట్లా మొండిగడ్డి తినటం కాస్త వున్న విషయమే. అది కాదనం. అయితే అట్లా చేసేవారు గూడా, ఇతర్లు చేస్తున్నారని తెలిస్తే తామేదో పవిత్రులమని వాళ్ళను నీచంగా చూచే అలవాటుంది. గూడూరి స్కూల్లో మిస్సమ్మల కతంతా మాకు తెలుసు. ఏమీ యెరగని సీత, ఎవణ్నో ప్రేమించి, వాణ్ణి చేసుకుంటానని పొరపాటున వానికి లొంగగా - లభించిన చిహ్నాలు బాగా కనబడుతూ వుండగా - వాళ్ళ తీక్ష్ణ విమర్శనలకు లోనైంది. నిజం తెలియక వాళ్లు చాలా అసహ్యంగా ప్రవర్తించారు. మా జీవితం అక్కడగూడా దుర్భరంగానే వుండింది. ఏదో ఒక విధంగా కాలం గడుపుతూ వచ్చాం. ఇట్లా వుండగా - సత్యారావు మమ్మల్నింకా వదలకుండా వాళ్ళకు జాబులు చాలా అసహ్యంగా వ్రాశాడు. పైగా అందువల్లనే - అంటే - మా పబ్లిక్ వ్యభిచారం మూలాన్నే అక్కడ అవమానింపబడి తరిమి కొట్టబడినట్లు వ్రాశాడు. వీళ్ల కందరికీ మే మంటే యేహ్యం హెచ్చింది. ఒక్కొక్క మిస్సమ్మ మమ్మల చూచినప్పుడు దయ్యాల చూచినట్లు చూచేది. కడపటికి రాజీనామా యిచ్చి పొమ్మన్నారు. వాళ్లచేత 'డిస్మిస్' అనిపించుకోకుండా మేమే రాజీనామా యిచ్చి బయల్దేరాము. ఇన్ని దినాలుగా నీకు యీ విషయాలు వ్రాద్దామని అనుకుంటూనే వున్నాను, వ్రాయలేక పోయాను. కడకు నీవే మమ్ముల వెతుక్కుంటూ వచ్చావు. నీ హృదయం యెంత సరళ మైందో నే వేరే చెప్పాలా సరళా!"

"అవన్నీ యెందుకుగాని లక్ష్మీ! సీత విషయం యేమిటో నాకంతా అగోచరంగా వుంది!"

"అది అమాయకురాలు సరళా! నీ మాదిరీ - నా మాదిరీ గాదది. ప్రస్తుతం యువతుల్లో 90% లో వున్న అమాయకత్వం దీనిలో వుంది. దీన్ని ఆ విధంగా అన్యాయం చేసినవ్యక్తి నీకు తెలు సనుకుంటాను."

"నాకు తెలుసు లక్ష్మీ! ఈ విషయం మొదటే తెలిసివుంటే బాగుండేది."

"ఎవరు చెప్పారూ?"

"క్రిష్ణయ్య మొన్న చెప్పాడు."

"క్రిష్ణయ్య!" అని నిరసనగా చిరునవ్వు నవ్వింది లక్ష్మి.

"ఏం లక్ష్మీ! ఎందుకల్లా అన్నావు?"

"క్రిష్ణయ్యకూడా కొంత కారకుడు. సీత పతనానికి అతను కొంత భాగస్థుడు కాకపోడు."

"అంటే!"

"అంటే - ప్రథముడు సత్యారావు. వాడొక రాక్షసుడు. వాడి చేష్టలు తెలిసినవే. వాడన్నీచేస్తూ వుంటేకూడా ఆమోదిస్తూ వచ్చినవాడు క్రిష్ణయ్య. మనుషులు యెంత స్వార్థపరులో అపుడు తెలిసింది నాకు. క్రిష్ణయ్య కాస్త మంచివాడని అనుకుంటూ వుండేదాన్ని. అంతకంతకూ తేలిపొయ్యాడు. నేను మంచివాడు దొరికితే పెండ్లి చేసుకోవచ్చు అనే ద్వైదీభావంలో వున్న తరుణంలో, క్రిష్ణయ్య తన్ను చేసుకోవల్సిందిగా కోరాడు. తర్వాత అతడొక ఉన్నతాశయాలూ, ఆదర్శాలూ గల వ్యక్తి గాదని తేలింది. సంకుచిత హృదయంతో, నాపైన దయజూపి నన్ను ప్రేమిస్తున్నట్లుగా మాట్లాడాడు. చాలా సార్లు అట్లాగే అని కడపటికి చాలా అవహేళనగా మాట్లాడాడు. తర్వాత తాను చేసిన ద్రోహమేమంటే, సీత తన స్నేహితుడైన మురళికి కాబోయే భార్య అనీ, తనలో యేలాటి నేరమూ లేదనీ, మురళి వల్లనే తనకు గర్భమైందని తెలిసికూడా - తనకూ సీతకూ అంకుగట్టి మురళికి సత్యారావు జాబులు వ్రాస్తే, అది తప్పని మురళికి తాను వ్రాయలేదు. ఇదెంత ఊహించరాని విద్రోహకరమో చూడు! నా మాదిరే సీతను గూడా అతను

కోరాడు. మురళి సంబంధాన్ని పురస్కరించుకొంటే యింతకంటే దుష్ట భావం వేరే వుండబోదు. మేము అట్లా అన్నామని మనుష్యుల అపవాదానికి గురిచేయడం యెందుకో అతనూ యోచించలేదు."

"యోచించరు లక్ష్మీ! అయితే అతడు చిన్ను పెండ్లాడాలని అంత ప్రయత్నం చేశాడా?"

"అంతా విన్నావుగా?"

"ఈ మగవాళ్లు యెందర్ని ప్రేమిస్తారో తెలీదు లక్ష్మీ. ప్రతివాళ్ళ దగ్గరా తననే ప్రేమించినట్లూ - ఇంకెవర్నీగూడా కన్నెత్తి అయినా చూడనట్లూ - మాట్లాడ్తారు. వీలుపడకపోతే కపట దయదలచి మనలను ప్రేమిస్తున్నట్లుగా అవహేళన చేసిపోతారు. క్రిష్ణయ్య నా విషయంలోగూడా అదే చేశాడు."

"అది నాకు తెలుసు సరళా! అవన్నీ తెలుసు!"

"ఇదేగాదు లక్ష్మీ! మా నాన్న చనిపోయినపుడు మేము బెజవాడ వొచ్చాంగా. మేము చదువుకు పోనున్నాము. చంపక వచ్చింది. అది మేమంటే ప్రాణాలు వదుల్తుంది. దానితో కాస్త పరిచయం కల్గించి క్రిష్ణయ్యకు. అది చలాకీగా మాట్లాడ్తుంది. యే మాత్రం గూడా నదురు, బెదురూ లేకుండా ఎవరితోనైనా యెట్లాటి విషయాలైనా, ముచ్చటించ గలదు. తర్వాత క్రిష్ణయ్య ఒక జాబు వ్రాశాడట దానికి అంతు పట్టించకుండా. మద్రాసుకు యేదో పనిమీద వస్తూవున్నట్లూ-తనని చూస్తాననీ - వ్రాశాడట. తర్వాత ఒక నాడు కాలేజీకి వొచ్చాడట. ఇది బాగానే మాట్లాడ్తూవుంటే సుముఖంగానే వుందనుకొని, 'ధారాళంగా అడుగు తున్నానని యేమీ అనుకోవద్దు, నీవంటే నాకిష్టం, నాస్థితి నీకు తెలుసు మనం వివాహం ఎందుకు చేసికో కూడదూ?' అన్నాడట - 'అసంభవం క్రిష్ణయ్యా! ఇక వెళ్ళవచ్చు. నా మాదిరి ధారాళంగా మాట్లాడే యే స్త్రీనీ - ఎపుడుగానీ - అంత తేలిగ్గా భావించక. నీ వడిగిన దాంట్లో తప్పు లేదుగాని, నీ ప్రేమలో లోతులేదని తెలుస్తున్నది' అందట-'అదెట్లా అనగలవూ?' అన్నాడట. 'పెద్దలతో విచారించకుండా-

నా తోనేశాద్దిపాటి పరిచయంతోనే - ఒకర్నొకరం బాగా ఎరగందే అంత తొందరగా అన్నందుకు,' అందట. సరే వెళ్లి పోతూందట. మాకు కని పించను గూడా లేదు. తర్వాత అది నవ్వుతూ నాకు చెప్పింది 'చూశావా! నాతో అట్లా చేశాడు. నీతో అట్లా చేశాడు; సితతో అట్లా; దీంతో ఇట్లా!! అవకాశా లున్నాయని యెంత దుర్వినియోగం చేసుకుంటారో చూశావా!' అసలు వివాహమంటే అర్థం కావడం లేదు ఎవరికీ."

తర్వాత సంభాషణ సీత విషయమై జరిగింది.

మరునాడు సీతతో ధైర్యంగా వుండమని చెప్పి, లక్ష్మి సర ళతోగూడా మద్రాసు బయల్దేరింది. త్వరలో లక్ష్మి, సరళా, ఇద్దరూ కలిసి వస్తామని చెప్పడంవల్ల సీత వదిలి పెట్టింది. మద్రాసుకు పోతున్నట్లు తెలు పుతూ, తనను గూడా రమ్మని రాజామణికి వ్రాశారు.

# 20

సరళ వెళ్ళిపోయిన రాత్రి సన్యాసిరా వింట్లోనే వుండిపోయాడు మురళి. అదతనికి బాగానే వుంది. పాత అభిమానం యే మాత్రమూ రాలేదు. మరునాడు దాదాపు 9 గంటలై వుంటుంది.

"చంపా! లలిత గారింటికి వెళ్ళి వస్తా" అన్నాడు.

"ఎందుకు?"

"ఈ దినం నాకు భోజనం అక్కడే."

"నీ వింట్ల బడిగా పోవడం నా కిష్టంలేదు."

"చంపా! ఏమిటి నీ వనడం!"

"అదికా దన్నా! క్షమించు. నే నా విధంగా భావించలేదు" అంటూ యేడుపు మొగంతో చెయ్యి పట్టుకొంది.

"నాకు తెలుసునమ్మా. నీ హృదయ భావం నాకు తెలుసు. అయితే అది కారి అట్లా వచ్చింది."

"అయితే ఈ దినం పోకపోతే ఏం అన్నయ్యా! యీ దినం మహేంద్రగూడా వస్తున్నాడు."

"సరే నేనెందు కిక్కడా?" అని నవ్వుతూ, "లలితగారి ఆజ్ఞ అనుల్లంఘ నీయమని తెలీదూ?" అంటూ బయల్దేరి వెళ్లాడు.

లలిత అన్నీ ముగించి స్నానం చేస్తూ వుంది. అప్పటికి దాదాపు 10 గంట లయింది. మురళి శబ్దం విని "అక్కడ కూర్చో వస్తున్నా" అని లోపలనుండి లలిత కేకవేయగా, అద్దం ముందు నిలబడ్డాడు. సన్యాసిరావు యింట్లో వున్న అతని చిన్ననాటి ఫోటోకు - యిప్పటి మురళి ప్రతిబింబానికి యే మాత్రమూ తేడాలేదు. 'అత నెవ్వరూ! నా తండ్రికాడు కదా! కాకపోతే అతనికీ నాకూ ఏదో చాలా దగ్గర సంబంధం వుంది, లేకపోతే యెల్ల చోట్లా పొడచూపే నా అభిమానమూ వ్యక్తిత్వమూ - ఆయన దగ్గిర యెందుకు పొడ చూపకుండా పోతాయీ?' ఇట్లా భావిస్తూ కుర్చీలో కూర్చున్నాడు. లలిత యింకా రాలేదని తొందరపడ సాగాడు. - 'ఏమన్నాగానీ యీ దినం ఖాయం చేసుకొని పోవాలి మా వివాహ విషయం. యీమెను చూడలేకపోతే నే నుండలేను. ఎపుడూ దగ్గర వుండాలంటే అట్టి బాంధవ్యాన్ని కలుగజేసుకోవాలి'-ఈ మాటలు కాస్త గట్టిగానే ఉచ్చరిస్తున్నాడు మురళి. అప్పటికి లలిత గుమ్మంలో నిలబడివుంది. ఈ మాటలు విన్నది. వికసించిన ఆ తేట ముఖంపై, ప్రకాశించిన ఆ ప్రసన్నత మురళిని ముగ్ధుణ్ని జేసింది. పరిశుభ్ర ఆకారంలో సర్వవిధాలా సౌష్ఠవాన్ని పొందిన ఆమె సర్వావయవాలూ వానిలో వుండే కామశక్తిని ప్రజ్వలింపజేశాయి. ఆమె అప్పటి కనుతీరూ - ఆ పెదవులపై చిరునవ్వూ- ఆ ప్రజల్విత శక్తిని ప్రకోపింపచేశాయి."నిజంగానా!" అన్న ప్రోత్సహిత ప్రశ్న అతని వుత్సాహ శక్తిని ప్రోత్సహించింది. ప్రఫుల్ల పద్మంపై పుష్పంధయం వ్రాలిన విధంగా, అమాంతంగా వాని పెదవులు వాలాయి ఆమె ముఖపద్మంపై. అనుమానించక మునుపే జరిగిన యీ ఆకస్మిక సంఘటన కామె ప్రచలిచ అయిపోయింది. భయంకాని ప్రకంపనం శరీరాన్ని ఆవరించింది. ఉపశమనానికి శరీరమంతా స్వేదపూర్ణమైంది. ఆ

కంపిత శరీరాన్ని మరింత గట్టిగా బంధించి, "లలితా!" అన్నాడు సోలి పోతున్న నేత్రాలతో చూస్తూ, ఏదో అనూహ్యమైన పరిష్వంగ సుఖాన్ని ఆమె అనుభవిస్తూ వున్నది. హృదయం ప్రేమపూర్ణమై వుబ్బితబ్బిబ్బులౌతూ వుంది. అంతకంతకూ పొంగి వుప్పొంగుతూ వుంది. ఎన్నో యేండ్లుగా తొక్కి-తొక్కి పట్టివుంచిన యేదో ప్రబలశక్తి, పట్టువదలి, ప్రగాఢంగా ప్రవహించి హృదయాన్నొక వుదధిగా జేసింది. ఆకస్మిక ఝంఝా మారుతాహతోత్తుంగ భంగసంకలితమై ఘూర్ణమానోదధి సామ్యంతో ఘూర్ణిల్లుతున్న దామె హృదయం. ప్రావృడ్ఝరీ ప్రవాహావే గోపహతయైన తుంగవలె ప్రతిఘటనాశక్తి అడుగునకు త్రొక్కబడినది. సొక్కిపోయినది. వివశయై సోలి పోయినది. లలితను మరింత గట్టిగా బంధిస్తూ - స్వేదజలోత్పన్న సౌరభాన్ని ఆఘ్రానిస్తూ-తమకంతో "లలితా?" అంటూ సోలిపోతున్నాడు మురళీ. తానే స్థితిలో వున్నదీ అపుడు గమనించింది. ప్రతిఘటనాశక్తి కాస్త పొడచూపింది. ఏదో అజ్ఞాత భావం దాన్ని ప్రబోధించి - ప్రోత్సహించింది. తటాలున తప్పు కోడానికి యత్నించింది. బంధం మరింత గట్టిగా బిగిసింది. "తప్పు! తప్పు!" అన్నదామె కనుబొమలు ముడిచి. పలకకుండా ఆమె హృదయంపై వ్రాలాడు. అతన్ని కుర్చీలో కూర్చోబెట్టి ప్రక్కనున్న కుర్చీలో కూర్చుంది.

"మురళీ! అంత తొందరపాటెందుకూ! తప్పు కదూ?" అంది.

"ఆపుకొనే శక్తి నాలో లేదు లలితా, ఎన్నాళ్లుగా ఆపుకొన్నానో అందు కెంత ప్రయత్నించానో - నీకు తెలీదు. నీవు యిన్నాళ్ళుగా దూర దూరంగానే వుంటున్నావు. అందకుండా వుండేకొద్దీ నాలో వాంఛ విజృంభించింది. అది శరీరం కలయికతోగాని అంతం గాదు."

"ఆ కలయిక అసంభవమైతే?"

"కాకూడదు. మన శరీరాలు ఒకటే కావాలి. ఆ విధంగా భగవంతుడు నిర్మించాడు."

"ఔను. నాలో యేదో అంతర్భూత శక్తి అదే అంటూ వుంది. అంచేత నిన్ను ప్రేమించాను."

"అయితే యిక దూరంగా వుండటం యెందుకు?"

"అందుకే యిన్నిక్కడ నాతో వుండి పొమ్మన్నాను."

"అందుకే త్వరలో వివాహమాడదాం."

"అక్కర్లేదు."

"అదేం! నీ కిష్టంలేదా! లేకపోతే మనమెట్లా ఒక చోట వుండగలం?" అన్నాడు తెల్లపోతూ.

"వివాహం ఎందుకూ?"

"ఎందుకంటే?"

"ప్రస్తుతం అందరూ భావించేది, కామతృష్ణ కొరకు. బిడ్డలు కనటానికి."

"ఔను."

"కామతృష్ణ నాకు లేదు."

"అదేమిటి?" అన్నాడు మురళి అదొక తీరులో ముఖంబెట్టి.

"ఏమీ లేదు. నిన్ను ప్రేమిస్తున్నాను. నిన్ను చూడలేక పోతే వుండలేను. యికలే భోంచేద్దువుగాని" అంది లలిత.

"వద్దు యిక భోజనం అక్కర్లేదు. కడుపూ హృదయమూ రెండూ నిండాయి."

"ఆఁ హాఁ!" అంటూ లాగి లేపింది. లోపలికెళ్ళారు. ఆ దినం ఆమె కంచంలోనే భోజనం పెట్టించింది. దగ్గర కూర్చొని కలిపి నోటి కందిస్తున్నది. పసిపిల్లవాడులాగా ఆమె సర్వాంగాలూ తిలకిస్తూ తింటున్నాడు. చిరునవ్వుతో ఆమె గూడా బిడ్డ నోటికి అన్నం కబళ్ళాన్ని అందిస్తూ ఆనందించే తల్లిలాగా ఆనందిస్తూ వుంది. అపుడపుడూ తానూ ఒక ముద్ద నోట్లో వేసుకొంటూ వుంది.

ఇంతలో సద్దు గాకుండా వచ్చారు అక్కడికి రుక్మిణీ, చంపకలు. ఆ దృశ్యం చూశారు. మురళి కొత్త గాబరాపడ్డాడు. లలిత ప్రశాంతంగానే, "చంపా! మీ అన్నయ్యకు అన్నం తినిపిస్తున్నా. యిూ వింతంగా లోపలికి

కోకపోతే రుక్మిణిద్ని చేసుకోలేనేమో" అంది. ప్రశాంతంగా, అంటున్న ఆ పలుకులు విని మురళి స్తంభీభూతు డయ్యాడు. ఆమె పలుకుల్లో తెచ్చి పెట్టుకున్న భావం యేమీ కనిపించలేదు. ఎంత స్వాభావికంగా వుండాలో అంత స్వాభావికంగా వున్నాయి. లలిత తన్ను పెండ్లాడదా యేమిటి? అనే అనుమానం చొరబడింది హృదయంలో. నోట్లో వేసికొన్న ముద్ద నోట్లో నేవుంది. "ఆశ్చర్యపడకబ్బాయ్! తిను" అని యిట్లా చూచేటప్పటికి అప్పటికే బయటికి పారిపోయారు చంపా రుక్మిణులు. నిన్న రుక్మిణి వివాహ విషయమయ్యే సుందరమ్మ లలిత దగ్గరి కొచ్చింది. లలిత చెప్పిన మాట తప్పదు అని సుందరమ్మను పురికొల్పింది. పైగా 'లలితగార్ని చూచి తీరాలి. అంతా నీవున్నట్లే వుంటుంది. మొన్న నేనూ, ఆమే అద్దం ముందు నిలబడితే మా ముఖాలు ఒకటిగానే వున్నాయి' అని రుక్మిణి ప్రోత్సాహించింది. ఈ కారణాల పురస్కరించుకొని సుందరమ్మ లలితను చూడ్డానికి వెళ్ళింది. లలిత ఎవరో తెలిసిపోయింది. ఇకనేం- తాను సిఫార్సు చేసే వ్యక్తిగా కాక, రుక్మిణి వివాహ విషయంలో బాధ్యత గల వ్యక్తిగా అయిపోయింది. నిన్న అక్కడున్నంత సేపూ లలితతో ఆ గొడవలే మాట్లాడింది సుందరమ్మ.

రుక్మిణి ఏనాడైతే మురళిని మొట్టమొదట చూచిందో ఆనాడే ఆమె హృదయం అతనివైపు ఆకర్షింపబడింది. దానికి చంపక సహవాసం బాగా ప్రోత్సాహమిచ్చింది. తర్వాత మురళి సుముఖత్వం గూడా కాస్త ధైర్యాన్నిచ్చింది. ఒకనాడు పెండ్లి విషయంరాగా రుక్మిణి మురళి విషయం చెప్పింది తల్లికి. కులవిషయంలో తలిదండ్రులు లొప్పుకోలేదు. కులాంతర వివాహం అంటే తలిదండ్రులకు ఎంతమంటా - ఆవేదనా - కోపమూ -, కలుగుతాయో అవన్నీ వీరిలోనూ కలిగాయి. రుక్మిణికి పట్టుదల హెచ్చింది, వాద ప్రతివాదనలు చెలరేగిన్నై. సహేతుకంగా ఎంతో వాదించింది రుక్మిణి. అయినా వాళ్ళకు పూర్తిగా నచ్చలేదు. తర్వాత తన తండ్రికి మురళీ, సరళా, చంపకలతో పరిచయం కుదిరినాక - వాళ్ల నీళ్ళింటికి రావడానికి మొదలు పెట్టినాక - అందాలరాణి తను. తనూ రైతు స్వర ద్రూపియైన వరుడు ప్రాప్తించడంవల్లా

అందులో వాళ్ళున్న వాతావరణం గ్రామ జీవితానికి భిన్నమైనందువల్లా - కథ పటికొక మోస్తరుగా చేసికోవచ్చు అనుకున్నారు తలిదండ్రులు. నిన్న కుల విషయంలో సుందరమ్మకూ లలితకూ గూడా, సంభాషణ జరిగింది. లలిత బాగా ఒప్పించి మురళిని ఒప్పిస్తానని చెప్పింది. తర్వాత సుందరమ్మ యింటికి రమ్మని ఆహ్వానించినా గూడా రాలేదు లలిత. వాళ్లు పోగానే తలుపు వేసి ఆలోచిస్తూ పడుకొంది. ఏమేమో ఆలోచించింది. ఒక నిర్ధారణ కొచ్చింది. ఇపుడు వాళ్ళిద్దరూ వచ్చింది మురళి కోసమే. ఫోంచేసి బయటికి రాగానే మురళిని చూచి, "అన్నా! నీ అదృష్టం చాలా గొప్పది. నీవేమో నా కేమీ లేదంటున్నావు. నీ పాదం మా యింట్లో పెట్టాలి మా యింట్లో పెట్టాలి అని అందరూ నీకోసం చస్తున్నారు. ఎందరిండ్లల్లో వుంటావో మరి" అంది చంప.

"ఎందరిండ్లల్లో వుంటాను చంపా! నాన్న యింట్లో వుంటాను."

చంప పట్టలేని ఆనందంతో కేక వేసి చెయ్యి పట్టుకొని పదన్నయ్యా! నాన్న నీ కోసం చూస్తూ వుంటాడు. అక్కడికి కెళ్ళిం తర్వాత మేము సుంద రమ్మగారిని నాన్న దగ్గరకు పట్టుకొస్తాం" అంటూ దారి తీసింది.

సన్యాసిరావు మురళీ మాత్రమే కూర్చొని వున్నారు. అప్పటికి 12 గంటలై వుంటుంది. "నీ వివాహం వైశాఖంలో యిక్కడే జరిపెయ్యాలని వుందోయ్" అన్నాడు సన్యాసిరావు నవ్వుతూ. మురళి ఏమీ పలుకలేదు. ఇంతలో వచ్చారు చంపా రుక్మిణి, ఆమె తలిదండ్రులూ. అందరూ కూర్చు న్నారు. చంపా రుక్మిణులు కాస్త వెనుక భాగంలో దూరంగా ఒక సోఫా పైన కూర్చున్నారు. మురళి సన్యాసిరావు ప్రక్కన వున్నాడు. మురళి కెట్లాగో వుంది హృదయంలో. చిన్నప్పటి నుండీ తన చేష్టలంతా ఒకటొకటే సినిమాలో బొమ్మల భ్రమణంలాగా తిరుగ జొచ్చాయి. సీతను గురించి ఆలో చించాడు. తాను విన్నవీ - సత్యారావు వ్రాసినవీ - హృదయాన్ని బాధపెట్టి, సీతనామనో నేత్రమునుండి తొలగించాయి. తర్వాత చంద్రమణీ-రాజామణీ ప్రస్తుతం కాలేజీలో కొందరమ్మాయిలూ-రుక్మిణీ లలితా - సరళా అందరూ

తిరుగ సాగారు. తానెందు కింత హీనంగా ప్రవర్తించాడో తనకే అగమ్య గోచరంగా వుంది. యెన్నిసార్లో తన్ను తాను మందలించుకొన్నాడు. ప్రమాణాలు గూడా తీసుకున్నాడు. నిలబెట్టుకోలేక పోయాడు. తాను గొప్ప గొప్పవారి జీవితాలూ - రచనలూ చదివిన వాడే. ఇతర విషయాల్లో కొంతవరకూ ఆచరణ శక్తి అలవరచు కొన్నాడు. ఈ ఒక్క విషయంలో మాత్రం నెగ్గలేక పోతున్నాడు. తాను చేసిన దానికంతా పశ్చాత్తాప పడేవాడు. కాని అది యెంతో కాలం వుండేది కాదు! స్త్రీ జాతి అంటే అతనికి మర్యాద వుంది. వారి పరిస్థితులు చూచి సానుభూతి చూపిస్తాడు. స్త్రీల నెవరన్నా అనవసరంగా గానీ - ఆధిక్య భావంతో గానీ - దూషించినా - అవమాన పరిచినా - సహించుకొనే వాడు గాడు. బీదల విషయంలో గూడా చాలా వుదారంగా వుండేవాడు.

ఎన్ని సుగుణాలున్నా వ్యభిచార గుణం వుంటే అవన్నీ మరుగు పడ్తాయి. సంఘంలోని వ్యక్తులు దాన్ని క్షమించరు. కడకు వ్యభిచారిగూడా సానుభూతి చూపడు. వ్యభిచారంపై గల ఆ భావం చాలా విచిత్రమైంది —

వాళ్ళందరూ మాట్లాడుకుంటూనే వున్నారు. ఇతన్ని ప్రశ్నించేంత వరకూ యితడు భావాంబరంలో విహరిస్తూనే వున్నాడు. "నీ యిష్ట మేమిటి మురళీ?" అన్న వాక్యం విన్నంత వరకూ అతను మామూలు ధోరణిలో లేడు. లలిత విషయం తళుక్కున మెరిసింది. ఆమె కడపట అన్న భావం సమ్మెటపోటులాగా తగిలింది. తాను తన్ను వివాహ మాడదట - రుక్మిణిని చేస్తుందట. ఇద్దర్నీ యింట్లో వుంచుకొని ఆనందిస్తుందట! —

"నాకింకా కాస్త వ్యవధి కావాలి. మా అక్కయ్య రాందే యేమీ చెప్పలేను" అన్నాడు మురళి. సన్యాసిరావు మురళి వైపు చూశాడు. సుందరమ్మా ఆమె భర్తా మురళిని చూస్తూ, మళ్ళా వాళ్ళ కెదురుగా, గోడపై నున్న ఫోటో చూచి, "అది మురళిదే కదూ!" అన్నారు. చంపక నవ్వుతూ, "అందరూ అట్లాగే అంటారు. కాని అది మా నాన్న పసితనంలోది" అంది. సుందరమ్మ వచ్చినప్పటి నుండి సన్యాసిరావు వైపే చూస్తూ వుంది. అతనూ చూస్తూనే వున్నాడు. ఔను! చిన్నప్పు డట్లాగే వుండేవా డాయన.

అయితే అది మురళి ఫోటో అని అందరూ భ్రమపడేలాగుంది. అసలు మురళికీ, సన్యాసిరావుకూ, రూపంలో భేదంలేదు. మారువేషంలో వచ్చిన మురళి లాగే వుంటాడతను. చంపక తల్లిపోయి యిప్పటికి పన్నెండేళ్లు. అప్పటికి అతని వయసు 28. తర్వాత అతను వివాహం చేసుకోలేదు. అప్పటి నుంచీ బ్రహ్మచర్యమే.

చాలాసేపయ్యాక "నేను షావుకెళ్తున్నా" అని వి.కె. రావు వెళ్లాడు. చంపా రుక్మిణులు మేడమీది కెళ్ళారు. పైనుంచి పిలువగా మురళిగూడా వెళ్ళాడు. అక్కడ మిగిలింది సన్యాసిరావు సుందరమ్మ మాత్రమే.

"సుందరమ్మా! నీకు తోబుట్టువులు ఎవరైనా వున్నారా?"

"అవును. వకుళ అని ఒక అక్కమాత్రం వుండేది" అంది సుందరమ్మ జవాబుగా.

"సరే! సందేహం తీరిపోయింది."

"మీరు ఆ సన్యాసిరావుగారే అనుకుంటాను."

"నిస్సందేహంగా" అన్నారు ఉత్సాహంగా. సుందరమ్మ ముఖంలో సంతోషం కనబడలేదు. విద్వేష భావమూ కనబడలేదు. ఒక మోస్తరుగా కూర్చొనివుంది ఆలోచిస్తూ.

"ఆ సంఘటన తలచుకొని ద్వేష్యం పూనుకున్నావా?" అన్నాడు సన్యాసిరావు.

"లేదు. ఎప్పుడో 19 యేండ్లనాటి సంఘటనకై ద్వేషించి లాభమేమిటి?"

"అయితే సుందరమ్మా! వకుళ జాడలు తెలిశాయా?"

"లేదు" అని బొంకింది.

"నేనుగూడా ఎంతో వెదికించాను. మన గంజాం జిల్లానే గాక యింకా ఇతర జిల్లాలుగూడా వెదికించాను. ఫలితం లేకపోయింది" సన్యాసిరావు ముఖంలో చింతాచిహ్నాలు పొడచూపాయి.

"మంచిపని చేశావు. అది ముందే వుండి వుంటే యింత కాక పోయేది. పైగా మొసలి కన్నీరు!" అంది సుందరమ్మ.

"నీ భావం నా కర్థమైంది సుందరమ్మా! స్త్రీల మాదిరి పురుషులు ప్రేమించ లేరనీ - స్త్రీలు చూపిన పట్టుదల చూపరనీ - మోసం జరిగినాక చింతను నటిస్తారనీ నీ వనుకుంటున్నావు. చాలావరకూ అట్లాగాదు. నా విషయం నీకు తెలీదు. నేను వకుళ నెంత ప్రేమించానో ఆమెకు తప్ప మరెవరికీ తెలీదు. ఆనాడు కులవిషయంలో నా తలిదండ్రులూ - దగ్గర బంధువులూ ఆ విధంగా ప్రవర్తించక పోయివుంటే యింత జరగక పోయేది. అసలు మా అమ్మ విషం చేతులో పట్టుకొని నన్ను బెదిరించక పోయివుంటే నేను ఆ వివాహానికి ఒప్పుకొని వుండేవాణ్ణి కాను. అపుడు పెండ్లాడక తప్పింది కాదు. అపుడుగూడా వకుళను యెంతో బ్రతిమాలాను, తప్పకుండా రెండవ వివాహం క్రింద చేసుకుంటానని. ఆమె వినలేదు. నామాట విశ్వసించలేదు. తనకు జరిగినదాన్ని భరించలేక బయలుదేరి పోయింది అంతే! తర్వాత మానసికంగా నేనెంత బాధపడ్డానో ఆ పరమేశ్వరునికే యెరుక. నేను స్వయంగా వెళ్లి చాలాచోట్ల వెదికాను. ఆమె కొరకెంతో బాధపడ్డాను. చేసుకున్న భార్యను కూడా సరీగా చూడలేదు. ఆమెను గూడా నన్ను యేనాడూ బాధపెట్టలేదు. తర్వాత భర్తగా నా విధిని నేను నిర్వర్తించాలని తెలుసుకున్నాను. ఆమెలో గూడా వకుళనే చూస్తూ వుండేవాణ్ణి. నా భార్య మరణ విషయం నీకు తెలిసిందే. ఆమె చావుకు నే నేమీ దుఃఖించలేదు. ఎందుకంటే మొదటి భార్యగా స్వీకరించిన వకుళే లేనపుడు యీమెకూడా లేకుండటమే మంచిదనిపించింది. అప్పటికి నాకు 28 యేండ్లే. ఎంద రెందరో వచ్చారు పిల్లనిస్తామని. నే నొప్పుకోలేదు. వకుళను మనసులో నిలుపుకొని చంపకను పెంచుకుంటే సరిపోతుందనుకున్నాను. ఇపుడు నాకేమీ అవసరంలేని స్థితిలో వున్నాను. అయితే ఈ క్షణంలోనైనా వకుళ లభిస్తే ద్రోహం చేశాను అని బాధ పడుతున్న భాగంగూడా ఆరోగ్యం పొందుతుంది. ఆమె నిపుడు నేను యే స్థితిలో వుంచుకుంటానో ఎవరికి తెలుసు? ఆమె బ్రతికి వుందనే నమ్మకం నాకు లేదు. ఒకవేళ బ్రతికేవుంటే బ్రహ్మచారిణిగానే వుంటుందని నా నమ్మకం!"

"నాకూ అదే నమ్మకం! ఆమె కనిపిస్తే మీరు అంత ఆదరణతో స్వీకరిస్తారా!"

"దేవతనులాగా స్వీకరిస్తాను!"

...."ఎన్నమకుంటే యేముందిలెండి!" అంటూ లేచింది. పైనున్న రుక్మిణిని పిలిచి, "నేను లలితగారింటికి వెళ్ళివస్తాను యిక్కడే వుండు" అంది.

"మేమందరమూ యిపుడే వెళ్ళొద్దామనుకుంటున్నాము. మేమూ వస్తాం పద."

"వద్దు. నాకు కాస్త రహస్యపు పని వుందామెతో. తర్వాత వెళ్ళండి మీరు" అంటూ యిటు తిరిగి "మీరు కూడా రావాలి దయచేసి. ఏమీ అనుకోకండి!" అంది సన్యాసిరావుతో.

"ఆమె నే ఒక్కసారి ఆహ్వానిస్తే బాగుండదూ? సుందరమ్మా. నేనెందు కక్కడికి?"

"అట్లా కాదులెండి. ఆమె పురుషుల కలుసుకోడానికై ఎవరింట్లకూ వెళ్ళదట?"

"అయితే తన యింటికెళ్ళి పురుషులు కలుసుకోవచ్చా?" అంటూ నవ్వాడు.

"అది వేరు విషయం. అదిగూడా తప్పనిసరి క్రింద వస్తేనే."

కారు బయలుదేరింది. వీళ్ళు వెళ్ళేటప్పటికి మూడు గంటలైంది. లలిత పాలు కాస్తూ వుంది లోపల. సుందరమ్మ బయటనుండే 'అక్కయ్యా!' అని కేకేసింది. 'కూర్చో వస్తున్నా' అంది లలిత లోపలనుండే. 'మీరిక్కడ కూర్చోండి' అని అక్కడ సన్యాసిరావును కుర్చీలో కూర్చోబెట్టి, గది గుమ్మంలోకి వచ్చేటప్పటికి లలితగూడా వచ్చింది.

"నీ కొక అమూల్య నిధిని తెచ్చానక్కా! నా కేమిస్తావ్?" అంది అక్కడే నిలవేసి.

... "ఏమిటే! ఏమిటా నిధి? అంత నిధే దొరికితే అది నీకూ ఆనందమేగా? అట్టి ఆనందంకన్నా అన్యమైన బహుమానం మరేముంది!"

"భగవంతు డెంత దయామయు డక్కా! ఒకరి కోసం ఒకరు పరి

తపించే హృదయాల స్వచ్ఛతను పరీక్షించి యెప్పటికైనా వాటి నొక్కటిగా చేర్చకపోడు.''

''ఏమిటీ! నీ వుపక్రమణోపన్యాసం!''అంటూ లోపలికి చొరబడింది. ఆ లోపలి వ్యక్తి తటాలున, చూశాడు. నాలుగు నేత్రాలూ కలుసుకున్నాయి. చూపులు పెనవేసికొని తీయబోయినా రాలేదు. చూపుల వెంట హృదయాలు పరుగిడినాయి. ఏదో ఒక అపూర్వ సంఘటనను తిలకిస్తూ వున్నారు! ఒక హఠాత్సంఘటన, ఒక కలలోని దృశ్యం! నమ్మశక్యంగాని ఒక రసవత్తర ఘట్టం! లలిత హృదయం వుబ్బి తబ్బిబ్బు లయింది. హృదయంలోని ప్రేమ రసం జలమై ప్రవహించి ఆనందాశ్రువులుగా వ్రాలాయి. ప్రేమ ఝరీప్రవాహం వూర్ధ్వముఖమై ప్రవహిస్తూ, ఆమెను ముందుకు తోసింది. ''నీవేనా!'' అంటూ అతని కాళ్ళదగ్గర వ్రాలింది.

''అవును వకుళా నేనే'' అని తల నిమిరా డా వ్యక్తి గంభీరంగా కూర్చొని. ఆ దృశ్యాన్ని చూస్తూ - ఆనందబాష్పాలు రాలుస్తూ - నిల్చుందల్లే సుందరమ్మ. చాలా సేపటి వరకూ ఎవరూ మాట్లాడలేదు. ఏమి మాట్లాడాలో ఎవరికీ తోచలేదు. కడపటికి సన్యాసిరావు ఆనందాన్ని అదిం పట్టుకొని అన్నాడు:

''నీవు ఏ మాత్రమూ మారలేదు వకుళా! అప్పటిలాగానే ఉన్నావు.''

''భౌతికంగానా? మానసికంగానా?''

''భౌతికంగానే వకుళా! మానసికంగా ఎంతో వున్నత స్థితి పొందావు. లేకపోతే దేవుడు మళ్ళా నన్ను నీ దగ్గరికి పంపడు''

''నీవూ అంతే. వేషంలో వున్న వ్యక్తినిలాగా నిన్ను గుర్తుపట్టాను. శారీరకంగా నీలో ఏలాటి మార్పులూ లేవు.''

''అవును! ఇద్దరూ బ్రహ్మచర్య వ్రతంబూని ఒకరి కోసం ఒకరు తపస్సు చేసుకుంటున్నారుగా. తపస్వుల దేహాలు జరావృతాలు కావుగా.'' అంది సుందరమ్మ మహాతృప్తితో.

''అవును. బాగా అన్నావు'' అన్నా రిద్దరూ.

"సరే! యింకెందు కక్కా! నీ వంటరి సంసారాన్ని లేపెయ్"

"నిదానించు సుందరీ! మన చుట్టూ ఎంతమంది పెండ్లి యీడు వచ్చిన పిల్ల లున్నారో తెలుసుగా! ఇది వాళ్ళకు విదానంగా తెలియ వలసిన విషయం!"

"నిజం! నిజం! బాగా చెప్పావు" అని లలితను చూచి అంటూ-

"అంతే సుందరమ్మా" అన్నాడామె నుద్దేశించి సన్యాసిరావు.

"నేను యిక వెళ్ళి కొన్ని అర్జంటు పనులు చూచుకోవాలి. వస్తా. అక్కడికివెళ్ళి కారు పంపిస్తా మళ్ళా మీకు."

"అక్కర్లేదు. నే నెట్లాగో రాగలను."

"అన్నట్టూ....పిల్లలిక్కడికి రావాలని అన్నారుగా."

"సరే రమ్మను:"

సుందరమ్మ వెళ్ళిపోయింది.

# 21

సరళ వస్తున్నట్లు తంతివార్త వచ్చింది. మురళితోపాటు చంపకా రుక్మిణులు చాలా ఆనంద పడ్డారు. ఆతృతతో స్టేషనుకు పరుగెత్తారు ముందే. ఎంతో సేపు యెదురు చూడగా బండి వచ్చింది. సరళ దిగగానే మురళి పరుగెత్తు కుంటూ దగ్గిరికి వెళ్ళి, "అక్కా! ...." అని అవతలేమీ అనలేక నిలబడ్డాడు వూరికే. చంపకా రుక్మిణులు చెరొకవైపు చేరారు చేతులు పట్టుకొని, మురళి భావాన్ని సరళ గ్రహించింది.

"తెలుసు మురళీ! నీ వెంతగానో బాధ పడి వుంటావు. నేను అప్పటి బాధను అనుభవించలేకనే చెప్పకుండా వెళ్ళి పోయాను. అయితే చంపక వుంది కదా అనే ధైర్యం మాత్రం-వుండింది" అంది తృప్తితో చంపక వైపు చూస్తూ.

"అంతేలే ఎంత రాచుకొని తిరిగినా మేం దూరస్తులమేగా!" అంది రుక్మిణి మొహమాటంగా.

"ఆ మా టెవరన్నారే? నీవూ అందులో దానివేగా, అంత బాధ్యత వహిస్తున్న దానివేలే." అంటూ అంతలోకే సామాన్లన్నీ కూలిచేత క్రిందికి దింపించి దిగిన లక్ష్మిని చూచి, "ఇదో యీామె లక్ష్మి - బాల్య స్నేహితు రాలు. ఈమెను గురించి యెంతైనా చెప్పవచ్చు. మీరు చూస్తారుగా" అంది. మురళి లక్ష్మిని చూచి చాలా సిగ్గుపడ్డాడు. లక్ష్మి మామూలుగానే అతనివైపు చూస్తూ. "బాగున్నావా మురళీ?" అంది.

"అవును లక్ష్మి" అన్నాడు ముక్తసరిగా. లక్ష్మి అంటే అతని హృద యంలో భయమే!

అందరూ కలిపి లలిత యిల్లు - సన్యాసిరావుగారి యిల్లు సుంద రమ్మ యిల్లు తిరిగి వచ్చారు. మూడోనాడు అందరికీ భోజనం సన్యాసిరావుగా రింట్లో. అందులో అందరూ పాల్గొన్నారు. లలిత వచ్చింది. సుందరమ్మా - ఆమె భర్తా వచ్చారు. ఇక మిగిలినవారు మామూలే. మహేంద్ర గూడా వచ్చాడు. భోం చేస్తూ మాట్లాడుకొంటూ, నవ్వుకుంటూ వున్నా రందరూ. సన్యాసిరావన్నాడు:

"ఈకొద్ది పరిచయంతోనే లక్ష్మిని నేను బాగా అర్థం చేసుకో గలి గాను. ఆమె చదువు చూస్తే అంత గొప్పదిగా కనిపించదు. మాటలుచూస్తే చాలా జ్ఞానవంతంగా వున్నాయి. మరి యెట్లా సంపాదించిందో?"

"లక్ష్మికి వాళ్ళనాన్న యిచ్చిన శిక్షణ చాలా గొప్పది బాబాయ్! అందులో ఆమె చదివినన్ని పుస్తకాలు మేమెవరమూ చదవలేదు. అనుభవ జ్ఞానంగూడా వుంది. అదేగాదు విషయాల గురించి చాలా సునిశితంగా ఆలో చిస్తుంది" అంది సరళ.

"ఆఁ! అట్లాచెప్పు. అసలు జ్ఞానం కలిగేదపుడే. విషయాలపై యెపుడు ఆలోచించడానికి వ్యక్తి పూనుకుంటాడో, అపుడే జ్ఞానం కైవసం."

"ఏదో లెండి. మీ వాత్సల్యం అట్లా అనడానికి ప్రోత్సహించింది.

మీ బోటి పెద్దల ముందు మే మెంత! మా జ్ఞాన మెంత! మా అనుభవ మెంత!'' అంది లక్ష్మి సాధారణ వినయ ధోరణిలో.

''ఎంతో ముచ్చటగా మాట్లాడ్తావమ్మా. నీ మాటలు వినేకొద్దీ నిన్నిక్కడే వుంచుకొని యెపుడూ మాట్లాడించుకుంటూ వుందామా అనిపిస్తుంది.''

''లక్ష్మి వుండాల్సిందే నాన్నా! వుంటే యెంతో బాగుంటుంది' అంది చంపక లేచి వుత్సాహంగా.

''కూర్చునే మాట్లాడరాదటే. అంత వుత్సాహమా?'' అంది సరళ మందహాసం కనబరుస్తూ.

''అంతే. లక్ష్మి యిక్కడ వుండ దగిన మనిషే సర్వ విధాలా'' అంది లలిత.

''చూశావా? ఆ మాట అతి విలువైనది. అంత అర్హతా - అంత అనుబంధ భావమూ - అంత అనురాగమూ లేందే ఆ మాట ఆమె నోటి వెంట రాదు. ఇంతమందీ అనరు!''

''ఉందామనేగా వచ్చాను! అయితే లలితగారు కూడా యిక్కడే వుండిపోవాలి'' అది అసంభవ మనే భావంతో అంది లక్ష్మి.

''నిజమా! ఆ విధంగా నీవు బాస చేయగలవా! ఆ ప్రతిజ్ఞపై వుండగలవా!''

''ఓ! ప్రతిజ్ఞ చేశాను. ప్రతిజ్ఞ అంటే యెంత విలువైనదో నాకు తెలుసు. నా ప్రతిజ్ఞ తల కోసివేసినా మారదు.''

''చిక్కింది!'' అని ఒక్కసారిగా అంటూ ఒకరి మొగాలు ఒకరు చూచుకున్నారు లలితా సన్యాసిరావులు. అందులో అర్థం అందరికీ అవగాహనం కాలేదు సుందరమ్మకు తప్ప.

''ఒక విషయం వుంది సరళా! నీ వీ నాడే, చంపకతో వెళ్ళి ఆ యింటికి యివ్వాల్సిన బాడుగ యిచ్చేసి వాళ్ళ స్వాధీనం చేసి రామ్మా'' అన్నాడు సన్యాసిరావు మక్కువతో.

''ఇంకా జరగనీ బాబాయ్, తర్వాత చూచుకోవచ్చు'' అంది సరళ.

"ఏమిటి నీ కా అభిమానం! పెద్దవాణ్ణి గదమ్మా. ఇన్నిసార్లు, వుల్లంఘి స్తే యెట్లా?"

"ఎపుడు కూడా యిక్కడే వుంటున్నాం గద బాబాయ్! ఆ యిల్లు అట్లావుంటే పోయే దేముంది?"

"ఇంత యిల్లుండగా అదెందుకమ్మా?"

"వద్దు బాబాయ్, క్షమించు."

"నిజంగానా! అయితే నేను అన్నం తినకుండా లేస్తున్నా" అని లేచింది, చంపక నిర్ధారణతో.

"చంపకా ఏమిటది?" అంది సరళ.

"ఉండిపోరాదూ సరళా!" అన్నారందరూ ఒక్కుమ్మడిగా.

"సరే బాబాయ్! అట్లాగా చేద్దాం. అయితే కాస్త గడువివ్వండి."

వరసగా విందులు యిక్కడో, సుందరమ్మ యింట్లోనో, లలిత బసలోనో జరుగుతూనే వున్నాయి. లలిత యెంత వుత్సాహంగా వుందో అందరూ గ్రహిస్తున్నారు. ఆమెలో ఏవో విజృంభిత శక్తులు కనిపిస్తున్నాయి అందరికీ!

అట్లా రెండు దినాలు గడిచాయి. సరళ బసలో సరళ, మురళి, లక్ష్మి మాత్రం కూర్చున్నారు. లక్ష్మి సీత విషయం మాట్లాడుతూ వుంది. మురళికి ఆ పేరే కిట్టడం లేదు. లక్ష్మి మాత్రం కథ సాగిస్తూనే వుంది:

"చూడు సరళా! దాని శరీరమంతా ప్రేమమయ మంటే నమ్మ. నీకు తెలుసు సాధారణంగా అన్నదమ్ములకు వలెనే, అక్కచెల్లెళ్లుగూడా కొద్దో గొప్పో మత్సరం గలిగివుంటారని! చిన్నప్పటినుండీ ఏదో సన్నిహిత భావం వాళ్ళల్లో నాటుకపోయి వుంటుంది గాబట్టి - ఒకర్నొకరు మర్యాద, మన్ననలతో చూచుకోవాలనే బాధ్యతవుంటుంది గాబట్టీ - కొద్దిగా ఒక రభిప్రాయాల కొకరు దోహదమిస్తూ వుంటారు. అంతే! అతి సాధారణ విషయాల్లో సైతము కలతలుపడి ఒక ర్నొకరు తేలిగ్గా విడిచి పోగూడదనే భావం మొదట్నుండీ వాళ్ళల్లో ఇంకిపోయి వుంటుంది. అయితే నాకూ మా సీతకూ ఏలాటి అభిప్రాయ భేదమూ వచ్చినట్లు నే నెరుగను. అది పైకి ఎంత

అమాయికగా, అందరికీ కనబడుతుందో, అంత గడుసుది. బహుగుండె నిబ్బరం గలది. శాంతము, దయ, ప్రేమ, అనే మూడు సిద్ధాంతాలను అది యెంత బాగా అలవరచుకుందో, దాన్ని అర్థంచేసుకొన్న వాళ్ళకే తెలుసు. అందుచేత అదంటే నా కమితమైన ప్రేమ. దాన్ని ఎపుడూ తొడలపై పడుకో బెట్టుకొని శరీరాన్ని నిమురుతూ ఆనందంగా కూర్చుండిపోదామా అనిపిస్తూ వుంటుంది. ఆ విధంగా, సంతృప్తితో ప్రాణాలుగూడా వదిలేద్దామా అని పిస్తుంది. దాని ప్రేమగాథ చెప్పానిది వరకే. అది మురళిని ఎంతగా ప్రేమించిందంటే - తన కిట్లాంటి గతి పడుతుందని ఊహించిగూడా, అతని కామానికి దోహదమిచ్చింది. దానికి ప్రతిఫలం యిపుడు అనుభవిస్తూవుంది. అయితే, ఎవరి దుష్టకార్య ప్రతిఫలం అది అనుభవిస్తూవుందో, ఆ వ్యక్తి యిక్కడ, యిష్టమొచ్చిన వాళ్ళను అనుభవిస్తూ, పైగా దానిపై నిందలు వేస్తూ, శత్రువులాగా చూస్తున్నాడు. దానిపై వేయి నిందలుపడినా మొదట అది లెక్కించలేదు. ఎపుడైతే మురళి అవి నమ్మాడని తెలుసుకుందో - ఎపుడైతె మురళి బెజవాడకొచ్చిగూడా మా యింటిపై పొకసారయినా తొంగి చూడలేదో - అప్పటినుండీ, దానికి దిగులూ, అసహ్యమూ, పట్టుకున్నాయి. ఆ నాటినుండీ కృశించి పోతున్నది. దానికీ తెలుసు మురళి వ్యభిచారి అయి పోయాడని. నిజమైన వ్యభిచారి అయినా అది ప్రేమిస్తున్నది. అది వ్యభిచారిణి కాకపోయినా నిందల విని, మురళి దాన్ని ద్వేషిస్తున్నాడు. ఈ విషయంలోనే, నాకూ దానికి తగాదా వస్తుంది:-'నీ ప్రేమ స్వచ్ఛమూ, నిష్కళంకమూ, అయినప్పటికీ, అతను నిన్ను చాలా పేలవంగా భావించి, నీచంగా చూస్తున్నాడు. అతను పెద్ద వ్యభిచారి అని తెలిసిగూడా, నీవెందుకు ప్రేమిస్తావు? స్త్రీ వ్యభిచారిణి అని, పురుష దనుమానపడి, త్యజిస్తూవుంటే, పెద్ద వ్యభిచారి అని తెలిసిగూడా, స్త్రీ, ఆ పురుషుణ్ణి పట్టుకొని యెందుకని ప్రేలాడాలి?' అని నేనంటే - దాని కదేమిటో సమాధానాలు చెబుతుంది. వాద మట్టట్టా యెంతదూరమో సాగుతుంది. అది నన్ను సమాధానపరచాలని ఎంతో చూస్తుంది. ప్రస్తుత సంఘంలోని వ్యత్యస్త ధర్మాలను నామాదిరది తీవ్రంగా విమర్శించదు. కొంతవరకూ మార్జిన్ వదలా లంటుంది. అయితే...."

ఇంతలో అర్దొచ్చింది వరళ—

"అది చాలామందిలో వుంది లక్ష్మీ! అది కేవలం పురుషాధిక్య భావంపై ఆధారపడి వుందని తెలుసుగా! స్త్రీలలోగూడా దాని కనుగుణంగా న్యూనతాభావం లేకపోలేదు. ఈ రెండు భావాలూ పరస్పరం యిరువురిలోనూ వున్నాయిగాబట్టే యీ విధంగా జరుగుతున్నది. సంఘం, స్త్రీని, సాంఘికంగా - అంటే, ఆర్థికాది విషయాలలో స్వతంత్రం లేకుండాచేసి, ఆజన్మాంతమూ యెవరో ఒకరిపై ఆధారపడి వుండాలని చేయడమే దీనికి కారణం. స్వేచ్ఛలేని జాతి యెపుడూ స్వేచ్ఛగా భావించలేదు. వాళ్ళ భావాలకు ఔన్నత్యమన్నది వుండదు. ఎపుడూ సంకుచితంగానే వుంటాయి. చత్వారి అద్దాలకు అలవాటు పడిన చూపులు ఎపుడూ అధోముఖంగా వుంటాయి. అట్లాగే అణిచి పెట్టబడిన స్త్రీల భావాలుగూడా. పురుషుల విషయమైనా అంతే. దానికి తార్కాణం, ఇంతవరకూ దాస్యంలో మునిగి, అజ్ఞానంలో వున్న మన దేశవాసులే! విద్యాగంధం లేనివా రెవరైనా స్వతంత్రంగా ఆలోచించ గలుగుతున్నారా? స్త్రీ స్వాతంత్ర్య విషయాల్లో - కులవిషయాల్లో - మతవిషయాల్లో - ఆచార విషయాల్లో - జాతీయాంతర్జాతీయ విషయాల్లో కడకు కవిత్వ విషయంలో గూడా బాగా చదువుకున్న వారికీ, కొద్దిగా చదువుకున్న వారికీ - చదువురాని పట్టణవాసులకూ, విద్యాగంధంలేని పల్లెవాసులకూ భేదం చూస్తూన్నాం గదా! వారి భావనలో ఎంతో వ్యత్యాసం కనిపిస్తుంది. ఇంతకూ తేలిందేమిటంటే అణిచి పెట్టబడిన స్త్రీజాతి ఈనాటికీ స్వేచ్ఛగా ఊహించలేకుండా వుంది అని. అందుచేతే విద్యాధికలైన బాలికలుగూడా - పైకి పురుషాధిక్యాన్ని ద్వేషిస్తూ, ఆ విధంగా ఉపన్యాసాలు దంచుతూ, సమయం వచ్చేటప్పటికి సహజాతోత్పన్నంగా (Instinctive) వారికి ఉన్నతస్థానమిచ్చి, అధోస్థానాన్ని ఆక్రమిస్తారు. అదే - వ్యభిచారాధిక్యతవల్ల పుచ్చిపోయిన శరీరంగల పురుషుడు, ఒకమ్మాయిని చేసుకోమన్నపుడు ఆమె ప్రవర్తన మంచిదేనా అని అడుగుతున్నాడు. ఏదో పొరపాటున, కావాలని ఎవడన్నా, ఆ పిల్ల వ్యభిచారిణి అని అంటే. నే చేసుకో నంటాడు. ఆ దెవరితోనన్నా వూరికే మాట్లాడిందన్నా

పీడి కనుమానమే. అసూయగూడా. అయితే, అట్టి వ్యభిచార పురుషుణ్ణి చేసుకోమన్నపుడు స్త్రీ ఆ విధంగా భావించడం లేదు. ప్రస్తుతపు పోటీల్లో, తనకు వివాహం జరిగితే చాల్లే అనే భావం దీంట్లో వుంటూవుంది. ఒకవైపు తలిదండ్రులూ-రెండోవైపు ఆర్థిక స్వతంత్రత, దీనికి కారణాలు. చదువు కున్న పిల్లలు ఈనాడు వివాహ విషయంలో దెబ్బ తింటున్నారు. దానికి రెండు కారణా లున్నాయి. ఒకటి చదువురాని పిల్లలుగూడా, మితిలేని కట్నాలు యిస్తామంటూ చదువుకుంటున్న పిల్లలతో పోటీ చేస్తున్నారు. ప్రత్యమ్నాయంగా చదువుకున్నపిల్ల చదువురానివాణ్ణి జేసుకోలేదు. ఈ పరి స్థితిలో నైతికంగా పతనం పొందిన ప్రస్తుత యువకుడు, వివాహమంటే అర్థంకాని అజ్ఞాని, కేవలం కామక్రీడకూ, సేవచేయటానికీ ఎవరయితే యేం అని భావించే పంద - ధనానికి మాత్రం ప్రాధాన్యమిచ్చి, ఆ చదువురాని దాన్నే చేసుకుంటున్నాడు. మరొకటిగూడా వుంది. చదువుకొనే పిల్లల్లో నడత వుండదని నడతలేని వాడికిగూడా నమ్మకం. వాళ్లు తప్పకుండా చెడి వుంటారని వాడిభావం. ఎందుకంటే, వీళ్ళల్లో వున్న స్వతంత్ర భావం, చదువువల్ల వాళ్ళకు కలిగింది వుండగా - దానివల్ల క్లాసుమేటుతోనో, మరెవరితోనో, మాట్లాడితే-అంత మాత్రానికి గూడా వ్యభిచారాన్ని అంట గట్టి ఏవగించు కుంటారు. మరొక టేమిటంటే:- చదువుకున్న పిల్లను చేసుకుంటే - భార్యపైన ఎన్నివిధాలుగానైనా అధికారం చలాయించ వచ్చుననే భావం వంశ పారంపర్యంగా అలవరచుకున్న పురుషుడు, "చదువు కునది పిల్లలు విధేయత చూపరు. ఎడ్డెం అంటే తెడ్డెం అంటారు - అనే భయభావం గూడా వాళ్ళల్లో వ్యాపించింది. అంచేత ప్రస్తుతం చదువుకుంటున్న అమ్మాయిలకు వివాహ విషయంలో మంచి దెబ్బ తగుల్తూ వుంది.

"అది నిజం. పురుషులూ, స్త్రీలూ, వాళ్ళ ప్రస్తుత భావాలు మార్చు కుంటేగాని ఈ సమస్య చక్కబడదు" అంది చంపక అపుడేవచ్చి.

ఇంతలో రుక్మిణిగూడా వచ్చింది. వాదంలో నిమగ్నులైన వీళ్ళంతా కూర్చోమన్నట్లుగా ఆమెకు సంజ్ఞ చేశారు. మురళి సద్దుగాకుండా దాటు

కున్నాడు 'ఇదో వస్తా' అంటూ. లక్ష్మి మళ్ళా అంది మురళి వెళ్ళిపోవడాన్ని చూస్తూ:-

"అదేగాదు దీనికి మంచి విరుగుడేమంటే:-ఇదివరకే సరళ చెప్పిందిగా ఆ స్వతంత్ర హృదయులు ఉన్నతంగా ఆలోచించలేరని! ప్రస్తుతం చదువు కుంటున్న బాలికలుగూడా వట్టి చేతగాని వా ళ్ళయిపోతున్నారు. వాళ్ళ చదువు వాళ్ళకేమన్నా ఉపకారం చేస్తున్నదా అంటే నాకు నమ్మకం లేకుండా పోతు న్నది. చదువుకొనేకొద్దీ, చదువువల్ల అవిధేయులై పోతున్నారనే అసూయ నినాదాలు విని అట్టినిందలు రాకుండా చేసుకోవాలనే భావంతో వీళ్ళంతా చేత గాని వాళ్లుగా తయారౌతున్నారు. వాళ్ళనుచూ స్తే నిజంగా జాలివేస్తున్నది. దైహికంగానూ, మానసికంగానూ వాళ్లు వట్టి దుర్బలలై పోతున్నారు. వాళ్ళంతా వాళ్ళ సంస్కారాన్నీ, స్వాతంత్ర్యాన్నీ వ్యక్తిత్వాన్నీ గుర్తించు కొని, కట్నమడిగే నీచుణ్ణి చేసుకోమనీ-అసలు స్వకులంలో చేసుకోమనీ- పట్టుపడితే తీరిపోతుంది.

"అవు నవును, నిన్న మా కాలేజీలో హిందూకోడ్ బిల్లుపై చర్చ జరిగింది. అయితే స్వకులంలో చేసికోము అని పట్టుబట్టితే అనుకున్నంత ఫలితం లభించదేమో!" అంది రుక్మిణి.

"పర కులంలో ప్రేమించి చేసికొనే విషయంలో-వివాహం చాల మటుకు ప్రేమ పురస్కారమైన ఎన్నికపై ఆధారపడి వుంటుంది గాబట్టి, కట్నాల బాధలు తొలగుతాయి. ఈ కులాంతర వివాహాల ఫలంగా సిద్ధించే లాభా లేమంటే ఒకటి - చదువుకుంటున్న పిల్లలకంతా చాలామటుకు నచ్చిన మొగుళ్లు దొరుకుతారు. రెండవది - అనైకమత్యంతో-కుల వ్యత్యాసాలతో - మత విద్వేషాలతో నాశనమై పోతున్న సంఘానికి ఐకమత్యాన్ని ప్రసాదిం చిన వారౌతారు. కట్నాలు పడిపోతాయన్న విషయం యిక చెప్పనక్కర్లేదు. అసలు సంఘంలో సమత్వం వచ్చి, ఐకమత్యం రావాలంటే అది స్త్రీల చేతిలోవుంది. ప్రస్తుతపు వివాహ సంస్థను ధిక్కరించడం - తమ బిడ్డల తాము పెరిగినట్లు కాకుండా స్వతంత్ర పంథాలో పెంచడం. ఈ రెంటిపైన్నే

సంఘాభ్యుదయం ఆధారపడి వుందని నా భావం. ఈ గురుతర బాధ్యతను ఎంతమంది గుర్తిస్తున్నారు?''

''గుర్తించారు లక్ష్మీ! గుర్తించకపోలేదు. ఇట్లాంటి ప్రతిజ్ఞలు తీసికొని భీష్మించుకు కూర్చుంటే వివాహమే కాదేమో అన్న భయం వాళ్ళలో వుంది.''

''అదే పిరికితనం! కాకపోతే పోనీ! పై ఆదర్శాలూ, పట్టుదలా, లేనపుడు మాత్రం వివాహం జరుగుతుందన్న గ్యారంటి యేమిటి? ఇప్పటి పరిస్థితులలో ఉండి ఉండి, కడపటికి ఏ కుంటినో, గ్రుడ్డినో, వ్యభిచారినో, వయసు చెల్లిన వానినో, భార్య పోయిన వాణ్ణో తమ ప్రకృతికి విరుద్ధమైన వాణ్ణో - చేసికోవలసి వస్తున్నది. అంతమాత్రానికి వివాహం లేకపోతే యేం? యిప్పటికంటే, ఆ ఆదర్శాలు గలిగి, ఆచరణ శక్తి వుండి, ఆ ప్రతిజ్ఞలు గైకొన్ననాడే, వారికెక్కువగా వివాహాలు జరగడానికి ఆస్కారముంది. చాలావరకు పరీక్షించి. నచ్చిన వరుణ్ణే చేసుకోవచ్చు. పెండ్లి కాదేమో - కాకపోతే యెట్లా - అనే వ్యక్తిత్వంలేని ఆ అస్వతంత్ర భావం వాళ్ళల్లోనుండి తొలగాలి.''

''అల్లాటి ప్రతిజ్ఞలు తీసుకుంటే, వాటిని చెల్లించుకొనే శక్తి వుండొద్దా అక్కా! దీనికి ఆర్థిక స్వాతంత్ర్యం ముఖ్యం. అది లేనపుడు, తనను పెంచే తలిదండ్రులు తమ భావాలకు దాస్యం చెయ్యలేదని ఇంట్లోనుంచి బయటకి నడు,అంటే అపుడేం చేస్తుంది! అందుకు ఈనాడు స్వతంత్ర భావాలు కలిగి వున్నా దాసోహభావంతో నిండివున్నది,'' అన్నది చంపక.

''నిజమే! ఇపుడు లక్ష్మి ఎట్లా జీవిస్తున్నది! నేనెట్లా జీవిస్తున్నాను? అధైర్యమక్కర్లేదు. పట్టుపట్టి సిద్ధింపచేసుకొనే స్వతంత్రం పురుషుడికి వుంది. అదే స్త్రీకిగూడా వుండాలి. అంటే పిత్రార్జితమైన ఆస్తిలో హక్కుండాలి. హిందూకోడ్ బిల్లు తక్షణం ప్యాస్ కావాలి. అది ప్యాసయితేగాని స్త్రీకి మోక్షం లేదు. ఆ విధంగా దాస్య విమోచనం కానిదే స్వతంత్రంగా ఊహించ లేదు. స్వతంత్ర భావాలు లేకపోతే - ఆ స్వాతంత్ర్యాన్ని సరైన మార్గంలో

ఆచరించకపోతే - భావి సంతతి సరైనదిగా వుండదు. అట్లా లేనినాడు మన జాతి ప్రస్తుతం అనుభవిస్తున్న అవకతవకలే వారికీ వారసత్వం ద్వారా సిద్ధిస్తాయి.''

''ఆ బిల్లును ఎక్కడ ప్యాసు కానిస్తారు సరళా? సనాతనులు కొందరు సనాతన ధర్మం అంటూ దానిపైన కుక్కలులాగా భౌ! భౌ! అంటూ పడ్డారుగా'' అంది రుక్మిణి.

''బాగా అన్నావు రుక్మిణీ! కుక్కలు, అని బాగా అన్నావు. ధీర గంభీర గమనంతో ఒకానొక గజము పురోగమిస్తూ వుంటే, ఇట్లాంటి కుక్కలు ఎన్నో అరుస్తూ వెనకబడతాయిగా! అయితే దాని గమనానికి వీటి వల్ల నిరోధం జరగదు. నిరోధం జరుగుతుందేమో అన్నంత గలాభా చేస్తాయి. అయితే జరగదు. అంతగా సాహసించి ఒక కుక్క ముందు కెళ్ళినా, తొండంతో పట్టి, తిప్పి. విసిరితే, అదేగాక, అది తగిలి ఇతర కుక్కలూ హతమౌతాయి. అంతే యీ కుక్కల విషయం గూడా!''

''అయినా. అది ఆడవాళ్ళకు సంబంధించిన బిల్లుగదా! ఈ పురుష పుంగవుల కెందుకో యీ యేడుపంతా?'' అంది చంపక.

లక్ష్మి అంది:

''ఇంకెవరికి కావాలి? ఒకరు బాగుపడుతున్నారంటే ఓర్వలేనిది మన జాతి. ఆ విధంగా తయారయ్యాం. కులాలు ఏనాడయితే మన సంఘంలోకి ప్రవేశించి ఆమోదింపబడ్డాయో-ఏ నాడయితే ఒక కులానికి ఆధిక్యతా, మరొక కులానికి నీచతా ఆపాదింపబడ్డాయో - ఏనా డయితే జనులు అజ్ఞానులై వాటి నిజతత్వాన్ని గ్రహించలేక, 'పెద్దవాళ్ళు పెట్టారు. మనం పాటించాలి' అన్న అనవసర ధర్మభీతితో వ్యక్తిత్వాన్ని పోగొట్టుకొని. కపటంగా ప్రవర్తింప సాగారో-ఆనాటి నుండీ, ఒకర్లో ఒకరికి కాకుండాపోయింది. ఐకమత్యం చచ్చింది. అస్వతంత్రత, అన్యాయం, అసూయ, ద్వేషం, ఇత్యాదులు ప్రబలాయి. ఇట్లా వుండగా, స్త్రీ అన్నది ప్రతి కులంలో, ప్రతి గృహంలో, ఒక అస్వతంత్ర బానిసగా, పనిచేసే యంత్రంగా - బిడ్డలు కనే యంత్రంగా -

తయారు చేయబడుతూ వచ్చింది. అస్వతంత్రతను అనుభవించే జాతి - స్వతంత్రంగా ఊహించలేని జాతి - ఏనాడూ యితరులకు స్వాతంత్ర్యాన్ని యివ్వదు. ఉన్న స్వాతంత్ర్యాన్ని గుర్తించదు. పోనుపోనూ స్త్రీని ఒక కొర ముట్టు క్రింద కట్టేసి, నీచపరిచారు. పిన్న తనంలో తలిదండ్రులు ఆశ్ర యులు. పెట్టుపోతల విషయంలో ఎట్లావున్నా వివాహ విషయంలో మాత్రం తండ్రుల దౌర్జన్యం చాలా హెచ్చు. ఆ దౌర్జన్యం మీ మంచికే అని అంటారు. తలిదండ్రులు చూపినవాణ్ణే ఎటువంటి వాడయినా చేసుకో వాల్సిందే! చేసుకోకపోతే పాపలోకంలోకి పోవాల్సిందే! చేసికొన్న తర్వాత ఆశ్రయస్థానం మారగా, ఆ పురుషు డెటువంటి వాడయినా, ఏమిచేసినా ఓర్చు కొని పోవాలనీ, అట్లా ఓర్చుకున్నదే పతివ్రత అనీ, ఇట్లాంటివన్నీ నేర్పారు. ద్రౌపది, అహల్య, కుంతి, సుమతి, ఇటువంటి పతివ్రతల కథలు మార్గదర్శకా లన్నారు! ఆ మాదిరిగా మనంగూడా చేస్తే - స్వర్గ మెక్కడుందో గాని-స్వర్గా నికి పోతారు అని పురాణాల్లో చెప్పి, అట్లా చెయ్యక, భర్తను దైవంగా పరిగణించకపోతే, ఆ స్త్రీని ఇట్లా చెయ్యాలి, అట్లా చెయ్యాలి అని ధర్మ శాస్త్రాలు వ్రాసి, భయపెట్టి, స్త్రీని ఒక పాలిచ్చే పశువు కింద తయారు చేశారు. మనుస్మృతిలో అంటాడు:

'భర్త కురూపి అయినా, వ్యభిచారి అయినా, రోగిష్టి అయినా, దుర్మార్గు డయినా, స్త్రీ వాణ్ణి దేవుడుగా భావించి సేవ చెయ్యాలి.' మరొక చోట 'భర్త తిరిగితిరిగీ యింటికొస్తూనే వాని కాళ్లుగడిగి, ఆ జలాన్ని తాగితే లేక దాంతో స్నానంచేస్తే ఆ స్త్రీ పుణ్యలోకానికి పోతుంది.' మరొక స్మృతిలో 'భర్త పరదారా సక్తు డయి నప్పటికీ, భర్తను భగవంతుడుగా, పరిగణించని స్త్రీ చేతినుండి, ఎవరూ అన్నమును స్వీకరించగూడదు.' మను స్మృతిలోనే మరొకచోట, 'ఏ స్త్రీ అయితే తన తలిదండ్రుల గృహాధిక్యాన్ని పురస్కరించుకొని భర్తను న్యూనతా దృష్టితో చూస్తుందో, ఆ స్త్రీని, పుర జనుల సమావేశ సమ్ముఖంలో కుక్కలకు ఎరగావించాలి.' ఇట్లాంటి వెన్నో వున్నాయి. ఈ విధంగా అజ్ఞానులైన స్త్రీలకు నమ్మకమూ, భయమూ పుట్టించి

యంత్రాలుగా తయారుచేశారు. స్వార్థపరులూ, రాజులూ, పురోహితులూ కలిసి ధర్మశాస్త్రాలలో కట్టుదిట్టాలు వ్రాసి భయపెట్టారు. విరుద్ధంగా నడిచిన వారిని దండించి, లొంగించుకున్నారు. అట్టి స్వార్థపరులూ, దౌర్జన్యవాదులూ, దయా రహితులూ - వ్యక్తి సమత్వం, వ్యక్తి స్వాతంత్ర్యం అంటే తెలియని ఆ గొప్పవారు-అధికారంలో వున్నంత కాలం - అజ్ఞానాంధకారమే బాగా ప్రబలింది. ఇపుడు స్వాతంత్ర్యమంటే యేమిటో అందరూ తెలుసుకున్నారు. తెలుసుకున్న వారేమీ మాట్లాడ్డం లేదుగాని దాని రూపం తెలియనివారు, ఇంకా పాతవిపట్టుకొని వ్రేలాడ్తున్నారు.''

''అంతటితో ఆగలేదు. ఇంకా మిగిలిన వాళ్ళను వాళ్ళతో పాటు దిగ మంటున్నారు,'' అంది చంపక.

''పతితుల ధోరణి అంతకంటే యేముంటుంది! వాళ్ళలో నైతికబలం చచ్చింది. సమభావం శిధిల మయింది. సంఘీభావం సమసిపోయింది. వారి లాగానే అందర్నీ తయారు చేయటం వారి అభిమతం. అయినా వారి యేడుపులు వినే దెవరు?''

''అసలు యింకొక విషయం!'' అంటూ తీసుకుంది లక్ష్మి. ''వాళ్ళ గోల చూశారా? అవన్నీ ఋషులు చేసినవట! సామాన్య మానవుడు తాకకూడదట! ఋషులే వాటిని సంస్కరించాలట!'' అనే టప్పటికి చంపక:

''వీళ్ళ చూశారటనా ఆ ఋషులను? అయినా యెక్కడో ముక్కు మూసుకొని కూర్చునేవారికి సంఘజీవనాన్ని గురించీ, లోటుపాట్లను గురించీ మార్పులను గురించీ, పరిమాణాల గురించీ ప్రసక్తి యెందు కుంటుందీ? వీటి పైన దృష్టి కేంద్రీకరిస్తే వాళ్ళ తపస్సెట్లా సిద్ధిస్తుంది. తపస్సు వదలి వీటిపై దృష్టి కేంద్రీకరిస్తే వాళ్ళు లౌకిక మానవులౌతారుగాని ఋషులెట్లా అవుతారు? అయినా, వాళ్ళివన్నీ చేశారా? ఇప్పుడు మనం చూస్తున్న, పాక్షిక, స్వార్థ ధర్మాలతో నిండిన శాస్త్రాలు వ్రాసినవారు వారే అయితే - ఆ ఋషులకు గౌరవం నిజంగా వుండాలంటే-ఈ సనాతన బ్రువులంతా అంతటితో నోరు మూసుకుని, ఋషుల మాట యెత్తకుండా వుండాలి. ఆ విధంగా వాళ్ళ

పేర్లెత్తి వాళ్ళ పైనుండే గౌరవాన్ని హిందూ సంఘములోనుండి పెకలించి వేస్తున్నారు. ఒకే ఋషి ఒకే కాలంలో, ఒకే గ్రంథంలో, ఒకే కలంతో, భిన్నభిన్న ధర్మాలు వ్రాస్తాడా? అదెక్కడయినా వీలవుతుందా? స్వవచోఘాతాలతో నిండిన ధర్మాల క్రోడీకరణమైన మన ధర్మశాస్త్రాలను వారి కంటగట్టడం వారిపైన దుష్ప్రచారం (Malpropaganda) కాదా? అవన్నీ ఋషులు వ్రాయలేదు ఇటువంటి స్వార్థపరులే-స్వలాభాపేక్షులే - పాతుక బుద్ధులే ప్రక్షిప్తాలు గావించి, ఋషులు వ్రాశారని వారి నెత్తినరుద్ది, వాళ్ళ గౌరవాన్ని మట్టిపాలు చేస్తున్నారు. పైగా ఇంకొకటట! ఈ రాజ్యాంగం అటువంటి చట్టాల జోలికి పోగూడదట! మతవిషయంలో జోక్యం కల్గించుకోగూడదట! వీళ్ళ రాజ్యాంగంలో దీని ప్రసక్తిలేదట! అంచేత దీన్ని సంస్కరించే అధికారం వీళ్ళకు లేదట!''

ఇంతలో సరళ అంది:

"అవునవును! ఇట్లాంటి ఆలోచనలేని మాటలు ఎట్లా మాట్లాడ్తారో అర్థంకాదు. సాంఘికంగా - అంటే - నా అర్థంవేరు. సాంఘికమంటే - రాజకీయం, ఆర్థికం, నైతికం, విద్యావిషయకం, తాత్త్వికం - అన్నీ దీనిలో వస్తాయి. మన రాజకీయవేత్తలు ఉపన్యాసం దంచేస్తున్నాం చూడండి అనే తీరులో వాడేక్రమం నాకు తప్పుగా తోస్తున్నది. 'రాజకీయంగా - ఆర్థికంగా-సాంఘికంగా నైతికంగా - ....' అని యిట్లా వరసలో 'సాంఘికంగా' అని పడవేయటం నా కిష్టంలేదు. సాంఘికము - అన్న దానికి పైవన్నీ ఉపాంగాలు. అంతే!-అంటే: ఆ రాజకీయమూ, ఆ నైతికమూ-ఆ తాత్త్వికమూ - అన్నీ కావలసింది వ్యక్తికి. వ్యక్తే సంఘము. అటువంటప్పుడు, సాంఘికంగా, అంటే వ్యక్తికి కావలసిన పై అన్ని అంశాలూ అందులో చేర్తాయి. సాంఘికంగా అంటే అవన్నీ అని అర్థం, వ్యక్తే సంఘం అని అన్నాం. ప్రజా ప్రభుత్వంలో ప్రజలే ప్రభుత్వం. ప్రజలకు సంబంధించిన యావత్తూ ఆ ప్రజా ప్రతినిధులే చూడాలి. మానవునికి ఏదేది అవసరమో అవన్నీ ఆ ప్రజా ప్రభుత్వం చూడవచ్చు. రాజకీయమూ, ఆర్థికమూ, నైతికమూ, వలెనే

శాస్త్రీయక విషయం గూడా మనిషికి కావాలి కనుకనూ, మత మన్నది గూడా మానవునకే కావాలి కనుకనూ, అన్నిట్లో కలుగజేసుకొన్నట్లే, మత విషయం లోగూడా ప్రజాప్రభుత్వం కలుగజేసి కోవచ్చు. ఒక యింట్లోపడి, ఎవడన్నా దోచుకుపోతూవుంటే, వాణ్ణి శిక్షించడానికి ప్రభుత్వం కావాలి? - ఒకడి పెండ్లాన్నొకడు బలవంతం చేస్తే ప్రభుత్వం కలుగజేసుకోవాలి? అందరికీ విద్య చెప్పించడానికీ, ఉద్యోగా లివ్వడానికీ ప్రభుత్వం కావాలి? ధనాధికారుల ఆస్తుల లాక్కొని లేనివారికి పంచడానికి ప్రభుత్వం కావాలి? అస్పృశ్యతను పాటిస్తూ కొన్ని జాతుల వారినీ-స్వతంత్రం లేకుండా స్త్రీలనూ - అణగద్రొక్కే ప్రబుద్ధుల శిక్షించడానికి ప్రభుత్వం అక్కర్లేదా? ప్రజాస్వామ్య సిద్ధాంతాలు ప్రపంచ మంతా వ్యాపిస్తున్న ఈ కాలంలో అస్వతంత్రులకు స్వాతంత్ర్యాన్ని కలిగించడమూ, అణిచివేయబడిన వారిని ఉద్ధరించడమూ, ఆస్తి లేనివారికి ఆస్తుల కల్పించడమూ ఇట్లాటివి చేసే అధికారం ప్రభుత్వానికి లేదా? మానవావసరాలైన పై విషయాల్లో జోక్య కల్గించుకోగల్గిన ప్రభుత్వం యీ విషయాల్లో జోక్య మెందుకు కల్గించుకో గూడదు? పై విషయాల్లో చట్టాలంతా మార్చవచ్చు. అది మనువు వ్రాసినా, యాజ్ఞవల్క్యుడు వ్రాసినా, అంగీరసుడు వ్రాసినా, పరాశరుడు వ్రాసినా, అవసరాన్నిబట్టి అవి మార్చుకోవచ్చు. ఎందుకంటే యీ మాట్లాడే ప్రబుద్ధులకు ధనమూ, భూములూ, యెక్కువ లేవు గాబట్టి; స్త్రీలకు కాస్త స్వాతంత్ర్యం వస్తే-హరిజనులు ముందుకొస్తే-కులాంతర వివాహాలు జరిగితే-సమత్వం వచ్చి ఇట్లాంటి వారి ఆధిక్యతలూ, పలుకుబడీ పోతాయిగా! అందుకు-ఇవి ఋషులు వ్రాసినవి - ఎవరూ ముట్టగూడదు. ఎవరికీ అధికారంలేదు. ఈ ప్రభుత్వం మతప్రసక్తి లేనిది (Secular State) గనుక దీనికి అధికారం లేదు. అని గోలపెడుతున్నారు. మానవ జీవిత సర్వస్వానికీ కావలసిన ప్రభుత్వం, మతవిషయంలో మాత్రం యెందుకు పనికిరాదు? అసలు స్త్రీ స్వాతంత్ర్యం విషయం, అస్పృశ్యత విషయం, వర్ణాంతర వివాహాదులన్నీ మత సంబంధికా లెట్లా అవుతాయి? అవి మత సంబధింకా లయితే మతమంటే యేమిటో మన ప్రబుద్ధులకు తెలియదన్న మాట!"

ఇంతలో వీధి తలుపులు కొట్టిన శబ్దం వినవచ్చింది. చంపక పరు గెత్తుకుంటూ పోయి తలుపు తీసింది. అంతవరకూ తలుపు దగ్గర కాసేపు చెవి యొగ్గి వింటూ వుండిన కృష్ణశాస్త్రిగారు స్మితవదనంతో మురళితోబాటు లోపలికి వచ్చి, చూపిన ఆసనంపై కూర్చుంటూ ''ఏమిటో మతం పైన దండెత్తి నట్లున్నారే'' అన్నాడు.

"ఏదో మాట్లాడు కుంటున్నాం లెండి." అంది సరళ వినయ భావంతో.

''ఆద్యంతాలు లేకుండానా?''

''అది మాత్రం వుంది లెండి అంతే కనబడ్డం లేదు'' అన్నది రుక్మిణి.

''అవును. చర్చ అంతే! నలుగు రొకచోట గూడితే - ఏదో ఒక విషయమై బయలుదేరిన చర్చ కొంచెం కొంచెమే దానికి సంబంధించిన విషయాల్లోకి దిగి, తర్వాత సంబంధించని విషయాల్లోకి గూడా దిగుతుంది.''

''అవి అనవసర చర్చలు జరిపేవాళ్ళ విషయం లెండి'' అంది చంపక.

"మనకు మతవిషయమైన చర్చ అంత అవసరం గాబోలు!''

''కాదుగాని, అవసరం మాత్రమైంది" అంది సరళ.

"అంత అవసరమేంటో చెబుదూ'' అన్నాడు శాస్త్రి.

"పురుషాధిక్యతపై చర్చనుండి, హిందూకోడ్ బిల్లు వరకూ జరిగింది చర్చ" అంది రుక్మిణి.

శాస్త్రిగారు కాస్త వికటంగా నవ్వారు. కాస్త పరిహాస ధోరణిలో "పాపం! ఆడవాళ్ళు నిజంగా చాలా కష్టపడుతున్నారు! స్వతంత్రం లేందే బ్రదికేటట్టు లేరు! స్వతంత్రం ఆడవాళ్ళకంటే యెక్కువెవరికుంది సరళా! మగవాడు తిరిగి తిరిగి, సంపాదించి యిల్లాలి చేతికిస్తున్నాడు. ఆపైన అంతా యిల్లాలి యిష్టమే! ఇంట్లో అంతా ఆమె చూచుకుంటుంది. తర్వాత పురుషుడి కేమీ పెత్తనం లేదుగా! అసలు ఆడవాళ్ళ కున్నంత స్వాతంత్ర్యం యింకెవరి కుంది?'' అన్నాడు.

"ఆ స్వాతంత్ర్య మేమిటో శాస్త్ర చెప్పండి విశదంగా!" అంది లక్ష్మి. లక్ష్మి అతనికి పెద్దపరిచితగాదు. ఒకసారి మాత్రం ఆమెను పరిచయం చేశారు. ఆ కొద్దిపాటి పరిచయాన్నే పురస్కరించుకొని లక్ష్మి ఈ ప్రశ్న వేసింది. శాస్త్రి ఆమె వైపు అట్లా చూశాడు.

ఇదివర కంతా అక్కడక్కడా వాగేస్తూ వచ్చిన సంప్రదాయ సంబంధికమైన రెండు ముక్కలూ వాగేశాడు.ఇంకేమీ చెప్పలేక, "ఎంత స్వాతంత్ర్య ముందో మీకేం తెలుసు?" అన్నాడు.

"అదేనండీ! ఎంత వుందో చెప్పమన్నాను" అంది మళ్ళా లక్ష్మి.

"ఉంది. ఎంతైనా వుంది. హిందుకోడ్ బిల్లు వచ్చి ఇంతకంటే యెక్కువగా ప్రసాదించే దేమీ లేదు గదా! పైగా లేనిపోని రభస తెచ్చిపెడుతుంది. సాఫీగా నడిచే సంసారాల్లో కల్లోలాలు బయలు దేరదీస్తుంది."

"ఎందుకండీ!"

"స్త్రీకి దాయ భాగమిస్తే కొంత ఆస్తికి అధికారిణి అవుతుంది. తర్వాత చెప్పినమాట వింటుందా? ఎవణ్ణో ప్రేమించి చేసుకుంటా నంటుంది! అపుడు వర్ణాలు భ్రష్టమై పోతాయి."

"దాయ భాగం వస్తే స్వాతంత్ర్య మొస్తుం దన్నారు. స్వాతంత్ర్యం వద్దంటారా?" స్వాతంత్ర్యంతో వ్యహరిస్తున్నదని భయ మెందుకు? కొడుకు ఆస్తికి హక్కుదారుడై వివాహ విషయంలో, వ్యాపార విషయంలో, స్వతంత్రంగా వ్యవహరిస్తే యేం చేస్తున్నారు? అది అర్హమైనపుడు స్త్రీ విషయంలో ఏల అర్హము కాకూడదు? ఎవరినో ప్రేమించి చేసుకుంటుందన్నారు. మరి ప్రేమించనివాణ్ణి చేసుకోవాలనా? అందులో కులం పోతుందా? కులమంటే యేమిటి? అలవాట్లలో అభిరుచుల్లో సమత్వం గలిగిన వాళ్ళ సమూహమే కులము! ఒక స్త్రీ గాని, పురుషుడుగానీ, పరస్పరం ప్రేమించుకున్నారంటే, అట్టి సమత్వం ఉండితీరాలి. ఉండనిదే పరస్పరం ప్రేమించుకోలేరు. అటువంటప్పుడు కులం చెడట మేమిటి? వర్ణం చెడట మేమిటి? ఇదొక వ్యర్థ భావం! అర్థంలేని భావం! అటువంటి వివాహాలకు మీలోటి విద్యాధికులు

హర్షించూపి దోహద మివ్వాలి. అట్లా అయిన నాడే మన సంఘంలో అస మత్వం అంతరించి సమత్వం అలముకోగలదు."

"అదే కాదులెండి. ఆ స్వాతంత్ర్యము స్త్రీకి వస్తే విడాకు లిచ్చి ఒక క్షణంలో పారిపోతుంది!"

"అది వట్టి అబద్ధమండీ" అన్నాడు మురళి. మళ్ళా అన్నాడు: "ఈ మాట చాలా మంది మీబోటివారూ యువకులూ అంటూ వుంటే విన్నాను. విడాకు లిచ్చుకోవడ మన్నది సరస్పరంగాని వైయక్తికం గాదు. పురుషుడు స్త్రీని వదలటమూ-స్త్రీ పురుషుణ్ణి వదలటమూ-ఈ రెండూ అందులో యిమిడి వున్నాయి. విడాకుల స్వాతంత్ర్యం అన్నది ఒక స్త్రీకి మాత్రమేనా? అది వున్నదని విడాకు లిచ్చుకుంటూ పోతుందా? తనకు మాత్రం ఒక అనువైన పురుషునితో సుఖా లనుభవిద్దామని ఉండదా! వట్టి భ్రమలు! అస లీ మాట లోనే కనిపిస్తుంది అన్యాయభావం! ఈర్ష్యభావం!"

"ఎట్లయినా సంఘం తలక్రిందులౌతుంది. విషయా లెట్లయినాగానీ, రిజిష్టరు వివాహాలకు నే నొప్పుకోను. అదేంటి ఆ పడమటి తెల్లకోతుల్లాగా మనం తయారు కావాలా? వాళ్ళను మనం అనుసరించడ మేమిటి?"

"ఎందుకుండ గూడదు? అనుకరణ అని మంచివాటిని గూడా ఎందుకు విడనాడాలి?"

"ఏమిటా మంచి? మన సమంత్రక వివాహం ఎంత శ్రేష్ఠమైందను కున్నావు?"

"ఎంత శ్రేష్ఠమో నాకు తెలుసు! మంత్రాల అర్థమేమో ఎవరికీ తెలి యదుగదా! అసలు చదివే పురోహితుడికే తెలియవాయె! నోటవచ్చేవన్నీ అప శబ్దపు కూతలు! అందులో మళ్ళా పాక్షికం! బ్రాహ్మణులకు మంత్రాలు వేరు! సాంగాలు వేరు తంతు వేరు! ఇతరులకు వేరు! ఎంతో జాగ్రతగా ఆలోచించి, ఆలోచించి, మంచి ముహూర్తాలు చూచి శ్రేష్ఠంగా వుండాలని పెండ్లి చేసిన మూడోనాడే మగడుచచ్చి పూరుకుంటాడు. వితంతువుల సంఖ్య బ్రాహ్మల్లో తప్ప మరె వర్ణ్లోనైనా హెచ్చుగా వుందా? ఈ పద్ధతివల్ల పురోహితులకు కాస్త

పలుకుబడి, తిండీ, లభించడం తప్ప మరేమీ లాభంలేదు. మన వివాహ పద్ధతి చాలా వ్యయంతో కూడినది. మనదేశంలో చాలామంది, వివాహాలవల్లా, తద్దినాలవల్లా - ధనికులు బీదలై బీదలు భిక్షులైనారని మీబోటి వారికిగూడా విశదమే అనుకుంటాను.''

శాస్త్రిగారు తాత్కాలికంగా ఊరుకున్నారు. ప్రతివాది పలుకులు సహేతుకంగానే వున్నాయిగాని, మనసారా స్వీకరించలేక పోతున్నాడు.

ఇంతలో చంపక అంది: ''ఏమండీ! మనదేశానికి సామ్యవాదం కావాలని ఒప్పుకుంటారా?''

''ఓ! తప్పక!''

''జమీందారుకూ, నిరుపేదకూ - ధనాధిపునికీ, దరిద్రునికీ - పెట్టుబడిదారునకూ, కూలీకీ మధ్య ఉన్న వ్యత్యాసం పోవాలంటారా!''

''తప్పక! ఈ విషయమై మొన్న నేను అమోఘంగా ఉపన్యసించాను గూడా! మనదేశం అన్నవస్త్రాదులకు కటకట పడకుండా - విద్యాభావంతో నీరసించకుండా - అస్వతంత్రతతో అలమటించకుండా వుండాలంటే, జమీందారీ విధానం నశించాలి. పెట్టుబడి విధానం వూడ్చుకుపోవాలి. దౌర్జన్య విధానం తుడుకుపోవాలి'' అన్నాడు ఉపన్యాస ధోరణిలో ఉత్సాహంగా.

''అయితే మీరు కోరిన సంఘాభ్యుదయం రావాలంటే సంఘ సమత్వం ముందుగా కావాలి. దేశంలో వున్న అస్పృశ్యత నశించాలి. స్త్రీ స్వాతంత్ర్యం పెరగాలి. కులమత భేదాల విడనాడాలి'' అన్నాడు మురళి.

''నిజమే? తప్పక కావాలి.''

''ఊరికే ఉపన్యసించడం కాదు ఆచరణ కావాలి.''

''కావాలి.''

'మీరు ఎంతవరకూ ఆచరిస్తున్నారో చెప్పగలరా?''

''అదివేరు. ఇంట్లో పాతపద్ధతులు అవలంబించే తలిదండ్రులనూ, బంధువులనూ, ఆడవాళ్ళనూ, మనసు నొప్పించగూడదు. నిదానంగా మారాల్సిందే; మారాయిగూడా! ఒక్కసారిగా మారాలంటే మారదు. అయినా ఎవడో ఒకడు ఆచరించినంత మాత్రాన ఏమవుతుంది!''

"అదే పొరబాటు! దాన్నే స్వార్థవాదం అంటారు. వ్యర్థవాదం అని గూడా అంటారు. సాంఘికంగా కాస్త ఉన్నత స్థానంలో వుండేవాళ్ళు, అసమత్వం క్రింద బాధపడేవాళ్ళకు స్వాతంత్ర్య మిచ్చి సమత్వంతో చూడ గూడ దంటారు. దానికి విదానం కావాలంటారు. దానికి తలిదండ్రులూ, ముసలి వారూ, ఆడవాళ్ళూ, బంధుగులూ యిష్టపడ రంటారు. దీనికి మీ పెద్దలు యిష్టపడకపోతే - ఆ జమీందారులూ - పెట్టుబడిదార్లూ - ధనాధి కులూ - యిండ్లలోని తలిదండ్రులూ, ఆడవాళ్ళూ, బంధుగులూ వాళ్ళ భూములు లాక్కోవాలంటే, వాళ్ళధనం లాక్కోవాలంటే యిష్టపడతారా? వాళ్ళూ గోలపెట్టరూ?-మీ బోటివారే యిట్లాంటి సంకుచిత భావాలు గలిగి వుంటే, సంఘం యెట్లా బాగుపడుతుంది? మీరు యం. యె. (M A.) చదివారు గదా! అంతకంటే పెద్ద చదువు యింక లేదుగదా-అందులో మీరు వుపన్యాసకులు గదా - పదిమందికి చెప్పేవారు గదా-దేశం సర్వతోముఖంగా అభ్యుదయం పొందాలంటే ఉపాధ్యాయులు సుశిక్షణ యిచ్చి యువకులను తయారు చేయాలని అంటారు గదా-మరి ప్రతి వచనంలోనూ స్వవచో వ్యాఘాతం కనిపిస్తున్నదే!-ప్రతి ఆచరణలోను భిన్నత్వం కనిపిస్తున్నదే!- విదానంగా రావాలంటారా? అంటే సమత్వానికి కాళ్ళూ చేతులూ వున్నాయా? లేకపోతే యెవరైనా తెచ్చి పైన పడవేస్తారా? ప్రతివాడూ అట్లా అనడం కంటే - 'నేను పాటిస్తాను! నేను పాటిస్తే సంఘం సర్వతోముఖంగా అభ్యుదయంలోకి నడుస్తుంది?' అని అనుకొని, ఆ విధంగా ఆచరిస్తే సంఘం ఒక క్షణంలో బాగుపడదా? అట్లా అనుకోవాలి. ఈ సంఘంలో మీరొక వ్యక్తి. వ్యక్తే సంఘం, వ్యక్తి బాగుపడితే సంఘ బాగు పడుతుంది. వ్యక్తి సంస్కరణ కావాలి," అన్నాడు మురళి.

"ఇట్లాంటి వాదాలు చాలామంది దగ్గిర విన్నాం శాస్త్రిగారూ. అయితే వాళ్ళందర్నీ దక్షిణాఫ్రికాకు పంపిస్తే బాగుపడతారని ఆశ పడుతున్నాను." అంది లక్ష్మి.

మురళి అన్నాడు:—

"దక్షిణాఫ్రికా విషయం వచ్చినపుడు ఉద్రేకులై ఎంత దౌష్ట్యం! ఎంత

రాక్షసం! ఎంత నీచత! ఎంత అసమత్వం! అని ఎందరో అనగా విన్నాను. వారే తమ యిండ్లలో, ఇతర కులాల వారిని నీచంగా చూడటం. అస్పృశ్యతను ఆచరించడం ఇట్లాంటివి పాటించటం కండ్లారా చూస్తున్నాను, మన జాతంతా ఒక తెగులుతో బాధపడుతున్నది. అది వర్ణాశ్రమ ధర్మము అనే తెగులు! అది వున్నంత కాలమూ, ఇతర్లు అసమత్వంతో తంతున్నా, నాకంటే తక్కువ వాడొకడైనా ఉన్నాడుగదా అనే భావంతో ఊరటపడు తూనే వుంటాడు భారతీయుడు! అదిపోయిన నాడే నేను మానవుడను, అని తలెత్తుకొని తిరగగలడు. లేనినాడు దక్షిణాఫ్రికాకు పంపినా అక్కడ తెల్ల వాడి కాలిబూట్ల దెబ్బలు తింటూనే, కులవ్యత్యాసాలు పరస్పరం నెఱపుతూ వుంటారు. అంతనీచంగా తయారైపోయాం మనం,''

ఇట్లాగా వాదప్రతివాదాలు సాగాయి. ఆ వాదనలో ఉద్రేకంగానీ, స్వమతాంగీకరణకై పట్టుదలగానీ లేదు. అందుచేత, హేతువాదపూర్వకమైన వాదానికి అందరూ అంగీకారాన్ని ప్రదర్శిస్తూనే వచ్చారు.

కడపట చాలించే ముందు మురళి ఒకటి అన్నాడు: ''మనవాళ్లు చాలా మంది హేతువాదాన్ని అవలంబించడం లేదు. ఆ హేతువాదం అన్నది చచ్చింది. అందరూ బుర్రలకు తాళంవేసి కూర్చున్నారు. ఒకసారి తాళాలు తెరిచి బుర్రలతో ఆలోచించి ఆచరణ ఏమిటో కాస్త తెలిసికోవాలి. హరిజనాభ్యుదయాన్ని కాంక్షించాలి. దానికై కృషి చెయ్యాలి. స్త్రీకి పుట్టిన పురుషుడు తన తల్లిని, తన మాతృ జాతిని, నీచంగా సంభావించి, అవమానపరుస్తున్నామని ఏనాడయితే గ్రహిస్తాడో, ఆనాడే దేశం బాగుపడుతుంది. ఇది స్త్రీపై గూడా చాలా ఆధారపడివుంది. ప్రస్తుతం చదువుకున్నా, చదువుకుంటున్న స్త్రీలు, తమ పంథా మార్చుకోవాలి. స్వతంత్రంగా ప్రవర్తించాలి. వారు తల్లులైననాడు, బిడ్డలకు కులం అన్నది తెలియకుండా, మతం అన్నది తెలియకుండా, స్త్రీ పురుష భేదాలు సముద్రాంతరాలుగా భావించేట్లు చేయకుండా - ఒకటేమిటి, సర్వవిధాల సరైన మానవ వ్యక్తిగా తయారు చెయ్యాలి" అని.

రాత్రి భోజనానంతరం, మురళి, సరళ, లక్ష్మి మాత్రం కూర్చున్నారు.

లక్ష్మి అంది : "నే నొచ్చిన పని ఇప్పటి కే మాత్రమూ కాలేదు సరళా! త్వరగా వెళ్ళాలి. లేకపోతే సీత బెంగపెట్టుకుంటుంది. అది ముందే పురుషాన్యాయ ప్రవర్తనకు గురియై దాని ఫలితాన్ని దుఃఖంతో అనుభవిస్తూ వుంది. ఇపుడు నేను దూరంగా వుంటే........."

మురళి లేచి పోబోయాడు.

"అదేంటి మురళీ లేచిపోతున్నావు! పనుంది కూర్చో నీతో" అంది లక్ష్మి.

"నాకేదో కాస్త తల నొప్పిగా వుంది" అంటూ లేవబోయాడు.

"మురళీ! అసలు నీకోసమే నే నింత దూరం వచ్చింది! నేను తొందరగా వెళ్ళాలి. నీతో అర్జెంటు విషయాలు మాట్లాడాలి. రేపు ఉదయం యక్స్ప్రెస్‌కు పోతాను" అని లక్ష్మి అంటూంటే మురళికిసారి నిజంగా తలనొప్పి వచ్చింది. లక్ష్మి మాట్లాడబోయే విషయంపై అతనికి అసహ్యం! లక్ష్మితో వాదించి గెలవలేనని భయం! చేసేదిలేక కూర్చున్నాడు అయిష్టంగా.

లక్ష్మి అంది : "మురళీ! నీవు మాకంటే చిన్నవాడివి, మేం ఆడవాళ్ళం. మాకు స్వేచ్ఛ తక్కువ కనుక, ప్రపంచానుభవం తక్కువే వుంటుంది. అయినప్పటికి నీ మాత్ర మయినా అనుభవాన్ని గడించి వుంటాము. నీవు బాగా చదువుకున్నవాడివి. చాలా విషయాలు తెలుసు. ఆదర్శాలు మంచివే వున్నాయి. అయితే పొరపాట్లు చేస్తున్నావు. చేస్తున్నావని నీకూ తెలుసు. వాటి విషయమై పశ్చాత్తాప పడుతూ గూడా వున్నట్లు నాకు తెలుసు. వాతావరణ ప్రోద్బలంవల్లా - వయసు యొక్క ప్రచోదనంవల్లా - కొన్నికొన్ని చేస్తూనే వున్నావు. మళ్ళా పశ్చాత్తాప పడుతూనే వున్నావు. నీవేమేమి చేసిందీ నాకు తెలుసు! నీవు వ్యభిచారివై పోయావని అంటున్నందుకు క్షమించు. నిన్ను చిన్నబుచ్చాలనే అభిప్రాయంతో ఈ మాట అనడం లేదు. వెనుక చెప్పబోయే మాటకు ఉపకరిస్తుంది గాబట్టి అన్నాను, నీవు ఇన్ని పనులు చేస్తూ - నీవల్లమాత్రం చెడి - అది చెడటం కాదనుకో - ఇపుడు దాని అర్థం చెడినట్టే అయింది. ఆపిల్ల విషయంలో. సీత నీ కొఱకు

యేడుస్తూ వుంటే. పరపురుషు లెంత మంది దానికోసం ప్రయత్నించినా, పురాణాల్లో, కావ్యాల్లోని పతివ్రతలాగా సంచరిస్తూ నీకోసమై పరితపిస్తూ వుంటే, వ్యభిచారం నీవు చేస్తూ, వ్యభిచారిణి కాని దాన్ని వ్యభిచారిణిగా భావించి, ఆ విధంగా వదలి, ఇచ్చినమాట తప్పి, చేసిన ప్రతిజ్ఞల నీళ్ళపాలు చేసి, కడపటికి నగర విలాసాల్లోపడి, రకరకాల స్త్రీలతో తృప్తిపడుతున్నావా?

"నీ ఆదర్శా లేమయ్యాయి? నీ ఆచరణ యింతేనా? ప్రతిజ్ఞ తీసుకుంటే అంతేనా? ప్రతిజ్ఞను పాలించలేని వ్యక్తి ఒక వ్యక్తేనా? నిన్ను ఎన్నయినా అనడానికి నాకు అధికారం వున్నది. ఎందుకంటే, నా చెల్లిని నా సమక్షంలోనే పెండ్లాడతానని బాసచేసి, దానికోసం తిరిగి తిరిగి, అది వద్దంటున్నా తప్పక చేసుకుంటాంగదా ఫరవాలేదని దాన్ని ఆ విధంగా చేసి, ఇపుడీ విధంగా ముఖావంగా వున్నావు గనుక. ఇది యేమాత్రమూ న్యాయం కాదని...."

"ఆగు లక్ష్మీ! నీ వెన్నన్నా నాకు ఫరవాలేదు. నీ వాదమే వాదించుకుంటూ పోక, మా వాదంగూడా విను. నేను నీ చెల్లెలి నా విధంగా చేయటం మంచిది కాకపోవచ్చు. నీ చెల్లి చేసింది బాగుందా?"

"ఏం చేసింది?"

"ఏం చేసిందో నన్నడిగితే!"

"ఇంకెవ ర్నడగ మంటావు మురళీ! అపవాదు వేస్తున్నది నీవాయె! పైగా వాదిస్తున్నదీ నీవాయె! ఇంకెవ ర్నడిగేదీ? అదేదో కాస్త చెప్పు వింటాను."

"సీతలో లక్ష లోపా లున్నాయని అంటాను."

"లేవని నేనంటాను."

"తప్పులు చేసేవారూ, వాటి కనుమతించేవారూ లేవనక వొప్పుకుంటారా లక్ష్మీ!"

"చాలా విషయాల్లో కాకపోవచ్చు. సత్యవాదు లెవరన్నా వుంటే వాళ్ళ కది అన్వయించదు."

"సత్యమతావలంబులు లట్లాంటి పనులు చెయ్యరు."

"పొరపాటు పడుతున్నావు. తప్పులు చెయ్యటం మానవులకు సహజం. సత్యవాదులకు తప్పుచేస్తున్నాం అనే జ్ఞానం వుండి, పశ్చాత్తాపంతో దాచేస్తారు. అట్లాంటి పనులు చెయ్యరు అన్నావు. ఎట్లాంటి పనులు?"

"ఈ తర్కం ఆగదు లక్ష్మీ! నీ యీ రాయబారం యేమీ ప్రయోజనకారి గాదు."

"ప్రయోజనకారి కాకపోతే పోనీ! నిన్ను బలవంతంగా దానికి అంటగట్టాలని నేను రాలేదు. అది నా అభిమతంగాదు. నీ తప్పు నీకు చూపడానికొచ్చాను. నీ పురుషాధిక్యతను పురస్కరించుకొని, నీ అవకాశాలకు దాసోహం అనీ, స్త్రీలపై లేనిపోని అనుమానాలు పెట్టుకొని ధర్మభేదంతో చూడటం తప్పని నీకు చెప్పడానికే వచ్చాను."

"నాకు తెలుసు! నాకేమీ చెప్పబనిలేదు. ఆ విషయాలన్నీ తవ్వితే చాలా అవుతుంది! నీపైనగూడా బోలెడుంది!"

"రుజువులేకుండా మాట్లాడ్డం అంత ధర్మంగాదు మురళీ! స్త్రీలపై అనవసరంగా తప్పులు మోపడం పురుషుల కంత శ్రేయస్కరంగాదు."

"రుజువు చేస్తాను. క్రిష్ణయ్య సత్యారావులు మీ యింటి కెక్కువుగా రాసాగినాక, సీత నాపైన మునుపటి మక్కువ చూపించలేదు. నన్ను బాగా ధిక్కరించింది. క్రిష్ణయ్యగూడా సీత విషయంలో మొదటికంటే చాలాసానుభూతితో మాట్లాడ్డం - అనురాగం చూపడం, యెక్కువయింది. క్రిష్ణయ్య సీతను పెండ్లాడాలనే ఉద్దేశ్యంతో ప్రేమవ్యాపారాలు సాగిస్తున్నాడని గూడా విన్నాను."

"హరహరా" అని చెవులు మూసికొంది లక్ష్మి.

"నీ కొకవేళ యిష్టంలేకపోతే కిట్టని అపవాదాలు అదయతో యెందుకేస్తావు మురళీ! క్రిష్ణయ్య వివాహ విషయాలు మాట్లాడివుంటే నాతో మాట్లాడి వుంటాడు. అంతే. సీతను తన చెల్లికంటే అన్యధా భావించడం లేదతను." అంది లక్ష్మి.

"అసలు క్రిష్ణయ్య, సత్యారావులు మీ యింటికి విశేషంగా వస్తూ వచ్చిన సమయంలోనే సీత గర్భం దాల్చిం దన్న విషయం నాకు రూఢిగా తెలుసు. ఆ విధంగా ఎంతో సాక్ష్యాన్ని చూపగలను."

"చూపు! చూపైనా సంతోషిస్తాను. ఇక నీతో మాట్లాడ్డం కష్టం. నీ వెంతకయినా మాట్లాడ్తా విపుడు."

మురళికి సీత విషయం అనుకొనే కొద్దీ - లక్ష్మి సమర్థించే కొద్దీ సరళ, లక్ష్మి సీత వైపే మొగ్గుచూపడం గురించీ - అసహ్యం అతిశయించి పోయింది. "చూపుతానుండు! అంటూ లేచిపోయి, పెట్టె తెరచి కొన్ని పదుల జాబులు తెచ్చి వాళ్ళముందు పడేశాడు. అందులో సత్యారావువి నాలు గున్నాయి. తక్కినవన్నీ ఆకాశరామన్న జాబులు! వాటినిండా అసభ్య వర్ణ నలు. లక్ష్మి సరళలు ఒకరి వెంట ఒకరు చదివారు. వారు కన్నీరుకారుస్తూ వుంటే విజయ గర్వంతో గంభీరంగా కూర్చున్నాడు మురళి! పురుష సంపర్కం కలలోగూడా యెరుగని లక్ష్మి, గొప్ప వ్యభిచారిణిగా చిత్రింపబడి వున్నది. సీత వ్యభిచారానికి గుర్తుగా ఆమె గర్భాన్ని ప్రతివాడూ ఉదహరిస్తు న్నాడు. ఎవరు చదివినా నిజమే అని తీవ్రంగా అసహ్యించు కొనేటట్లుం దందులోని చిత్రణము. రకరకాలుగా చిత్రించిన ఆ జాబుల్లోని ఉదంతాన్ని చూచి, మురళి నమ్మడంలో అంత తప్పేమీ లేదనుకుంది. అయితే - సత్య మతాన్ని అవలంబించి, సత్యాన్ని పాటిస్తా నంటూ, ప్రేమించిన హృదయం లోతు కనుక్కోకుండా, రుజువులేని ఆరోపణల చూచి, అనుమానించడం ఆమె సహించలేదు. ఎంతమరుగు పడినా, సత్యాన్ని త్రవ్వి లాగాలి గాని దాన్ని ఆవరించిన అసత్యాన్నే నిజమని నమ్మితే అది సత్యాన్వేషణగాదు.

లక్ష్మి ఒక ధోరణిలో అంది గాద్గదికంగా: "సరే మురళీ! నీవిట్లాంటి వాడివని అనుకోలేదు. నిందలు చూచి భయపడే వాడివని తేలిపోయింది. సత్యాన్ని కనుక్కోడానికి గూడా ప్రయత్నించని వాడివై పోయావు. ఆ శ్రమ నీకెందుకు? అదే కావాలనీ, అదే ఉత్తమమైన దనీ నీకు మనసులో వుంచే ఆ అన్వేషణకు ప్రయత్నించే వాడివేమో! నీ కంఠకంచే మంచి అవకాశాలూ

అన్ని విధాలా మేలుగా కనిపించేవి, దొరికి నపుడు, ఆ యత్నం చెయ్యా లన్న సంకల్పం యెందుకు కలుగుతుంది. యౌవన ప్రాదుర్భావ జనిత దుశ్చే ష్టితమై, నీలో ఒకానొక దుర్బలగుణమైన వ్యభిచారం మినహా మిగతా అన్ని విషయాల్లోనూ చాలా ఉన్నతాశయాలు గల వాడవని మేం చాలా విశ్వసించాం. ఆ విషయమే నేనూ సరళా చాలాసార్లు అనుకునే వారం. అయితే పర్యవ సానం ఇట్లా పరిణమించింది. నీవు చాలామంది సామాన్య పురుషుల్లాగానే ప్రవర్తించావు. ఇదిగో! కడపట ఒక్క విషయం మాత్రం చెబుతున్నా. నీకు పశ్చాత్తాపం రాకపోదు. ఒకానొక స్త్రీకి - నిష్కల్మష గుణోపేతకు - అన్యాయం నాచేతులారా చేశాను గదా అని దుఃఖించే ఒక ఘట్టం నీకు త్వరలో సంభవిస్తుంది. ఇప్పటికిగూడా ఆదర్శ వాదాలు తప్ప ఆచరణ శూన్యతతో ప్రవర్తించే పురుషులవల్ల సంఘంలో ఎంతమంది స్త్రీలు అవస్థల పాలవు తున్నారో అని నమ్మేకాలం త్వరలో నీవు చూస్తావు....''

లక్ష్మి మాట్లాడ్డం చాలించింది. గంభీరంగా కూర్చుంది చూపులు ఆలోచనల్లోకి ప్రవేశపెట్టి.

# 22

లక్ష్మి ప్రయాణమై కడపకు వెళ్ళిం తర్వాత యిల్లు చేరారు సరళా. మురళీ. సంభాషణ మళ్ళా కొంత నడిచింది. తీవ్రంగా కాకపోయినా, ఒక తీరులో సాగింది.

సరళ కాస్త మందలిస్తున్నట్లుగా, "నీ వైఖరి ఏమీ నచ్చడంలేదు మురళీ! ఆ విధంగా నీవు మాట్లాడ్డం అంత మంచిదిగాదు" అంది.

"కండ్ల యెదురుగా సర్వస్వమూ కనిపిస్తూవుంటే - జరిగినదానికంతా రుజావు కనిపిస్తూ వుంటే అనటంలో తప్పేమిటి?"

"రుజావులు సత్యదూరాలైనపుడు యేం చేస్తావు. ప్రస్తుత సంఘం లోని స్త్రీ స్థానాన్ని చదువుకున్నవారుగూడా సరిగా అర్థం చేసుకోవటం లేదు.

అర్హమైన మార్గంలో గౌరవించడంలేదు. ఇట్లాంటి అపవాదాలు స్త్రీలపై పడుతున్నాయంటే, అందుకు స్త్రీలే కారకులు కారు మురళీ! పురుషులే కారకులు ముఖ్యంగా, సమత్వం సమత్వం అని ఎడతెగని వినాదాలు వినిపిస్తున్నయీ కాలంలో గూడా, విద్యాధిక అయిన స్త్రీ గూడా బయటనడిస్తే తప్పు! ఒంటరిగా నడిస్తే తప్పు! ఇతరుడితో మాట్లాడితే తప్పు! పురుషుడు పబ్లిగ్గా వ్యభిచరిస్తున్నా వాడివైపు చూడరు! వాణ్ణి గురించి ఆలోచించరు! స్త్రీకి ఈసంఘంలో అందులో మన దక్షిణదేశంలో - భద్రత యేదీ? స్త్రీ కనబడితే, యేదో వొక విధంగా వెక్కిరించి, కేకలువేసి, యీలలువేసి, గిల్లిగగ్గోలు పట్టిస్తారు! ఊరుకున్న స్త్రీని గూడా రెచ్చగొడతారు. ఏదన్నా చేసినా, చేయకపోయినా, దానికి రంకుగట్టి వేళ్లు చూపి, నానావిధాలా గోలపట్టిస్తారు. ఒకడెవడో తెలివిలేకనో కసిచేతనో, ఫలానా పిల్ల రంకుది, అంటాడు! ఇక రెండోవాడు నేను చాలా మంది వల్ల విన్నానంటాడు, మరొకడు నే నీ రెండుకండ్లతో చూచానంటాడు. మూడోవాడు నన్నే పిలిచిం దంటాడు. దీని కంతేమిటి? ఇవన్నీ నేడుమనం చూస్తున్నవేనా? నీకు తెలియని వేమీకాదుగా! ఇన్నెందుకు? స్త్రీకి స్వతంత్రమూ, సమాన హక్కులూ కావాలనే వారికే స్త్రీ స్వాతంత్ర్యం అర్థం కావడంలేదు. ఇప్పటికీ అదేదో అర్థంకాని ఆధిక్యభావంతో అల్లాడిపోతున్నారు, ఉగ్గుపాలతో ప్రవేశించి రక్తంలో యింకి, నాళనాళాలలో జీర్ణమై కరుడు కట్టుకపోయిన భావాలు మారటం చాలా కష్టం. సంఘం మీ ఆధిక్యభావానికి మద్దత్తు యిస్తూ వుందనీ - అవకాశాలు కొల్లలుగా వున్నాయనీ - వాటి ద్వారా మీ యిష్టమొచ్చినవారి ననుభవించ వచ్చుననీ- పెచ్చుమీరి పోకూడదు. మన కేదో కలిగివుందని లేనివాళ్ళ పీ[illegible]ంగ్గా చూడటం దేనికి మురళీ!

మురళికి ఒక విద్యవచ్చు. తన కిష్టంలేని విషయాల్లో ఎక్కువ బంచ్చుచదు, మురళి ముభావం చూచి సరళ గూడా ఊరకుండిపోయింది.

సాయంకాలం మురళి లలిత యింటి కెళ్ళాడు. లలిత గూడా అప్పుడేవచ్చి, వంటింట్లోకి వెళ్ళింది. మురళి వెళ్ళి మామయ్య బయటి గదిలో కూర్చున్నాడు హెచ్చరించి. కాసేపటికి లలిత పాలు పట్టుకొచ్చింది.

"ప్రతిరోజూ నాకు పాలిచ్చి పంపిస్తున్నావు" అన్నాడు మురళీ నవ్వుతూ.

"అవును మురళీ! నిన్ను చూస్తే పాలివ్వాలనే బుద్ధి పుడుతుంది!" అని ఒక మోస్తరుగా నవ్వింది. ఆమె నవ్వును అర్థంచేసుకున్న మురళీ కాస్త విచారం ప్రకటించాడు. కాసేపెవరూ మాట్లాళేదు. లలిత నిలబడే వుంది. మురళీ పాలు తాగలేదు. లలిత వైపు గూడా చూళ్ళేదు. చూస్తూన్న లలిత ప్రక్కగా కుర్చీ యీడ్చుకొని కూర్చుంది.

"చూడు మురళీ! నీవు మంచివాడవు గదూ! పాలు తాగవూ? చూడూ! ఇట్లా చూడు!" అంటూ గడ్డం పట్టి పైకెత్తింది. సూటిగా ఆమె కండ్లల్లోకి చూచాడు. ఆమె చూపుల్లో వాత్సల్యభావం వుట్టిపడుతూ వున్నది. చేష్టల్లో సమదాయింపు కనిపిస్తున్నది. 'ఏమిటీమె నన్ను బిడ్డనువలె లాలిస్తున్న దేమిటి?' అనుకుంటూ ఆలోచిస్తున్నాడు. ఆమె మళ్ళా 'పాలు తాగవూ?' అంది వాత్సల్యంతో.

"ఏమిటి లలితా! నేను పసిబిడ్డ ననుకుంటున్నావా? నీ ధోరణి కొద్ది రోజుల నుండీ నా కర్థమవటంలేదు." అన్నాడు దైన్యంగా చూస్తూ.

"అవును. నీవు పసిబిడ్డవు కావూ? నీకూ నాకూ వయసులోగల తేడా అంత వుంది నీవయసు. కాస్త జ్ఞానార్జన చేసినా, వయసులో నీవు నాకు పసిబిడ్డవేగా! నీకర్థమవటం లేదన్నావు. కొన్నిదినాల నుండీ అర్థం కావటం లేదన్నావు. మొదటినుండి మాత్రం అర్థం చేసుకుంటున్నావు గనుకనా?"

ఈ మాటలు మురళీకి నచ్చలేదు. తాను వివాహమాడా లనుకుంటున్న వ్యక్తి ఈ ధోరణిలో మాట్లాడ్డం అతనికి చాలా వెగటేసింది. తనను ఆమె తాను ప్రేమిస్తున్నట్లు ప్రేమించడం లేదనుకున్నాడు. 'ప్రేమిస్తున్న ఎంత మందినో తోసేసి ఈమెను ప్రేమిస్తే ఈమె నన్ను వేరు విధంగా చూస్తున్నది. ప్రపంచంలో ఇంతేనేమో! వాళ్ళను నేను వదిత్తే ఈమె నన్ను వది లేస్తున్నది.' అని ఇట్లా ఆలోచించుకుంటూ కూర్చున్నాడు. పాలు మాత్రం

త్రాగలేదు. చూపులు మాత్రం చురుగ్గా వున్నాయి. ముఖం గంభీరంగా వుంది. లలిత అతని క్రాపులోకి చేతిబ్రేళ్ళను పోనిస్తూ, అట్లాదున్ని. చేత్తో తలను తనవైపు లాగి, తాను ప్రక్కకువంగి, తమకంతో, సానుభూతితో - నొసటి కనంపై ముద్దుపెడుతూ "మురళీ! ఏమి టాలోచిస్తున్నావో నాకు చెప్పవూ?" అంది ప్రేమతో.

"ఏమీ ఆలోచించడంలేదు. ఒకవేళ ఆలోచిస్తున్నా నీకది అనవసరం" అంటూ లేచాడు. బిర్రుగా వెళ్ళిపోయాడు. ఆ నిర్గమిస్తున్న మూర్తిని విచార భావకలిత మందహాసంతో తిలకిస్తూ అట్లాగే నిలుచుండిపోయింది లలిత.

అట్లా వెళ్ళిపోయిన మురళి వీధిలో నడుస్తున్నాడు ఆలోచించుకుంటూ. తనను మించివెళ్ళి, ఎదుట, ఒక కారు ఆగింది. దాంట్లోవున్న చంద్రమణి, "మురళీ! కార్లోకి రా!" అంది, ఏమీ మారు మాట్లాడకుండా వచ్చి ప్రక్కలో కూర్చున్నాడు. ఇంటి ముఖంగా పోతున్న ఆమెకంటె ముందుగా పరుగెత్తుతూ వుందామె మనసు. తృప్తితో - ఒక విధమైన సంతోషంతో "ఎపుడోగాని రావటం లేదు మురళీ! నీ మొగమే కరువైపోయిం దిటీవల!" అంది చంద్రమణి.

"అన్నిసార్లు వస్తేనే."

"ఎన్నిసార్లు వచ్చా వేమిటి?"

"ఎన్నోసార్లు వచ్చాను."

"ఎపుడూ నా దగ్గిర వుండవలసిన వాడవు లెక్కలుగూడా మొదలెట్టావే. సరేగాని లలితగారు నిన్ను వదలటంలేదా యేమిటి?"

ఆ ప్రశ్న కిదివర కయితే ఎట్లా ఫీలయ్యేవాడోగాని, ఇపు డేమీ ఫీలు కాలేదు.

అందుకు కాస్త ప్రోత్సహిత అయినట్లుగా, "నీవు నన్ను నీకంటే చాలా పెద్దదాన్నన్నావుగదా, నాకూ లలితకూ యెంతతేడా వుంటుంది!" అంది చంద్రమణి.

"నీకంటే ఒక సంవత్సరమో, రెండు సంవత్సరాలో ఎక్కువయినా, నీ కంటే కనీసం పన్నెండేండ్లయినా చిన్నదిగా కనిపిస్తుంది. పైగా ఆమె బ్రహ్మచారిణి" అన్నాడు అతి సాధారణంగా మురళి.

"నేను కాదేంటి?"

"నే నెంత బ్రహ్మచారినో, నీవూ అంత బ్రహ్మచారిణివి."

'అయితే అటువంటివారేగా దంపతులు కావాల్సింది. నీవంటి బ్రహ్మచారి అనాఘ్రాతపుష్పాన్ని కోరడం, మీ కవకాశ మున్నదని ధర్మభేదాన్ని పాటించడమే గదూ?"

మురళి యేమీ మాట్లాడలేదు.

చంద్రమణి మళ్లా అంది: "రెండుచేతులూ పరస్పరం తాకితేనే చప్పట్లు వినిపిస్తాయి. అట్లాగే స్త్రీ పురుష లిర్వురూ కలిస్తేనే వ్యభిచారానికైనా ఆస్కారం వుంది. స్త్రీలే కారకులెట్లా అవుతారు? అవసరం యిరువురికీ ఒకటే. అవసరంవల్ల అట్లా అనాలోచితంగా కలుస్తారు. ఆ తప్పు ఒక స్త్రీ నెత్తినే రుద్ది దాన్ని గోలచేసి గగ్గోలు పట్టిస్తారు. కలిసినవాడే, అంటే ఆ వ్యభిచారానికి కారకుడైనవాడే, దాన్ని చేసుకోమంటే వ్యభిచారిణి అనే భావంతో నిరాకరిస్తాడు. వీడు వ్యభిచారి అని తెలిసిగూడా పిల్లనిస్తాం అంటూ ఎందరో వస్తారు. ఎందరో పిల్లలు తెలిసిగూడా వీణ్ణి చేసుకోటానికి అంగీకరిస్తారు. స్త్రీ అసహాయ కాబట్టే ఈ అన్యాయానికి లొంగుతూవుంది. సంఘంలో యిట్లాంటి పాక్షికభావం యెందు కయితే వుందో, దానికి కారకు లెవరో చెప్పు?"

"నీతో సర్వవిధాలా యేకీభవిస్తా నత్తా. నేనుగూడా ఎన్నిసార్లో చింతిస్తూవుంటా నివన్నీ ఆలోచించి. సంఘం ఆపాదమస్తకం మారాలి. ప్రస్తుతంవున్న ఆధిక్యన్యూనతా భావాలు మారాలి."

"నీలో నీవు మార్చుకున్నావా?"

"చాలా ప్రయత్నిస్తున్నాను. పరిపక్వదశకు రాలేదు. అవకాశాలు మాత్రం మా భావాల మార్చుకోనీడంలేదు. సంఘం పాక్షికదృష్టితో చూడటం వదిలిపెడితేగాని, ఈ విషయంలో సమత్వం రాదు. దానికెన్నో అంశాలు తోడ్పడాలి."

"మీ భావాలు మారవు మురళీ. మార్చుకోవాల్సిన ఆగత్యం లేదు.

మీకు జన్మహక్కులు (Previleges) వున్నాయి. ఉన్న ప్రివిలేజిని ఎందుకు నాశం చేసుకుంటారు?"

ఇంతలో తపాలాబంట్రోతు వచ్చి ఒక టెలిగ్రాం యిచ్చాడు. చంద్రమణి దాన్ని చించి "మా అక్కయ్యనుండి మురళీ! రేపు ఉదయం మెయిలు కొస్తున్నది! నీకుగూడా చెప్పమన్నది!" అంది.

# 23

"మద్రాసు విశేషా లేమిటక్కయ్యా" అంది సీత లక్ష్మితో.

"ఏమున్నాయమ్మా! అందరూ కులాసాగానే వున్నారు."

"సరళ యేమంటుంది?"

"ఏమంటుంది? ఆమెగూడా మనమాదిరి బాధపడుతూన్న వ్యక్తే! అందుచేత నీ విషయంలో యెక్కువ సానుభూతి చూపుతుంది."

"మురళి యేమన్నా డక్కా?"అంది దగ్గరగా వంగమని చెప్పి కాస్త సిగ్గుతో.

లక్ష్మి దీనికి జవా బేమని చెప్పుతుంది? ఈ ప్రశ్నకు జవాబు కోసమే లక్ష్మి రైల్లో అంతా ఆలోచించింది. సీతకేమని చెప్పటం - అన్నదే తనకు తీరని సమస్యగా కూర్చుంది. తన ప్రయత్నమంతా వృధా అయినట్లు కాగా, ఏదో వ్యధ హృదయాన్ని బాధపెట్టినట్లయింది. సీత ప్రశ్నకు జవాబుగా ఒక కన్నీటిబొట్టు రాల్చింది. అది ఆమె చాచిన చేతిపై వేడిగా పడింది. సీత అంతా గ్రహించింది. హృదయంలో సహింపరాని బాధ బయలుదేరిందిగాని, తాను విషాదాన్ని చూపిస్తే అక్కకు మరింత దుఃఖహేతువౌతుందనీ - అది మళ్ళా తనకు ఖేదహేతువౌతుందనీ-సీత హృదయాన్నణచుకొని మామూలుగా అక్క మొగంలోకి చూచి, అటు తిరిగి పడుకొంది.

సీతకు విన్నటినుండీ ఆయాసంగా వుంది. మనిషి చాలా నీరసంగా వుంది. ఇటీవల భోజనం చాలించిందని అపుడే వచ్చిన నర్సు చెప్పింది. ఆమె నెవరూ విశేషంగా మాట్లాడించ గూడదని గూడా లక్ష్మికి చెప్పింది. లక్ష్మి అక్కణ్ణుంచి లేచిపోయింది.

రెండు దినాలు గడిచాయి. సీత నిదానంగా, ఓర్పుగా, గంభీరంగా కనబడుతూ విషయాలన్నీ లాగింది. హృదయం పగిలిపోయే పరిస్థితి కలిగింది. అది బయట పడనీయలేదు. జరిగిన విషయమై ఖేదపడినా వొకటే సంతోషించినా వొకటే. ఈ రెంటికీ మించిన విషయం అనుభూతిని అనుభవిస్తూంది సీత. ఇపు డన్నం గూడా మానింపి ఆలోచన కంతరాయం గలగ గూడదని. పర్యవసానంగా నిర్ధారణకు వచ్చింది. ఆమె అన్నం తినడం మానడం చూచి డాక్టరు బలవంతం చేస్తే గూడా తినలేదు. లక్ష్మి ఎంతగానో అర్థించింది. "నాకు సహించడం లేదక్కా. నన్ను బలవంత పెట్టకు" అని ఇదివరకు లాగా వేడికోలు ధోరణిలో కాకుండా, నిర్మొహమాటంగా అంది. లక్ష్మికి హృదయావేదన ఎక్కువైందిగాని, ఏమి చెయ్యడానికీ తోచడంలేదు. ఇదివరకులాగా సీత తన అభిప్రాయాలు చెప్పడం చాలించింది. సలహా లడగడం చాలించింది. కోరికల కోరడం వదలిపెట్టింది. తనలో తానేదో చూచుకుంటున్నట్టుగా కనిపిస్తుంది. ఒక్కొక్కసారి పెదవులపై పండ్లు బిగించి, తల పంకించి "ఊహూఁ" అంటుంది-ఈ విషయాలన్నీ సరళ కొక పెద్ద ఉత్తరంగా వ్రాసింది లక్ష్మి. తక్షణం రమ్మని వ్రాసింది. రాజామణికి బెజవాడకు బాబు వ్రాశానని తెలియజేసి మద్రాసుకు వచ్చివుంటుందేమో పిలుచుక రావలసిందని వ్రాసింది. కృష్ణయ్యకూ, సత్యారావుకూ విషయాలన్నీ విశదీకరిస్తూ తప్పక తక్షణం రావలసిందని వ్రాసింది.

సీతమగ బిడ్డను కన్నది. ముందునాడు బలవంతాన కాస్త గంజి త్రాగించారు. మరునాడు గూడా లక్ష్మి బ్రతిమాలి ఏడ్చినందువల్ల కాస్త రొట్టె ముక్క తిన్నది. మూడోనాడు ముట్టలేదు.

లక్ష్మి దగ్గరగా కూర్చొని, గాద్గదికంగా: "సీతా! నీకింత నిర్దయగా

ప్రవర్తిస్తావనుకో లేదమ్మా! నన్నింత దుఃఖాల పాలుచేస్తావని నేను కలలో గూడా అనుమానించలేదు. ఎవడో ఒక పురుషుడి నిర్దయ ప్రవర్తనకు నీ వీ విధంగా ప్రాణాలు వదిలేస్తావా? నాపైన అంత నిర్దయ యెందుకు? నిన్ను సర్వస్వంగా చూచుకుంటూ వున్న నన్ను వదిలిపెట్టిపోతావా? నన్ను ఏకాకిని చేసి నీవుగూడా వెళ్ళిపోతావా? నీ యీ ఆత్మహత్య యెందుకో చెప్పు?'' అని యేడ్చింది. సీత జవాబేమీ చెప్పలేదు.

ఆనాడే అందరూ దిగారు. రాజామణి, సరళ, చంపక, వచ్చారు మద్రాసునుండి. బెజవాడనుండి క్రిష్ణయ్య, సత్యారావులు వచ్చారు. వీళ్ళందర్నీ చూచి లక్ష్మి బోరున యేడ్చింది. లక్ష్మి ఆ విధంగా, అంత అధైర్యంతో, ఏడుస్తుందని వాళ్ళలో యెవరూ ఊహించలేదు. గుండెలు పగిలేటట్లుగా యేడ్చింది. ఆ యేడుపుకే వాళ్ళ గుండెలు దిగజారాయి. "సీత కెట్లా వుంది?" అని అందరూ ఒక్కసారిగా అడిగారు ఆదుర్దాతో. లక్ష్మి ఏడుస్తూ అంతా వర్ణించింది. అందరూ ఆస్పత్రికెళ్ళి సీత స్థితిని చూచారు. సూర్యోదయా నంతరం వెలవెలపోతున్న పూర్వదిక్పతిలాగా వుంది సీత. ఝంఝూమారుతా నంతరం ప్రశాంతతను వహించి వున్న సముద్రం పోలివుంది సీత! ఎవరి తోనూ ఎక్కువ మాట్లాడలేదు. వచ్చిన వాళ్ళలో మురళి వున్నాడేమో అని చూచింది. కనబడలేదు. కాస్త అసంతృప్తితో అటు మళ్ళి ''సత్యారావ్ నీవు అసత్యాన్ని ప్రకటించావ్. నేను ప్రాణాలనైనా అర్పించి సత్యాన్ని ప్రకటిస్తా'' అంటూ అటు తిరిగి పడుకొంది. అందరూ విషాదపూర్ణ మనస్కులయ్యారు.

సత్యారావు ''క్షమించు సీతా! మీ యిద్దరి కష్టాలకూ, ముఖ్యంగా నీ యీ స్థితికి నేనే కారకుణ్ణి'' అంటూ కన్నీరు కార్చాడు. అందు కామె యేమీ జవాబు చెప్పలేదు. సరళ ఈవైపు తిరిగి వచ్చి కూర్చొని ''సీతా! మేమంతా నీకోసం వచ్చాం. మాట్లాడవూ?'' అంది తలనిమురుతూ.

''మీ రిప్పు డొచ్చారు. నాకోసం యింతకు చాలాముందే యెవరో వచ్చారు,'' అంది స్మితవదనంతో.

సీత ఈదఫా యెవరితోనన్నా మాట్లాడిందీ అంటే, అది ఒక్క సరళ

తోనే. సరళ చాలా బ్రతిమాలటంవల్ల, అందరూగూడా మేంగూడా తినం అని శపథం పట్టంవల్లా, సీత నాలుగు మెతుకులు తిన్న దానాడు. మిగిలిన నాలాళ్ళు కాస్త రొట్టె సేవిస్తూనే వచ్చింది. సత్యారావు తానెంతగా పశ్చాత్తాపపడ్డాడో చెప్పడం వర్ణనాతీతం! అంతా వర్ణిస్తూ, ఆవేదనతో, ఒక సుదీర్ఘమైన లేఖ వ్రాశాడు మురళికి సత్యాన్ని ప్రకటిస్తూ. క్రిష్ణయ్య గూడా వ్రాశాడు,

వారం దినాలు పూర్తిగా గడిచాక ఆస్పత్రి వదిలి యిల్లు చేరింది సీత. అందుకొరకుగా వేచివుండిన సీత యిల్లు చేరగానే అన్నపానాలు బిగబట్టటం మళ్ళా సాగించింది. తొమ్మిదో దినాన స్పృహ లయిపోయాయి. సంతోష విషాద సంకలిత హృదయాలతో ఆ నా దందరూ కాస్త తృప్తిపడి పిల్లవాణ్ణి చూస్తూ కూర్చున్నారు. కడపట ప్రసాదంగా కాస్త సేవించిం దానాడు సీత. ఎవరితోనూ మాట్లాడలేదు. కొడుకువైపు చూస్తూ తృప్తిగా పడుకొంది. మరు నాడు సీతలో ఎక్కడా, ఎపుడూ చూడని ఒక ఆనందశక్తిని చూచారు అంతా. అక్క నడిగి ఆనాడు మురళి తనకుగా తెచ్చిన వస్త్రాలు ధరించింది. గంధం కాస్త తీసి పూయమంది. లక్ష్మి కన్నీరు కారుస్తూనే సీతను సింగా రిస్తూ వుంది. వాడిన తీగవంటి ఆమె శరీరాన్ని స్పృశించి లక్ష్మి భోరున యేడుస్తూ "సీతా! నీ నిర్ధారణ మార్చుకోవా!" అని చదికిలబడింది.

"ఎందుకక్కా! అవసరంలేదు. మురళికి మాత్రం ఒక విషయం చెప్పు ఎపుడైనా తటస్థిస్తే. 'నేను తనకోసమే జీవించాను. తనకోసమే జీవ యాత్ర చాలిస్తున్నాను' అని. అంతే నా తుదికోర్కె. నేను ధరించిన యీ బట్టలు గూడా నాతోనే పూడ్చెయ్యండి. మీరు ప్రాపంచిక దృష్ట్యా చూస్తూ భవబంధాలు వదులుకోలేక ఈ విధంగా విలపిస్తున్నారు గాని, నా యీ ప్రతిజ్ఞా పూర్వక మరణం సంఘం శ్రేయస్సుకే అనీ - అబలా లోకానికి బలం చేకూర్చేదనీ - పురుషజాతి యికనైనా నిష్పాక్షికంగా వ్యవహరించి స్త్రీకి సమస్థానాన్ని యివ్వడానికి పురికొల్పేదని - రుజువౌతుంది."

అవే సీత కడపటి మాటలు! సీత కన్ను మూసింది శాశ్వతంగా. లక్ష్మి ఎంత ప్రాధేయపడినా ఫలం లేకపోయింది. జీవించాలని కుతూహల

మున్నంత కాలమూ, తనకు సీత యెంత లొంగి, ప్రేమతో జీవించేదో - జీవితం చాలించా లనుకున్న తర్వాత ఎంత స్వతంత్రంగా, నిర్దాక్షిణ్యంగా - ప్రవర్తించిందో, అన్నీ ఆలోచిస్తూ కూర్చుంది లక్ష్మి యేడుస్తూ. 'పార లౌకిక దృష్టి కలిగితే యిహలోకపు సంబంధాన్ని అంత పేలవంగా చూస్తారు కాబోలు.' అనుకుంటూ కూర్చుంది. ఏడ్చి ఏడ్చి, కడపటికి, అవసరంకొద్దీ ధైర్యం వహించింది లక్ష్మి. చాకల్ని పిలిచి సీత అంత్యక్రియలకై పూను కుంది.

మురళికి తంతివార్త వెళ్లింది. అతడు వస్తాడన్న నమ్మకం వాళ్ళ కెవరికీ కలగలేదు. సత్యారావు వెళ్లి పిలుచుకొస్తానన్నా గూడా అందరూ అనవసరం అన్నారు. పాడి కట్టాడు. అక్కడెక్కువ మంది ప్రోగుకాలేదు. ఇరుగు పొరుగువారికి వీరంటే మర్యాద అంతగాలేదు. వారికిగూడా కొద్దిగా తెలిసింది వీరి పాట్లు. పెండ్లి కాకుండానే సీత గర్భం దాల్చటం వాళ్లుగూడా యెరుగుదురు. వీరి ప్రవర్తన యెంత మంచిదిగా వున్నా వీళ్ళపై ఎక్కువ సద్భావం లేదు. ఏ మహమ్మారివల్లనో, విషూచి, మసూచి, ఇత్యాది రోగాల వల్లనో చనిపోయినవారి దగ్గిరికి ఏవిధంగా అయితే చేరరో ఆ విధంగానే సీత మృతదేహం దగ్గిరికి రాలేదు. ఎక్కువ ఏడుపు ధ్వనులుగూడా వినిపించటంలేదు. అశ్రుజలాన్ని కుమ్మరించే బంధుజనం గూడా విరివిగా లేరు. బాజా భజంత్రీలు లేవు. మోసేందుకుగూడా మనుషులు దొరకలేదు. ఎక్కువ డబ్బిస్తామన్నా దొరకలేదు. కడపటికి లక్ష్మి, సత్యారావులు ముందువైపున్నూ సరళ క్రిష్ణయ్యలు వెనుకవైపున్నూ పట్టారు. నిశ్శబ్దంగా నడుస్తున్నారందరూ. దారిన గూడా యెవరూ యిటువైపు ఆకర్షింపబడలేదు. ఏదో శవం పోతున్నదని గూడా యెవరూ గమనించడంలేదు. పూడ్చే స్థలానికి పోయారు. అక్కడ కాపలా మనిషి వచ్చింది. పేరు వ్రాయమంది. భర్త పేరు వ్రాయమంది. ఏదో వ్రాశారు. పావలా యిచ్చారు. చాకళ్లు త్రవ్విన గుంత దగ్గర దించారు. ఇక ఆ గుంతలో సీతను దాచాలి. ఇన్నాళ్లుగా యెవరైతే వీళ్ళ మధ్య కల కలలాడుతూ ఆహ్లాదాన్ని కల్గిస్తూ వుండిందో-సజీవమై యే శరీరమైతే లావణ్య

శోభలతో ప్రకాశిస్తూ ఆకర్షణాత్మకమై వుండిందో - యే శరీరమైతే లక్ష్మికి ఒక రమ్యప్రేమ విగ్రహముగా కనిపిస్తూ వుండిందో - యే శరీరమైతే మురళి తమకం సర్వస్వానికి ఒక గాదెవంటిదో - ఆ శరీరం వారికి దూరమై పోతున్నది.

అందరూ దుఃఖోద్విగ్న మనస్కులై అయోమయ భావాలతో వున్న సమయంలో - సజలనేత్రుడై - స్వేదజలపూర్ణ గాత్రుడై - ఊర్ధ్వహస్తుడై "ఆపండి" అని కేకవేసిన మురళి అల్లంతదూరంలో కనిపించాడు. అతని ఆకారాన్నీ, ఆ పరుగెత్తే తీరునూ, ఆ ముఖ భంగిమనూ చూచి అందరూ ఒక్క పెట్టున భోరుమన్నారు. మురళి కొట్టుకపోయినట్టుగా సీత కళేబరం పై పడి దాని హృదయంపై ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడువసాగాడు! అతడు కార్చిన కన్నీటితో ఎంత కామం కారిపోయిందో! ఎంత కోపం క్షాళితమై పోయిందో! ఎంతో సేపటికి తల ఎత్తాడు. వివర్ణమై పోతున్న ఆ ముఖం వైపు చూచాడు. ఎన్నెన్నో విషయాలు స్మృతి పథంలో గిరున తిరుగసాగాయి. శూన్య దృష్టితో అట్లా చూస్తూ కూర్చున్నాడు. రేపు నేనూ యింతే! ప్రతి ప్రాణీ యింతే! ఆ ప్రాణం వున్నంత కాలమే లావణ్యం! ఆకర్షణ! అది కాస్త పోతే యేమీ లేదు. వట్టిమట్టి! మిగిలేది ఒక స్మృతి చిహ్నం.

మురళి లేచాడు. ఆ శవం వైపు చూస్తూ నిలబడ్డాడు. ఆనాడు తాను తెచ్చిన చీరా, రవికా, ఈ నా డామె ధరించి వుంది. నా ప్రేమ చిహ్నానికి విలువ యిదే కాబోలు! మృతదేహ ధారణాయోగ్యాలు కాబోలు! నిజమే! నా ప్రేమ అంతే ఐంది! సీత దానికి తగిన విలువ కట్టింది! ఉచిత స్థానం యిచ్చింది ....

"మురళీ!" అంది లక్ష్మి. దీనంగా ఆమె వైపు చూచాడు. నిరహంకారపు చూపులు అశ్రుజలం ఇంకా కుంఠితం చేశాయి.

"ఇక మనం విచారింప నవసరంలేదు. ఈ స్థితి రాకుండా చేసుకొనే

అవకాశం వున్నప్పుడు విడనాడుకున్నాం. కావలసిందేదో అయింది. ఇక దానికి తిరుగులేదు.''

''.... .... .... ....''

''నీవు తలవైపు పట్టు! సమయానికి వచ్చావు. నీ సన్నిధిలో ప్రాణం పోవాలని దానికి ఆశ వుండేది. నీ చేతులారా ఖననమన్నా జరిగే యోగం వుంది కాబట్టి ఇపుడయినా వచ్చావు. నీవు తల వైపు పట్టు. నీవూ, క్రిష్ణయ్యా కాళ్ళ వైపు పట్టండి. సరళా! నీవు గోతిలోకి దిగు సత్యా'' అంది లక్ష్మి. అందరూ పట్టారు. సీత కళేబరాన్ని గోతిలో బోరగిల పడుకోబెట్టారు. కన్నీటిని కానుకగా అర్పిస్తూ అందరూ గట్టున కూర్చున్నారు. మురళి చేతులు వెనుకకు పెట్టి, వెనుకవైపుగానే మూడు పిడికెళ్లు మట్టివేశాడు. సత్యారావు క్రిష్ణయ్యలు మరి కాస్త మట్టి తోసేశారు. చాకళ్లు మిగిలిన పని ముగించారు.

సీత కళేబరం గూడా మరుగుపడి పోయింది. భార హృదయాలతో, ఎవరిపాటికి వారు సీత గుణగణాలను గురించీ, ఆమె జీవితాన్ని గురించీ ఆలోచించుకుంటూ నడిచారు.

స్నానా లయిపోగానే అందర్లోనూ వున్న వైరాగ్య భావాలపటుత్వం కాస్త సన్నగిల్లింది. మురళి హృదయంలో బాధ పెల్లుమీరింది! సత్యారావు, సీత మరణానికి కారకుడు తానేగదా అని చాలా బాధ పడుతూ కూర్చున్నాడు. చంపకా రుక్మిణులు అన్నం తయారు చేశారు. ఎవరూ లేవలేదు. తనకు సంహించకున్నా లక్ష్మి లేచి అందర్నీ లెమ్మంది. అందరూ లేచారు గాని సత్యారావు లేవలేదు. కన్నీరు కారుస్తూ కూర్చున్నాడు. లక్ష్మి మళ్ళా ఒక సారి లేవమంది. ఆమె రెండు చేతులూ పట్టుకొని కన్నీరు కారుస్తూ ''నా కే శిక్షయినా వెయ్యి లక్ష్మీ! దీనికంతా కారకుణ్ణి నేను. నేను పాపిని! నావల్ల మీరెన్నో కష్టాలు పడ్డారు. కడకు సీత ప్రాణాలు కూడా అర్పించింది. నన్ను నీవు తప్పక శిక్షించు. అంతవరకూ నా మనస్సుకు శాంతి వుండదు. నే నసలు యిక్కడికి రాకనే పోదును. అక్కడే ఎంతో వ్యధపడ్డాను. మీ మొగాలు చూడలేననుకున్నాను. క్రిష్ణయ్య బలవంతం చేశాడు. రావడమే మంచి

దయింది. కండ్లారా ఆమెను చూడనన్నా చూశాను. నా అసూయ, దుర్మార్గం ఫలితంగా సీత తనువు చాలించింది. అంతకుముందే అవి, నాలో నుండి మాయమైపోయాయ్! ఆ స్థానంలో కేవలం పశ్చాత్తాపం మిగిలింది. నా స్వార్థం వల్లనే, పగ వల్లనే, ఇంత స్థితికి మిమ్ములు తెచ్చాను. నీవు శిక్ష విధించకపోతే ఈ దుఃఖాన్ని మరువలేను. ఈ పాపం జీవితాంతం వరకూ వదలదు.''

''నీవు చేసింది మాత్రం యేముంది సత్యారావ్! నీవు కారణ మాత్రుడివి. అదట్లా కావాలని వుంది. దానికి బాధ్యుడవు నీవని అనుకుంటూన్నావు. నీవు కాదు. అయితే ఒక ఓదార్పు కనిపిస్తున్నది. అసూయతో, పగతో, ఈర్ష్యతో, దుర్మార్గంతో నీవు జయించలేకపోయావు. సహనంతో, పట్టుదలతో, ప్రేమతో, ప్రతిజ్ఞతో, సీత జయించింది. నిన్ను పశ్చాత్తప్తుణ్ణి చేసింది. అది చచ్చి అయినా సాధించింది. పోనీ, ఆమె చిత్తానికి ఈ శాంతి అయినా ఉంటుంది .... అన్నీ యిక మరుద్దాం జీవించాల్సి వున్నాం గనుక. వాటినంతా విస్మరిస్తేనే మంచిది'' అని ఓదార్చింది.

దుఃఖం దిన దినమూ దిగుముఖాన్ని పడుతూ వచ్చింది. అందరి ముఖాలూ కాస్త కాస్త మామూలు స్థితి కొస్తున్నాయ్! దీని కంతా ముఖ్య కారణం పిల్లవాడు.

''వీడంతా అన్నయ్యలాగా వున్నాడు అప్పటంగా!'' అంది చంపక.

''అవును. వీడి నాయన పుట్టినపుడు నేనే పురుడుపోశాను. అంతా యిట్లాగే వుండేవాడు. ఇట్లాగే నవ్వేవాడు. ఇదే మాదిరి దవడల్లో సుళ్లు పడేవి నవ్వితే,'' అంది రాజామణి.

'నేనే పురుడు పోశాను వీడి నాయనకు' అన్న పలుకులు విన్న మురళి అట్లా ఒకసారి చూచాడు రాజామణివైపు. భరింపరాని ఏహ్యాభావం పుట్టుకొచ్చింది హృదయంలోనుంచి. అది ప్రాతిపదికగా మళ్ళా తానుచేసిన పాత కృత్యాలన్నీ నెమరు వేసుకుంటూ తన్ను తా నసహ్యించుకుంటూ కూర్చున్నాడు.

# 24

అందరూ మద్రాసు చేరారు. సరళ వున్న అద్దెయింట్లోనే దిగారు. వారా నా దొస్తున్నారని సన్యాసిరావు, లలితగార్లకు తెలుసు. ఆనాడు ఎక్స్‌ప్రెస్ చాలా లేటుగా వస్తున్నదని తెలిపింది. అంచేత వాళ్లు వీళ్ళను చూడడానికి ప్రయత్నించలేదు. వీరంతా బస చేరేటప్పటికే రాత్రి పది గంటలయింది.

ఉదయం సరళ పిల్లవాణ్ణి కాళ్ళపై పండవేసుకొని ఉగ్గుపెడుతూ వుంది. అందరూ చుట్టూ మూగివున్నారు, మురళి తప్ప. పిల్లవాడు కేకలేసి యేడుస్తూ కాళ్ళతో తంతున్నాడు.

కాళ్లు పట్టుకున్న చంపక,

"చూడక్కా ఎంతగా తంతున్నాడో! వీడు వట్టి అల్లరోడుగా వున్నాడు" అంది. ఉగ్గుపట్టడం కాగానే ఉయ్యాల్లో పండేసి జోలపాట పాడుతూ వుంది సరళ.

ఇంతలోకే హఠాత్తుగా వచ్చారు లలితా సన్యాసిరావులు. లలిత వచ్చీ రావటంతోనే "పిల్లవాడేడీ" అంటూ ఉయ్యాల దగ్గిరికి చొరబడింది. వాణ్ణి చూడగానే, ఒకనాటి ఘట్టం, తటాలున స్మృతి కొచ్చింది. తటాలున తీసుకొని హృదయానికి హత్తుకొని 'వాడే వీడు' అంటూ వుంది ఆనందంగా,

"వకుళా!" అంది ఆశ్చర్యంతో రాజామణి. స్తంభీభూత అయినట్లుగా నిలబడింది లలిత రాజామణిని చూస్తూ.

"వీళ్ళల్లో చేతి ఎన్నాళ్ళయింది?" అంది రాజామణి మళ్ళా సంతోషంతో.

"చాలా నాళ్ళయింది!"

"కొడుకును కనుక్కున్నా వన్నమాట!"

సరళకుగాని, మరెవరికీగాని అర్థం కాలే దీ సంఘటన! సినిమాలో చూస్తున్నట్లుగా వుంది.

అనుమానంగా, "అదేంటత్తా. లలితగార్ని వకుళా అంటున్నావు?" అంది. రాజామణికి అపుడర్థమైంది అసలు విషయం బయటపడలేదని. రహస్యం బయటపెట్టవచ్చా అన్నట్లు లలిత వంక చూచింది. ఫరవాలేదన్నట్లు సైగచేసింది లలిత.

"మురళి తల్లి వకుళ" అంది రాజామణి. అంతా వింటూ అప్పటికి గదిలోనుంచి బయటకొచ్చాడు మురళి చింతామేఘాచ్ఛన్నముఖంతో. ఆశ్చర్యంగా అట్లా చూచా డందరి వైపు. కళకళలాడుతున్న లలిత ముఖంలోకి చూచాడు.

"అదో మురళి నీ తల్లి! ఇంకా తెలుసుకోలేకున్నావా!" అంది రాజామణి. ఆ పలుకులు ఎక్కడనుందో.

ఎంతదూరంనుండో అంతర్వాణి పలుకుతున్నట్లుగా వింటున్నాడు.

"లలిత - వకుళ. వకుళ మురళి తల్లి"—ములుకుల వంటి పలుకులు! చెవిగూబలకు సూదులు! హృదయానికి సమ్మెటపోట్లు! ఆ పలుకులు అవిచ్ఛిన్నంగా వినిపిస్తున్నాయ్! వద్దనుకున్నా చెవుల్లో మారు మ్రోగుతున్నాయ్! వడగండ్ల వడివడిగా మింగినట్లు - ప్రళయకాల మేఘగర్జనచే చెవిగూబలు బ్రద్దలైనట్లు - సన్నవి విషపు సూదులతో చెవిగూబలు చిల్లులు పడకొడిచినట్లు - సర్వదిఙ్మణులైన ప్రచండ భానుకిరణ సర్వస్వమూ కేంద్రీకరణమై ఏకముఖంగా హృదయాన్ని దహించి వేసినట్లు - అబ్బా! - చెవులు మూసుకున్నాడు హఠాత్సంఘటన! విచిత్ర సంఘటన! అంతా ఒక పెద్ద స్వప్నం! తా నేం వింటున్నాడో తన కిపుడు తెలియలేదు. శరీరం ఆపాదమస్తకం కంపిస్తున్నది. ఎక్కడనుండి ఉత్పన్న మయిందో, అసహ్యభావం తన నమాంతం కుంగదీస్తున్నది! ఆకాశం బ్రద్దలుగా పగిలి నా మీద పడదేం? ధరాతలం బ్రద్దలుగా చీలి నన్ను రసాతలానికి కొనిపోవదేం? ప్రచండ మారుతాలు నన్ను గిరగిర తిప్పి ఎగరగొట్టవేం? ప్రళయభానులు ఒక్కుమ్మడిగా నన్ను దహించి వెయ్యరేం? - గుండెలు గుప్పెట్లో పట్టుకున్నాడు. పైన పిడుగు పడ్డట్టయింది. శరీరం భస్మీభూతమై పంచభూతాల్లో

లీనమై నట్టయింది! ఆకర్షణ శక్తి అంతరించింది. దృష్టి మందగించింది. సర్వేంద్రియాలూ సమ్మోహితమై చేసినట్లయింది. అట్లా చూశాడు. ఒకవైపు సరళ! మరొకవైపు లలిత - వేరొకవైపు రుక్మిణి! ఛీ! ఛీ! కన్న తావునే కామంతో అపేక్షించడం!!....అబ్బా!!....తనలోనుండే యేవో శబ్దా లుత్పన్న మైనాయ్! బయలుదేరాడు. ఉత్తరాభిముఖుడై బయలుదేరాడు. పోతూనే వున్నాడు! ఎవరూ అడ్డలేదు! అడ్డినా ఆగడు! అతడు పోతున్నంత దూరమూ ఈ శబ్దం వినిపిస్తున్నది:

ప్రేమయె సత్యం శాశ్వత మమృతం
కామమనృత మశాశ్వతం మృతం
ప్రేమయె దైవం దివ్యం దీధితి
కామమాసురం పాపం ధ్వాన్తమ్
ప్రేమ ఊర్ధ్వముఖగామి గోచరం
కామమధోముఖ గామ్యగోచరం.

సంపూర్ణం

150210

## అంతటి నరసింహంగారు

జననం 1925 లో. జన్మస్థలం కడపజిల్లా వెంకటరాజు పల్లి. విద్యాభ్యాసం:- రాజంపేట బోర్డు హైస్కూలు. అనంతపురం ఆర్ట్స్ కాలేజి, వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయం. తెలుగు ఎం. ఏ., హిందీ విశారద. ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. 1943 నుండి రచనా వ్యాసంగం.

గేయకావ్యములు:—కవిసమ్మేళనం, అర్పణం.

సాంఘిక నవలలు:—ఆదర్శం, భావం, స్వగతం, ప్రేమభిక్ష, [illegible]

చారిత్రిక నవలలు:—రామరాయలు.

నాటకాలు:—పరిష్కారం, భువనవిజయం, సామరస్యం, [illegible]త్వం, సహజీవనం (ప్రభుత్వ బహుమతి పొందినది)

[illegible] విషయములు:—అస్పృశ్యతా నివారణ, వర్ణాంతర వివాహాలు, వర్ణవర్గభేదనిర్మూలనం, స్త్రీ విద్య.

# భావం

రచన:

అంతటి నరసింహం, ఎం. ఏ.

(ఆంధ్రోపన్యాసకులు-ప్రభుత్వకళాశాల, కడప.)

సమతా సాహితి

9/5 విప్పర్తివారి వీధి

విశాఖపట్నం

